# శత శతక ప్రసాద సమీక్ష

సరసభారతి ఉయ్యూరు



గబ్బిట దుర్గా ప్రసాద్

# Contents

## అపూర్వ విషయం

సాహితీ బంధువులకు శుభాకాంక్షలు. సరసభారతి బ్లాగ్ ఏర్పరచి దశాబ్ద కాలం దాటింది. అంతకు ముందు, ఈ కాలం లోనూ నేను రాసిన రచనలన్నీ ఒక చోటుకు చేర్చాలని మా రెండవ అబ్బాయి శర్మ తపన పడుతూ, వాడి ఉద్యోగ ధర్మాన్ని నిర్వహిస్తూ ఈ పనికి సుమారు ఆరునెలలముందు శ్రీకారం చుట్టాడు. ఎప్పటికప్పుడు నాకు పురోగతి తెలియజేస్తూ, గొప్ప విజన్ తో ముందుకు సాగుతూ మొట్టమొదటి సారిగా నారచనలు డిజిటల్ గా మార్చి, "సమస్త భక్త శిఖామణులు " శీర్షిక తో సుమారు 700 పేజీల దేశ భక్తులు, దైవభక్తులు, రాజ్యభక్తులైన మంత్రులు మొదలైన వారి గురించి నేను రాసినవన్నీ క్రోడీకరించి 75వ భారత స్వాతంత్ర్య దినోత్సవ పుణ్య సమయం లో ఆన్ లైన్ లో నాతో అవిష్కరింప జేశాడు. వాడి దీక్షకు కృషికి విజన్ కు అభినందనలు. ఎదో రాసుకొంటూ పోవటమేకానీ, దానికింత ప్రశస్తి ఉంటుందని నాకెన్నడూ అని పించలేదు. ఇదంతా చూశాక, తప్పులు దిద్దే సమయం లో కొన్ని అసలు నేనే రాశానా అనే అనుమానం వచ్చిన సందర్భాలు కూడా ఉన్నాయి. మా వాడిని అడిగితే "నువ్వే రాశావు నాన్నా "అని జ్ఞాపకం చేశాడు. ఇది నా సాహిత్యజీవితం లో ఒక మైలు రాయి.



ఇంతటి తో ఆగలేదు. నేను వివిధ రామాయణ, భారత, భాగవత,వేద ఉపనిషత్తులు మొదలైన వాటిపై విశ్లేషణ రూపంగా రాసినవన్నీ ఒక చోటికి చేర్చి డిజిటల్ రూపమిచ్చి రెండవ భాగం గా సుమారు 450 పేజీల "వేద, ఇతిహాస, తాత్విక రచనల విశ్లేషణ"గా నామకరణం చేసి విద్యా ప్రదాత శ్రీ వినాయకుని పుట్టినరోజు శ్రీ వినాయక చవితి నాడు నాచేత ఆవిష్కరింప జేస్తున్నందుకు మహదానందంగా ఉంది. ఎన్ని సార్లు తప్పుల జల్లెడ పట్టినా, కొన్ని కంటికి కనిపించకుండా దూసుకు పోతూనే ఉన్నాయి. థ,ఠ,ఢ వంటి అక్షరాలు స్పష్టంగా రాయటానికి జంత్రిక ను నాకు ఎప్పటికప్పుడు అందించి, వేగ వంతంగా రాయటానికి తోడ్పడుతున్న మా మనవడు చి. భువన్ కు ఆశీరభినందనలు. ఇంతటి అక్షర వారాసి ని చూస్తుంటే అద్భుతమని పిస్తోంది. ఇంకా కొన్ని భాగాలు వీలువెంట డిజిటలైజ్ చేసి, వేర్వేరు శీర్షికలతో ఆవిష్కరిస్తాము. ఇదంతా మా తలిదండ్రుల ఆశీర్వాదాలు, మా ఇలవేల్పు శ్రీ సువర్చలాంజనేయ స్వామి దీవెనలు, శ్రీ సరస్వతీ మాత కరుణా కటాక్షమే అని సవినయంగా మనవి చేస్తూ, మా శ్రీమతి, మాకుటుంబ సభ్యులు అందిస్తున్న ప్రోత్సాహానికి, సాహితీ బంధుల ఆదరాభిమానాలకు అభినందనలు తెలియ జేస్తున్నాను. శత శతక సమీక్ష చాలా ప్రత్యేకమైనది. వంద సంవత్సరాల క్రిందటి శతకాలు ఇప్పటి వారికి చేరువ చెయ్యటం ఒక గొప్ప సంకల్పం. మనకి తెలియని వారు ఎందఱో వారిని పరిచయం చెయ్యటం నా పూర్వజన్మ సుకృతమే..

గబ్బిట దుర్గాప్రసాద్ సెప్టెంబర్ 2023

ఉయ్యూరు

## ఒక్క నిమిషం

కాలం తో పాటు సాంకేతిక మారింది. ఇంతకు ముందు తెలిసినవి అన్నీ పుస్తకం లో రాసుకొని, సమావేశాలలో అందరికి వినిపించటం అనేది అలవాటు గా జరిగేది. 2010 లో సరసభారతి ఉయ్యురు లో ఒక సాంస్కృతిక సంస్థ గా ప్రారంభం అయ్యి సాహితీ సభలు, ఉగాది కవి సమ్మేళనం, సమావేశాలు స్థానిక గ్రంథాలయాలలో, దేవాలయాలలో జరిగేవి. సరసభారతి చిన్న పత్రిక గా రూపుదిదుకొంది.

సహజం గా సైన్స్ టీచర్ అవ్వటం వల్ల ప్రతిదీ నా అవసరాలకు మేరకు నేర్చుకోవటం బాగా అలవాటు.. ఈ వయసులో కంప్యూటర్ నేర్చుకొనటం, తెలుగు లో టైపు చేయటం, నోట్స్ తయారు చెయ్యటం ఈమెయిలు రాయటం. సమాధానాలు రాయటం నేర్చుకోన్నవి. బహుశా మా తరం వాళ్ళకంటే ముందుగా కంప్యూటర్ నేర్చుకుని ఇమెయిల్ ద్వారా సాహితీ రచనలు పంపటం ప్రారంభం అయ్యింది ఈ ప్రయాణం. ఇమెయిల్ తెలుగు లో రాసినవి స్కాన్ చేసి. బంధువులకు, మిత్రులకు పంపటం అలవాటు అయ్యింది.

అప్పుడే ప్రసిద్ధ వ్యక్తులు బ్లాగ్ ద్వారా తమ రచనలను, ఆలోచనలను పంచుతున్నారు. పిల్లలు బ్లాగ్ పెడితే అందులో ఇంగ్లీష్ లో రాయటం. తెలుగు వి స్కాన్ చేసిపెట్టటం. ఇది ఒక మెట్టు. సాహితీ బంధు గ్రూప్ తయారుచేసి. సాహితీ మిత్రులకు పంపటం మలి మెట్టు.తెలుగు లో రాయాలంటే సాఫ్ట్వేర్, కీబోర్డ్ ఉండాలి ఎందుకో అది కష్టం గా అనిపించింది. అప్పుడే గూగుల్ యూనికోడ్ తో తెలుగు లో రావాలటం. చాలా బాగా ఉండటం. ఇంగ్లీష్ లో కొడితే తెలుగు లో రావటం అది ఇమెయిల్ లో, బ్లాగ్ లో చేరటం. జరిగింది మొరొక మెట్టు. రోజుకు ఒకటి, లేదా రెండు పోస్ట్స్ తో ప్రారంభం అయ్యి. ఒక అలవాటు గా మారి రోజుకు పది.. డజన్ల వరకూ వెళ్ళింది. బ్లాగ్ ప్రారంభం అయ్యిన తరువాత గ్రామీణ ప్రాంతం నుంచి తెలుగు లో ఉసూల గూడు (బ్లాగ్స్) కూడా రాస్తారు అని ప్రపంచానికి తెలిసింది. తెలుగు బ్లాగర్స్ అందరికి సరసభారతి బాగా పరిచయం. కూడలి ద్వారా దేశ విదేశాల తెలుగు వారికీ బ్లాగ్ చేరింది.

ఉదయం వార్తా పత్రికలలో వచ్చే అంశాలతో ప్రారంభం అయ్యి, సాయంత్రం ఒక పుస్తకం, కవి మీద సమీక్ష సాయంత్రం కొన్ని సార్లు రాత్రి పొద్దు పోయేవరకూ రచనలు జరిగేవి. దాదాపు 10-12 గంటలు నోట్స్ రాసుకోవటం. టైపు చెయ్యటం, ఫొటోస్ కాలేక్ట్ చెయ్యటం. ఇమెయిల్ ఇవ్వటం ఇలా... సోషల్ మీడియా విస్తరించి బ్లాగ్ లో రాసింది ఆటోమేటిక్ గా ఫేస్బుక్, ట్విట్టర్ మొదలైన వాటికి వెళ్ళటం. ప్రపంచమంతా తెలియటం జరిగింది ఇది మరొక్క మెట్టు. అమెరికా ప్రయాణం లో పరిచయం లేని వాళ్ళు కూడా గుర్తు పట్టి బ్లాగ్ గురించి గొప్పగా చెప్పటం విశేష అనుభూతి. బ్లాగ్ లో సాహిత్యం, పుస్తక విశ్లేషణ, సభలు. ప్రయాణాలు. రాజకీయాల, దేవాలయములు, సినిమా, నా దారి. సరసభారతి సమావేశాలు... ఇలా జీవితం లో మనకు తారసపడే ప్రతి అంశం మీద రాయటం అవి సోషల్ మీడియా లో చేరటం జరిగిపోయేవి. టైపింగ్ లో కొన్ని తప్పులు దోర్లినా మంచి మనసుతో దానిని అర్థం చేసుకొని బ్లాగ్ కి సహకరించిన వారి అందరికి ధన్యవాదాలు.

లాభాపేక్ష, వ్యాపార ద్రుష్టి లేకుండా రాసినవి, సేకరించినవి భావి తరాలకు తెలియాలసేదే ఈ ప్రయత్నం. పుస్తకాలలో నిక్షిప్తమైన వి ఈ తరం, రేపటి తరాలకు అందించటమే ఆశయం. వికీపీడియా కూడా తమ రిఫరెన్స్ కోసం సరభారతి పోస్ట్స్ లంకె వెయ్యట జరుగుతోంది. ప్రపంచం మొబైల్స్ లోకి మారినప్పుడు అందరూ బ్లాగ్స్ ఆపేసినా సరసభారతి కొనసాగించటం విశేషం. వాట్సాప్ లో కూడా మిత్రులకు గ్రూప్ తయారుచేసి పోస్ట్ పంపటం ప్రారంభం.గత రెండు సంవత్సరాలుగా చాలా సౌకర్యం గా ఉండటం తో రోజు ఉదయం పది గంటలకు లైవ్ ప్రోగ్రాం చెయ్యటం అలవాటుగా మారింది. దాదాపు 1300 గంటల లైవ్ చేసి వాటిని youtube లో అప్లోడ్ చెయ్యడం జరిగింది. సరసభారతి బ్లాగ్ పది లక్షల వీక్షకులతో బ్లాగ్ లో రాసి పుస్తకం రూపం లో వచ్చినవి దాదాపు. 40. అంచెలంచలు గా ఎదుగుతూ పదివేల పోస్ట్స్ కు నేను రాసినవి చేరాయి. ముద్రితం కానివి దాదాపు 500 వ్యాసాలు. పదివేల పేజీలు, యాభై లక్షల పదాలు, రెండు కోట్ల అక్షరాలూ. వీటిని సేకరించి తప్పులు సరి దిద్ది క్రమ పరిచి **అంకాత్మక** (డిజిటల్) పుస్తకాలు గా ఆవిష్కరించి మీకు అందించే ప్రయత్నమే ఇది.

శత శతక ప్రసాద సమీక్ష వివిధ మహా కవులు వారి ప్రాంత ఆరాధ్య దైవం మీద రాసినవి చదివి బ్లాగ్ లో రాస్తూ ఇప్పితికి దాదాపు శతం వరకూ చేతాయి. ఇవి ఒక డిజిటల్ పుస్తకం గా మీ ముందుకు తీసుకొని వస్తున్నాము.

## గ్రంథకర్త పరిచయం



| | |
|---|---|
| పేరు : | **గబ్బిట దుర్గాప్రసాద్** |
| జననం | **27-6-1940 ఉయ్యూరు కృష్ణాజిల్లా** |
| తలిదండ్రులు | **గబ్బిట భవానమ్మ, మృత్యుంజయ శాస్త్రి** |
| భార్య | **ప్రభావతి** |
| విద్య | **ఎం ఏ, తెలుగు, బి.ఎస్ సి. బి.ఎడ్.** |
| ఉద్యోగం | **ఫిజికల్ సైన్స్ టీచర్, పదానోపాధ్యాయుడు -కృష్ణా జిల్లా పరిషత్ (1963-1998)** |

| | |
|---|---|
| సంతానం | గబ్బిట మృత్యుంజయ శాస్త్రి, సమత సంకల్ప్, భువన్ సాయి తేజ<br>లక్ష్మీ నరసింహ శర్మ, ఇందిర శ్రీ హర్ష సాయి, హర్షి తాంజని<br>నాగ గోపాల కృష్ణ మూర్తి, రాణి గౌతమ శ్రీ చరణ్, రమ్య<br>వెంకట రమణ, మహేశ్వరి<br>కోమలి విజయలక్ష్మి, సాంబావధాని శ్రీకేత్, ఆశుతోష్, పీయూష్ |
| స్వీయ రచనలు | 1 ఆంద్ర వేద శాస్త్ర విద్యాలంకారులు 2 జనపేమన 3 దర్శనీయ దేవాలయాలు 4 శ్రీ హనుమత్ కథా నిధి 5 శ్రీ ఆంజనేయ స్వామి మహాత్మ్యం 6 సిద్ధ యోగిపుంగవులు 7 మహిళా మాణిక్యాలు 8 పూర్వాంగ్ల కవుల ముచ్చట్లు 9 దర్శనీయ దైవ క్షేత్రాలు 10 గీర్వాణ కవుల కవితా గీర్వాణం (3 భాగాలు) 13 దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు (2భాగాలు) 15 కేమోటాలాజి పిత డా.కొలాచల సీతారామయ్య 16 దైవ చిత్తం 17 బ్రహ్మశ్రీ మద్దులపల్లి' శాస్త్రి గారి శతజయంతి కరదీపిక 18 ఆధునిక ప్రపంచ నిర్మాతలు - జీవితాలలో చీకటి వెలుగులు 19 షార్లెట్ సాహితీ మైత్రీ బంధం 20 అణుశాస్త్ర వేత్త డా.ఆకునూరి వెంకట రామయ్య 21 ప్రయోగాత్మక కాంతి శాస్త్ర పరిశోధన పిత డా పుచ్చా వెంకటేశ్వర్లు 22 ఊసుల్లో ఉయ్యూరు 23 సోమనాథ్ నుంచి కాశీ విశ్వనాథ్ దాకా 24 ఆధునిక ఆంద్ర శాస్త్ర రత్న మాణిక్యాలు 25 వ్యాఖ్యాన చక్రవర్తి కోలాచలం మల్లినాథ సూరి 26 విదేశీ సంస్కృత విద్వాంసులు. |
| సంపాదకత్వం | సరసభారతి ప్రచురించిన పుస్తకాలు 1 జ్యోతిస్సంశ్లేషణం 2 ఉయ్యూరు ఊసులు 3 నవకవితా వసంతం 4 మా అక్కయ్య 5 "ఆదిత్య "హృదయం" 6 త్యాగి పే"రెడీలు" 7 శ్రీరామవాణి 8 మా అన్నయ్య 9 శ్రీ సువర్చలా వాయు నందన శతకం 10 శ్రీ సువర్చలా మారుతి శతకం 11 శ్రీ సువర్చలేశ్వర శతకం 12 వసుధైక కుటుంబం 13 Nuclear Scientist Dr.Akunuri Ramayya 14 సాహితీ స్రవంతి (సాహితీ మండలి తరఫున |
| అంకాత్మక | 1 సమస్త భక్త శిఖామణులు 2. వేద, ఇతిహాస, తాత్విక రచనల విశ్లేషణ 3. కోనసీమ అందాలకు వేదపవిత్ర సొబగులు సౌరభాలు అద్దిన ఆహితాగ్నులు,4. దర్శనీయ మహాదే(వ-వి)నాయక ఆలయాలు,5. బ్రహ్మశ్రీ విద్వాన్ శ్రీ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి,6. శమీ అష్టోత్తరం పూజా విధానమ, 7. సహస్రచంద్రదర్శనం 8. శ్రీ సంకర 9.. శ్రీ శోభ కృత్ ఉగాది కవితా సంకలనం 10. రైట్ హానరబుల్ శ్రీనివాస శాస్త్రి(అనువాదం). 11 శత శతక ప్రసాద సమీక్ష |

## శతక సమీక్ష ఎలా ప్రారంభం

శతకాల పైన సమీక్షలు రాయాలని ఎప్పుడూ అనుకోలేదు. అది చాలా కష్టమైన, క్లిష్టమైన ప్రక్రియ. మా సువర్చలాన్జనేయ స్వామి దేవస్థానం పైన శ్రీ మంకు శ్రీను రాసిన శ్రీ సువర్చలేశ్వర శతకం , శ్రీ తమ్మెర్రు రామ లక్ష్మణ చార్యులు, రాసిన శ్రీ సువర్చలా వాయు నందన శతకం. శ్రీమతి ముదిగొండ సీతరావమ్మ గారు రాసిన శ్రీ సువర్చలా మారుతి శతకం శతకాలను సమీక్షించి ముద్రించటం వరకే ఆగిపోయింది.

పామఱ్ఱు ధ్వజ స్తూపం (గ్రామ చరిత్ర) రాసిన శ్రీ శివ -వేంకట కవులు నా ద్వారా చాలా మందికి పామఱ్ఱు చరిత్ర దేశ. విదేశీ పామర్రు ప్రజలకు తెలియటం జరిగింది. ఈ జంట కవులు రాసిన శ్రీ కనక దుర్గా స్తోత్ర రత్నమాల శతకం సమీక్ష తొ మళ్ళీ ప్రారంభం. శ్రీ తూములూరి దక్షిణా మూర్తి గారు పంపిన విష్ణు శతకం సమీక్ష రాసి ఆయనకు పంపటం. శ్రీ చింతలపాటి నరసింహ దీక్షిత శర్మ ఘారు రాసిన శ్రీ కృష్ణ విలాసం శతకం సమీక్ష తో మరియు అగ్నికి ఆహుతి కాబోయి చేతికి చిక్కిన శ్రీ కోట పేరిశాస్త్రిగారి శ్రీ ఆనందేశ్వర శతకం పైన సమీక్ష రాస్తే చాలామంది అభినందించటం జరిగింది.

రాసుకొంటూ పోవడమే కానీ ఇన్ని సమీక్షలు చేయాలి అనే ఉద్దశ్యం ఎప్పుడూ లేదు. నాలుగు సంవత్సరాలనుండి అప్పుడప్పుడూ ఒక శతక సమీక్ష చెయ్యటం. ఒక పుస్తక సమీక్ష వ్యాస పరంపర అవ్వగానే ఒక శతక సమీక్ష, మళ్ళీ వేరే సాహిత్య సమీక్ష ఇలా ఇప్పటికి శతాధిక సంఖ్యా కి చేరాయి అని తెలిసి సంతోషించి వీటిని ఒక క్రమం లో పెడితే బాగుంటుంది అనే ప్రయత్నం. శతక ప్రక్రియ ఈ తరానికి పెద్దగా తెలియదు. వాటిపైన రాసినా చదివేవారు తక్కువ. సమీక్ష కు తీసుకొన్నవి చాల విశిష్టమైనవి. ఇంతకు ముందు వివిధ దేవాలయాలపైనా సమీక్షలు రాసి ముద్రించి ఉన్నా ఇంకొన్ని దేవాలయాల చరిత్రలు ఈ శతక రూపం లో వచ్చాయి.

దాదాపు 30 శతకాలు ఆ గ్రామంలో వెలసిన మహనీయ దేవాలయ చరిత్ర ఉండటం విశేషం ఉదాహరణకు కొన్ని. శ్రీ చిత్రాడ వెంకటేశ్వర, లక్కవరం లక్కవరం శ్రీ వేణుగోపాల స్వామి, మర్రిగుంట శ్రీ పాండురంగ స్వామి. నువ్వుకొండ శ్రీ సీతారామ స్వామి. జీడికంటి శ్రీ రామచంద్ర స్వామి, నడిగడ్డపుర శ్రీ ఆంజనేయస్వామి, మోదుకూరి చెన్న కేశవ శతకం. అమ్మనబ్రోలు చెన్నకేశవ శతకం, తాడిమళ్ళ రాజగోపాల శతకం,తిన్నెలపూడి వేణుగోపాల శతకం. ఆలూరు కోన రంగనాయక శతకం రొయ్యూరు శ్రీ వేణుగోపాలస్వామి శతకం, శ్రీమత్పూనూరు వేణుగోపాల కృష్ణ శతకం, ఇక్కుర్తి శ్రీ హరిహర పశుపతీశ్వర శతకం, హేలాపురి (ఏలూరు). .. ఇలా చాలా దేవాలయ చరిత్రలు శతక రూపం లో మిగిలి పొయాయి. వాటిని పరిచయం చెయ్యటం పూర్వ జన్మ సుకృతం.

దాదాపు 100 ఏళ్ల క్రితం రాసిన వివిధ కవుల శతకాలు సమీక్షించడం గొప్ప అదృష్టం. కవులు వివిధ ప్రక్రక్రియలు ఏక ప్రాస శతక, శతక భారతం, శతక భాగవతం, పూర్తి ఆటవెలది పద్య, పూర్తి సీస పద్య శతకం తెలుగు వారికి చెల్లింది.

శతక కవులలో బాల కవులు, కవులు, గాయకులు, పండితులు, యోగులు, మాహాయోగులు. శ్రీ బమ్మెర పోతన(అయన రాసిన నారాయణ శతకం ఇది ఆంధ్ర మహాభాగవతం కి ప్రేరణ గా నిలిచింది అని కవుల అభిప్రాయం) ఈ శతకాలలో వివిధ కులాల, వివిధ మతాల వారు రాసినవి చాలానే ఉన్నాయి.

కవుల పేర్లు, వారి సాహిత్యం వారి ఇతర రచనలు, శతకం ముద్రణ తేదీ, వెల, అంకితం, ద్రవ్య సహాయం చేసిన వారి వివరాలు అందించటం జరిగింది సమాచారం దొరికినంత వరకూ. మా అబ్బాయి శర్మ ఇలాంటి కవులను శతకాలను వెతికి పంపించి నాతో రాయిస్తున్నాడు. అతడికి అభినందనలు.



ఒకసారి శ్రీ సుంకర కోటేశ్వర రావు గారు గాన లోల శతకం గురించి అడిగారు. అది వెంటనే దొరకలేదు కానీ. కొన్ని మంచి శతకాలు పంపటం తో వాటిని సమీక్ష చేయటం. ఈ క్రమం లో గానలోల శతకం కూడా దొరికింది. ఇన్ని అద్భుతమైన శతకాల అన్వేషణ కు కారకమైన గానలోల శతకాన్ని ఈ వరుస క్రమం లో ముందుగా ఉంచడం జరిగింది.

శ్రీమతి గబ్బిట ప్రభావతి 77 వ జన్మదినం సందర్భం పురస్కరించుకొని ఈ డిజిటల్ పుస్తకం **ఆదిదేవుడు శ్రీ విఘ్నేశ్వర స్వామికి వినాయక చవితి 18.09.2023 రోజున అంకితమిస్తున్నాము.**

***పూర్తి శతకం కాపీ లింక్ ను శతక శీర్షిక లో పేటడం జరిగింది. రెండు సార్లు క్లిక్ చేస్తే శతకం పిడిఎఫ్ రూపం లో వస్తుంది***

## 01 'పొడుపు కథల శ్రీ గానలోల శతకం - శ్రీ నాగ భూషణ కవి

**<< ===== క్లిక్ రెండుసారు**



## 01 'పొడుపు కథల శ్రీ గానలోల శతకం -- శ్రీ నాగ భూషణ కవి

శ్రీ పుట్రేవువెంకట సుబ్బారాయ మంత్రి గారి ద్వితీయ పుత్రుడు శ్రీ నాగ భూషణ కవి రాసిన శ్రీ గానలోల శతకం ఏలూరు రామా అండ్ కో వారు 1914లో ప్రచురించారు. వెల ఒక అణా.



శతకాన్ని వినాయకుని స్తుతి తో "తండ్రికంటే గొప్పతనమున మున్ముందు –పూజనముల నందు పుణ్యుడు "అన్నారుకవి. తర్వాత సరస్వతిని "బాపనమ్మ యయ్యు బతి గల్గి యుండియు –రచ్చమీద కెక్కురమణి "అన్నారుకొత్తగా.పొడుపులతో అర్ధం తెలుసుకోమని. తర్వాత అన్నీ పొడుపుపద్యాలే. దీని యర్ధమేమి గానలోల అనేది మకుటం.98 ఆటవెలది పద్యాల సౌందర్యం రాశీభూతమైన శతకం.

"నాల్గుమొగములుండు నలినోద్భవుడుగాడు –కనులు పదియునారు కలిగియుండు నాలుమగలకెప్పుడానందమిచ్చును –దీని యర్ధమేమి గానలోల ?" అంటే మంచం. "పండ్లు నూరుగలవు ప్రాణంబులేదు. -జీవకోటి నెల్ల జిక్కబట్టు –నరుల తలలపైన నాట్యంబు లాడును"అంటే దువ్వెన. తలాతోకా ఉండి,కళ్ళులేకుండా పొడిచి తోకతో భూమిని పైకి లేపేది –గునపం. పైకెక్కుతాడుమనిషి కానీ గుర్రం కాదు. పాలిస్తుందికానీ బర్రేకాదు.కదలదు "అంటే తాటిచెట్టు. "మూడుకన్నులుండు ముక్కంటి యనరాదు –కడుపు వీపునడుము కాళ్ళులేవు-తిరిగి ధాన్యములును దినుచు గ్రక్కుచుండు "అంటే తిరగలి.



శ్రీ

గానలోలశతకము

నాగభూషణకవి

రామా అండ్ కో.,

1914

Price 1 Anna.]

Copyright.

రెండు చెవులు ఉంటాయి చేతుల్లేవు కడుపు ఉంది నోరుకన్ను లేవు అగ్నిమీదకెక్కి భక్ష్యము లిచ్చేది –బూర్లేమూకుడు. వర్షాకాలం లో వేయకుండానే వచ్చే గొడుగు –పుట్టగొడుగు. నీరు మేతా అడక్కుండా అన్నికాలాల్లో బంటులా వెంటవచ్చేది -నీడ. ”కడుపున కనిపెంచి కన్నెనిచ్చినయట్టి –మామయుం డగాను మరచిపోయి –మామయందు రొకని”అంటే చందమామ.రాజు అంటారు రాజ్యం లేదు లెక్క ఖచ్చితంగా చెప్పి చిక్కులు తీరుస్తున్దికానీ మంచీ చెడూ లేనిది –త్రాసు అదే తరాజు. రాణి అంటారుకాని రాచపిల్లకాదు,భరణిలో ఎప్పుడూ పడుకొనే ఉంటుందిదానిపేరు చెబితే దేవుళ్ళే దిగొస్తారు –సాంబ్రాణి. కారం అంటారుకానిఉప్పులాగాఉన్నా చప్పగా ఉంటూ. నీళ్ళల్లో కరుగుతుదికాని నిప్పుతగిల్తే మండుతుంది –సురేకారం “నేనే రేడు అంటుంది. ఏదో ఒకకాలం లోనే కాస్తుంది అందరికీ ఊరికే ఇస్తుంది –నేరేడు.

“నరుడు గట్టనట్టి మెరుగైన ఇండ్లలో –పాలు నిండి యుండు మేలుగాను –వానిద్రాగి నరులు వర్ధిల్లు చుందురు”అంటే పాలిండ్లు.రాత గీతాలేని భారతం పామరజనం నోట్లో పలుకబడేది –చాటభారతం. రామాయణమే,రమ్యమే చదువు రాని వారు చదువుతారు –అదే లోకాభిరామాయణం. శుకం వనం శాఖ ఒకమాటలో ఉన్న ఔషధకూర –చిలకతోటకూర . గాడిద గుమ్మం ఆకు ఉన్న పదం –గాడిదగడపాకు. ” వేయి కనులుండు వేల్పురేడా కాదు-కడుపు చెవులు నోరుకాళ్ళు లేవు –దాన్యరాశులేల్ల దనివార భుజియించు “-జల్లెడ.

ఇలాగే తమాషాగా ఉండే మాటలు కనుక్కోవాలి –”అన్నదమ్ములేల యరచి పోట్లాడుట –పిల్లలేల యరచు తల్లిజూచి –రెండు నొక్కమాట నుండును బరికింప “అంటే పాలుకు అని అర్ధం పాలు అంటే భాగాలు పంచుకోవటం. తల్లిపాలు అనీ కూడా. జనాల ఇళ్ళల్లో పుడుతుంది కాని సంతానం కాదు అంటుకుంటే నెత్తురే తాగుతుంది –నల్లి. వాణి అంటారు వాగ్దేవికాదు.జనం తనివారా తాగుతారు. కొత్త కుండలో కూర్చుంటుంది తప్పకుండా –తరువాణి.

"విట పురుషు నెల్ల వేశ్య నుంచగ నేల –పోయ్యిమీదకూడు పొంగనేల –రెండు నొక్కమాట నుండును పరికింప "అంటే "మరిగి "వేశ్యను మరిగి అని మొదట్లో తర్వాత పోయ్యిమీదమరిగి అని అర్ధాలు. విటుడు వేశ్య. చేప చిక్కేది- ఎర చేత."రాజుమీద నెక్కు రౌతుమీదను నెక్కు –నందినేక్కు పిదప పందినెక్కు-అమృతముపైనెక్కు అన్నిటిపైనా ఎక్కేది ఈగ. జుట్టు నేలవంచి గట్టి తపస్సు చేసి ప్రాప్తాలైన ఫలాలను పక్షులకు పంచిపెట్టేది-మర్రి చెట్టు. "అన్నదమ్ము లేవురవని నుండిరి వారి –యందు పేరులేని యతని జూచి –నగలు బెట్టు చుండ్రు నరులు సంతసమున –"అనామిక అంటే ఉంగరపు వ్రేలు.


గానలోలశతకము.

గర్భభారాన్ని మోసి కడుపార కంటే. బిడ్డలని తెలిసినా ప్రేమలేకుండా తండ్రి చంపాలనుకొంటే, తల్లి రక్షిస్తుంది అందకుండా –పిల్లి. పడుపుకత్తే కాదు ఇతరులను ఎరగదు. స్త్రీలకు ఉపచారం చేస్తుంది కానీ సాని అంటారు చెవలాయలు –మంత్రసాని.జందెం ఉంటుంది బ్రాహ్మణుడుకాదు. వంగి ఉంటాడు కాని ముసలాడుకాడు. సిద్ధమైతే యుద్ధానికి రెడీ –విల్లు. చెట్టుకు పుట్టడు మనుషుల్లో తిరుగుతాడుకానీ వాడిని కాయఅంటారు –డిప్పకాయ. కాళ్ళుంటాయి తుమ్మెదకాదు నల్లగా ఉంటుంది నమ్మరాదు నరుల తలలపై నాట్యమాడుతుంది –పేను.

"గర్భవాసమందు కన్నబిడ్డలనెల్ల –కనుల జూడలేక కరుణమాని –తనదు బిడ్డలనక తప్పక భక్షించేది-పాము.దుఃఖ ఫలాన్ని తెచ్చి మనుషులు రసం పిండి మరగగాచి పొట్టనిండా తినేది –చింతపండు. "చలువ తియ్యదనము కలిగించునొకకల్లు –కూరలందు వేసి కకొనెడుకల్లు –మంచి వస్తువులను మర్దించు నొకకల్లు –వడగల్లు. ఉప్పుగల్లు సన్నెకల్లు. చదువూ సంధ్యలు లేకపోయినా గోడమీద కూర్చుని శకునాలు చెప్పేది –బల్లి. మొదలు చివర మూడక్షరాలు కుతుకము. కూర్మి కలది తలకిందు చేద్దాంటే కానిది –ముదము. కొంపతవ్వే కుత్సితుడైనా రాజుంటారు. పళ్ళు కప్పాలుగా ఇస్తారు –ఎలుకరాజు.

"జుట్టు విరబోసి బట్టలు పదిగట్టి –చెట్టుమీద నుండు చిట్టచివర –పొట్ట చించెనేని పొడచూపు ముత్యముల్ '-దీని యర్ధమేమి గానలోల ?-మొక్కజొన్నపొత్తు

## 02, కనక దుర్గా స్తోత్ర రత్నమాల -- శివ -వేంకట కవులు

వీరు జంటకవులు. వీరిలో బ్రహ్మశ్రీ అడవి సాంబశివరావు పంతులుగారు మొదటివారు. రెండవవారు మధ్వశ్రీ నందగిరి వేంకటప్పారావు పంతులుగారు. ఇద్దరి పేర్లు కలిసి వచ్చేట్లుగా ''శివ వేంకట కవులు "అనే పేరు పెట్టుకొని జంటగా కవిత్వం చెప్పారు.

బ్రహ్మశ్రీ అడవి సాంబశివరావు పంతులుగారు

కృష్ణాజిల్లా కైకలూరు తాలూకా బొమ్మినంపాడు గ్రామానికి చెందినవారు బ్రహ్మశ్రీ అడవి సాంబశివరావు పంతులుగారు. నియోగి బ్రాహ్మణులు. సాంఖ్యాయనస గోత్రీకులు. ఆంధ్ర మత్స్య పురాణం. బిల్వనాథీయం. సాత్రాజితీయం మొదలైన ఉద్గ్రంథాలు 25రచించిన పండితకవి.

మధ్వశ్రీ నందగిరి వేంకటప్పారావు పంతులుగారు

కృష్ణా జిల్లా గుడివాడ తాలూకా అంగలూరు వాస్తవ్యులు మధ్వశ్రీ నందగిరి వేంకటప్పారావు పంతులుగారు. మధ్వబ్రాహ్మణులు. విశ్వామిత్ర సగోత్రీకులు. శ్రీ రామాయణోద్భూత ఉత్తరకాండ. శుద్ధాంధ్ర భీమసేన విజయం మొదలైన పంచ వింశతి గ్రంథ కర్తలు. 16ఏళ్ళ వయసులోనే "అష్టావధానం "చేసిన సాహస మేధావి కవి. అంగలూరులో స్వంత ఖర్చులతో,అనేక కష్ట నష్టాలను భరించి "బాలికా పాఠశాల" స్థాపించి.నిర్వహించి, సర్వతోముఖాభి వృద్ధి చేసిన మహోదారులు. స్వార్ధ త్యాగి.

సాంబశివరావు గారు. అప్పారాగారు చిరకాల మిత్రులు. సమవయస్కులుకూడా. యాభై ఏళ్ళ వయసు వారు. సహజ పాండిత్యులు. ఉభయభాషా కోవిదులు. తమమిత్రత్వాన్ని కాపాడుకోన్నట్లే తమ పేర్లకూ మిత్రత్వం చేకూరుస్తూ "శివ వెంకట కవులు "అనే మిశ్రమ నామం తో 1912నుండి కనక దుర్గా స్తోత్ర రత్నమాల. బ్రహ్మపత్రాభ్యుదయం. జగన్నాథీయంమొదలైన ఆరు గ్రంథాలు రచించారు. వడాలిలో ఉన్న జగన్నాథదేవాలయం పాలకులు ఈ జంటకవులకు "ప్రబంధ కవి పంచానన "బిరుదునిచ్చి గౌరవించి సత్కరించారు.

ఈ విషయాలన్నీ "పామర్రు కారోనేషన్" కమిటీ మెంబర్ శ్రీ బొమ్మారెడ్డి నాగి రెడ్డి 15-5-1914న "పామట్టు( స్తూప )జయధ్వజ చరిత్ర "పుస్తకం పీఠికలో తెలియ జేశారు.

ఈ జంటకవుల కవిత్వాన్ని కొద్దిగా ఆస్వాదిద్దాం

1-"శ్రీ విద్యోత సమస్త లోకపటలీ సృష్టి స్థితి క్షేపణ-ప్రావీణ్యోల్ల సదాత్మక శక్తి మహిమోపన్యస్తసర్వేశ్వర

త్వావిర్భూత దయామయా కృతితియుతుం డై,సర్వగుండౌమహా -దేవుండీయుత జార్జి భూమి పతికిన్ దీర్ఘాయు రారోగ్యముల్ "

2-భూషణమై పామర్తికి -శేషుడు ధర మోచి. యుల్లసిలునంతకు సం

తోషమున జార్జికారో-నేషన్ కమిటీ దృఢముగ నెగడెడు గాతన్ "

3-పరమోత్సాహంము తోడ హైందవ జన ప్రాంచన్మనోభీస్టముల్-చరితార్ధంబు లొనర్ప,బంచమ మహా జార్జి ప్రభుం డంచితా

దరుడై,ఢిల్లి మహాభి షేక పదవిన్ దాల్పంగ,దన్మంగళా-కరమౌ పుణ్య దినంబు శాశ్వతముగా గన్ దెల్పబామర్తిలో

స్థిరమౌ స్తంభము నాటి. మాకు గరమర్థిన్ మేలుగాంచి తీ-వురు తేజో నిధిపై మహామ్మదుహుమాయూన్ సాయెబు గ్రామణీ"

4-"అసమాన రాజభక్తి సమేతులై ప్రజా సామాన్యమునకు రాజన్యభక్తి -స్థిరముగ నెలకొల్పి పరమోపకారంబు గావించు శ్లాఘ్య సంకల్పమొప్ప

బ్రతి సమంబును. రాజ పట్టాభి షేకమహోత్సవ స్మరణ ప్రయోగ సరణి -నతి బీదలగువారి కన్న వస్త్రములిచ్చి తత్సుకృతంబు భూధవునకంచి

తాయురారోగ్య ములొసంగు నట్లు వేడి -కొనెడు సత్కార్య శూరులై మనెడు నట్టి

సాదు"పామర్తి కారోనేషన్"సమాజ -సభికులను బ్రోవు గావుత జక్రధరుడు "

ఈ కమిటీ రెండవ సంవత్సరోత్సవం 12-12-1912న అప్పటి తాసిల్దారు శ్రీ తాయి సుబ్బారావు నాయుడు గారి యాజమాన్యం కింద జరుపబడింది. నిధి వసూలు చేసి హుమాయూన్ గారిలాగానే పేదలకుమృష్టాన్న భోజనం పెట్టించి నూతనవస్త్రాలిచ్చారు. 12-12-1913న మూడవ వార్షికోత్సవం డిప్యూటీ తాసిల్దార్ శ్రీ వక్కలంక లక్ష్మీ నరసింహారావు పంతులుగారు ఘనంగా నిర్వహించారు. ఈ సందర్భంగా మన జంటకవులు మంచి

పద్యాలవిందు కూర్చారు –"కరుణన్ బీదల కన్న వస్త్ర ములొసంగన్. నీ మహోత్సాహ ని-ర్భరతన్ గన్గొని లేమి లేమి యగుచున్ పైధాత్ర సంకల్పమున్

జరితార్థం బొనరించు నీదగు క్రియా చాతుర్యమార్యాళిప-ల్మరు వర్ణించు ను వక్కలంక కులాజాలక్ష్మి నృసింహాన్వయా "

రూపకం –బ్యాండు మెట్టు

"జార్జి చక్రవర్తికిన్ –జనని మేరి రాణికిన్ –ఊర్జిత జయమంగళంబు –లొసగు నీశు డెప్పుడున్

తనదు ప్రజల సాటిగా –దలచి మనల సూటిగా –ఘనుడు జార్జి చక్రవర్తి –కాచుచుండు గావుతన్ "

చివరి కందపద్యం –"శివ వేంకటీయ కృతియై –చవులిడు పామఱ్ఱు స్తంభ చారిత్రంబీ

భువి నార వితారకమై –కవి హృదయాహ్లాద కరముగా విలసిల్లున్ "

శివ, వేంకట కవులు రాసి ప్రచురించిన గ్రంథాలు

1-శ్రీ రామాయణోద్భు దోత్తరకాండం 2-జగన్నాదీయం అనే వడాలి మాహాత్మ్యం 3-శుద్ధాంధ్ర మేఘ సందేశం 4-ఆంధ్రీకృత మేఘ సందేశం 5-చంద్రిక –నవలాప్రబంధం 6-బాలాశతకం 7-సీతారామ శతకం 8-రామ శతకం 9-ఆది కేశవ శతకం 10-శ్రుత శైల హనుమత్సతకం 11-బ్రహ్మ పత్రాభ్యుదయం అనే పొగాకు మహిమ 12-గంగిరెద్దు –హాస్యరచన 13-స్త్రీ విద్యా సార సంగ్రహం-వచనం 14-దొంగసామి చరిత్ర –యదార్ధకథ 15-శ్రీకృష్ణ మానస పూజ-సంస్కృతం 16-హరిహర స్తోత్ర తారావళి –సంస్కృతం 17-కనకదుర్గా స్తోత్ర రత్నమాల-సంస్కృతం 18-అంగలూరు విలేజి భూగోళం 19-పామర్రు జయధ్వజ చరిత్ర 20-బాలతొడవు (అమూల్యం )21-నేత్రావధాన చంద్రిక

ఇవన్నీ - శివ వేంక టీయ గ్రంథాలయం-అంగలూరు –కృష్ణా జిల్లా లో దొరుకుతాయని ప్రకటించారు జంటకవులు

## 03 శ్రీ కృష్ణ విలాసం -- శ్రీ చింతలపాటి నరసింహ దీక్షిత శర్మ

కవి రాజ మౌళి. కవి సార్వభౌమ మధురకవి,అష్టావధాని,కనకాభిషేకి శ్రీ చింతలపాటి నరసింహ దీక్షిత శర్మ

91 ఏళ్ళ వయసులోనూ అద్భుత కవితా సృష్టి చేయగల చేవ ఉన్న విద్వత్ కవి శ్రీ చింతలపాటి నరసింహ దీక్షిత శర్మ గారు. గుంటూరు జిల్లా అచ్చమ్మ పేట మండలం కోగంటి పాలెం అగ్రహార నివాసి. చింతలపాటి వెంకట నరసమాంబ. వెంకట రామ శాస్త్రి దంపతులకు 26-6-1927జన్మించారు. కృష్ణా జిల్లా చందర్ల పాడు లో విద్యాభ్యాసం ప్రారంభించి. హైదరాబాద్ వేదాంత వర్ధినీ సంస్కృత కళాశాల లో విద్యా శిక్షణ పొంది. గుంటూరు జిల్లా పొన్నూరు లో శ్రీ భావనారాయణ స్వామి సంస్కృత కళాశాల లో ఆంధ్ర భాషాధ్యయనంచేసి. గుంటూరు జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల ఆంధ్రాధ్యాపకులై. విద్యా బోధనలో తరించి పదవీ విరమణ చేశారు.

రచనా దీక్షితీయం

జన్మతః కవిత్వం వంట బట్టిన శర్మగారు 16 వ ఏటనే రమాపతి, రాజ రాజేశ్వరశతక ద్వయం రాసిన ప్రతిభాశాలి. బాలకవిగా. ప్రౌఢ కవిగా. మధురభారతి గా. కవిరాజమౌళి గా కవితా శిఖరారోహణం చేశారు. 72 కు పైగా గ్రంథాలు ఆంధ్ర, సంస్కృతాలలో,వివిధ ప్రక్రియలలో రచించిన పండిత కవి.. "శాతవాహన చరిత"చారిత్రిక కావ్యం రాసి తన మిత్రుడు శ్రీ జొన్నలగడ్డ జానకి రామయ్యకు అంకిత మిచ్చిన స్నేహ శీలి. ఇందులోని అవతారికను బట్టి శర్మగారు అప్పటికే ఋతు సంహారము. శృంగార గోవర్ధనము. లీలాభిక్షువు. విశ్వనాథ విజయం రచించినట్లు తెలుస్తోంది. ఇవికాక మందార మంజరి. నాస్వామి. త్రివేణి. కృష్ణ చరిత్ర. సరసోపనిషత్తు కూడా రచించారు. అరవై ఏళ్ళ వయసులో తన షష్టి పూర్తి ఉత్సవ సందర్భంగా జగన్నాథ పండితరాయల సంస్కృత "అన్యోక్తి విలాసం 'ను "చైత్ర రథం "పేర తెలిగించారు. చైత్రరథం అంటే కుబేరుని ఉద్యానవనం. అది అనేక రకాల పరిమళభరిత పుష్పజాతులతో విరాజిల్లేది. తన చైత్రరథం లోను పలు కవితా సౌరుల నందించాలన్న తపనతో ఈ పేరు పెట్టారు శర్మగారు. ఒక ఉపజాతిపద్యం దాని తరువాత ఒక వృత్తపద్యం. మళ్ళీ ఉపజాతి, తర్వాత వృత్తం ఉండేట్లు రచన చేసి శోభ చేకూర్చారు . ఇందులో శర్మగారి కవితా వైదుష్యం,వైశిష్ట్యం. భావగాంభీర్యం. ఆలోచనాసరళి ముగ్ధులను చేస్తాయి. ఆపాత మధురంగా. ఆలోచనామృతం గా తీర్చి దిద్దారు. "పాలిత శబ్ద ధర్ముడు "రసగంగాధర కర్త ఐన ఆంధ్ర కవి పండిత జగన్నాథ కవి రాయల రచన నుఆంధ్రీకరించుట అంతంత మాత్రకవికి సాధ్యం కాదు. శర్మగారు దాన్ని సాధించి కీర్తి పొందారు. "ప్రతిపద్యం ముక్తాస్వచ్చము.

మనోమోహకం “అని మెచ్చిన డా ప్రసాదరాయ కులపతి గారి మాటలు అక్షర సత్యాలు. శ్రీ వేదాల సీతారామాచార్యులు వీరి విద్వత్తును ప్రశంసిస్తే. శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య గారు”తెలుగుం బల్కుల తీపి మీగడలు తృప్తిం బెంచ. గైర్వాణికోక్తులు మేలౌ కలకండ ముక్కలుగ నెంతో తీయముల్ నించ. నీ తెలుగుం గావ్యము తీర్చి దిద్దితివి”అంటూ ప్రశంసాశీస్సులు అందించారు . తాను “ఉభయ భాషాను షంగసౌరభ తరంగములకు చలువల విలువలు కొలుపువాడ “అని సవినయంగా బుధులకు విన్నవించుకున్నారు శర్మగారు.

ఇంతటి విద్వత్కవి శర్మగారు బాలలకోసం “బాలప్రబోధం” రాశారు. అందులో “మధుర శబ్ద పాక మహితమ్ము. సుజ్ఞాన –బోధకమ్ము. కీర్తి సాధకమ్ము –సరస భావ యుతము. నరసింహ దీక్షిత –కృతము కనుము రచన రీతి బాల “అన్నారు. తాను అప్పుడప్పుడు రాసిన ఖండికలను ‘మధుకణాలు “గా తెచ్చారు. ఇందులో కాళిదాసు. విశ్వనాధ మున్నగు కవి ప్రశంస. సంక్రాంతి. ఉగాది శోభ వర్ణించారు . వజ్రాయుధం కొండలను నరికి నట్లు లోకం లోని అవినీతిని ఖండించటానికి 527పద్యాల “కవితా తూణీరం “రాశారు. ఇందులో –”గోడలందు “అస్పృశ్యత కూడద”నుచు –వ్రాయు చుండుటయే అంటరాని తనము –కలదనుచు పిన్న వారికి తెలుపుటెయిది –విజ్ఞాతా శూన్యమైనట్టి వెకిలి వ్రాత “అని మన సిగ్గుమాలిన తనాన్ని ఎండగట్టారు. -”నారద శారద “లో జ్యోతిశ్శాస్త్ర విశేషాలన్నీ వచనంగా రాశారు.తన పేరు లోని నరసింహ దీక్షిత శర్మ ను “నదీశ “గా కుదించి “నదీశ కవిత ““రాశారు.ఇందులో “వినయము విధేయత. సపర్య యను గుణమ్ము-గృహిణులకు రత్నభూషయై కీర్తిపెంచు –కావ్య సతికిం. జమత్కార గరిమ సొమ్ము “వంటి అనర్ఘ పద్య రత్నాలెన్నో ఉన్నాయి.

కృష్ణం వందే జగద్గురుం,రసో వై సహ” అన్న దాన్ని అనుసరించి “శ్రీ కృష్ణ విలాసం “కావ్యాన్ని 102 తేటగీతి పద్యాలలో కవితామయంగా వర్ణనాత్మకంగా రాశారు. ”రాస లీలాది సుధల,గోపీ సుదతుల –ముంచి తేలిచి. రస పీఠమున నిలిపె-ధాత్రి. నానందరస నిర్వృత మ్మొనర్చె-రసమయుడు బ్రహ్మానంద రసమయుండు “.కృష్ణా జిల్లా దివితాలూకా అవనిగడ్డ –నాగాయలంక దారిలో ఉన్న వేకనూరు క్షేత్రం లో వెలసిన ఉభయ ముక్తీశ్వర స్వామి “పై భక్తి చిప్పిలేట్లు” వేకనూరు ఉభయ ముక్తీశ్వర శతకం “రాశారు. ఇందులోని పద్యాల మొదటి అక్షరాలన్నీ కలిపితే శ్రీ వేకనూరి వాసాయ ఘంటసాల వంశ సంభవ ---భారద్వాజస గోత్ర మధురభారతి కవిరాజమౌళి చింతలపాటి నరసింహ దీక్షిత కవి విరచితం “అని వచ్చేట్లు చమత్కారం చేసి స్వామికార్యం, స్వకార్యం తీర్చుకున్నారు. ”ముక్తి రమ చేరుగాత ముముక్షు తతిని-భక్త కోటికి శుభములు ప్రబలు గాత-కవి

వచస్సులు తేజస్సు గాంచు గాత-ఉభయ ముక్తీశ్వారా వేకనూరి వాస ".అలాగే కృష్ణాజిల్లా నందిగామ దగ్గరున్న చింతలపాడు లో చింతలపాటి వంశీకులడైన సోమేశ్వర స్వామి "పై అవంశం వారి అభ్యర్ధనమేరకు చింతలపాటి సోమేశ్వర శతకంను "సహస్ర చంద్ర దర్శనం"తర్వాత పూర్తి ఆరోగ్యం తో "కళ్యాణ మంగళ వాద్యంగా. ఖండ శర్కర నైవేద్యం లాంటి పద్యాలతో రాసి శివభక్తి ప్రకటించుకుని"శతకంబుల్ రచియించితి. నభీష్ట శ్రీల గుప్పింతువో –రతనంబుల్ సమకూర్తువో –అతుల జ్ఞాన ధనాఢ్యు చేయుదువో"అంటూ ఆర్తిగా వేడుకొన్నారు. చనిపోయిన తన చెల్లెలు "సాధు అది శేషాంబ"స్మృత్యర్థం మేనల్లుని కోరికపై "సువర్ణ దుర్గ "శతకం రాసి భక్తి శతకక రచనలో తనదైన ముద్ర వేసి భక్త కవి శిఖామణి అనిపించుకొన్నారు.. "త్రివేణి. సువర్ణాభిషేకం. శ్రీ వేణుగోపాలశతకం కూడా రాశారు. 87 వ ఏట ఈముదుసలి కవి మనసు సరసం పైకి పాకి,ఏకంగా "సరసోపనిషత్ "రాసేసి –"విషమ శరతంత్ర వైవిధ్యమరసి-సంతసించుడు"అంటూ సరసోపనిషత్తు "నిత్యకల్యాణ లక్ష్మి వినిద్ర కీర్తి –సంపదల సొంపుపెంపుల నింపుగాత"అని అభయమిచ్చారు .

అవధాన సరస్వతి

శర్మగారు నలభై కి పైగా అష్టావధానాలు చేశారు. అందులో వచ్చిన సమస్యలను మధుర కవిత్వం తో పూరించి ఆ పూరణలను "సమస్యా పూరణం "పేరుతో ప్రచురించారు. 50 భువన విజయాలలో పాల్గొన్నారు. జంధ్యాల వారి సరసన "ధూర్జటి "పాత్ర పోషించారు. కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ. డా నారాయణ రెడ్డి. దివాకర్ల వేంకటావధాని వంటి సాహితీ దిగ్గజాల దీవెనలు అందుకున్న కవి శేఖరులు శర్మగారు.

బిరుద సత్కారాలు

కృష్ణా జిల్లా నందిగామలో కుర్తాళం పీఠాధిపతి సమక్షం లో శర్మగారు కనకాభిషేకం పొందారు.అలాగే అవధాన సరస్వతి శ్రీ మాడుగుల నాగఫణి శర్మగారి అధ్యక్షత న జరిగిన సభలో దీక్షిత శర్మ గారికి కనకాభి షేకం జరిగి "కవి శిరోమణి "బిరుదు నందుకున్నట్లు తెలియ జేశారు.ఇవి అపూర్వ విషయాలు.,చిరస్మరణీయాలు.శర్మగారి రచనా సర్వస్వం పై ఒక విదుషీమణి "సిద్ధాంత గ్రంధం "రచించి. ఆచార్య నాగార్జున విశ్వ విద్యాలయం నుండి డాక్టరేట్ పొంది కవిగారి కీర్తి కిరీటం లో మరొక కలికితురాయిని చేర్చింది. శర్మగారి బిరుదులు ఎన్నో ఉన్నాయి. అందులో కవి రాజ మౌళి. కవి శిరోమణి. మధురభారతి. పండిత పరమేశ్వర. కవి వతంస. సత్కవీంద్ర. విద్వత్కవి పుంగవ. అభ్యుదయ భారతి. సాహిత్య సాగర. కవివల్లభ ఆంధ్ర గోవర్ధన. సాహిత్య జగద్గురు.

మధురకవి. భక్త కవి వరేణ్య. కవి సార్వభౌమ మొదలైనవి. ఇవన్నీ వారి విద్వత్తుకు, కవితా పాండిత్యానికి, శేముషీ గరిమకు లభించిన అన్వర్ధాలైన బిరుదాంకితాలే. ఈనాడు మున్నగు తెలుగు పత్రికలు శర్మగారి కవితా సామర్ధ్యం పై అనేక వ్యాసాలు రాశాయి. కవిత్వం వీరికి వాచో విదేయం. సుగమం, సుందర పద గుంఫన తో. అనితర సాధ్య శైలీ నిర్మాణం తో శర్మగారి కవిత్వం శోభిల్లు తుంది. పద్యం లోనూ ఆధునిక భావాలను అలవోకగా చెప్పగల నేర్పు వారిది. ఆధునిక భావాలనూ సమాదరించి పాత కొత్తలకు మేలు వంతెన నిర్మించారు.

ఇంతటి ఉత్కృష్ట రచనలు చేసి. పలుసన్మానాలు. బిరుదులూ పొందిన కవి శేఖరులు,జ్ఞాన వయో వృద్ధులు శ్రీ చింతలపాటి నరసింహ దీక్షిత శర్మగారు గుంటూరు జిల్లా స్వగ్రామంలో శేష జీవితం గడుపుతున్నారు. ప్రభుత్వం వారి దృష్టి. మహా మహా సాహిత్య సంస్థల దృష్టి.. సాహిత్యాన్ని ఉద్ధరిస్తున్నామని చెప్పుకునే పత్రికల దృష్టీ,,విశ్వ విద్యాలయాల దృష్టి ఈ పండిత కవి శ్రేష్టుని పై ప్రసరించకపోవటం విచారకరం. శర్మగారు ప్రస్తుతం “పేటికాంతర్గత మాణిక్యం “లాగా ఉండి పోయారు. వారి ప్రజ్ఞా పాండిత్య కవిత్వ శేముషీ వైభవాన్ని గురించి ఈ తరం వారికి తెలియ జేయటానికి రమ్య భారతి సంపాదకులు,సాహితీ సుమనస్కులు శ్రీ చలపాక ప్రకాష్ గారు పూనుకొన్నందుకు అభినందిస్తూ.. రాసే బాధ్యత నాకు అప్పగించినందుకు ధన్యవాదాలు తెలియ జేస్తూ.అంతటి కవితావతంసుని పరిచయం చేసే భాగ్యం. అదృష్టం నాకు కలిగినందుకు ధన్యుడనయ్యానని వినమ్రంగా విన్నవించుకొంటున్నాను.

“తే వంద్యా స్తే మహాత్మానః –తేషాం లోకేస్థిరం యశః –యైర్ని బద్ధాని కావ్యాని -యే చ కావ్యే ప్రతిష్టితా”

## 94 శ్రీ విష్ణు శతకం -- శ్రీ డా.తూములూరు శ్రీ దక్షిణా మూర్తి శాస్త్రి

శ్రీదక్షిణా మూర్తి నుతించిన శ్రీ విష్ణు శతకం

సరసభారతికి అత్యంత ఆప్తులు. నాపై అపార కరుణా దృక్కున్నవారు. చుళుకీకృత సర్వ గీర్వాణ వాఙ్మయ పాదోధి పయస్కులైన అపర ఆగస్య ముని వరేణ్యులు. శ్రీ లలితా పరాభట్టారిక పరమోపాసకులైన బ్రహ్మశ్రీ తాడే పల్లి రాఘవ నారాయణ శాస్త్రి బ్రాహ్మీ మూర్తుల అనుంగు అంతేవాసులు. వారి దౌహిత్రులు గీర్వాణం లో శతావధానం చేసి శిశుపాలవధపై పరిశోధనతో పిహెచ్ డి అందుకున్న శ్రీ చెరువు ఆంజనేయ శాస్త్రిగారి బావమరదులు. నా గీర్వాణ గాండీవానికి,పదును పెట్టి శోభ సమకూర్చినవారు. విద్వత్ కవి పండిత ప్రకాండులు. మహా భక్తి తత్పరులు. అమోఘ సాధనా చతురాననులు,అనేక గ్రంథ నిర్మాణ

చాతురీవైభవమూర్తి. అద్భుత ప్రసంగ మాధురి. కలకండ కవిత్వ రస పారీణులు ఉద్గ్రంద రహస్యాలను కరతలామలం చేసుకొన్న వరిస్ట గరిష్ట బ్రాహ్మీ మూర్తి. బ్రహ్మశ్రీ డా.తూములూరు శ్రీ దక్షిణా మూర్తి శాస్త్రి గారు నాపైఅనుగ్రహం తో పెనుభారం మోపి తాము ఆన్ లైన్ లో అనుగ్రహించిన "శ్రీ విష్ణు నుతి శతకం" "కు ముందుమాట రాయమని దాన్ని శతకం లో ప్రచురిస్తామని నిన్న విద్యుల్లేఖ ద్వారా ఆనతిచ్చారు.గుర్వాజ్న శిరో దార్యం కదా. హనుమంతుని ముందు కుప్పిగంతులుగా రాసే సాహసం చేస్తూ. ఎల్లుండి శనివారం ఉదయానికల్లా రాసి ఆన్ లైన్ గా పంపిస్తానని మాట ఇచ్చి.శ్రీవారిని నా దోసగులను మన్నించమని వేడుకొంటున్నాను.



118 వృత్త పద్యాల కవితాకల్హార మాలికగా శ్రీ మహావిష్ణువు కంఠ సీమను అలంకరించి. విష్ణు. వైభవ శోభలను ద్విగుణీకృతం చేసిన శతకం ఇది. విష్ణు పారమ్యాన్ని. అవతార అంతరార్ధ పరమార్ధాలను కళ్ళకు కట్టించారు. ప్రతిపద్యం రసగుళిక అనటంమామూలు మాట అవుతుంది. రసోవై సహ అయిన ఆ రసానందమూర్తిని నుతించేది కనుక దానికి సమానంగా పరమ రసస్ఫూర్తి గా ఉంది. '"సర్వ ప్రవృత్తుల నాతడు ఇహము. పరము. సంతుస్టుడు,ముక్తుడు".అని మొదటిపద్యం లో చెప్పారు. విష్ణు సహస్రనామ స్తోత్రం లోని భావనలన్నీ మనముందుంచి "శ్రీనారాయణ స్తోత్ర మంచిత భక్తిన్ బఠియింప సిద్ధమగు సుశ్రేయంబు లున్గ ల్గేడున్ "అని ఫలశ్రుతి చెప్పారు. ఆత్మ తత్వ ప్రబోధకుడు, అమలుడు. అవ్యాజాను రాగుడు. సద్గురుడు ఆనంద మయుడే కాక యోగి జన హృద్గుహ్యుడు విష్ణుమూర్తి. కలిలో శ్రీ విష్ణు నామమే ఉపాస్యం ప్రారబ్ధాన్ని నశింపజేసి,ముక్తినిస్తుంది. మానవత్వ విలువలు చాటటానికి శ్రీ రాముడుగా,పరశువు చేతబట్టి మునివర్గాన్ని బాధపెట్టే రాజులపాలిటి అరివీర భీకరుడై "శృతి ధర్మముల్ నిరంతరముగసాగ జేసే శుభదాముడైన పరశు రాముడై,అమృతోత్పాదన సమయం లో ఆదికూర్మమై. విష్ణువు సర్వవ్యాపి అని తెలియజెప్పటానికి నృహరి యై. గీతామృతం పంచి. విశ్వ రూపాన్ని వ్యాఖ్యానించి దుస్ట సంహారం, శిష్టరక్షణ

చేసే శ్రీ కృష్ణ పరమాత్మయై. కలియుగం లో కల్కి గా ధర్మాలను నడుపుతూ వెలసిన అవతారమూర్తి విష్ణుమూర్తి అన్నారు.

"నీదు పాద వరివస్యం జేసి జన్మంబు ధన్య విశేషంబుగజేసికొందు " అని ఆర్తిగా అంటారు . బ్రహ్మాన్ని మదిలో ఊహించటమేకాని ఇలాఉంటాడని చెప్పటం ఎవరితరం కాదంటూ "నరనారాయణ తేజమీ జగతి నిండి "ఉందని. "పరమోదారు. పరంజ్యోతి. నక్షరు "ని సంకీర్తనతో ఆ పరముని చేరతారని అభయమిచ్చారు. ఎవనిని తలిస్తే సందేహ నివృత్తి, భీతి తొలగి. సంపత్ శ్రేణులు విద్యా లభిస్తాయో "ఆ విష్ణువు సర్వ దోష హరుడు ".సకలార్ధ సాధకం. వత్సర మాస, పక్ష. తిధులకు కారణమై కాలాన్ని నియమించే జ్ఞాని విష్ణువు. .విష్ణుపదం చేరటానికి రాగద్వేషాలు వదిలి, సజ్జన సాంగత్యం తో. సమస్త భూత హితుడై. సౌశీల్యుడు,మైత్రి ఉన్నవాడికే సాధ్యం అని యోగ రహస్యం చెప్పారు. అయితే తనకు జపం. ధ్యానం కుదరదని. "ఈ సర్వంబు నీవన్న జ్ఞాన పథంబెరుగ"అని తన అల్పత్వాన్ని ప్రవరగా చెప్పుకున్నారు. "యోగంబు ప్రత్యహమున్ జేయగ యోగానండుడా విష్ణువే "అని అభయమిచ్చారు.

విష్ణువు విశ్వ రూపాన్ని –

"స్థిరుడై. శాశ్వతుడై వెలుంగు పురుష శ్రేష్టున్,సహస్రంబులౌ –శిరముల్. కన్నులు, బాహువుల్. పదములున్. చిత్రంబులున్ నామముల్

బరగన్ భక్తి నమస్కరింతు. బరితాపంబుల్ నివారించి. స –ద్వరమున్ గూర్చు ననంతు. నచ్యుతు. గృపాపాంగున్ జగన్నాథునిన్ "గా దర్శించారు. మనకూ దర్శింప జేశారు.

ఒకే చైతన్యం అనేకమై సర్వత్రా భాసిస్తుంది. ఈజగత్తు అద్వైతమే. "మోక్ష రమా కాంక్ష. మనోజ్ఞ రూప మెనయన్ సాక్షాత్కారింపన్ గదే " అని ఆ వెన్నుని ప్రార్ధించారు. పరమాత్మ "పరమాణు స్థితి. పర్వతాకృతి యై భాసించు "అంటారు. "ప్రాణంబే ప్రణవంబు. తత్ప్రణవమే రాజిల్లు నీ తేజము నీ ప్రాణంబుల్ నీ ప్రతిరూపు లౌదురు. మహాత్ప్రాణంబ నీ వౌచు "సంత్రాసం చెందే జగత్తునుచైతన్యం చేసేవాడు త్రిభువనవ్యాప్తుడైన జ్ఞానప్రదుడైన పురుషోత్తముడు అని ఉపనిషత్ రహస్యాన్ని అందమైన పద్యం లో నిబంధించి తేటతెల్లంగా చెప్పారు. కవిత్వ మహాత్మ్యాన్ని వివరిస్తూ "కవితా గంగ సువర్ణాభిషేకం. కవితాగంధం చల్లదనం. కవితాపుష్పం

అలంకారం. ”కవితా మాధ్వినివేదనంబగు రసజ్ఞా. పద్మనాభ ప్రభో “అని వివరించారు. చైతన్యమే సృష్టికి కారణమై పోషకమై లయకారకం అయి సత్యజ్ఞాన మనంతమై వెలుగుతుంది. ధర్మానికి గ్లాని కలిగినపుడు “ధర్మముద్ధరణ జేయన్ బుట్టు నా దైవం “హరి అని భగవద్గీతాసారం చెప్పారు. ”పరమాత్ముండగు విష్ణువున్ సకల విశ్వంబులో దర్శించువారు జ్ఞానులు “.నరజన్మం బతి దుర్లభంబు. తిరుమంత్రం బెంతొ శ్రేష్టంబు”అని విశిష్టాద్వైతాన్ని ఆ భాషలోనే చెప్పటం బాగుంది.

”ఆతని కొలిస్తే అన్నిజగాలను కొలిచినట్లే. ఆయన తింటే సర్వ భూత సంతతి తిన్నట్లే. అన్నిటా ఆతడే. ”ఎవరే మార్గమున ప్రవర్తిలిన నిన్నే చేరారు శర్వా “అని కృష్ణుని గీతలోని భావాన్ని పద్యీకరించారు. ”హరినామం బెదవిస్మరింప బడుటే. యత్యంత దుఖంబగున్ “అన్నారు. ”మతినీవె గతినీవె ‘శ్రీపతీ “అని “శృతినీవె గతినీవె నా ఈ నా ఆకృతివి నీవె భారతీ ”అంటూ స్వాతికిరణం సినిమాలో మాస్టర్ మంజునాథ్ పాడిన పాట భావం గానే శాస్త్రిగారూ అన్నారు. “అన్నంబూ హరి. రూపమే. తినెడువాతండె- దేహస్థుడై యన్నంబెల్ల బచించు నాల్గు గతులం దాతండె”..”భ్రమలన్నాన్పి. యదార్ధమున్ దెలియ జెప్పన్. దైవ మేన్నో ప్రయత్నములన్ జేయుచు. విశ్వ రూపమున సందర్శింప గా జేసె” అన్నారు పరమాత్మ అసలురూపాన్ని దర్శింపజేస్తూ...’వరమై. లోక వరేణ్యమై. వరదమై. వర్ధిల్లునారాయణ స్మరణం బార్తిహరం ”అనీ. ”ఖగరడ్వాహను డాశ్రితావనుడు,విఖ్యాతుండు. శ్రీ శంఖ చ –క్ర గదా ఖడ్గ ధనుర్ధరుండు “అని విష్ణుమూర్తి రూప సౌందర్యాన్ని వర్ణించారు. ప్రత్యక్ష దైవం అయిన సూర్యుని ఆరాధిస్తే. అనురాగమూర్తి అయి ఆహారాదికాలు ఇస్తాడని “తల్లి దండ్రి గురు డీ సర్వంబౌ జ్యోతి. నా-దిత్యున్ గొల్చెద. దేవ దేవుని, సురాధీశున్ గృతజ్ఞుండనై”అని చివరిపద్యం ముగించి. శ్రీమన్నారాయణ మూర్తికి సూర్యనారాయణ మూర్తికి అభేదాన్ని తెలియజేసి సూర్యుని. సవితృ నారాయణనిగా భావించే అనాదిభావాన్ని విశదీక రించారు.

శాస్త్రిగారి శతకాన్ని తల స్పర్శగా స్పశించానే తప్ప, లోతుగా విశ్లేషణ చేయలేక పోయిన నా అజ్ఞానాన్ని శాస్త్రిగారు మన్నించాలని కోరుతున్నాను. రసానందస్వరూపమైన శ్రీ మహావిష్ణువు నుతి శతకం కనుక ప్రతిపద్యం మధురస స్వరూపంగా ఉంది. ఉదహరించాలంటే శతకమంతా మళ్ళీ రాయాల్సి వస్తుందని కొన్నిటినే ఉదహరించిన నా సాహసాన్ని శాస్త్రిగారు మన్నిస్తారని విశ్వసిస్తూ. వారికిచ్చిన మాటను ఒక పూట ముందే పూర్తి చేసి, వారికి దీన్ని ఇప్పుడే మెయిల్ చేస్తున్నాను.

## 05 శ్రీ ఆనందేశ్వర శతకం -- శ్రీ కోట పేరిశాస్త్రి


శ్రీ అద్వయానంద భారతీ స్వామి

అగ్నికి ఆహుతి కాబోయి చేతికి చిక్కిన శ్రీ కోట పేరిశాస్త్రిగారి శ్రీ ఆనందేశ్వర శతకం

నిన్న13-4-19 శనివారం ఉదయం మా శ్రీమతి వేడినీళ్ళు కోసం దొడ్లో కాగుపెట్టి పాత చిత్తు కాగితాలతో నిప్పు అంటించ బోతుంటే అకస్మాత్తుగా అందులో ఒకచిన్న, బాగానలిగిన, దాదాపు కాగితాలు ఊడిపోయిన పుస్తకం కనిపించి పొయ్యిలో పెట్టటానికి మనస్కరించక నన్ను పిలిచి నాచేతికి అందించింది. తీరా చూస్తే, అది శ్రీ కోట పేరిశాస్త్రి కవి గారు రాసిన "శ్రీ ఆనందేశ్వర శతకం".అది నాదగ్గరకు ఎలావచ్చిందో వచ్చింది పో నా చిత్తుకాగితాల లోకి ఎలా ఎప్పుడు చేరిందో. ఇంతకాలం నాకు ఎందుకు కనిపించలేదో ఎంత బుర్రబద్దలు కొట్టుకొన్నా నాకు అర్ధం కాలేదు. ఏమైతేనేమి నాకొక పెన్నిధి దొరికిందన్న పరమానందం కలిగింది. కళ్ళకద్దుకొని నిన్నల్లా మా దేవాలయం లో శ్రీరామనవమి. శ్రీ సీతారామకల్యాణం హడావిడిలో తీరిక దొరకక.ఇవాళ పొద్దున్న తీరికగా దాన్ని తీసి ఊడిపోయిన కాగితాలను అంటించి, శ్రద్ధగా చదివి మురిసిపోయాను. 102 పద్యాలున్న 18 పేజీల శతకం ఇది. బహుశా దీనిని మా కోట గురువరేణ్యులు కీ.శే.బ్రాహ్మశ్రీ కోట సూర్యనారాయణ శాస్త్రిగారి కుమారులు అంటే మా గురు పుత్రులెవరైనా కాని లేక వారి కజిన్ శ్రీ కోట సీతారామ శాస్త్రి గారు ఇచ్చి ఉండవచ్చు నేమో అనిపించింది. కవిత్వం లోకి వెళ్లేముందు ఆ శతకం ఎలా,ఎక్కడ ఆవిర్భవించిందో వివరాలు తెలుసుకొందాం.




కృష్ణా జిల్లా గుడివాడ దగ్గర బేతవోలు లో ఉన్న శ్రీ ఆనందేశ్వర మహాశివునిపై శ్రీ కోట పేరిశాస్త్రి గారు శార్దూల పద్యరత్నాలతో. ''ఆనందేశ్వర !బేతవోల్పుర విహారా !చంద్ర రేఖాధరా "అన్న మకుటంతో రచించిన శతకం. రచనాకాలం 25-4-1989.శతకాన్ని కవిగారుపరమహంస పరివ్రాజకాచార్య శ్రీ నిర్వికల్పానంద భారతీ స్వామి వారి గుణ గరిస్టత ను ప్రశంసించారు . స్వామివారిని "పరమార్ధ భావ విహరణ –పరి శోభితులౌచు నన్ గృ పామల దృష్టిన్ – బరికించుచున్నవారలు – చరితార్ధునిగా దలంతు సంయమి చంద్రా "'అని కీర్తించారు. స్వామివారు –"శమదమాది కఠోరనిష్టా గరిష్ట!-సుస్థిర జ్ఞాన వైరాగ్య శోభితాత్మ !భవ్య నిర్వికల్పానంద భారతీ. వి –భాసమాన యతీంద్ర !తుభ్యం నమోస్తు "అని నిండుమనసుతో స్తుతించి,అనన్య గురుభక్తి ప్రకటించి ధన్యులైనారు శిష్యవరేణ్యులు శాస్త్రిగారు. ఈ శతక కృతిని శాస్త్రిగారు పరమహంస పరివ్రాజకాచార్య అనంత శ్రీ విభూషిత శ్రీ అద్వయానంద. భారతీ స్వామి వారి పాదుకలకు అంకితమిచ్చి ధన్యులయ్యారు."అల్పుని కృతి అని మనసులో తలచకుండా సమ్మోదం తెలిపినందుకు "కృతజ్ఞతలు చెప్పుకొన్నారు. అంకితం పుచ్చుకోన్నవారు –"సరస సాహిత్య విజ్ఞాన సారహృదయ –అఖిల వేదాంత విద్యారహస్య వేది-"ఐన శ్రీఅద్వయానంద భారతీ స్వామి వారు. ఇద్దరు మహాస్వాముల కరుణాకటాక్షాలు పుష్కలంగా పొందిన పేరి శాస్త్రికవి ధన్యతములు. అందుకే" సమర్పణ "శార్దూల పద్యంగా అద్భుతంగా చెప్పారు పేరి శాస్త్రిగారు -

"అర్దేందూజ్వల రత్న రంజిత కిరీటా !భవ్య సద్భక్తి భా –వార్ద్ర ప్రోత సుశబ్ద పద్య సుమ మాల్యం బిద్ది గైకొ గదే

శార్దూలాజిన ధారణంబు తదపేక్షా దృష్టి గా నెంచి యీ-శార్దూలంబుల నర్చగానిడితి ఈశా నన్ గటాక్షింపవే “అని శార్దూల నైవేద్యం పెట్టారు చాకచక్యంగా.

శ్రీ అద్వ్యాయానంద భారతీ స్వామి ”సంమోదము “అనే ఉపోద్ఘాత వ్యాసం లో మనకు కావాల్సిన విషయాలు గ్రాంధికంగా తెలియజేశారు. నేను దాన్ని వ్యావహారికంగా మీకు అందజేస్తున్నాను. ”నేడు గుడివాడ పట్నం లో ఒదిగిన బేతవోలు ప్రాచీనమైనది. ఆపేరును బట్టే అది చాలాపురాతనమైన ప్రదేశం అని తెలుస్తోంది. ఒకప్పుడు ఇది జైన స్థావరం. గుడివాడ పూర్వం “గృధ్ర వాక”మండలానికి ముఖ్యస్థానమై జైన,బౌద్ధాలకు ఆలవాలమై ఉండేది. ఆ అవశేషాలు ఇప్పటికీ అక్కడున్నాయి.

బేతవోలులోని శివుడు శ్రీ ఆనందేశ్వరుడు . ఆలయం చాలా ప్రాచీనమైనది. శిదిలమైపోతే కృష్ణాజిల్లా గురజ జమీందారు పునః ప్రతిష్ట చేసి ఆలయం నిర్మించారు. ఈ ఆనందేశ్వరుడు తైత్తిరీయ ఆనందవల్లి లో వర్ణించబడిన బ్రహ్మానంద మూర్తి. చిచ్చంద్ర రేఖా ధరుడు. త్రికాలారాధ్యుడైన సత్యమూర్తి. బహుజన్మ సంస్కారుడైన ఏ కవి అయినా ఆయన ఆకర్షణకు లోనౌతాడు. కవి పేరిశాస్త్రిగారు మన హృదయాలనిండా ఆనందం నింపాడు. శతకాన్ని గంగా నిర్ఝర సదృశ దారాళవాగ్ధాటితో పలికాడు. ఆనందేశ్వరుడికి కవితా పీయూష (అమృత )ధారాభిషేకం చేశాడు.కవి చిన్ననాటి నుంచి శ్రీ విశ్వనాథ కవితా భావుకుడు. ప్రౌఢ కవితాప్రియుడు. శతకం అంతా ప్రౌఢ సరస్వతీ విన్యాసమే దర్శనమిస్తుంది. సమాసకల్పన లో ఒక ప్రత్యేకత. రీవి, శైలిలో ఓజస్సు. చమత్కారంతో ఉన్న ప్రసాదగుణం. ఔచిత్యంతో కూడిన సంబోధనలు. ఆ. సంబోధనలో ఒక మార్మికత, వాక్యాలలో వేదాంత స్ఫూర్తి,ఆగని స్వచ్ఛకవితా ధార. బహు స్పష్టమైన శబ్దాదికారం రచనను దీప్తిమంతం చేసింది.

శాస్త్రిగారితో నాకు యాభై ఏళ్ళుగా పరిచయం ఉంది. అయన కల్మషం ఎరుగని చిత్తశుద్ధికలవాడు. సజ్జనుడు. నిగూఢ సాధకుడుగానే ఉండిపోయాడు. రచనలు చేసినా వెల్లడించకుండా నే ఉండిపోయిన నిర్లిప్తుడు “అని కవి పేరిశాస్త్రి గారి గురించి శ్రీ అద్వయానందభారతీ స్వామి తెలియజేశారు. కవిగారి ఇతర రచనలు గురించి మనకేమీ తెలియదు. కానీ చివరిదైన 102శార్దూలపద్యం లో శాస్త్రిగారు తనగురించి కొంత చెప్పుకొన్నారు స్వామికి నివేదనగా –

“నేనీ దాసుడ. కోట వంశజుడ. కౌండిన్యాఖ్య గోత్రుండ,నో –ప్రాణేశా ! పెదపున్నయాఖ్యునకు. ధర్మాచార సంపంన్న,దీ-క్షా నిర్నిద్ర సరస్వతీ సతికి నిం గారాము పుత్రుండ. నీ

ధ్యానాసక్తుడ పేరి శాస్త్రి యభి దుం డర్పించు నర్చా శతం –బానందేశ్వర !బేతవోల్పుర విహారా !చంద్ర రేఖాధరా”

ఇంతటి అద్భుత శతకం నా చేతిలో పడటం నా అదృష్టం. శతకం లోని కవితా విశేషాలు తరువాత తెలియజేస్తాను.

బేతవోలు శ్రీ ఆనందేశ్వర దేవాలయం కాలక్రమం లో శిదిలమైతే గురజ జమీందారు శ్రీ శోభనాద్రీశ్వరుడు పునః ప్రతిష్టించాడని. కోట వంశానికి చెందిన సీతారామశాస్త్రిగారు వంశపారంపర్య ధర్మకర్తగా చక్కగా ఆలయాన్ని కాపాడుతున్నారని పేరి శాస్త్రిగారు పద్యాలలో చెప్పారు. -"తానేగ్రామనివాసి దేవళమనిద్రా భద్ర దివ్యాత్ముడై –ఏ నాటన్ విలసిల్ల జేసెననసేమీ !శోభనాద్రీశ్వరుం –డేనాడోగురజాదిపుం డిచట ప్రతిష్టించెన్ నినున్. మాపురిన్ "అని కృతజ్ఞత చెప్పారు. అలాగే –

"తానొక్కండు,కృత వ్రతుండగుచు,సీతారామ శాస్త్రాఖ్యుడున్ –పౌనః పున్యవిలుంఠ భక్తిరసభావాలం కృతుండొప్పవం -శా ను ప్రాపిత ధర్మకర్త పరమేశా !కోట వంశ్యుం డొగిన్"అని ఆలయ వంశపారంపర్య ధర్మకర్త కోటసీతారామ శాస్త్రిగారిని మెచ్చుకొన్నారు. ఈ సీతారామశాస్త్రిగారు నాకు తెలిసిన మైలవరం వద్ద తెలుగుపండిట్ గా పనిచేసిన సీతారామ శాస్త్రి గారు, మా కోట గురువుగారి పుత్రులకు సమీపబంధువు బేతవోలు నివాసి కోట సీతారామంజనేయులుగారి ఇంటి ప్రక్క ఉంటున్న సీతారామ శాస్త్రిగారేమో అనిపిస్తోంది. లేకవారి తాతగారైనా అయి ఉండచ్చు.ఇది మా కోట గురుపుత్రులు క్లారిటీ ఇవ్వాల్సిన విషయం. ఎవరైతేనేమి ఆనందేశ్వర సేవలో ధన్యులౌతున్నారు.రసగుళికలు లాంటి ఎన్నో పద్యాలు భక్తిభావబంధురంగా కవిగారు రచించి జన్మ చరితార్ధం చేసుకొన్నారు.

"ఓనీహార ధరా ధరేంద్ర తనయా యుక్తార్ధ దివ్యాంగ ! స్వ-ర్వేణీ వేణి ధరోత్తమాంగ!భుజంగా నీకాంగ!చితా విభస్మపరిలిప్తాంగా !దయా సాంగ"అంటూ అంగ ప్రదక్షిణం చేశారు. శివునికున్న పేర్లన్నీ సార్ధకంగా ప్రయోగించి శివనామస్మరణ చేశారు –"ఓ నీల ద్యుతికంధరా !స్మరహరా !యుష్ణీష గంగాధరా - మానాధాశర !దైత్యహరణహరా !మంజీర భోగేశ్వరా !దీనోద్ధార! హరా !పరాత్పర !ఉమాదేవీ వరా !శంకరా "అంటూ ప్రవాహవేగంగా సాంబశివ నామజపం చేశారు. .కవిగారి శివుడు "అఖండోజ్వల జ్ఞానానంద వికాసుడు –మౌని జన హృత్సందీపితా వాసుడు ".ధూర్జటి కవి ఆవహించి రాయిం చాడేమో అనిపిస్తుంది ఆ అనన్య భక్తి వైభవం చూస్తే.పొంగిపోతారు పరవశిస్తారు పరవశింపజేస్తారు కవి పేరిశాస్త్రిగారు-

"మాణిక్యోజ్వల చంద్ర మశ్శకల రంజన్మౌళిమందాకినీ –వేణీ మౌక్తిక రాజిరాజిత శిరో వేష్టీ!సురక్ష్మారుహా గ్రానూనాంచిత తామ్ర మూర్ధజ !మహాకాలా !మహేశా !శివా "అని భీమఖండం లో శ్రీనాధుని లాగా పారవశ్యంతో పరమేశ్వరనామోచ్చారణ చేసి తరించారు. ఆ నందం అనుభవైక వేద్యం –అక్కడ ఆయన "ఆనందంబున. అర్ధరాత్రమున చంద్రా లోకముల్ కాయగా. నానాసైకత వేదికాస్థలుల –శంభు కాశీనాధు నుమామహేశు

శివున్. శ్రీ కంరు నిన్ బాడెదన్ మేనెల్లన్ పులకాంకు రంబులెసగ నిండారు మిన్నేటిలో" అన్నపద్యం లో ఎలా ఉప్పొంగిరాశాడో. ఈ కవీ అలాసే సార్ధక్యంగా రాశారు. పేరిశాస్త్రి గారు ఎలాంటి శివుడిని ధ్యానిస్తారో తెలుసా –

"ధ్యానింతున్ మది నద్వితీయ మగు బ్రహ్మన్,సత్యసంకల్పువి –ద్యానిద్రాకృతి లోకకారకుని. లోకాలోక సద్రూపునిన్ –జ్ఞానానంద మయ స్వరూపు నిను గంగా పార్వతీయుక్త శ్రీ ఆనందేశ్వరుని "అంటే ఈ ఆలయం లో దేవేరులు గంగా. పార్వతులన్నమాట. అలాగే "ఆనీతం బొనరింతు నీకరుణచే నైశ్వర్యముల్ ఈ జగ-చ్ఛ్రేణి న్నేనిక తోలుపుట్టమును బూదిన్ దాల్తు నెమ్మేననీ-శానా !భోగమభోగమంచను వివక్షా దృష్టిమన్నించవో"అని అపరాధశతం చెప్పుకొన్నారు.

"వీణాక్వాణము. కామినీజన లసద్విస్రంభ సల్లాపమై –వాణీ కంకణనూపురధ్వనులు సమ్యగ్వేణునాదంబులే -యై నీనర్తన మేల మాకు నటరాజా !వట్టి విన్యాసముల్ "అని భక్తిహీనుల భౌతిక దృష్టిని ప్రశ్నించారు. భ్రూ నేత్రాగ్ని. చర్మ ధారణా. పాముల భూషణాలు చూసి భయపడి తొలగిపోము "మందార మాలా నిష్యంద మరందముల్ జిలుకు నీఅంతరంగాన్నిచూసే ఆకర్షితులమౌతామన్నారు. ఈర్ష్య అసూయలు లేని జీవితాన్ని ప్రసాదించమని వేడికోలు చేశారు –

"లూనోచ్ఛిన్నము చేయలేనయితి,నాలోనున్న వాంఛాలతల్ –లీనోద్భేదన సేయలేనయితి. దుర్మేభాగఘోరాశ్మముల్ -దీనుండ.శరణార్ధి దాసుడ,కపర్దీ కావవే ఈశ్వరా "అని శరణాగతులయ్యారు. సర్వం ఈశానునికే అర్పించారు.

"జ్ఞానాజ్ఞాన ములందు నింద్రియములో. జంద్రార్ధ చూడామణీ-ప్రీణంబౌ బహుధా ననజ్ఞ్నతకె మాస్దిత ద్యోతముల్ –సూనంబంచు ధరింప గండ శిలలందున్ బాయగా జాలమో "అంటూ అజ్ఞానం చేసే వికృత విన్యాసాన్ని వివరించారు. భక్తుని పరీక్షించటం అంటే "శాశ్వత కీర్తి కాయుని గ నీ క్ష్మానిల్పు సంకల్పమే "అని తెలియజేశారు.

"నీ నిత్యత్వ మనిత్య తాస్దితు లనిర్నేయంబు. లజ్నేయముల్-గానేపారు సదాశివా !అగణిత బ్రహ్మాండ సృష్టి స్థితి –క్షీణానేక చిదేక వైభవ ములన్ గ్రీడింతు సర్వాత్మపై "అని శివలీలా రహస్యం ఎరుక పరచారు. శివానందలహరిలో శంకరభగవత్పాదులు లాగా చక్కని పద్యం రాశారు –

"సాను ప్రాంశు శిలాతలంబున నివసంబుంట నీ కిస్టమే-యైనం. ఆ రజతాద్రి సానువుల యట్లత్యంత కాఠిన్యమున్ –కానేకాదు. మదీయ హృత్కుహరభాగంబందు భాసింప వే "అని తన హృదయకుహరం లో శాశ్వతంగా నిలిచిపోమ్మని ఆనందేశ్వర సదాశివుని ఆర్తిగా ప్రార్ధించారు.

చివర్లో అత్యంత చమత్కారంగా తన ఆనందేశ్వర శివుని ఇంకా ఎందుకయ్యా పాత చీకిపోయిన శార్దూల చర్మం ధరిస్తావు ?నా శార్దూల విక్రీడిత శతకం స్వీకరించి హాయిగా విహరించు అని ప్రార్ధించారు –

"లూనాఘూజగదాది నాటిదగు శార్దూలాజినంబిక నీ-కీనాడే?వినూత్న మద్ఘటిత భక్తిప్రోత శార్దూల వి-శ్రాణార్చా శతి స్వీకరింపుము ప్రభూ. శంభో శంకరా –ఆనందేశ్వర !బేతవోల్పుర విహారా !చంద్ర రేఖాధరా "

ప్రౌఢ కవితా గంగా ఝరీ సదృశ కవిత్వం తో శతకం రాసి నా. కవిగారు తన వినిర్మల వినయాన్ని ప్రకటించుకొన్నారు ఆది శంకరాచార్యులుగారిలాగా -

"సానందా!మది నీసడింపకుపె,శబ్దార్ధ ప్రయోగాదిదో-షానేకం బిది యంచు నా వెనుక భాస్వంతోజ్వల స్వాంత వీ-ధీ నిర్దోషతి చూచియే. నను కృతార్ధీభూతు సేయందగున్ –ఆనందేశ్వర !బేతవోల్పురవిహారా !చంద్ర రేఖాధరా "

ఇంతటి గొప్ప శతకం అగ్నికి ఆహుతి కాకుండా నా చేతికి చిక్కటం ఈశ్వర సంకల్పమే కాని వేరుకాదు. ఆ ఆనందేశ్వరుడు మనకు ఆనందానుభూతి సదా అనుగ్రహించాలని కోరుకొందాం. మిస్టరీ వీడింది –ఇప్పుడే బేతవోలు నుంచి శ్రీ కోట సీతారామ శాస్త్రిగారు ఫోన్ చేసి నేను రాసిన మొదటిభాగం చదివానని. ఈశతక కర్త శ్రీ కోట పేరిశాస్త్రిగారు సాక్షాత్తు తమ తండ్రిగారేనని. ఆ దేవాలయ ధర్మకర్తలం తామేనని. తమ పితృపాదులు ఆనందేశ్వరునిలో లీనమై చాలాకాలమైందనీ. 2017 సెప్టెంబర్ 5 ఉయ్యూరులో లో అమరవాణిహైస్కూల్ లో జరిగిన శ్రీ కోట సూర్యనారాయణ శాస్త్రి గురు వరేణ్యుల గురు పూజోత్సవం నాడు. తాము, మాగురుపుత్రులు శ్రీ కోటసీతారామాంజనేయులుగారు కలిసి వచ్చి,పాల్గొని మేము అమెరికాలో ఉండటం చేత ఈ శతకాన్ని మా అబ్బాయి రమణకు అందజేసి వెళ్లామని చెప్పారు. సుమారు ఏడాదిన్నరకాలంలో శతకం బయటపడి నాకు దక్కింది. సర్వం ఈశ్వరాదిచ్ఛేత్ అంటే ఇదేనేమో.

## 06 వేంకటేశ్వర శతకం -- శ్రీ కాశిరాజు లక్ష్మీ నారాయణ

శ్రీ కాశిరాజు లక్ష్మీ నారాయణ రచించి. పోరంకి భద్ర గిరి-ధ్రువ కోకిల బృందం 2020 జనవరి లో ప్రచురించి నాకు ఆత్మీయంగా పంపిన శ్రీ వేంకటేశ్వర శతకం ఇవాళ మహా శివ రాత్రి పర్వదినాన అందటం. ఉదయం 11-30వరకు పూజాదికాలు. మహన్యాస పూర్వక రుద్రాభిషేకం. బిల్వార్చనాదులతో సరిపోవటం భోజనం చేసి కాసేపు కునికి. మధ్యాహ్నం 3కు లేచి చదివి. రసవంతమైన దారాశుద్ధిగల భక్తి శతకం కనుక శివరాత్రినాడు దానిపై స్పందిస్తే భక్తీముక్తీ అనిపించి రాస్తున్నాను. ఇప్పటికే భవానీ శతకం. కులశేఖరాళ్వార్ ముకుందమాల-

అనువాదం.ముకుంద శతకం  శతకం. కాఫీ శతకం రాసిన అనుభవం కవిగారిది. కొంతకాలం మిత్రుడు ఎన్. సి. హెచ్. చక్రవర్తి గారితో కలిసి జంటకవిత్వమూ రాశారు. కవి విశ్రాంత కృష్ణా జిల్లాపరిషత్ ప్రధమ శ్రేణి తెలుగుపండితుడు కావటం తో, పాఠాలలో కవిత్వం చెప్పీ చెప్పీ. చదివే రోజుల్లో క్షుణ్ణంగా నేర్చీ నేర్చీ అనుభవమున్న వారు. నాకు ఈ పుస్తకం తోసే వారి పరిచయం. నన్నెలా తెలుసుకొని పంపారో ఆ శ్రీనివాసునికే ఎరుక.

సురధుని కడుగు పాదాలకు శతకం అంకితం చేశారు. మొదటిపద్యమే మనోహరంగా ఉంది. "శ్రీవర  పద్మనాభ రవి శీతకరాక్ష భుజంగ మర్దనా. -క్ష్మావర పద్మపద హరిచందన చర్చిత కైటభారి"అంటూ ధారగా పారింది కవిత్వం భక్తి నిండారగా. తనబ్రతుకు పండుగ అవటానికి ఈరచన చేశారట. పుష్పాలు ఫలాలు  తోయం ఇద్దామనుకొంటే అన్నీ ఎంగిలి చేసినవే కనుక "ఎంగిలికాని నామనము నిచ్చెద"అంటారు భక్తీఅర్తీ చమత్కారాలతో. రసవత్తరంగా వేణువు వేణుపైనట్లు  శ్రీనివాసుడు వకుళమాతను చేరాడట. "మానసవీధి,నీ మృదుల మంజుల భావపరంపరల్ సదా జ్ఞాన పరీమళమ్ములువెదజల్ల "కోరిక కవిగారిది. అర్ధం కాని నుదుటి గీతలు సార్ధకం చేయమని కోరారు. వార్ధి భుజంగ తల్పమున. వార్ధిజ పాదములొత్త,లోకముల్ వర్ధిల జేసే "జగన్నాయకుడు తన కంటకమయ బాటకు బాసటగా ఉండమని కోరారు. తాను మంద బుద్ధియై "మోక్షమనే  కమలాన్ని"వదిలి ఐహిక సుఖాల వెంటబడిన వాడినని.  అమలిన భక్తి నిమ్మని వేడుకొన్నారు. నారాయణ వృక్షవంత  శిఖరమున నిలిచిన వేంకటేశ్వరుడు అనటం బాగుంది. ఆలయ పాలక వర్గం భక్తులిచ్చే విశేష ధనరాసులను స్వామికైంకర్యానికి. లేక లోక కల్యాణానికి ఉపయోగించకుండా "తెగ మింగే హైన్య వికార వర్తనులను "అంతం చేయమని నిష్కర్షగా కోరారు. మహాభక్తుడు అన్నమయ్య "సురరిపు శోణిత ప్రభల శోభిలు నందకం "శ్రీనివాసునికి "సరససురాగ భావములు జాను తెనుంగున నాలపించి కాంచన హారం వేశాడట.కొండంత వేల్పు తనను శతాధిక పద్య రచన తో నుతింప జేసినందుకు కృతజ్ఞతలు చెప్పుకొని. భవసాగర తీరాన్ని దాటింపజేసి,దయ చూపిన "దాన వార్తి కర. శుక్తి సుదర్శన ధారి"మాధవునికి జోతలు సమర్పించి "నను జూడవె ప్రేమను  వేంకటేశ్వరా " అంటూ శతకం పూర్తి చేశారు మధు మధురంగా మధురకవి కాశి రాజు లక్ష్మీనారాయణ కవి.

## 07 ముకుంద శతకం -- శ్రీ కాశిరాజు

కమ్మని కాఫీ ఇచ్చిన చేత్తోనే ముకుంద కంద మాల అల్లిన" కాశిరాజు "

నాకు పరిచయం లేకపోయినా మళ్ళీ రెండు కవితా పొత్తాలుపంపారు శ్రీ కాశిరాజు లక్ష్మీనారాయణ పండిత కవి. ధన్యవాదాలు. రెండూ 2019 జులై లో విడుదలైన తాజా పుస్తకాలే. మొదటిది "కాఫీ శతకం "రెండోది "ముకుంద శతకం ".మొన్న 6వ తేదీ అందగా ఇవాళ 8వ తేదీ చదివేశాను. శ్రీ జొన్నవిత్తుల 'కాఫీ దండకం "తో సుప్రసిద్ధుడయ్యాడు. ఈకవికీ "కుదిరితే ఒక కప్పు కాఫీ "అలవాటు బాగా తెలిసిన వాడే. కాఫీ ఆవిర్భావం. కలిపే తీరు,రంగు రుచి వాసనా. ఇచ్చే కిక్కూ,కమనీయంగా వర్ణించాడు. ఐతే అట్టమీద బొమ్మ కొంచెం "రాక్షసం "గా ఉందని పించింది.

"తొలిచూపు వలపు. తొలకరిచిరు జల్లు. తుహినం. కులసతి స్మేరం కంటే కాఫీ "చిలిపిగా ఊరిస్తుందట కవికి. మనకీ అంతేగా. "చక్కని కాఫీ పొడితో –చిక్కని సారమ్ము (డికాషన్ )దీసి చిచ్చర పాలన్-చక్కర కల్పినతోడనె"చవులూరిస్తుంది. ఎందుకండీ "ఎలనాగ ఆలింగనం. వలకారి పయోధరాలు ?"వాటిల్లో లేని మాధుర్యం కాఫీలో కలదని" కప్పు" బజాయించి చెప్పాడు కవి. రోగీ వైద్యుడూ ఒకే రకంగా ఆలోచిస్తే కేమిస్ట్రీ కుదిరి వ్యాధి దూరమౌతుంది. అందుకే డాక్టర్ "త్వరగా ఉపశన మీయ "జ్వరం బిళ్ళను కప్పు కాఫీతో వేసుకోమని సూచించటం తో "వెజ్జునకు అనుజ"అవుతుందట కాఫీ సోదరి. ఎవరి టేస్ట్ వారిది. కొందరు వేడి వేడిగా కొందరు చల్లర్చుకొంటూ కొందరూదుకొంటూ పలు విన్యాసాలతో కాఫీ దేవిని స్వీకరిస్తారు. ఆవైభోగాన్ని కవి "పొగతో కొందరు ద్రావగ-సెగబీల్చుచు గొంతమంది. ఎక్కటి రొదతో –సెగసెడి మక్కువ గొందరు –నొగరుగ నానంగ రుచియు నొక్కటె కాఫీ "అని కమ్మగా చెప్పాడు కవి. ఎన్నెన్నో పానీయాలున్నాయ్ మత్తెక్కించేవీ. కిక్కిచ్చేవీ,ఉషారిచ్చేవీ. నిస్సత్తువ పోగొట్టేవీ. కాని కవికి "వాటన్నిటిలో –మానసిక పికం –ఉప్పొంగేట్లు గానం చేయించగలిగే గరీయమైంది కాఫీ ఒక్కటే అంటాడు కవి భావ గర్భితంగా. ప్రవరునికాలం లో కాఫీయే ఉంటె. వరూదినికి పూతచరిత్రుడైన "బాపని" నీతి తప్పించటానికి అన్ని విధాలుగా చెలరేగాల్సిన అవసరం లేదట. కప్పు కాఫీ ఇస్తే ఇనుప కచ్చడాల్ కట్టిన అతడి మనసు చెదరదా ?అన్నాడు. సులభ తరుణోపాయం చెప్పాడు. బాతాఖానీ కబుర్లకోసం చేరే మిత్రుల కాఫీ సేవిస్తూ పాతరోజులు రుచులు తవ్వి తలపోస్తారు. దానితో తాదాత్మ్యమేకాదు సంతోషం విలసిల్లుతుంది. ఉష్ణం ఉగ్రంగా ప్రకోపించి నోరు చేదై,తిండియావ లేకపోతె "తీరగు పానీయమై "కారణజన్ముడాలౌతుంది కాఫీ నెచ్చెలి. ప్రేమ ముదిరి. మాట్లాడుకోటానికి వీలు లేకపోతె ప్రేయసి

కాని ప్రియుడు కాని "కుదిరితే ఒక కప్పు కాఫీ తాగుదాం "అని ఆహ్వానించి ఊసుల మైకం లో పడిపోతారు. "పద్యానికి ప్రాసయతులు –సేద్యానికి విత్తు. వానచినుకుల్ మడికిన్ –వాద్యానికి శ్రుతిలయలు ది-న ఆద్యానికి నీవు చాల అక్కర కాఫీ "అని కాఫీ ప్రాముఖ్యత తెలియజేస్తాడు కవి. అంతేనా ?యాగానికి ఆజ్యం. వ్యాజ్యానికి సాక్షి. రాజ్యానికి మంత్రి యెంత ముఖ్యమో "ఉపభోజ్యానికి మొదటి ముఖం కాఫీ "ట.ప్రాచీనకాలం లో మజ్జిగ. ఆర్వాచీనం లో కాఫీ "ప్రధమ ఔషధాలట."చల్ల స్వాస్త్యం ఇస్తే, ఓజనిచ్చె మోహన కాఫీ "అయిందట. సవనం (యాగం )లో సోమరసం. కవనం లో ఆత్మరసం,యుద్ధం లో వీరరసం. పట్టు విడుపుల లోకరుణ రసం ఒక్కొక్కటే ఐతే "నవరస సారమ్ము నీవ నవయుగ కాఫీ "అన్నాడు గడుసుగా. బాగా చైతన్యం ఇచ్చి. రాగద్వేషాలు లేకుండా రంజిల్ల జేస్తుందట కాఫీ. పొద్దున్నే కార్యోన్ముఖులైనవారికి శ్రమనిర్వీర్యం చేసి బలిమి. ఔదార్యం కలిగిస్తుంది. "నిను సేవించియు పొలమున –పని చేసేది రైతు చెమట వర్షపు చినుకై –పెను సారము నింపి పుడమి –కనువగు ఫలసాయమిచ్చు త్యాగివి కాఫీ "అని కాఫీ త్యాగగుణాన్నికూడా కొత్తకోణం లో చెప్పాడు కవి. పొలాల్లో పని చేసేవారు కాఫీ కంటే టీ అనే చాయ్ నే ఎక్కువగా తాగుతారని కవి గమనించి ఉండడు.ఏది తాగినా ఫలితం ఒక్కటే. మొత్తం మీద కాఫీ పై చాల సాఫ్ట్ కార్నర్ గా ఉన్నాడుకవి. నెగటివ్ భావాలు లేకుండా పాజిటివ్ గా కాఫీ గుణగాన కీర్తన చేసి సుభాష్ అనిపించాడు కవి.

అందమైన కందాలతో రాసిన దే "ముకుంద శతకం "దీన్ని ఆకాశవాణి విజయవాడ కేంద్రం లో దాదాపు 40సంవత్సరాలు వయొలిన్, గాత్ర సంగీత,హరికథ,మొదలైన ప్రక్రియలలో అమృతం పంచి సంస్కృతాంధ్ర సాహిత్యాలలో సత్కావ్యాలెన్నో రచించి వాగ్గేయకారు లని పించుకొన్న కవి సంగీత సాహిత్య కళానిధి. శాస్త్ర కోవిదులు శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులవారికి అంకిత మివ్వటం సముచితం గా ఉన్నది. బాలకృష్ణ లీల. దుష్ట శిక్షణ శిష్ట రక్షణ.గోపాలకులతో క్రీడా విలాసం. స్నేహ వాత్సల్య, భక్తీ. వంశీ నాద ప్రమోదం. అన్నీ కలిపి రాసిన కంద శతకం. ఎనెక్డోట్స్ లా ఉన్నాయే కాని ప్రత్యేకత కనిపించలేదు. చదివి మురిసి పులకించి. ఉదాహరించాల్సిన పద్యాలు నాకు తక్కువగా కనిపించాయి.భక్తి పారమ్యానికి తక్కువేమీ లేదు. కాఫీ ఇచ్చిన చేత్తో నే రాసినా, ఆ కాఫీ రుచి రాలేదేమో అని పించింది. పోతన భాగవత వాసన తో ఉన్నాయి పద్యాలు –ఉదాహరణకు –బాలుండీతడు. ఘనతర శైలంబిది ".ఐతే "అక్కజమైన చెలువమది –చిక్కడు తలక్రిందులైన శిశుపాలునికిన్ –దక్కదు కేసరి సొత్తది-నక్కను చేబట్ట బోదు నాతి ముకుందా "మంచి పద్యం అయినా పోతన ఛాయ వెంటాడింది. "లాక్షా గృహ దహనమ్మున-రక్షింపను పాండవుల సొరంగము త్రవ్వన్ – దక్షుని పూన్చితివిజగ –ద్రక్షక నీ యండ మాకు రక్ష ముకుందా "క్షకార ప్రయోగం బాగుంది అనుకొన్న భావం కుదిరింది. ఎన్నని ముకుందుని లీలలు ? అన్నీ వర్ణించటం సాధ్యమా. తరమా అందుకే సింపుల్ గా "భవదీయ

దయను గూర్చెద –భవ  బంధమ్ములను ద్రెంపి"పాహి ముకుందా అని కవి ఆర్తిగా నివేదించు కొన్నాడు ఆ వేణు వినోదునికి.

08  శ్రీ వేంకటేశ్వరదేవాలయం –చిత్రాడ --  శ్రీ అనంతా చార్యులు. కృష్ణాచార్య



తూర్పు గోదావరి జిల్లా పిఠాపురం మండలం లో చిత్రాడ గ్రామం ఉన్నది అక్కడ శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయం ప్రసిద్ధమైనది. ఈ చిత్రాడ వెంకటేశ్వర స్వామిపై సంస్కృతం లో "చిత్రాడ వెంకటేశ్వర శతకం "రాశారు శ్రీ అనంతా చార్యులు. కృష్ణాచార్య గురువు వలన వేదం వేదాంగాలు శాస్త్రాలు కావ్యాలంకారాలు,శ్రౌత స్మార్త కర్మల నిర్వహణ నేర్పు పొంది. వైఖానస పాంచరాత్ర శ్రీ విష్ణు దివ్య ఆగమాలలో పరిణతి సాధించిన సుదీమణి శ్రీ పద్మనాభాచార్యులు. తైత్తిరీయ శాఖ. వైఖానస సూత్రులు. గౌతమ గోత్రీకులు. యజ్ఞయాగాదులు నిర్వహించటం లో చేయటం లో ప్రసిద్ధి చెందినవారు. నిగమాగమ ప్రవచనంలో వరిష్టులు తాతగారైన శ్రీ పద్మనాభాచార్యులు. ఆ గౌతమస గోత్రం లో జన్మించిన నరసింహా చార్య కవికి మూడవ సోదరుడు అనంతాచార్యుడు అనే కవి ఈ చిత్రాడ వెంకటేశ్వర శతకం రాశారు. వృష శైల క్షేత్రంగా ప్రసిద్ధి చెందిన చిత్రాడ నివాసి. దక్షిణ తిరుమలగా. దక్షిణకాశిగా,పాద గయగా  ప్రసిద్ధి చెందింది ఈ క్షేత్రం . ఉత్తరాన పాదగయ అయిన పిఠాపురం. తూర్పున సముద్రం. పశ్చిమాన అఖండ గోదావరి ఉన్న పవిత్ర క్షేత్రం చిత్రాడ. రావు వంశం లో పుట్టి శ్రీ వెంకటేశ్వరస్వామి నిజభక్తుడైన వెంకటాద్రి సద్గుణ గరిష్టుడు. సచ్చీలుడు. ఆశ్రితులపాలిటి కల్పతరువు. ఈయన ఆదేశం తోకవిగారు చిత్రాడ శతకం సంస్కృతం లో రాశారు . ."చిత్రాడ వాస కృపయాపరిపాహి దీనం "అనీ ""చిత్రాడ వాస మురసా శ్రియ మా దధానం "అనీ "చిత్రాడవాస

శరణాగత వత్సలత్వా "అనీ పరిపరి విధాల సంబోధిస్తూ అత్యంత భక్తీ తాత్పర్యాలతో అత్యంత సులభ శైలిలో శతకం రాశారు

"సనకాది యోగి వర్యైరనవరతా సేవ్యమాన పద పద్మః –చిత్రాడ వేంకటేశ క్షిప్రం మే ప్రదిశ పాద భక్తిం తే"

"కలిదోషహరం కరుణా జలధిం –కమనీయ వపుః కలితం పరమం – కమలాలయ వక్ష సమాదిగురుం –కలయే సతతం వృష శైల పతిం"

"చిత్రాడ గ్రామ వాసీ ఘనరుచి రతనుః పార్శ్వర్యోర్విద్యువిద్యుదాభ –శ్రీ భూ దేవీ సమేత స్తరణి శ్శిశిల చ్చక్ర శంఖోర్ధ్వపాణిః –భక్తేభ్యో వేంకటేశోవిలసతి చరణప్రస్రురోరుస్తితాభ్యాం-హస్తాభ్యా మాశ్రితేభ్యః ప్రపిత విరజా గాధ ముక్తి ప్రదేశః "

"శ్రీ భూదేవీ సమేతాయ భక్తాభీష్ట ప్రదాయినే –చిత్రాడాఖ్య పురీశాయ వేంకటేశాయ"అంటూ శతకం పూర్తీ చేశారు.

చిత్రాడ లని శ్రీ వెంకటేశ్వరస్వామికి రంగరంగ వైభంవగా జరిగే రధోత్సవం చూడటానికి ఎక్కడెక్కడి నుంచో భక్తులు వేలాదిగా తరలివస్తారు. ఆ వైభవం చూడటానికి రెండు కళ్ళూ చాలవు. స్వామి తన దేవేరులు శ్రీ దేవీ భూదేవీ లతో కలిసి ఊరేగుతాడు. భక్తుల అభీష్టాలను తీర్చే కొంగు బంగారం చిత్రాడ శ్రీ వేంకటేశ్వర స్వామి.

09 శ్రీ వేణు గోపాల స్వామి దేవాలయం -- లక్కవరం శ్రీ లక్కాకుల వేంకట రత్నదాసు




తూర్పు గోదావరి జిల్లా తాటిపాక సీమ అనబడే  రాజోలు మండలం లో లక్కవరం గ్రామం లో శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం ప్రసిద్ధమైనది. చుట్టూ ప్రాకారం. మంచి ధ్వజస్తంభం. వైభావాత్మక కళలతో అందంగా ఉన్న గర్భాలయం. కళ్ళను ఆకర్షించే చిత్రాలు ఉంటాయి. ముందు భాగం లో ముఖమంటపం కళ్యాణ మండపం ఉంటాయి. ఆలయ గోపురం రమ్యంగా చూడముచ్చటగా ఉంటుంది. ఆలయం లో జయ ఘంట నాదం ఓంకారధ్వనితో వీనులకు విందు చేస్తుంది. మనసుకు హత్తుకొనే శిఖరాలు న్నాయి. స్వామి పూజకు పెంచిన పూలతోట వివిధరకాల పుష్పాలతో అలరారుతుంది.

ఆలయ ద్వార బంధం దాటీ గా ఉంటుంది. దానికున్న తలుపులలో చిరు ఘంటల రవళి మానసిక ప్రశాంతత కలిగిస్తుంది. స్వామి ఊరేగింపుకు ఉపయోగపడే అనేక వాహనాల వరుస నయనమనోహరం. స్వామి ఉత్సవ విగ్రహాలు  వెలలేని శోభతో  ఆగమ రీతిలో ఉంటాయి. స్వాములకు పట్టేతెల్లగొడుగుల కాంతి శరత్కాల పౌర్ణమి చంద్రకాంతి తో ధగధగ మెరుస్తాయి. వెండి వింజామరలు స్వామి కి మలయా నిలం అందిస్తాయి. మంగళ తోరణాలు శుభప్రదమై కాంతు లీనుతూ కనిపిస్తాయి.


లక్కవర
శ్రీ వేణుగోపాలశతకము
ఇందు
రచయిత
All right Reserved.
1937

గర్భ గృహం లో సకల సౌభాగ్య శృంగార సంయుతమైన ఎత్తైన పీఠంపై ముద్దులొలికే శ్రీ రుక్మిణీ సత్యభామల మధ్య శ్రీ వేణుగోపాలస్వామి నయనా నందకరం గా ముద్దులు మూటకట్టుతూ. భక్తులకు కొంగు బంగారం గా భక్త వరదుడుగా దర్శన మిస్తాడు. వేణు గోపాల స్వామి ఆలయానికి శంఖు చక్రాలు ధరించిన జయవిజయ అనే ద్వార పాలకులు ఇరువైపులా ఉంటారు. వేణుగోపాల స్వామికి తూర్పు దిశలో పరమ భక్తాగ్రగాన్యుడు స్వామి వాహనం అయిన వైనతేయుడు పరమ భక్త తో వందనం చేస్తూ దర్శన మిస్తాడు. నంద దీపాలు స్వామికి భక్తజనులకు ఆనంద సంధాయకం గా ఉంటాయి.

శ్రీ కృష్ణాష్టమి నాడు అశేష భక్తజన సందోహం స్వామి వార్లను దర్శించి పూజించి తరిస్తారు. ఆలయం లో నిత్య అష్టోత్తర. సహస్రనామ పూజ ధూప దీప నైవేద్యాలు. భోగాలు వైభవంగా రెండు పూటలా జరుగుతాయి.స్వామి వారల ఏకాంత సేవ చూసి తరించాల్సిందే. ధనుర్మాసం లో నిత్య ప్రాతః పూదికాలు. అత్యంత వైభవంగా గోదా దేవి కల్యాణం నిర్వహిస్తారు . సంక్రాంతి పర్వదినాన ఆలయ ధర్మకర్త వంశ స్త్రీలంతా ఆలయానికి విచ్చేసి స్వామిని మనసారా అర్చిస్తారు . ఆలయం నిత్యపూజలు నిత్యభోగాలు. చక్రపొంగలిలి వేణు పొంగలి పులిహోర వంటి ప్రసాదాలతో కలియుగ వైకుంఠం లాగా కనిపిస్తుంది. వైశాఖ శుద్ధ ఏకాదశినాడు ఉభయ దేవేరులతో శ్రీ వేణు గోపాలస్వామి కల్యాణం రంగరంగ వైభవం గా నిర్వహిస్తారు.

ఈ ఆలయానికి ఇరువైపులా రెండు చిన్న దేవాలయాలున్నాయి. ఒకదేవాలయం శ్రీ లక్ష్మీ దేవి. మరియొకదానిలో శ్రీ జానకీ రామ లక్ష్మణుల దివ్య విగ్రహాలు భక్తానుగ్రహం గా ఉంటారు. .ఆలయ ధర్మకర్తలు మంగెన వంశం వారు.1921దుర్మతి నామ సంవత్సర వైశాఖ బహుళ దశమి బుధవారం ఉదయం 8-04 గంటలకు ఉత్తరాభాద్ర నక్షత్ర యుక్త మిధున లగ్నం లో వీరు నిర్మించిన లక్కవరం అనే బ్రాహ్మణ అగ్రహారం లో శ్రీ వేణుగోపాల స్వామిని ప్రతిష్టించి సర్వాంగ సుందరంగా వైభవోపేతం గా సకల సౌకర్యాలతో ఆలయనిర్మాణం చేశారు. ఆ వంశం లో గంగయగారు ఉత్తముడు వేణుగోపాల భక్తుడు భార్య సుబ్బాంబ. ఈ దంపతులకు పంచ

పాండవుల వంటి బుద్ధిమంతులైన అయిదుగురు కొడుకులు. సర్వారాయుడు,వెంకటస్వామి. ముత్యాలు మొదలైనవారు.

మంగెన వంశం వారు పరమభక్తితో భద్రాద్రి రామదాసులాగా శ్రీ వేణుగోపాల స్వామి కి గోపురప్రాకార మంటప వాహనాలు చక్కగా అమర్చారు. చక్కని కోనేరు త్రవ్వించారు. పేదలకు అన్నోదకాలు కల్పించారు. వివాహాదులకు ధన సహాయం అందించారు. బ్రాహ్మణులను ఆదరించి సకల సౌకర్యాలు కల్పించారు. భూతదయతో జాతిమత భేదం లేకుండా అందరి మనసులను రంజింప జేసి కీర్తి పొందారు. ప్రజల క్షేమమే పరమావధిగా జీవించారు.

ఆధారం – లక్కవర శ్రీ వేణుగోపాల శతకం –కవి –భగవత్కవి శ్రీ లక్కాకుల వేంకట రత్న దాసు గారు –నెల్లూరు జిల్లా ఆత్మకూరు తాలూకా కుల్లూరు పురం లో జన్మించారు. తండ్రి రామ చంద్రార్య. తల్లి యరుకలాంబ. కవిగారికి స్వప్నం లో ఈ స్వామి దర్శనమివ్వగా భక్తితో 180 సీస పద్యాలతో భక్తిజ్ఞాన వైరాగ్య బోధకాలుగా లక్కవర శ్రీ వేణుగోపాల శతకం 1937లో రాసి ధన్యులవగా. మంగెన వంశీకులు దాన్ని ముద్రించి లోకానికి అందించారు. . సంక్షిప్తంగా ఆలయ చరిత్ర ధర్మకర్త వంశావళి కూడా రాసి తెలియని విషయాలెన్నో లోకానికి తెలియ జేశారు. "లక్కవర పురపాల హిరణ్య చేల –వేణు గోపాల రుక్మిణీ ప్రాణ లోల "అనేది మకుటం. ఒకటి రెండు పద్యాలు మచ్చుకు చూద్దాం –

"రాధామనోహర మాధవ పరమాత్మ –పరమ పదనివాస శరణు శరణు –పార్ధ సారధి దేవభక్త సంరక్షకా –మురళీధరా శౌరి శరణు శరణు –నారాయణా. భక్త కల్పద్రుమా –సర్వేశ శ్రీ కృష్ణ శరణు శరణు –మందరోద్ధార. గోవింద హరే కృష్ణ –పరమార్ధ గోవింద శరణు శరణు –శరణు నీకిదే నిక్కంబు సారసాక్ష –భక్త హృత్పద్మసంవాస ధర్మవాస –లక్కవర పురపాల హిరణ్య చేల –వేణుగోపాల రుక్మిణీ ప్రాణ లోల "

"శారద చంద్రికా సమరుచి హైయంగ -వీణంబు నొక చేత వేడ్క నమర –అమృ తోపమానమై

యలరారు పాయస –భక్తంబు నొక చేత పరిఢవిల్ల –పుండరీక నఖంబు. నిండు చందురు గేరు –కాంతులు మెడక్రింద గంతులిడగ-కనక సూత్ర స్పీత ఘంటా వితానంబు –దిసమొల మ్రోగుచు తేజరిల్ల –తల్లి వెను వెంట ముద్దుగా తప్పటడుగు –లలర దిరిగెడుదివ్య దిగంబరుండు –పద్మ పత్రాక్ష నీవె శ్రీపతి ముకుంద –"

“సద్గురు పాద కంజాతముల్ సేవింప –కనులేదు వైరాగ్య ఘనసుపదవి –దేశికు నపాదతీర్ధంబు గ్రోలక –గానరాదట్టి విజ్ఞాన మహిమ –దేశి వర్యుని దివ్య ప్రసాదంబు- గొనక కల్గునె భక్త మనన దీక్ష –సద్గురు బోదార్ధ సారంబు దెలియక –కలుగునే ముక్తి యు ఘనతగాను –అట్టి సద్గురు మూర్తి పై యమరు దీపె-నీ గురూప దేశమే నాకు నిత్య సుఖము --–

“గోపాల శ్రీ కృష్ణ గోపరిపాలకా –మందర నగధీర మంగళంబు –నీరజ దళ నేత్ర. నీల తోయద గాత్ర –మౌని సన్నుత పాత్ర మంగళంబు –పాండవ పాలనా. భక్త జనోద్ధార-మధుసూదనా శౌరి మంగళంబు –కమలామనః ఖేల కాంచనమయ చేల –మహనీయ గుణ శీల మంగళంబు –మన్మధాకార. యదు వీర మంగళంబు –మాధవాననంత గోవింద మంగళంబు –లక్కవర పుర పాల. హిరణ్య చేల –వేణు గోపాల రుక్మిణీ ప్రాణ లోల “

అంటూ శతకం పూర్తి చేశారు దాసుకవి. మందార మకరంద మాధుర్యంగా భక్తి తత్వ సుబోధకం గా పద్యాలున్నాయి . ఈ కవి మనమహాకవుల దృష్టిలో పడక పోవటం ఆశ్చర్యం. భక్తకవిగా పేరు పొందాల్సిన కవి వరేణ్యులు ఈ కవి. వారు ఈదేవాలయ శతకం రాయకపోతే దాని చరిత్ర తెలిసేదికాదు. వారికి ఆంధ్ర సాహితీ లోకం, భక్తజనం రుణ పడి ఉంటారు .

## 10 యోగి ఖాదర్షాబాబా శతకం -- శ్రీ భోగరాజు వెంకటరామయ్య



విజయనగరం జిల్లాలో వికారి సంవత్సర కార్తీక శుద్ధ చవితి బుధవారం హజరత్ ఖాజా ఖాదర్షావలీ బాబా పాదాలలో శుభాలక్షణాలైన శంఖు చక్రాలతో జన్మించారు. వీరి పూర్వీకులు తిరుచినాపల్లి రాజవంశానికి చెందినవారు. అక్కడినుంచి విజయనగరం వచ్చి స్థిరపడ్డారు. కైలాసపతి శివుడే జన్మించాడని అందరూ భావించారు. బాల్యం లోనే సాదు సత్పురుషుల బోధలు విని జ్ఞానం పొందేవారు. స్థానిక హైస్కూల్ లో చదివారు. ఒక రోజు తండ్రి నాగపూరులో లోఉన్న అయిదుగురు సాధువులకు తలా ఒక రాగికానీ ఇస్తానని మొక్కుకొన్నానని, ఇప్పటిదాకా ఇవ్వ లేకపోయానానని. వెళ్లి వారిని గుర్తించి అందజేయమని పంపించారు. నాగపూరు చేరినరోజే ఇక్కడ తండ్రి చనిపోయాడు. నాగపూర్లో వేలాది శిష్యులున్న తాజుద్దీన్ బాబాను దర్శించారు. ఈ బాబా ఖదర్షా బాబా ను లోకొద్ధరణకోసం ప్రేరేపించి ఉపదేశించారు. మూడు రోజులు జ్ఞానబోధ చేశారు. "ఖాదర్ అంటే నేనే "అని ఆయన్ను ముఖ్య శిష్యుడిగా స్వీకరించాడు. తిరిగి విజయనగరం వచ్చి స్థానిక నల్ల చెరువు గుట్ట మీద 15ఏళ్ళు నిద్రాహారాలు మాని మౌనంగా దీక్షగా తపస్సు చేశారు. తర్వాత స్థానికుల కోరికపై మైదానప్రాంతానికి వచ్చారు. అక్కడ విశాలమైన ప్రాంతం లో ఒక ప్రార్ధనామందిరం దర్గా ఏర్పడింది. వసుధైక కుటుంబం ధ్యేయంగా బోధనలు చేశారు. చేతి స్పర్శతో ఎంతటి రోగామైనా తగ్గించే వారు. ఇక్కడ రాజు సామాన్యుడు ఒకటే. కులమతజాతి భేదం లేదు గులాబిరేకులు చిటికెడు విభూతి మాత్రమే బాబా ఇచ్చే మందు. రమణమహర్షి సత్యసాయిబాబా వంటి మహానుభావులు బాబా దర్శనం చేసి ఆశీస్సులు పొందారు. విజయనగరం జైపూర్ మహా రాజాలుకూడా బాబా

ఆశీస్సులు అందుకొంటూ తరచూ దర్శనం చేసుకొనేవారు . బాబాపాదాలలో ఉన్న శంఖు చక్రాలే సర్వ జన రక్ష. కనుక బాబా పాదరక్షలకు భక్తిగా జనం మొక్కుతారు. అప్పటి నుంచి అక్కడ ఉన్న ఎనిమిది వృక్షాలను అ ష్టదిక్పాలకులుగా భావిస్తారు. ఇక్కడి దాక తెలిపిన వృత్తాంతం అంతా యు ట్యూబ్ వీడియో కథనం. శాంతి సర్వమత సమానత్వం. సకలజీవులపట్లమమకారం ప్రేమ ఆలంబనగా. మానవాళి జాగృతికోసం జ్ఞానయోగ మార్గంగా సూచిన్పిందే సూఫీ మతం. ఈ సూఫీ మతాన్ని ఆదర్శంగా ఖాదర్షాబాబా ప్రచారం చేశారు

శ్రీ బాబా ఖాదర్షా శతకము

గ్రంథకర్త :
శ్రీ వారిధక్తుడు :
భోగరాజు వెంకట్రామయ్య, విజయనగరం.

ది మోడర్న్ పబ్లిషర్స్, తెనాలి.

Copy right) Rs. 0-6-0

ఇక పై రాసింది అంతా శ్రీ భోగరాజు వెంకటరామయ్య కవి గారు రాసిన "ఖాదర్షా బాబా శతకం "ఆధారం గా రాసింది.

బాబా చిన్నతనం లో పాలిచ్చే దాది ఇంట్లో నిద్రిస్తుంటే. ఆ వీధిలోని ఇళ్ళన్నీ అగ్నికి ఆహుతికాగా ఈ ఒక్క ఇల్లు మాత్రమె కాలకుండా ఉండటం అందరికీ ఆశ్చర్యం కలిగించింది. ఎప్పుడైనా ఈ పిల్లాడిపై తల్లికి కోపం వచ్చి కొడితే. వెంటనే ఆమెకు జ్వరం వచ్చేది. ఒకసారి గుర్రపు స్వారీ చేస్తూ వెడుతుంటే ఐదు తలల నాగుబాము కన్పించి. ఆ రోజు రాత్రి కలలోకూడా కన్పించి "నువ్వు గంధర్వుడివి. అందుకే కనిపించాను "అని చెప్పింది. చుట్టుప్రక్కలవారు ఇవన్నీ విని ఆయనను భక్త ధృవ. భక్త ప్రహ్లాదునితో పోల్చేవారు.అంతటి భక్తి తాదాత్మ్యం అలవడ్డాయి.

గురువు ఆజ్ఞ పొంది ఒక కొండపై తీవ్ర తపస్సు చేశారు బాబా. అప్పటినుంచి ఆకొండ ప్రపంచంలో గొప్ప క్షేత్రమైంది. సింహాచలం. రామతీర్ధం మొదలైన వాటికి ఎంతటి ఖ్యాతి వచ్చిందో ఖాదర్షా బాబా తపస్సు చేసిన కొండకు అంతటి పేరు వచ్చింది. జనాలకు తత్వజ్ఞాన బోధ చేసే సంకల్పం. ఐహిక సుఖాలన్నీ త్యాగం చేసి "ఖాదిరీ పదివి "స్వీకరించారు బాబా. భద్రుడు తపస్సు చేసిన కొండ భద్రాద్రి అయినట్లు, బాబా తపస్సు చేసిన

“నల్ల చెరువు గుట్ట ““ఖాద్రీ నగరం “అనే మహా క్షేత్రం గా వర్ధిల్లింది. గురూప దేశ మంత్రాన్ని దీక్షగా నిశ్చలమనసుతో జపించి తపస్సు చేసినందుననే మహాత్ముడయ్యారు. ఎండా వానా లెక్కచేయక. క్రూరసర్పాలు మృగాలకు ఆలవాలమైన ఆ కొండపై దీక్షగా తపస్సు చేశారు బాబా. చుట్టూంతా గుట్టలు రాళ్ళు ముళ్ళపొదలు తో ఉండే ఆప్రదేశం బాబా వలన మంచి దారులు ఏర్పడి. కార్లతో హాయిగా రోజుకు పది వేలమంది భక్తులు దర్శించే మహా క్షేత్రంగా అభి వృద్ధి చెందింది. జతిమతాలు లేకుండగా అన్ని జాతులవారేకాక అక్కడి జంతువులూ పక్షులు కూడా పరస్పర వైరాలు మాని సఖ్యంగా ఉండటం ఆశ్చర్యం కలిగిస్తుంది. బాబా ఒకసారి తీవ్ర తపస్సు చేస్తుంటే పెద్ద తుఫాను విరుచుకు పడినా చలించక కదలక తదేకంగా తపస్సు కొనసాగించారు. అప్పుడు ఒక త్రాచు పాము వచ్చి ఆయన రెండు పాదాలను పట్టుకొన్నది శరణు వేడినట్లుగా. వడగళ్ళ వాన వచ్చినా చలించని దీక్షతో తపస్సు చేశారు. వంటవారు వంటలు భోజనాలకు చాలా ఇబ్బందికలిగిస్తోంది వాన దయచూడుబాబా అని ప్రార్ధిస్తే వర్షపు హోరు లేకుండా చేశారుబాబా.

ఒకనాడుఒక వేశ్య బాబా సేవకై వస్తుంటే. ఆతన తపస్సు మహాత్మ్యం వలన ఒక పాము ఆమె రెండు కాళ్ళను చుట్టేసింది. భయపడ్డ ఆమెకు సద్బుద్ధి ప్రసాదించి కాపాడారు. అర్ధరాత్రులలో రెండుప్రక్కలా రెండు పులులతో బాబా “షైరు” చేసేవారు. డాక్టర్లు కూడా తగ్గించలేని జబ్బులతో బాధపడే వారు బాబా ను దర్శిస్తే రోగాలు యిట్టె మాయమయేవి.. హస్తవాసి మంచిదని వాసుదేవుని వంటి చల్లని స్వామి అని ప్రజల నమ్మకం.

బాబా పై ఈ శతకం రాసిన కవి శ్రీ భోగరాజు వెంకటరామయ్య గారు 24ఏళ్ళనుంచి కడుపు శూల తో బాధపడుతూ ఎందరు డాక్టర్లకు చూపించినా తగ్గకపోతే బాబా దగ్గరకు వచ్చారు. ఇష్టం వచ్చినవన్నీ హాయిగా తినమని. పద్యం గిత్యం జాన్తా నై అని చెప్పి చిటికలో నయం చేశారు బాబా. కవిగారు తనకు ఏ పదార్ధాలు కూరలు పడవని చెప్పారో వాటినే తినమని చెప్పి తినిపించి శూల బాధ నివారించారు.

బాబా దర్బారులో గానా బజానా జరుగుతున్నా వినీ విననట్లు చూసీ చూడనట్లు ఉంటూ విజ్ఞాన మౌనంతో తదేక దృష్టి తో దీక్ష కొనసాగించటం బాబా ప్రత్యేకత. బాబా అనుగ్రహం తో ఇచ్చే ఫలమైనా విభూతి అయనా గడ్డిపరకైనా రోగాలు, హాహాకారాలు మానిపోయేట్లు చేస్తాయి. అన్నిరకాల రోగులు మానసిక రోగులు మూర్చరోగులు కూడా వచ్చి బాబా అనుగ్రహంతో వ్యాధులనుపోగోట్టుకొని హాయిగానవ్వుకొంటూ వెళ్లారు..మహా వేదాంతులు. బహు శాస్త్ర పారంగతులు. శాస్త్రవేత్తలు దైవజ్ఞులు ఐశ్వర్య సంపన్నులు బాబా పాదాలకు మ్రొక్కి

భక్తితో సేవించటం మహాదాశ్చర్య విషయం. కలియుగ ప్రత్యక్ష దైవం గా ఖాదర్షా బాబాను విశ్వసిస్తారు. అని కవిగారు చాలా భక్తిగా ఆర్తిగా బాబా చరిత్ర రాశారు. వీరు ఆంధ్ర దేశ అక్షరాస్యులకు చిరపరిచితులైన కవి శేఖరులు. విజయనగర ఆస్థాన కవీశ్వరులు శ్రీ భోగరాజు నారాయణ మూర్తిగారి తమ్ముడు.దీనికి ముందుమాట ను విజయనగరం మహారాజాకాలేజి రిటైర్డ్ సీనియర్ తెలుగుపండితులు శ్రీ అడిదం రామారావు గారు రాశారు. ప్రముఖకవి శ్రీ విశ్వనాథ కవిరాజు ఆశీస్సులందించారు. పుస్తకముద్రణకు ధనసాయం చేసినవారు శ్రీ రామ చంద్రుని రామారావు పంతులుగారు. వీరంతా ఖాదర్షా బాబా భక్తులే. .ఈ శతకం 1946లో ముద్రింపబడింది. కవిగారి కొన్ని పద్యాలురుచి చూద్దాం

“మద క్రోధద్వయ నాశాకారి వగుటన్. మత్తేభ శార్దూలముల్ –ముదమారంగాను సూటినిం గలిపి నే ముత్తెంబులున్ వజ్రముల్ -గదియం గల్పుచు మాల గూర్చి ఇడితోఖాదర్ష బాబా. భవ-త్పద భక్తిన్నిది కంఠమందు ధరియింపం గోరి మన్నింపుమా “

“బ్రహ్మయో విష్ణువో శివుడో తాజుద్దీన్ రూపంబు తో –గరుణంబెట్టిననంగజాలు ఘనుడౌఖాదర్షబాబాగురూ”

“బుధు లొందుంగలశంఖ చక్రములు నీ పూజ్యంబు పాదంబులన్”

“నిన్నుం బోల్చగావచ్చు నాధ్రు వునితోనిక్కంబు ప్రహ్లాదుతో “

“సకలైశ్వర్య సమున్నతిం గలిగి. తత్సౌఖ్యంబు లాసించ కే -సకలో త్సృష్టఖాడిరీపదవికి సంకల్ప మున్ బూని”

“ఈ రీతిన్ పరమాత్ము తోసముడవైయీ పర్వతారణ్యముల్ ఘోరంబయ్యెడి క్రూర జంతుభయముల్ ఖూనీలు చోరీలంగల హత్యలున్ గలస్థాలిన్,సుక్షేత్రమున్ జేయు నీ –కౌరాసాటియేలోకమందు కనగా ఖాదర్ష బాబా గురూ “

“అహాహా నీ ఇరు ప్రక్కలం బులులు రెండౌ యర్ధరాత్రంబు నన్-బహు భక్తిం నడువ”

“ఏ రూపంబును నెట్టి రోగి యయినన్ నీక్షించాగా నంతనే యా రోగంపు బలంబు తగ్గి మనమానంద ధైర్యంబు లవ్వారినింబొందునోయట్టిరూపయుతుడౌస్వామిసదానంద పే మారుల్ మ్రొక్కెద”

"ప్రత్యక్షంబగు దైవమీవ యనుచున్ భక్తాళి సేవ్వళలన్ –సత్యాసత్యవివేక జ్ఞాన మిడుచున్ సన్మార్గులుం జేయుచున్ "

"జాలంబింతకు జేయకయ్య సతతమున్ సద్భక్తితో గొల్చెదన్ –కాలంబింతయు వ్యర్థ పుచ్చకయనే ఖాదర్వ బాబా గురున్ –బోలెం జాలెడు వారు లేరనుచు నిబ్బూమిం దగన్ జాటెదన్ –పాలించంగను జాగు సేయకుము యో బాబా నమస్కారముల్ "

అంటూ శతకం ముగించారు కవి ధారాశుద్ధి భక్తీ అంకితభావం అవగాహన. బాబా మహిమా నిరూపణం తో కవిత్వం చిందులు త్రొక్కింది. ఆదర్శ పురుషుడు ఖాదర్షా బాబా చరిత్రను లోకానికి తెలియ జేసిన కవి శ్రీ భోగరాజు వెంకటరామయ్య ధన్యులు.

## 11 మర్రి గుంట శ్రీ పాండురంగ స్వామి దేవాలయం -- శ్రీ అరి గొండ శ్రీనివాస కవి



కలియుగం లో భక్త పుండరీకుని ఉద్ధరించాలని పుండరీకాక్షుడైన శ్రీ మహా విష్ణువు మహారాష్ట్ర చంద్ర భాగా నదీ తీరం లో పండరీపురం లో పాండురంగ నామం తో వెలిశాడు. జ్ఞాన దేవ నామదేవ. ఘోరాకుభార్. తుకారాం. తులసీదాస్. సక్కూబాయి, మీరాబాయ్, జ్ఞానాబాయ్ గోమాబాయ్ మొదలైన భక్తులను రక్షించాడు. చాలాకాలం అక్కడే ఉండి,విసుగుపుట్టి. కలికాలంలో భక్తులు కస్టపడి తన దగ్గరకు రాకపోవటం తో కలత చెంది. తానేభక్తులను వెతుక్కుంటూ అన్ని లోకాలు తిరుగుతూ చిత్తూరు జిల్లా ఏర్పేడు తాలూకా మర్రి గుంటపురం (వట గర్త పురి )చేరాడట.అక్కడి భక్తుల భక్తిశ్రద్ధాలకు ఆనంద పడిఅక్కడే ఉండిపోవాలని నిశ్చయించాడు. ఆ గ్రామవాసి అయిన శ్రీ అరి గొండ శ్రీనివాస కవి ఈ వృత్తాంతాన్ని "మర్రి గుంట పాండు రంగ శతకం "గా రాశారు .

ఈ శతకం రాయాలని అనుకొన్నప్పుడు ఒకరోజు మధ్యాహ్నం భోజనం చేసి నిద్ర పోతుంటే ఆగ్రామవాసి అయిన బ్ర వే.పత్తంగి రాఘవాచార్యులు కలలో కనిపించి మంచి ప్రయత్నమే అనీ. కానీ అందరికీ అర్ధమయేట్లు "లీలా వృత్తం "లో రాయమని హితవు చెప్పారు. నిద్ర లేచిన కవికి అది పాండురంగ స్వామి ప్రబోధమే అని పించి,వెంటనే అలవోకగా అయిదు ప్రార్ధన పద్యాలు స్ఫురించగా కాగితం పై వ్రాసి శతక రచన శ్రీకారం చుట్టాడు కవి. దీనికి తప్పొప్పులను సవరించినవాడు కవి. పౌరాణికుడు శ్రీ కన్నె గంటి చిన లింగా చార్యుడు. శతక ముద్రణ చేసినవారు పౌరాణిక పితామహులు కొత్త పేటకు చెందిన శ్రీ కాకుమాను సూర్య నారాయణ రావు. గుంటూరు చంద్రికా ముద్రాశాలలో 1944లో ముద్రింపబడిన దీని వెల అర్ధరూపాయి మాత్రమే.


శ్రీ పాండురంగ స్తోత్రము

పల్లవి

అనుపల్లవి

చరణము

కరుణాకరుడవు - ఘనగాత్రుండవు
కరివరదుండవు - గరుడగమనుడవు
సురమునినుతుడవు - శుభదాయకుడవు
పరమాత్ముండవు - భక్తపాలుడవు

ప్రతి పద్యం చివర" పాండురంగా "అని వస్తుంది. ఇష్ట దేవతా ప్రార్ధన చేసి. పురవర్ణన చేశాడు కవి. ద్వాపరం లో ద్వారక గా. గోపికలకు ఉనికి పట్టుగా ఉండేది మర్రిగుంట. కవి తాతపుల్లయ్య కాళహస్తి ప్రభువు మంత్రి. తల్లి పేరమ్మ తండ్రి కాళప్ప. భార్య కన్నమ్మ. కవి వంశంవారు ఈ ప్రాంత ప్రభువులు. అని చెప్పి దశావతారాలు వర్ణించి. పాండురంగ స్వామి ఆపురం లో ఎలా ప్రవేశించాడో చెప్పాడు. 1936లో ఈ సంఘటన జరిగిందట.

"పదియు తొమ్మిది వందలున్ -గడిచి ముప్పది దాటి యటు మీదటన్ –గదియు నారవ యేటను –నీమహిమ గాంచి తిమి పాండురంగా" గొల్ల ఇళ్ళల్లో చోటుదొరక్క మర్రి గుంటవచ్చావా అంటాడు . స్వామి ఇక్కడికి రావటం ఇష్టం లేక. ఓర్వలేక కొందరు పోరాటం చేసి ఓడిపోయారు. తిట్టిన వాళ్ళు, పూజ చెడగొట్టిన వాళ్ళూ మట్టిలోకలిసిపోయారట. న్యాయాన్యాలు తెలీకుండా పక్షపాతం చూపినవారు" పాడైరి పాండురంగా"అన్నాడు.

"శృంగారదేవ రంగా నా నమస్కృతి నీకు పాండురంగా - రంగత్కృపాంతరంగా –రుక్మిణీ రమణ జై పాండురంగా "అని 62పద్యాలు రాశాడు కవి. తర్వాత రామాయణం ఆరు కాండలు ఇలాగే 90వ పద్యం వరకు రాశాడు. 91నుంచి108వరకు "నీతిలీలావళి "రాసి ఫలశృతి చెప్పాడు. శతకం పఠిస్తే సంతానం కలుగుతుందని. ముక్తి"

తంగేటి జున్ను" ఔతుందని భరోసా ఇచ్చాడు . శ్రీ స్వభాను నామసంవత్సర కార్తీక శుద్ధ దశమినాడు కావ్యం పూర్తి చేశానని కవి చెప్పుకొన్నాడు. చివర్లో మంగళం పాడాడు –

"మంగళము శ్రీనివాసా మంగళము మరిగుంట పురనివాసా –మంగళము చిద్విలాసా –నీకు జయ మంగళము పాండురంగా "

12 నువ్వు కొండ మహాత్మ్యం -- శ్రీ మండలీక సీతారామయ్య

నువ్వు కొండకు వ్యవహారిక నామం బెండి కొండ. విశాఖ జిల్లా టెక్కలి తాలూకా పాత టెక్కలి జమీన్ లో ఉన్నది. ఒకప్పుడు ఈ కొండ ఇద్దరు వర్తకుల నువ్వుల రాశి. వారు తిలాధిపతి శనీశ్వరుని తృప్తి కలిగించకపోవటం వలన ఆగ్రహం కలిగి వాళ్ళ నువ్వుల రాశిని పెద్ద కొండగా మార్చాడట. పశ్చాత్తాపం చెంది మళ్ళీ స్వామిని ప్రార్ధిస్తే. మళ్ళీ నువ్వుల రాశిగా మార్చటానికి వీలు లేదని చెప్పి. వాళ్లకు ప్రీతి కలిగించటానికి తాను ఆకొండపై నివాసం ఏర్పాటు చేసుకొని భక్తుల కోరికలు తీరుస్తూ ఉంటానని చెప్పి. శనీశ్వరుడు అంతర్ధానమయ్యాడు.

రామయోగి అనే ఒక సాధువు పెరుగు మాత్రమె తింటూ. మితభాషిగా ఉంటూ ఈ కొండపై తపస్సు చేసి. 40రోజులకు పైగా నిరాహారంగా ఉండి4-3-1938 న ఈశ్వరనామ సంవత్సర శుక్లపక్ష విదియ గురువారం అపరాహ్ణంలో సిద్ధి పొందాడు. అప్పటినుంచి ఈకొండ నువ్వుకొండ శ్రీ రామ క్షేత్రంగా. శ్రీరామయోగి క్షేత్రంగా ప్రసిద్ధి చెందింది. ఈ రామయోగిపై టెక్కలి ఆంగ్ల ఉన్నత పాఠశాల సహోపాధ్యాయుడు శ్రీ మండలీక సీతారామయ్య "నువ్వు కొండ యోగి రామ శతకం "రాశాడు. 1941లో రాజమండ్రి శ్రీ రామాప్రెస్ లో ప్రచురింపబడిన ఈ శతకం వెల కేవలం నాలుగు అణాలు అంటే పావలామాత్రమే. రాసినవాడు రాయిన్నుచుకోన్నవాడు. ముద్రించిన ప్రెస్ అంతా రామమయం అవటం యాదృచ్చికం కాదు సుకృతంగా భావించాలి.


శ్రీ

నువ్వుకొండ

యోగిరామశతకము

టెక్కలి

యాంగ్లేయోన్నత పాఠశాలా

సహోపాధ్యాయ

మండలీక సీతారామయ్య

ప్రణీతము.

1941

కాపీరైటు రిజర్వ్డు]   [వెల రూ. 0—4—0.

ఇందులో ప్రార్ధన. శతకానికి ప్రేరణ. సంక్షేపంగా నువ్వుకొండ చరిత్ర. నువ్వు కొండ క్షేత్ర పాలక శనీశ్వర అష్టకం. రామయోగి ద్వాదశ మంజరి స్తోత్రం. శతక మాహాత్మ్యం. శతక సంకల్పం. రామయోగి శతకం. టిప్పణి ఉన్నాయి.




కవిగారి వియ్యంకుడు ఒక సారిటెక్కలి వచ్చి,పక్షవాతంతో బాధపడుతున్న కవిని చూసి పద్యాలతో రామయోగిని ప్రస్తుతిస్తే నయం అవుతుందని సలహా ఇవ్వగా. శతకరచనకు ఉపక్రమించాడు కవి. ఈ కవిగారే చాలా విపులంగా "నువ్వుకొండ మహాత్మ్యం "కూడా రాశానని చెప్పుకొన్నాడు.

మత్తకోకిలం లో శని దేవ స్తుతి

"శ్రీకరంబగు నువ్వుకొండ విచిత్రమొప్పగ నీ కృపన్ –నీకు శాంతి నివాసమౌనని నిశ్చయంబుగ బల్కుటన్

మాకు సర్వ శుభంబు లిచ్చుచు మమ్ము రక్షణ సేయుమీ-నీకు దండముపెట్టి ఎక్కితి నీదు శైలము గొల్వగాన్ "

రామయోగి ద్వాదశ మంజరి స్తోత్రం లో ఒకపద్యం –

"శ్రీరామ భక్తుడై చెలగుచు నువ్వు కొండ రాల సందున డాగురామయోగి –రాముడే కాని వేరేమి లేదని చాటు పూర్ణ వైరాగ్యుడౌ పుణ్యమూర్తి

పెరుగుమాత్రమె త్రాగి పెను తపస్సును జేసి –పరమాత్ము నెరిగిన పరమహంస –పదునెనిమిది యగు వందలేబది తొమ్మిది శక మీశ్వర ఫాల్గుణ శుచి పక్ష

మందు విదియను భ్రుగువాసరాపరాహ్నమందు –నలువదినాళ్ళనిశమున

బ్రహ్మ పద మొంది తిలరాశి పర్వతమున –రాముడి వెలసెను జూడీరంజితంబుగ

ఏ శబ్దం విన్న రామ శబ్దంగానే భావిస్తూ. ఎవరు కనిపించినా రామునిగాతలుస్తూ,పంచేంద్రియాలకు ఏది సోకితే అది రాముడిదే అనుకొంటూ. ఎవరుపిలిచినా రాముడే పిలుస్తున్నాడని బదులు పలుకుతూ. అడుగో రాముడు ఇడిగో రాముడు అని పరిగెత్తుతూ,కనపడకపోతే నిరాశ చెందుతూ "రాజిత విరాగి నువుకొండ రామయోగి " భక్త రామదాసులా అంతా రామమయం గా భావించాడు.అధ్వాన్నంగా ఉండే ఆకొండ రామయోగి వలన

అగ్రగణ్య మైంది.ఆయన కులం జాతిచదువు,అర్హత ఎవరికీతెలీదు . నిజమైన "యోగి రాముడే రామయోగి". కనుక తన శతకం పఠిస్తే,అన్నీ లభించి మోక్షం కూడా కలుగుతుందని హామీ ఇచ్చాడు కవి. తాను కొండ ఎక్కలేను. కానుక లివ్వలెను కనుక శతకమే తన సర్వస్వం అని. దాన్నే స్వీకరించి దయచూపమని కవి రామయోగిని వేడుకొన్నాడు .

రామయోగి శతకం మకుటంగా "నువుకొండ యోగిరామ "అనికాని శ్రీరామ యోగిరామ "అనికాని ఎవరికి ఎలా ఇష్టం అయితే అలా చదువుకో వచ్చుననని కవి చెప్పాడు. మచ్చుకు కొన్ని పద్యాలు చూద్దాం –

"ఆదిత్య హృదయ నిన్నాహ్వానము జేతు –నధ్యాత్మ ఫలదాత యాసనమిదె-"

"వేయి కన్నుల దొరవీక్షింపగాలేని –నీ రూపమెప్పుడు నిరతి జూతు"

"యెందుంటివో రామ ఇట కేలరావయ్య –యొక లిప్త దర్శన మొసగ రాదె"



శ్రీ నువ్వుకొండ యోగిరామశతకము

తొలిపలుకు

1 ప్రార్థనాదికము

"శిడికీ నీకు భేదం లేదు. ఒకడు పందిని కొడితే ఇంకోడు కోతిని కొట్టాడు –"ఇద్దరు వ్యాధులె ఎంచి చూడ "అని చమత్కరించాడు కవి. ఒక తమ్ముడికి పాడుకలిచ్చి బైరాగిని చేసి ఇంకో తమ్ముడికి ఆహార నిద్రలు లేకుండా చాకిరి చేయించు కొన్నావని. అన్నను గుహలో పెట్టి అతని భార్యను అపహరించినవాడి పక్షం చేరావు. అన్నకు ప్రతిపక్షి ఐనవాడిని శరణాగతుని చేసి రాజ్యం అప్పగించావు అంటూ మన కాసులపురుషోత్తమకవి లాగా నిందా స్తుతి చేశాడు. దాన ధర్మాన్ని నిర్వర్తించే దాతను పాతాళం లోకి పంపి కూడా జగద్రక్షకుడవు అయ్యావని మేలమాడాడు. చివరి పద్యం –

“మంగళమో రామ. మంగళమో శ్యామ –మంగళమరిభీమ మంగళంబు-మంగళము శివాత్మ మంగళమధ్యాత్మ-మంగళము మహాత్మమంగళము –మంగళమోశౌరి. మంగళమో సూరి-మంగళము మురారి మంగళము

మంగళము బుధాయ. మంగళము ధృవాయ –మంగళ మమలాయ మంగళంబు

హారతిం గొను మాది మధ్యంత రహిత –హారతిం గొను విశ్వేశ యఘ వినాశ –

హారతిం గొను మవ్యయాహ్లాద రూప –యోగ గణధామ నువుకొండ యోగి రామ “

అని 108వ పద్యం తో శతకం పూర్తి చేశాడుకవి . గ్రేడ్ వన్ తెలుగు పండితుడు అవటం వలన కవిత్వమూ గ్రేడ్ వన్ గానే సాగింది. ధారాపాతంగా ఈ పద్యాలన్నీ సీసపద్యాలుగా తేటగీతులు తో కూర్చాడు. చక్కని భావన. ఊహ చమత్కారం గుండెనిండా భక్తిభావం మాధుర్య విలసితం గా శతక పద్యమాలకూర్చి ఆరామునికీ, రామయోగికీ సమర్పించిన పరమభక్తాగ్ర గణ్య కవి మండలీక సీతారామ సుకవి. ఈ కవి గురించి ఎంతమదికి తెలుసో నాకు తెలియదు. సరసభారతి అలాంటి భక్తికవి ని పరిచయం చేసే భాగ్యం పొందిందని వినయంగా తెలుపుకొంటున్నాను.

## 13 జీడికంటి శ్రీరామచంద్ర దేవాలయం -- శ్రీ కేశవ పట్నం నరసయ్య

నల్గొండ జిల్లా జీడికంటి లేక జీడి కల్ క్షేత్రం లో శ్రీ సీతారామ చంద్రస్వామి దేవాలయం చాలా ప్రసిద్ధమైనది. ఈ స్వామిపై ఆ జిల్లాలోని రామన్న పేట వాస్తవ్యులు. వైష్ణవ భక్తులు కేశవ పట్నం నరసయ్య గారు "జీడికంటి రామ శతకం "రాసి ఆస్వామికే అంకిత మిచ్చారు. కవిగారు "వానకొండ శతకం "నిర్యోష్ఠ్యం గా రాశారు. జీడికొండ శతకం లో అంత్యప్రాస "క"నుంచి ప్రారంభించి "ళ"వరకు రాశారు. అందుచే దేశ. గ్రామ్యపదాలకూ స్థానం కల్పించారు. శతకం ఆద్యంతం భక్తి రసప్రవాహంగా సాగింది. సర్వులకు అర్ధమయ్యే సరళ శైలి లో రాశారు. శతకాన్ని కొలనుపాక లోని "బహిరామియా గ్రంథాలయం"వారు 9-2-34 న ముద్రించి అందించారు. మచ్చుకి రెండు పద్యాలు-


పీఠిక.

1-శ్రీరామ రామ నిన్ సేవింతు తొల్లింటి నేటి నేరముల మన్నింపు మంటి –ఏకాకిపై బ్రోతె లోకాల నన్నింటి నతి జేతుగావవేనన్ను నొంటి-అనిలో ప్రతాప మేమని జెప్పనీ వింటి తరి బాణముల విచిత్రంబు

వొంటి మును మున్నెనిను గొల్చి ఘనుడయ్యె ముక్కంటి ధర మిం -చె సిరి నీ పదములంటి –ఘన దయాంబుధి వంచు నిక్కముగ వింటి-గావబూనెద వేని మేల్గంటి మంట-సిరులకిరవైన జంటిశ్రీ జీడి కంటిధామ సుగుణాభిరామ శ్రీరామ రామ "

100-"తెలియ గోరుదు రెంతోదేరి నిన్ దేవళ్ళునినుతించ రాదు నిన్వేయి నోళ్ళ –గల శేషునకునైన కాదు వింత వోకిళ్ళు. పరమార్ధ బోధినీ పావుకోళ్లు

కడుబాడి నిను నారదుడు వైచు పింపిళ్ళు దనుజులపై మహోత్తరపు తళ్లు-బరిగించి సురలకు గరుణించికడు త్రుళ్ళుబొడమ బోజేసితెపూటకూళ్ళు-యెంత భావమైన నిను దల్చినంత ప్రేళ్ళుబర్వగా జేసితివి నీళ్ళపైన రాళ్ళు –సిరులకిరువైన జంటి శ్రీ జీడిగంటి ధామ సుగుణాభిరామ శ్రీరామ రామ “

మంగళం మంగళం మంగళం

కవి దారాశుద్ధిగా పద్యాలను రామబాణం లాగా శరవేగంగా పరిగెత్తించారు. అందమైన పదబంధాలు. శ్రీరామ వీర విక్రమపరాక్రమ శౌర్య ధైర్యాలు కళ్ళకు కట్టించారు. భక్తి గోదారిసే ప్రవహిప జేశారు. ఇంతటి కవి ప్రతిభ లోకం గుర్తించినట్లు. ఎక్కడా ఎవరూ ఉదాహరించిన దాఖలాలు లేవు. ఈ భక్త కవి వరేణ్యులు శ్రీ కేశవ పట్నం నరసయ్య గారినీ.  వారి శతకాన్నీ. జీడి కంటి శ్రీరామాలయాన్నిపరిచయం చేయటం నా అదృష్టం గా భావిస్తున్నాను.



ఓం.

అవిఘ్నమస్తు.

జీడికంటి రామ శతకము.

ఆలయ చరిత్ర

శ్రీ రామచంద్ర స్వామి దేవస్థానం జనగాం సమీపంలోని జీడికల్ గ్రామంలో ఉన్న ఒక ప్రసిద్ధ శ్రీరామ ఆలయం.ఒక స్థానిక కథనం ప్రకారం, ఆలయ ఉనికి ‘తత్రేతాయుగం ’ నాటిది, ఇక్కడే రాముడు ప్రవాసంలో ఉన్నప్పుడు, రాక్షస, మారిచులను  బాణంతో కాల్చి చంపాడని చెబుతారు, అతడు బంగారు జింకల వేషంలో వస్తాడు. మారీచుడు  రాముడి క్షమాపణ కోరినప్పుడు  ఆయనను ఆరాధిస్తానని వాగ్దానం చేస్తే.    కొండపై   ఈ   ఆలయం  లో  ‘స్వయంభు’గా ఉద్భవించటానికి అంగీకరిస్తాడు. శ్రీ రాముడి పాదుక లేదా బంగారు జింక మరణించిన ప్రదేశం, స్థానికంగా ప్రసిద్ధి ” లేడి బండ “,అంటారు  ప్రతి భవనం, ఇది ఒక రాయి లేదా మట్టితో లేదా సహజ రాతి శిల లోపల ఉన్న చెరువుతో అయినా,  శ్రీ రాముడు బంగారు జింకల కోసం తన వెంట పడేటప్పుడు ఈ స్థలాన్ని సందర్శించినట్లు ఆధారాలు విసిరాడు. స్థానిక పురాణాలప్రకారం  రాముడు వనవాసులో, భరద్వాజమహర్షి  సలహా మేరకు మలయావతి నదికి ఎదురుగా ఉన్న అందమైన కొండ చిత్రకూట్ వద్ద ఉన్న ప్రశాంత ప్రకృతి వైభవం చూసి బస చేశాడు.  ఇది భారతదేశంలోని అనేక ఋషులకు నిలయంగా మారింది. ఒక రోజున,  రామపత్ని సీతాదేవి  ఒక అందమైన

బంగారు జింకను తీసుకువెళ్ళి, తన గుడిసె ఇంటి తోటను అలంకరించి, తన కు ఆనందం కలిగించమని కోరింది. జింకను చనిపోయినట్లుగా లేదా సజీవంగా తీసుకురావడానికి తనను తాను సాహసించి, సీత దేవిని విడిచిపెట్టి, తను లేకపోవడంతో ఆమెను రక్షించడానికి తన సోదరుడు శ్రీ లక్ష్మణుడిని అప్పగించాడు. ప్రభువు బంగారు జింకను వెంటడించి స్వామి దాన్ని పట్టుకొని సజీవంగా తీసుకురావడానికి విసిగిపోయి, దానిపై మోకాలు బండపై ఆనించి లేడిని బాణం తో సంహరించాడు. బాణం వేసి, బాధించి, రాతిపై పడేలా చేస్తాడు. కింద పడిపోయిన తరువాత జింక తనను తాను మానవ రూపంగా మారి. స్వామిపై కోపం తో తన పేరు చిత్రరాధ అని అర్థం మరియు కౌషిక మహా రుషి చేత శపించబడ్డాననీ. శ్రీ రామ బాణం ద్వారా విముక్తి పొందుతున్నాననీ స్వామిని ప్రశంసించాడు. శ్రీ రాముడు ఆనందించాడు. దీని ద్వారా చిత్రరాధకు ఏమైనా కోరిక ఉందా అని అడుగుతాడు రాముడు. చిత్రరాధ ప్రభువు పవిత్ర పాదాలను తాకిన నీటిని అడుగుతాడు. అక్కడ ఉన్న శ్రీరాముడు తన బొటనవేలితో దగ్గరలో ఉన్న ఒక చిన్న రాతిని నొక్కి, దాని గుండా ప్రవహించమని గంగను ప్రార్థిస్తాడు, అది అలాగే ప్రవహించగా "ఉత్తర గంగ" గా పిలిచాడు. .ఈ నీటితో రాముడు సంధ్యావందనం చేశాడు. ఈ రోజు కూడా, రంధ్రం నుండి దుమ్మును తీసేస్తే. వేళ్లు తడిసిపోవడాన్ని అనుభవించవచ్చు.ఒకప్పుడు ఇక్కడే వాల్మీకి మహర్షి ఆశ్రమం ఉండేది. ఇప్పటికీ వాల్మీకి గుహ కనిపిస్తుంది. కొండకు నైరుతిలో శ్రీ ఆంజనేయస్వామి విగ్రహం ఉన్నది శ్రీ రాముడి విగ్రహాన్ని తన ముందు ఉంచి గొప్ప తపస్సులో ఉన్న సమీప వీర ఋషిని కూడా రాముడు ఆశీర్వదిస్తాడు. ఆయనకోరికమేరకు భూమిపై తన జీవితాంతం "పాద సేవ" చేయటానికి అవకాశం అడుగుతాడు. శ్రీరాముడు సంతోషంగా అంగీకరించి. తాను చేసిన. విగ్రహంగా మారి అర్చించినవారికి సకల కోరికలు తీరుస్తానని అభయమిస్తాడ. ఈ ప్రదేశంలో తన పాదాల గుర్తులు దుస్తులు వదిలివేసి, ఈ ప్రదేశం "వీరాచలం "గా ప్రసిద్ది చెందుతుందని చెబుతాడు. ఇప్పటికీ ఈ ప్రదేశంలో అడుగు పెడితే, ఒక రాతితో ఉన్న చెరువు మరియు శ్రీ రామ పాదుకా ఆరాధనలో ఉన్నట్లు గమనించవచ్చు. ఆలయ ప్రాంగణంలో నీటిని ఉపయోగిస్తున్నప్పటికీ, చరిత్రలో ఇప్పటివరకు నీటి మట్టం తగ్గలేదు. పెరగలేదు. వేసవిలో కూడా ఎండిపోని చెరువుపై ఈ ఆలయం నిర్మించబడింది..మొదట్లో పంచలోహ విగ్రహాలు ఉండేవి. ఎన్నో శతాబ్దాలుగా ఇక్కడ మానవ. ఆవాసాలున్నట్లు రాక్షస గుడ్లు,టైటా పెంకులు. బూడిద మట్టి గుర్తులు కనిపిస్తాయి. రామ టెంకిలు ఆనవాళ్ళు కూడా కనిపించేవట.

ఇంకో ఆసక్తి కరమైన విషయం ఒకటిఉంది. పూర్వం వీరుడు. భద్రుడు అనే సోదరులు ఉండేవారు భద్రుడు గోదావరి తీరాన వీరుడు. గోదారి ఆవలి ఒడ్డున శ్రీ రామునికోసం ఘోర తపస్సు చేశారు. ఇద్దరికీ శ్రీ మహావిష్ణువు ఏకకాలం లో దర్శనమిచ్చాడు. భద్రుడికోరికపై భద్రాచలం లో వెలసి దక్షిణ అయోధ్యగా., వీరుడికోరికపై వీరాచలం లో శ్రీ రామచంద్రమూర్తిగా కొలువై ఉన్నాడు. కాలక్రమంలో వీరాచలం జీడికల్ గా మార్పు చెందింది.

భద్రాచలం భక్తరామదాసు వలన ప్రసిద్ధ క్షేత్రం అయితే. వీరాచలం మాత్రం నీరసాచలం గా ఎదుగూ బొదుగూ లేకుండా పోయింది.

మరో కథనం ప్రకారం పూర్వం భీమ సేనుడు చంద్ర సేనుడు అనే రాజులు యుద్ధం చేస్తే చంద్ర సేనుడు ఓడిపోయి చనిపోతాడు. అతడి కవలపిల్లలు బాలచంద్రుడు. బాల చంద్రిక వేర్వేరు చోట్ల పెరిగి. స్వయంవరం లో ఈ ఇద్దరూ అన్నా చెల్లీ అని తెలియక పెళ్లి చేసుకాగా శరీరాలు వెంటనే నల్లబడి పోయాయి. ఆకాశవాణి వారిని 101పుణ్య క్షేత్రాలు సందర్శించమని చెబితే. జీడికల్ చేరి కొండపై ఉన్న జీడి గుండం. పాలగుండం లలో స్నానం చేస్తే. మళ్ళీ మామూలు రంగు వచ్చి. పాపవిమోచనం జరిగిందట. ఈ గుండా ల స్నానం పాప విమోచనంగా భక్తుల విశ్వాసం.

ఈ జీడికంటి రామాలయం భద్రాచల రామాలయం కంటే పురాతనమైనది. భద్రాచల దేవాలయ పూజారులుకూడా ఈ విషయాన్ని ధృవీకరించారు.వేల యకరాలు ఈనాము భూములున్నా పట్టించుకొనే నాథుడే లేడు.పూర్వం యాదాద్రి నరసింహ స్వామికి ఇక్కడినుంచే ధూప దీప నైవేద్యాలు వెళ్ళేవట. యాదాద్రి నారసింహుని కి భారీగా ధనం అప్పుగా ఈ వీర రాముడు ఇచ్చాడట కూడా. ఈ స్వామికి గుంటూరుజిల్లా వట్టిచెరువు మండలం కొర్లేపాడులో12ఎకరాలు. జీడికల్లు లో 50ఎకరాలు. గుమ్మడి వెల్లి గ్రామంలో 35ఎకరాలు ఉభయ ఆంధ్రరాష్ట్రాలలో ఇంకా చాలా చోట్ల ఈనాం భూములున్నాయి. శ్రీరామనవమికి సీతారామకల్యాణం కాక కార్తీకమాసం లో నెలరోజుల జాతర సమయం లోనూ మరోసారి కూడా అంటే ఏడాదికి రెండుసార్లు కల్యాణం జరుపుతున్నారు. మహారాష్ట్ర కర్నాటక లనుంచి కూడాశేష సంఖ్యలో భక్తులు వచ్చి దర్శించి తరిస్తారు అందుకే రెండవ భద్రాద్రి అంటారు. భద్రాచల రాముడు ప్రేమకు ప్రతీక అయితే వీరాచల రాముడు వీరత్వానికి ప్రతీక సరైన రోడ్డు సౌకర్యం లేకపోవటమూ ఇబ్బందిగానే ఉంది. భద్రాచలం తో పాటు జీడికంటి రామాలయాన్ని కూడా అభి వృద్ధి చేయాలని భక్తులు ప్రజలు తెలంగాణా ప్రభుత్వాన్ని కోరుతున్నారు. మళ్ళీ పునర్వైభవం పొందాలని కోరుకొందాం.

## 14 నడిగడ్డ పుర శ్రీఆంజనేయ దేవాలయం -- శ్రీ శిష్టు వేంకట సుబ్బయ్య శాస్త్రి




గుంటూరు జిల్లా వినుకొండ తాలూకా నడిగడ్డ గ్రామం లో వేంచేసి ఉన్న శ్రీ ప్రసన్న ఆంజనేయ స్వామి ఆలయం భక్తులకోరికలను తక్షణమే తీర్చే మహిమకలది. ఈ స్వామిని దర్శించి. పరవశించి, ధ్యానమగ్నమైన అన్న సముద్రం కవి శ్రీ శిష్టు వేంకట సుబ్బయ్య శాస్త్రి గారికి అప్పటికప్పుడు "నడిగడ్డ పురాంజ నేయ నతజన గేయా "అనేమకుటం గల పద్య పంక్తి మనసులో స్పురించి ఆయనకే ఆశ్చర్యం కలిగించి, నిండారు భక్తి ప్రపత్తులతో బయటికే చెప్పేశారు . అక్కడి భక్తబృందం పరమానందం పొంది కవిగారిని ఆ దివ్య మకుటంతో స్వామిపై శతకం రాయమని ప్రార్ధించారు. ఏక ప్రాస తో రాయటం కష్టమే అనిపించినా భారమంతా ప్రసన్నాంజనేయుని పై వేసి,తనజన్మ కృతార్ధమైనదని భావించి కందం లోఅందమైన శతకం రాయటానికి సిద్ధపడి "సరే "అన్నారు శాస్త్రిగారు .

కందపద్యాలలో "నడిగడ్డ పురాంజ నేయ శతకం "భక్తి తాత్పర్యాలతో రచించి ప్రముఖ కవి పండితులు బ్రహ్మశ్రీ గాడేపల్లి వీర రాఘవ శాస్త్రి గారికీ. శ్రీ ఉప్పల పిచ్చయ్య శాస్త్రి గారికీ. మద్దులపల్లి గురు బ్రహ్మ శర్మగారికి చూపించి. వారి మెప్పును ఆశీర్వాదపూర్వక పద్యాలను పొందారు. శతకముద్రణ కు కావలసిన ద్రవ్యాన్ని కవిగారి అనుజుడు శ్రీ శిష్టుపురుషోత్తమయ్య అందించగా ఆశీర్వాదకపద్యాలు చెప్పారు. నరసరావు పేట శ్రీ కోటీశ్వర ముద్రాలయం లో 1937లో ప్రచురించారు. వెల కేవలం 2అణాలు మాత్రమే. ఈ శతకం లో కవి గారి మిత్రుడు శ్రీ గురుబ్రహ్మ శర్మ రాసిన ఆంజనేయ దండకం. శ్రీ సత్యనారాయణ స్తోత్ర అష్టకం,శ్రీ భారతుల పేరి శాస్త్రి అనే శ్రీ రంగకవి రచించిన శ్రీ త్రిపుర సుందరీ స్తోత్ర చూర్ణిక కవిని. శతకాన్నీ ప్రశంసించిన విద్వత్కవుల ప్రశంసలు కూడా చేర్చి సుసంపన్నం చేశారు.

గాడేపల్లి వారి ప్రశంస –”నడిగడ్డ యాంజనేయుని-కడు చిత్ర చరిత్ర నీవు కందశతకమే – ర్పడ జేసి తుడిచి తఘముల-గడచితి సంసార వార్ధి కవికులతిలకా “


శ్రీరస్తు.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

శ్రీప్రసన్నాంజనేయాయనమః.

శ్రీ

నడిగడ్డ పురాంజనేయ శతకము.

సీ॥ శ్రీరామపదపద్మ సేవాధురీణత
లవణార్ణవముదాటి లంకజేరి
సీతామృగాక్షి వీక్షించిముద్రికనిచ్చి
మోదంబుమీరగా ముచ్చటించి
పాటలాశోకాది పాదపాకీర్ణమౌ
దశకంఠువనమెల్ల ధరణిగూల్చి
యక్షయాద్యసురుల హననంబుగావించి
రమణియిచ్చినశిరో రత్నమంది
తే॥ గీ॥ వచ్చిసుగ్రీవముఖ్యులౌ వనచరాళి
తోడనున్నట్టి రామచంద్రునకుసీత
వార్తదెలిగించినట్టి శ్రీవాయుపుత్ర!
అనఘ నడిగడ్డ పురప్రసన్నాంజనేయ!॥

అంటూ “ఏక ప్రాసతో అనేక చారిత్రాత్మక ప్రహేలలను రాయటం ఆయనకే తగినదని మెచ్చారు

. ’లాలిత కందపద్య సమలంకృత కావ్య వచోను షంగభా –వావళి ననేక రీతులుగా హర్ష మనస్కుడపై రచించిదే

వాళి శిరః కిరీట మణిహారివిభాలసదంఘ్రి మారుతిన్ –లాలన చేసి వేడితివి లాక్షణికాగ్రణు లెల్లమెచ్చగన్”

ఉప్పలవారు-”అనుపమ శబ్ద గుంఫన రసార్ద్ర పరి స్ఫురణంబుగల్గి-”న శిష్టు వంశ భానుడైనకవి రాసిన శతకం “కేవలమోదము గూర్చె నా మనంబునకు “అని భుజం తట్టారు.

గురుబ్రహ్మ శర్మ –”అబ్బా !”డ”ప్రాసంబును –బ్రబ్బి శతకమల్లు టెంతపని !యెట్టిదినీ –నిబ్బరము !శిష్టు వేంకట-సుబ్బయ కవి చంద్ర చిరయశో గణ సాంద్రా “

అని కవి బ్రాహ్మలు ముగ్గురు కమ్మని ఆశీర్వాద పనసలు చదివి ప్రోత్సహించారు. ఇందులోనే కవిగారి ప్రతిభ ఎంతటిదో మనకు అవగత మౌతుంది.

కవిగారి శతక మకరందం లో మొదటి కంద పద్యం –

“అడుగులకు మడుగు లొడ్డుచు –నడుముం గట్టికొని పలు ప్రణామంబులనే-నిడికొలిచెద రక్షింపుము –నడిగడ్డ పురాంజనేయ నతజన గేయా “

తనకు గురువులు లఘువులు ప్రాసలు గణాలు తెలీవనీ వినయంగా చెప్పుకొని. ఇన్నేళ్ళు బ్రహ్మచర్యం ఎలాగడిపావయ్యా  అని ఆశ్చర్యపోయాడు కవి. "వడి యోజన శతమొక్కు –మ్మడిదుమికి. దశాస్యు వీటి మంగళ విభవం "అడుగంట చేశావని స్వామిని పొగిడాడు. ."ఒడబడ వన్యాయమునకు –దడ బెడ పెట్టెట్టిక్లిష్ట తరయోజనలన్-నుడివడపెంతటి శ్రమకు "అంటాడు. 20వ పద్యం –"పడి భక్తి నీపదంబులు –విడువక పూజించుభక్త వితతికిసౌఖ్యం  - బెడలేకయొసగిప్రోతువు - నడిగడ్డ పురాంజనేయ నతజన గేయా"


గ్రంథకర్త
బ్రహ్మశ్రీ శిష్టు వేంకటసుబ్బయ్య శాస్త్రిగారు.
ఇయ్యది
బ్రహ్మశ్రీ శిష్టు పురుషోత్తమయ్యగారి ద్రవ్య సాహాయ్యము చే
ముద్రింపించి ప్రచురింపఁబడినది.
నరసారావుపేట
శ్రీ కోటీశ్వర ముద్రాలయమున ముద్రితము.
1937.
వెల రు 0—2—0.

"గడియన్ మూడు జగంబులు –వాడకింపగజాలినట్టి వాడవు "

"గుడిగుడిని దోకనించుక – ముడుచుక నిలుచున్న నీకు మొక్క విపత్తుల్ -విడుదల భరింతువు "అని తమాషాగాచెప్పాడు.

--"ఉడు గణముడుల్లజేయగ-నుడుపతిఖరకారుల తాళమొనరింప "జగాలను ఉడికింప చేస్తావు. "జడియక లంకం గాల్చెడు-నెడరావణు ననుజు గృహము "తగలెయ్యకుండా కృప చూపావు. "జడివానలలోన బడుపెను –పిడుగు క్రియన్ బంక్తికంఠుపీఠంపగుల గొట్టావు "

"కడగి నవ వ్యాకృతులం –గడి తీరిన పండితుడవు","జడు మైరావణుదునిమిన-యెడ "ఇంతటి దీమంతుడవు నువ్వే అని కొనియాడాడు

"పుడమి శశి రవులు జుక్కలు –జెడకుండునొ,యెంతవరకు క్షితి నంతటిదా-కుడుగక నిల్పుము శతకము - నడిగడ్డ పురాంజనేయ నతజన గేయా"అని 99వ పద్యం చెప్పి. 100వ పద్యం లో  తన ఇంటిపేరు శిష్టు అనీ, హరితస గోత్రం అనీ. తండ్రి శేషయ అనీ తనపేరు వేంకట సుబ్బయ్య శాస్త్రి అని శతకాన్నిశాలివాహన శకం 1850లో అంటే 1937 సెప్టెంబర్ 5న పూర్తి చేశాననీ చెప్పుకొన్నాడు కవి. ఇంతకుమించి కవిగురించికాని శ్రీ

నడిగడ్డ ఆంజ నేయదేవాలయం గురించికాని విశేషాలేమీ లేవు. శతకం లో ఆంజనేయ జననంనుంచి ఆయన విశేషాలనే కవి వర్ణించాడు క్షేత్రమాహాత్మ్యం గురించి చెప్పనే లేదు. కానీ ఒక మహా గొప్ప"కందకవి" ని.పరిచయం చేశానన్న సంతృప్తి, క్షేత్రం పేరుమాత్రమే చెప్పగలిగానన్న అసంతృప్తీ మాత్రం నాకు ఉండిపోయింది .

## 15 శ్రీ ముఖలింగేశ్వరశతకం -- శ్రీ మొసలికంటి వెంకట రమణయ్య




శ్రీ కాకుళం జిల్లాలో వంశధార నదీ తీరాన ఉన్నది. ఒకప్పటి గంగ వంశ రాజుల రాజధాని. దీనికి రెండు కిలోమీటర్ల దూరం లో "నగరి కటకం "ఆ రాజుల అంతఃపుర ప్రాంతం. నగరి అంటే రాజాంతఃపురం. తూర్పు గంగవంశ 12వశతాబ్దికి చెందిన రాజు అనంత వర్మ చోడ గంగడు బాగా ప్రసిద్ధుడు. రాజ్యాన్ని ఒరిస్సాలోని మహానది వరకు విస్తరించి "ఉత్కళ ప్రభువు ",త్రికళింగాధిపతి "బిరుదులు పొందాడు. భువనేశ్వర్ లోని మేఘేశ్వర అనంత వాసుదేవ. పూరీ జగన్నాథ స్వామి దేవాలయాల శిల్పాలు గంగవంశరాజులవే. ముఖలింగేశ్వర శిల్పాలు ఈ శిల్పాలనే పోలి ఉంటాయి.

ముఖలింగం లో మూడు దేవాలయాలున్నాయి. ప్రధాన ఆలయలయం కాకుండా ఊరి బయట పశ్చిమాభిముఖంగా ఉన్న సోమేశ్వరాలయాన్ని చంద్రుడు తనకుష్టు వ్యాధి నివారణకోసం నిర్మించాడు గంగవంశ రాజు హస్తి వర్మ క్రీ.శ.573ఈ ప్రాంతాన్ని పాలిస్తూ ముఖలింగేశ్వరాలయం నిర్మించాడు 11వ శతాబ్దం లోఅనంత వర్మ కట్టిందని కొందరి అభిప్రాయం. హస్తి వర్మ నిర్మిస్తే అనంతవర్మ పునరుద్ధరణ చేసి ఉండచ్చు. ఆలయ గోడలపై గణపతి. మహిషాసురమర్దిని. అర్ధనారీశ్వర శిల్పాలు నయన మనోహరాలు. సున్నం ఎక్కడా వాడిన జాడ లేదు. ఎర్ర రాళ్ళను చెక్కి వరుసగా అమర్చారు అంతే.ఇది ఇండో- ఆర్యన్ శిల్ప విధానం. ప్రధానమైన "మధుకేశ్వరాలయ"శిల్పకళ భీమేశ్వరాలయ శిల్పకళ భిన్నంగా ఉంటాయి. కనుక ఒకే కాలం నాడు కట్టినవి కాదు.

పాండవ భీముడు భీమేశ్వరాలయ శ్రీ భీమ లింగ ప్రతిష్ట చేశాడని. గంగవంశరాజు రెండవ వజ్రహస్తుడు11వ శతాబ్ది మొదట్లో ఆలయ నిర్మాణం చేశాడని తెలుస్తోంది . దీనిలో చోళ శిల్ప కళ ద్యోతకం. వేంగి చాళుక్యరాజు శక్తివర్మ సోదరుడు విమలాదిత్యుడు ఈ ఆలయ నిర్మాణానికి సహాయం చేసినట్లు చారిత్రకాధారాలున్నాయి.


అన్ని హక్కులు రచయిత

ప్రథమ ముద్రణ ; 1000 ప్రతులు

ప్రకాశకులు :

సిద్ధాశ్రమం, నరసన్నపేట

ముద్రణ :

తిరుమల తిరుపతి దేవస్థానము వారి
ద్రవ్య సహాయముతో

వెల ; అమూల్యము

ప్రతులకు :

1. సిద్ధాశ్రమం
ఇందిరానగర్ కాలనీ
నరసన్నపేట.

2. ఎం. వి. రమణయ్య
తెలుగు ఉపన్యాసకులు
స్టేట్ బ్యాంకు వీధి (ఓల్డ్)
నరసన్నపేట - 532 421.

ప్రధాన ఆలయ శిల్పకళ ముచ్చటగా ఉంటుంది. ఆలయం నాలుగుమూలల నాలుగు చిన్న ఆలయాలున్నాయి. పడమటి ఆలయం లో హరిహర మూర్తి మతసామరస్యానికి ప్రతీక. ఆలయ గోడలపై శివలీలలు చెక్కారు. కాశీ "ఆనంద కాననం "అయితే. శ్రీ ముఖలింగం" గోవింద కాననం "గా అభి వర్ణిస్తారు. అందుకే దక్షిణ కాశి అంటారు. స్కాంద పురాణంలో ఈ ఆలయ వివరాలున్నాయి. శివుని శాపానికి వ్యాసుడు కాశీ వదలాల్సి వచ్చి బాధ పడుతుంటే దేవ సేనాని కుమారస్వామి ప్రత్యక్షమై "శ్రీ ముఖలింగేశ్వర క్షేత్ర మహాత్మ్యం వివరించి అది దక్షిణ కాశి అని భరోసా ఇచ్చాడు. కృతయుగం లో గోవిందేశ్వర సువర్ణలింగం. త్రేతాయుగం లో మధుకేశ్వర రజత లింగం ద్వాపరం లో జంతీశ్వర కాంస్యలింగం గా వెలసిన పరమేశ్వరుడు కలియుగం లో లింగం లో ముఖం దాల్చి శ్రీ ముఖ లింగేశ్వరుడుగా వెలసి పూజలందు కొంటున్నాడు. అందుకే ముఖలింగ క్షేత్రం అయింది.

ద్వాపరం చివరకు ఇదంతా గొప్ప కీకారణ్యం. మనోహర వంశధార నదీ తీరం లో పరమేశ్వరాంశ సంభూతుడు వామ దేవ మహర్షి యజ్ఞం చేశాడు. ఈ క్షేత్రం చుట్టూ చాలా పుణ్య తీర్ధాలేర్పడ్డాయి. ఈ క్షేత్రసందర్శనంచేసిన మునులు యోగులు అనేక శివలింగాలు ప్రతిష్టించారు. మంకణేశ్వర,స్వప్నేశ్వర. సూర్యేశ్వర. సోమేశ్వర. భీమేశ్వర మొదలైన లింగాలున్నాయి.

ఈ క్షేత్రానికి తూర్పున రత్నగిరి దానిపై విష్ణుమూర్తి పద్మనాభస్వామిగా వెలసి క్షేత్ర పాలకుడుగా ఉన్నాడు. దక్షిణాన వటాద్రిపై మంకణేశ్వరుడు వెలిస్తే. దక్షిణాన స్వప్నేశ్వరుడు వెలసి దుస్వప్న దోషనివారణ చేస్తున్నాడు. ఉత్తరాన సూర్య ప్రతిష్టిత సూర్యేశ్వరలింగం సూర్య తీర్ధం ఉన్నాయి. చర్మవ్యాధులను నివారిస్తాడు. దక్షిణాన

సిద్దేశ్వర లింగం తీర్ధం సర్వ సిద్ధులు కలిగిస్తుంది. ఇంత ప్రసిద్ధమైన ఈ క్షేత్రానికి ప్రచారం చాలా తక్కువగానే ఉన్నది.


“ముక్తిదాయక సర్వేశ ! భక్తవరద
అంగభవభంగ శ్రీ ముఖలింగవాస”

ఈ క్షేత్ర మహాత్మ్యం రాసిన కవి చిన్నతనం లో చాలాసార్లు ఈక్షేత్ర దర్శనం చేశారు. 1988 తన దగ్గర బంధువులతో దర్శించినపుడు అర్చకస్వామి శ్రీ తమ్మా తిరుపతి రావు “ఈ క్షేత్రం గురించి మీరేదైనా రాయరాదా ?’”అని ప్రేరణకలిగిస్తే అది స్వామి ప్రేరణ అనిపించి మనసులో సీసపద్యం లోని ఎత్తుగీతి చివరి రెడుపాదాలు –”ముక్తి దాయక సర్వేశ భక్తవరద –అంగ భవ భంగ శ్రీ ముఖ లింగవాస “మకుటంగా భాసించింది.అనేక విషయాలు సేకరించి. శివలీలలు కూడా చేరిస్తే బాగుంటుంది అనిపించి. పురాణ గాథలను లఘు టీకా తో సహా సంపూర్ణం చేశారు ఇలాంటి ప్రయత్నం శతక వాజ్మయం లో అంతవరకూ రాలేదని కవి చెప్పారు చిన్నతనం లోనే తల్లిని కోల్పోయిన తనను అక్కగారినీ అనురాగం పంచి పెద్ద చేసిన పినతండ్రి శ్రీ మొసలికంటి వెంకటసన్యాసయ్య గారిని స్మరించారు. విజయనగర మహారాజ కళాశాలవిశ్రాంత అధ్యక్షులు శ్రీమానాప్రగడ శేషసాయి “రసతరంగం “అనీ. అరసవల్లి సూర్య దేవాలయ ఆగమపాఠశాల సంస్కృత అధ్యాపకులు శ్రీ ఆరవెల్లి లక్ష్మీ నారాయణా చార్యులు మున్నుడిలో “ఇక్కడి లింగం ఇప్పచెట్టు అంటే “మధూకం “మూలం నుండి ఉద్భవించి నందున “మధు కేశ్వరలింగం అనటం సార్ధకం. దారురూపంగా స్వామి దర్శనమివ్వటం ఆశ్చర్యం “అన్నారు. పూరీలోజగన్నాథస్వామి అన్నబలరాముడు సోదరిసుభద్ర లతో దారు శిల్పాలుగా దర్శనమిస్తారనిమనకు తెలుసు ఇక్కడ శివుడు అరుదైన దారు లింగంగా ఉద్భవించాడు. ఇదీ ఈక్షేత్ర విశేషం. .శ్రీకాకుళం ప్రభుత్వ కళాశాల విశ్రాంత ఆంధ్ర భాష ఉపన్యాసకులు శ్రీ గెడ్డావు సత్యం “ధారాళంగా సీసపద్య రచన జరిగింది. వివిధ క్షేత్రాలలో వివిధనామాలతో వెలయు భవుని వర్ణన భవ నాశకంగా ఉన్నది. చదివి శివుని కారుణ్యా మృతం “పొందుతారు “అని ఆశీస్సులదించారు.

సశేషం

శ్రీ ముఖలింగేశ్వరం అనే “శివ మహిమ” పుస్తకాన్ని నరసన్నపేట తెలుగు ఉపన్యాసకులు శ్రీ మొసలికంటి వెంకట రమణయ్య తిరుమల తిరుపతి దేవస్థానం ద్రవ్యసాయం తో నరసన్నపేట సిద్ధాశ్రమం ద్వారా ప్రచురించి తిరుమలేశునికి అంకితమిచ్చి శివ కేశవాద్వైతాన్ని చాటారు.. వెల అమూల్యం.

ముఖ లింగేశ్వర దేవాలయం

ముఖలింగ క్షేత్రం

మొదటిపద్యం –”శ్రీ కంఠ రజిత గిరినివాస విశ్వేశ –లోక రక్షక దేవశోకనాశ-మందరాచలదీర మహిత దివ్యప్రభా –ఫాలలోచన కోటి భాను తేజ –సోమ సూర్యాగ్ని సుశోభిత నేత్ర ని-గమగోచర శశాంక ఖండ మకుట –హిమశైల జాదిప హేమాద్రి ధన్విత్రి-పురనాశన త్రిశూలి భుజగ హార-భక్త జన రక్షనిఖిలసంపత్సమేత-పూత చారిత్ర మమ్మిల బ్రోవుమయ్య –ముక్తి దాయక సర్వేశ భక్త వరద –అంగభవ భంగ శ్రీ ముఖ లింగవాస “

3-శ్రీముఖ లింగాన శీతాంశు ధర యమ్మ –వారాహి తోడుగ వరలినావు” –

6-వామదేవుని యజ్ఞభాగంబు గైకొన –పేంచేసి గాంధర్వ బృందమెల్ల-కండకావరమున కన్నుగానక భిల్ల –వనితల జెరచిరి వక్రబుద్ధి-వామదేవుడు వారల శపియింప-భిల్లులై తిరిగిరి భీతి గొనుచు –ద్వాపరాంతము నందు వారాహి దేవితో –ఇప్ప చెట్టు మొదల ఇచట వెలసి –ఆననాబ్జము లింగాన యమర దాల్చి –శాపమంతము జేసితి  శైల చాప “

12-”ఒక వంక నెలవంక నకలంకముగదాల్చి –మకుట కిరణజాల మొకటి వెలుగ –దక్షిణ కరమందు దగ పుర్రె ధరియించి –దాపట బూని సుదర్శనంబు-గళసీమ కుడిప్రక్క కంకాళములు పేర-ముత్యాల హారంబు మురుపు సూప –ఫాలమందును నేత్ర పద్మంబు బొలుపార – వక్షమందున కౌస్తుభంబు మెరయ –హరిహరాద్వైతము దెలుప నాలయమున –వెలుగు నీ మూర్తి నే గొల్చి వినుతి జేతు”

అంటూ స్వామి హరిహరాద్వైత రూపాన్ని కళ్ళముందుకట్టించారు కవి.

15-చిత్ర సేనుడు భార్య “చిత్తని”యామోద-మును బొంది చిత్కళ మనువు గొనియె-అన్ని కాలములందు నమరంగ బూచెడి-ఇప్ప శాఖల నిచ్చె నిరువురకు “చిత్కళ భక్తికి బంగారు పుష్పాలిచ్చి. చిత్తిని చెట్టు మొదలంటా ఖండించగా ముఖ రూపాన్ని పొందాడు స్వామి. వేదముఖోద్గత నాలుగు వేదాలు. వ్యాకరణం మొదలైన షడంగాలు విజ్ఞాన వార్తాది విద్యలు సర్వ శకున ధర్మ సాముద్రికాలు. దాతు

పదతద్ధితాలు చదివితే బుద్ధి పెరుగుతుంది కాని-"కైవల్యపదము గాంచ గలడె- నీదు నామ స్మరణ లేక నిగమవేద్య"అని చదువులు ముక్తిమార్గం చూపించవన్న ఎరుక తెలియజేశాడు కవి.

45-జయ భూత నాథాయ జయ చంద్ర చూడాయ –జయ నీల కంఠాయ జయము జయము ---జయ వేద వేద్యాయ జయ కృత్తినివాసాయ –జయ నాగ భూషాయ జయము జయము "

ఈ సీసాలు శ్రీనాథ మహాకవిని ఆయన శివభక్తి తత్పరత ను గుర్తుకు తెస్తున్నాయి.

59-ఓంకార మనువుగా యురగభూషణు మంత్ర-పఠనము జేయునవియె వక్త్రములు –నిష్టమై భస్మమ్ము నిండార బూసిన- తనువు తర్కింప గా తనువు సుమ్ము "పద్యం పోతనగారి "కమలాక్షు నర్చించు కరముకరము. శ్రీనాథు వర్ణించుజిహ్వ జిహ్వ "పద్యానికి కు సాటిగా పోటీగా ఉంది.

కాటుక కొండను సముద్రంలో కలిపి సిరాచేసి. కల్ప వృక్ష శాఖలు ఖండించి కలాలు గా చేసి విద్యలరాణి వాణి లోకాలున్నంతకాలం రాయలనుకొన్నా "వ్రాయ దరమే "అంటారు కవి శంకరాచార్య స్పూర్తితో. శర్వుడుగా జలమూర్తి. భవనామం తో వసుధ. ఉగ్రనామంతో హుత భుక్ అంటే అగ్ని. మహాదేవ నామం తో అబ్జుడు. భీమనామం తో వ్యోమకేశుడు. రుద్రనామం మారుతుడు. పశుపతి నామంతో యజ్ఞపురుషుడు.ఈశాన నామంతో సూర్యుడు. పంచభూతాలు ఇన శశి పావకులుగా వెలిగే అష్టమూర్తి శివుడు అని చక్కగా వర్ణించారు. ఓంలో నాథుడు,అ ఉ మలతో త్రిగుణా త్మకుడు వేదత్రయం. విశ్వకర్తలు జాగ్రత్ స్వప్న సుషుప్తులు,ప్రాజ్ఞ తైజస విశ్వ పరమ రూపాలు శరీర త్రయం వర్ణాలకు ఆద్యుడు ఒట్టిఓంకార రూపుడు శివమహా దేవుడు అని తత్వమంతా విప్పి చెప్పారు 70వ పద్యం లో. 90వ పద్యంలో గాలికి గంగకు అగ్నికి భూమికి శరీరంలొని రక్తమాంసాలు.పాలకు సూర్యునికి ప్రకృతికి వృక్షాలు లతలకు పూలకు కులమేది అని తార్కిక ప్రశ్నలు సంధించి "కుసుమ కోదండ హర నీకు కులము గలదె-గుణము గొప్పది గావలెకులములేల "అని మనకు చెంప దెబ్బలు వాయిస్తాడు కవి.

100-నీదు లింగము గననీలలోహిత రాయి –శంకరా నీ సతి శైలతనయ –నీహార శైలుండు నీ మామ బాంధవ –వర్గంబు పరికింప భర్గ శిలలు –భవదీయ చాపము పశుపతీ శిల గదా-"మెడలో పుర్రెలమాల. చేతిలో పుర్రె. ఉన్న నీవుమాత్రం "కారుణ్య వత్సలుడవు "అంటాడు చమత్కారంగా కవి.

108- వ పద్యంలో తన గురించి చెప్పుకొన్నాడు. కోమర్తి గ్రామవాసి. హరితస గోత్రం. పేరు రమణయ్య. తండ్రి మాధ్వుడు మహిత యశ శ్శాలి. సత్వ గుణ సంపన్నుడైన గ్రామాధికారి నరసింగ రాయడు. తల్లి రమణమ్మ. వ్యక్తిగా తీర్చి దిద్దినవారు చొప్పల్లి జగన్నాథ స్వామి. తెలుగు భాషా యోష తీరు తెన్నులు చెప్పి అభిలాష కలిగించినవారు గంటి నరసింహ శాస్త్రి. పద్యం అల్లటం కర్రి సుబ్బారావు. రాఘవ పాండవీయం బోధించినవారు బంకుపల్లి సూర్యనారాయణ శాస్త్రి,రఘువంశం లక్ష్మణ శాస్త్రి గార్లు బోధించారు. ఈ విధంగా పరమభక్తాగ్రేసరకవి శ్రీ మొసలికంటి వెంకటరమణయ్య గారినీ వారి"శ్రీ ముఖ లింగేశ్వర శతకం"ను పరిచయం చేసే భాగ్యం నాకు కలిగింది. తెలుగు లెక్చరర్ అవటం సంస్కృతాంధ్రాలలో మంచి పట్టు ఉండటం. శాస్త్ర పరిచయం లోతుగా ఉండటం తో శతకరచన శ్రేష్టంగా కనిపిస్తుంది. .

## 16 యలమంద కోటీశ్వర శతకం -- శ్రీ బెల్లం కొండ కోటి నాగయ్యకవి

నరసరావుపేట తాలూకా శ్రీ కోటీశ్వర క్షేత్ర నివాసి. అచల గురుసంప్రదాయకుడు శ్రీ బెల్లం కొండ కోటి నాగయ్యకవి "శ్రీ యలమంద కోటీశ్వర శతకం "రాశాడు. వృషభ గోత్రజుడు. తల్లి సొమాంబ,తండ్రి పిచ్చయ్య. కవి పాశుపతం మొదలైన అనేక ఉపాసనా సిద్ధుడు. పరమహంస స్వరూప నిత్యానంద రాజయోగి.కోటి నాగార్యుడుగా సుప్రసిద్ధుడు.


శ్రీయలమంద కోటీశ్వర శతకము.

బెల్లంకొండ కోటినాగయ్యదాసుచే

1934

రేపల్లె తాలూకా మాచవరం వాస్తవ్యులు శ్రీ అలపర్తి వెంకయ్య చౌదరి ధర్మపత్ని శ్రీమతి వేంకాయమ్మ ద్రవ్య సహాయం తో. నిడుబ్రోలు తాతాముద్రాక్షర శాలలో 1934లో ప్రచురింపబడింది. వెలలేదు.

సీస పద్యం లో యలమంద గొప్పతనం వర్ణించాడు కవి. యలమంద అంటే కోటప్పకొండ. అక్కడి స్వామి త్రికోటీశ్వరుడు. కైలాసానికి మించిందీ. సమస్త ఓషధులకు నిలయమైనదీ. తిరుమలకు సాటియైనదీ. అణిమాది అష్ట సిద్ధులను అందించేది. "వసుధ యాదవ

మణి యొప్పుగా నందున్న మహిలో ఉన్నదీ. రుష్యాదుల బిలాలున్నదీ,అందానికి సాటి. మంచుకొండలున్నదీ. శ్రీకోటీశ్వరునికి నెలవై ఉన్నదీ. కోటి లింగాని జ్ఞాన కొండ యలమంద కొండ. ఆ కొండపై వెలసిన వాడే శ్రీ యలమంద కోటీశ్వర స్వామి.

జన్మ సార్ధకం చేసే చతుర్విధ ఉపాయాలు. జనన రాహిత్యానికి వివిధ సూచనలు. గర్భం లోని పిండ వృద్ధిక్రమం. పంచీకరణం. హంస గమనాగమనం. జ్ఞానేంద్రియాది నిర్మాణం. సాంఖ్య తారక అమనస్క యోగ విషయాలు ముముక్షు తత్వ మార్గానికి సోపానాలుగా,పండిత పామర రంజకం గా ఈ శతకం కోటి లింగకవి రాశాడని బాపట్ల తాలూకా మాట్లూరు వాసి శ్రీ ఆకుల కోటి లింగయ్య మెచ్చుకున్నాడు. కవిగారు తన శతకాన్ని నారాయణ శతకం లాగా చదు **వుకోవాలని సూచించాడు.**


4

ఓం శ్రీసద్గురవేనమః

శ్రీమదోంకార ప్రణవతత్త్వవిదులారా, కోవిదులారా!

అస్మత్కృత యలమందకోటీశ్వర శతకము కేవల పఠనానందమేగాక జ్ఞానానందమయమై జన్మసార్థకమొందు చతుర్విధోపాయములును జననరాహిత్య విధోపాయసూచనలును జననాగమనాత్పూర్వ గర్భస్థపిండ నవమాస గర్భనరక బాధా సంప్రాప్త దుఃఖానలంబును తత్తన్మాసాభి వృద్ధిపిండక్రమంబును జన్మాంతర కర్తవ్యంబును పంచభూతాంతర పంచీకరణ నిర్ణయంబును హంస గమనా గమన సంజ్ఞాపూర్వ రేచక పూరక కుంభక క్రియంబును జ్ఞానేంద్రియ కర్మేంద్రియ నిర్మాణంబును సాంఖ్యతారకామనస్క యోగ గ్రాహ్యానుకూలంబును తద్వారా ముముక్షుత్వమార్గ...నాభిలాషోదయంబును పండిత పామరులకు బెల్లముగా తెలియునటుల శ్రీ పరమహంస నిత్యానంద రాజయోగి బెల్లంకొండ కోటినాగార్యులు యీగ్రంథము వ్రాసినందులకు నే నెంతయో కృతజ్ఞుడను. వేదాంత విషయమునను కవిత్వ విషయమునను నాకెక్కుడు పరిచిత లేకపోయినను సత్సాంగత్యమునను యించుకెంగి యీపీఠిక వ్రాసినందులకు తప్పొప్పులమన్నింప ప్రార్థితుడ.

అచ్చుకు సహాయము చేసినవారలను పరమేశ్వరుడు రక్షించుగాత.

ఇట్లు, బుధజనవిధేయుడు,
ఆకుల కోటిలింగయ్య,
మట్లూరు గ్రామం
బాపట్ల తాలూకా.

**"శ్రీ భక్త హృదయవాసా –మౌనిజన- సేవ్యత్రికూట వాసా –శోభితామల వికాసా –మమ్మేలు –శుభ దృష్టి కోటీశ్వరా "అని శతకం ప్రారంభించాడు కవి. "గొప్పదనమునకు గాదు భక్తిగా జెప్పితి –ప్రాపు నీవని వేడితి –నన్ను తమ దాపునకు జేర్పమంటి –క్రూరుండు వీడంచు నను-నీవు వేరు శాయకు -కర్మ చే నిలబుట్టియు జీవులు –కర్మములు చేయు చుండి –కర్మ చేతను గిట్టుచు మరు జన్మ గాంచు దురు -ఋతు వేళ కమలమందు –సతి శుక్ల శోణితములు నండమగు కోటీశ్వరా !**

**"తల్లి పొత్తిలి యందున బెరుగుచును –తగమూత్ర మలము లందు –తల్లడిలి పొర్లాడుచుజరపితిని –సోయంచు పూరకంబు –లోపలి పోయి కుంభ కమగుచును –హం యంచు రేచకంబు వెలికొచ్చు-హర నామ కోటీశ్వరా-ముందు పరమాత్మ యందు నవ్యక్త-మందున మహత్తత్వము –అందునను హంకారము –నను గల్గె-నతిమాయ కోటీశ్వరా-వాయువులో సగ భాగము వ్యానమై –వరుస మిగిలిన భాగము –తోయమాకాశాగ్ని భూమిలో –తోడ్పడియె కోటీశ్వరా-తోయమున నర్ధాంశము రస**

**మయ్యె-రూప శబ్ద స్పర్శ ము –గంధరస –రూపింప జలపంచకం బని యొప్పె-రూఢిగా కోటీశ్వరా-తన్ను డా జుచుకొనుటె యమనస్కము కోటీశ్వరా''**

**చాలా గహన వేదాంత విషయాలు అరటి పండు వొలిచి చేతిలో పెట్టినట్లు శతకం లో రాసి నిజంగానే ముముక్షులకు మోక్ష మార్గ దర్శనం చేసిన శ్రీకోటి నాగార్య కవి ధన్యుడు.**

**కోటప్పకొండ,** గుంటూరు జిల్లా, నరసరావుపేట మండలం, యల్లమంద గ్రామ పరిధిలో ఉన్న త్రికోటేశ్వరుని సన్నిధి. ఇది ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోనే ప్రసిద్ధి[1] చెందిన మహిమాన్విత క్షేత్రం. ఇక్కడ కైలాశాధినేత అయిన ఆ మహా శివుడు త్రికోటేశ్వరుని రూపంలో కొలుపైన దివ్య సన్నిధి ఈ కొండ. యల్లమంద కోటయ్యగా భక్తులకు ప్రీతి పాత్రుడైన శివుడు కోటప్పకొండలో కొలువై భక్తుల కొంగు బంగారంగా విలసిల్లుతున్నాడు. ప్రతి ఏటా కార్తీకమాసంలో కోటప్పకొండ తిరుణాళ్ళు, కార్తీక వన సమారాధనలు కూడా జరుగుతాయి. ఈ తిరణాళ్లలో చుట్టుప్రక్కల ఊర్లనుండి ప్రభలతో భక్తులు దేవాలయాన్ని దర్శిస్తారు.ఇక్కడ కాకులు వాలవు. అదొక విచిత్రం.

## 17 ఈశ్వరమ్మ శతకం -- శ్రీ శ్రీధర్ ఎర్రోజు

శ్రీ శ్రీధర్ ఎర్రోజు ఎవరో నాకు తెలియదు కాని ఆయన రాసిన "ఈశ్వరమ్మ శతకం "మాత్రం నాకు ఆయనే ఈ నెల 8న పంపగా బహుశా నాలుగైదు రోజుల క్రిందట నాకు అందింది కాని నేను చూడలేదు. నిన్ననే చూసి ఆయనకు ధన్యవాదాలుచేప్పాను. నాస్పందన తెలియజేయమని చిన్న నోట్ కూడా పుస్తకం లో పెట్టారు. ఇప్పుడే శతకం చదివి నా మనోభావం తెలియజేస్తున్నాను.

లెక్కలలో ఎం. ఎస్. సి.చేసి లెక్కలమాస్టారుగా సమర్ధత చూపి,ప్రస్తుతం. తెలంగాణా లక్సెట్టిపేట ప్రభుత్వ ఉన్నతపాఠశాల గజిటెడ్ హెడ్ మాస్టర్ గా పని చేస్తున్నారు పగోజి మల్లవరం లో పుట్టిన శ్రీధర్. తన మాతృమూర్తి ఈశ్వరమ్మ గారికి ఈ పద్య శతకం అంకితం చేసి ఋణం తీర్చుకొన్నారు. లెక్కల మేష్టారు పద్యాలు రాయటం ఎయిత్ వండర్ అనిపిస్తుంది. పద్యం లో ఛందస్సు అంతా అక్షరాల లెక్కే కనుక అది వచ్చినవారికి ఇది అత్యంత సులువు. అందుకే చక్కగా సాగింది శతక రచన. సమకాలీన విషయాలన్నీ చోటు చేసుకొన్నాయి "ఈశ్వరమ్మ సుతుడు హితము పలుకు "అన్న "మకుటాయ"మానమైన శతకమిది. ఈశ్వర సుతుడుంటే వినాయకుడు. కుమారస్వామి అందులో అమ్మకొడుకు గణపతి అయ్యకొడుకు శరవణుడు. ఈయన ఈశ్వరమ్మ సుతుడుకనుక సిద్ధి బుద్ధి లకుఅధిపతి ఐన విఘ్నేశ్వరుని పలుకు లోక హితమేకాక,లోకైకహితమూ ఔతుందనటం లో సందేహం లేదు. అందుకే 80పేజీల పుస్తకం లో సగానికి పైనే

48పేజీలలో ఆంధ్రదేశం లో లబ్ధ ప్రతిష్టు లైన కవీశ్వరుల,హితైషుల అవధాన సరస్వతుల అభినందన ఆశీః వర్షం కరిసింది. ధన్యజీవి ఈ కవి.




"పదము పదములోన పటిక బెల్లము నిండి-పచ్చకప్పురంపు పసను కలిగి –కాజు. పిస్త,చెర్రి కలయిక కవనమ్ము కవనమ్ము-ఈశ్వరమ్మ సుతుడు హితము పలుకు "అని కవిత్వ రహస్యం చెప్పగలిగాడుకవి. ఐతే ఇందులో ఆధునికంగా కాజు పిస్తా,చెర్రి కలిపి మాధుర్యం పెంచాడు. ముందుగా తలిదండ్రులు, బంధువులనందరికీ పద్య నీరాజనం పట్టాడు. గతం మార్చటానికి ఘటన ఒక్కటి చాలు. మనమే ముక్కలమైతే మతం ఎలా బతుకుతుంది. ఆడవారి పై అలుసుభావం వద్దు. ఒక్కపల్కరింత. పట్టెడన్నం తో ప్రేమ పంచాలి. పాల్తీన్ సెల్లు సొల్లు ల వ్యామోహం పై మెత్తని చివాట్లు. గూడు మారితే గుణం మారదు. రైతన్న అన్నదాత. గద్దె నెక్కి జనుల గతులు మరవటం. జలం గరళమైతే జనుల మనుగడ ఎలా సాధ్యం. అనే జవాబులేని ప్రశ్నా సంధానం చేశాడు. శక్తి పొదుపు అంటే శక్తి సృష్టి. అడవి సంపద లేకపోతె తే అభ్రం ఎలా కురుస్తుంది అన్న మౌలిక పర్యావరణ సంబంధ ప్రశ్న.. పరువు లేనివాడి బతుకు నరకం. మత సహనం కన్నా మతమే లేదు దేశామాతకంటే దేవత లేదు అనే సుద్దులు చెప్పాడు. ఆలికన్నా ఆత్మీయులు లేరు. పసుపు ముద్దకన్న పసయున్న వనరు లేదు. ఆడవారు లేకపోతే సృష్టి ఆగే పోతుంది. అనే నీతులూ బోధించాడు. "కలలు కనే వేళ. కష్టకాలం లో తల్లిభాషలోనే తల్లడిల్లే మనిషి మాతృ భాష మరువరాదని. గాడ్జెట్ వలలో పడవద్దనీ. ఉల్లి ధర విని ఉల్లం ఆగిపోతుందనే చమత్కారం. అన్నిమతాలు చెప్పేది సత్యధర్మ శాంతి సహనాలే అనే విశాలభావం. రాగి జావ చేసే చలువ రంగు నీళ్ళు చేయవనే ఎరుక. వనాలు లేని భూమి వసుధ ఎలా అవుతుందనే ఘాటైన ప్రశ్నా. "నీటి పూరీ "అదేనండీ పానీ పూరీ మురికి వాడల్లో తింటుంటే వ్యాధులు రాకేం చేస్తాయని ఆరోగ్యసూత్రం. ఉచ్చ నీచాలుమరచి వెండితెర వేల్పుల ఆరాధన. పై విసుర్లు. ఇందులో పుష్కలం. కవిత్వానికి మరోనిర్వచనంగా "రసము లెన్నొజూపు రసధార కవనమ్ము"ఇచ్చాడు కవి. గురువు సుద్దులు నేర్పే చుక్కాని. "వాట్సపు గురువులు"వాస్తుతో సహా అన్నీ చెబుతుంటే అసలు గుగ్గురువులు అటకెక్కినారని "మందలింపు. కుత్సితాలు నిండి కుళ్ళిన "మనసు కడుగు టెట్లుమలినమ్ము తొలగించ "అనే నిర్వేదం. సూర్యుడికి రాత్రి చంద్రుడికి పగలు అచ్చిరావు కనుక" వేళకాని వేళ విలువలు అలామారుతాయి

అంటాడు అనువుగాని చోట అధికులమనరాదు అన్నదాన్ని గుర్తుకు తెస్తాడు. మళ్ళీ మరో సారి మాతృ వందనం ”అమ్మ యనిన దైవ మమ్మయె గురువురా –అమ్మలేక జీవమవని లేదు –ఆమ్మ నెట్లువిడుతు వాశ్రమముల యందు –ఈశ్వరమ్మ సుతుడు హితము పలుకు “చేశాడు. 122పద్యాల శతకానికి కవి చిత్రాలకు తాను రాసిన అయిదు పద్యాలను కూడా చేర్చి, కానుక చేశాడు. .ఈశ్వరమ్మ. తల్లీ పిల్లా. వెలుగుతున్న కొవ్వొత్తి. సిరా బుడ్డి నెమలి ఈక కలం? తో అందమైన ముఖ చిత్రం శతకానికి మరింత వన్నె చేకూర్చింది . ధారాశుద్ధి., సరళ మంజుల పదజాలంతో శతకం రాణించింది మరిన్ని కవితా సంపుటాలు శ్రీధర్ వెలువరిస్తాడని ఆశిద్దాం.

## 18 హేలాపురి (ఏలూరు)శతకం -- శ్రీ బొడ్డు లక్ష్మీ నారాయణ కవి

ఏలూరుగా పిలువబడే హేలాపురి పశ్చిమ గోదావరి జిల్లా రాజధాని. కళలకు సంస్కృతికి నిలయం. కవిపండిత కీర్తి స్థానం. వితరణకు వేదిక. ధర్మానికి పట్టుగొమ్మ. అలాంటి హేలాపురి పై గొడవర్తి తిరు వేంగళాచార్య శిష్యుడు. మృదు మధురాంధ్ర కవిత్వ సాంద్రుడు. బొడ్డు వంశం లో జన్మించిన నారసింహ కుమారుడు. కమనీయ సుగుణ సుకవి సమాజుడు. సజ్జన ప్రముఖార్య సత్కారుడు బొడ్డు లక్ష్మీ నారాయణ కవి “హేలాపురి శతకం “రాశాడు. దీన్ని నవనీత చోరుడు. రాధికా సతి వినోదుడు వేణు గోపాల స్వామికి సభక్తికం గా అంకితమిచ్చాడు కవి. ఇంతకు మించి కవి తన గురించి చెప్పుకోలేదు. ఏ సంవత్సరం లో రాశాడో,ఇంకేమైనా రాశాడో కూడా తెలియదు. అయితే కవిత్వం లో ఆరి తేరిన పండితుడని తెలుస్తోంది. వివిధ ఛందో భేదం గా. ద్రాక్షాపానక రస వంతంగా కవిత్వం చిందించాడు.

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

హేలాపురిశతకము,

శ్రీకరరమసదార్చితపాదరాజీవ రాజీవకే
తనరాజవినుత। వినతతనూజాత వితతనుతావ
నవనరుహాననమానధనకృతార్థ। అర్థాంగధరర
థాంధా ర్త్రాదిధారణరణధురీణధురీణగణనిదాన।
దానశౌండాసురదర్పఖండప్రచండ చండగు
ణోద్దండకాండకాండ। కాండభవభవభావనా
ఖండవరద। వరదయానిధిమాం పాహి పాహి
యనుచు। లలితమణిభాసురంబు హేలాపురం
బు। వేణుగోపాలుతోడి తే వేలతాంగి॥ ౧
శ్రీరుక్మిణీవదనారవిందారుణదారుణ శకట
దైత్యాదిహరణ।రణరంగవిజితవిక్రమసుదర్శ

ముక్త పద గ్రస్తం లో ఆరితేరిన కవి ముందుగా "శ్రీకర రమ సదార్చిత పాద రాజీవ,రాజీవ కేతన రాజ వినుత –వినత తనూ జాత వితన వితతావన వనరుహానన. మానధన కృతార్ధ –అర్ధాంగ ధర రాధా ధారాది ధారణ రణ ధురీణ గణ నిదాన –దాన శౌండా సుర దర్ప ఖండ ప్రచండ చండ గుణోద్దండ కాండ కాండ –కాండ భవభావభావనా ఖండ వరద –వరదయానిది మాం పాహి పాహి యనుచు –లలిత మణి భాసురంబు హేలాపురంబు –వేణు గోపాలు తోడి తేపే లతాంగి ".ఇందులో చివరి పాదమే శతకానికి మకుటం. తర్వాత పద్యాలన్నీ ఇదే ధోరణిలో సాగాయి. "హరికోటి కోటి భాసుర కర కోటీర మంబు నింపొందుశిరంబు వాని –ఘనమించు మించు మేఘము గూడుకొను మాడ్కి రత్న శోభితమౌ యురంబు వాని "అని వేణు గోపాకృష్ణ మూర్తిని స్తుతించాడు. తర్వాత మానవ జీవిత పరమార్ధం ఏమిటో –"హరిని శ్రీహరిని శ్రీహరిని బ్రోచిన వాని చిరము సేవించిన శిరము శిరము ----దరముమందరము సుందరము సుందరము దాల్చిన వాని కరముకరము "అంటూ పోతనగారి బాణీలో రాశాడు. "దినకర శశి నేత్ర దివ్యాభరణ గాత్ర నిరుపమాన చరిత్ర ధర పవిత్ర "అని రాసి అష్టభార్యా సమేతుడిని –"అలరుక్మిణీ సత్యభామా హృత్పద్మమోహాబ్ధికానంద భ్రుంగాబ్జు డనగ –మిత్ర వింద సుదంతి నేత్రాబ్జ కరలతాతతికింపురవి కల్ప తరువానంగ-భద్ర కాళింది యవ్వన వనకుచ గిరుల్కురియు మత్తేభ జీమూతమనగ-వర లక్షణా జాంమ్బవత్యోష్ఠ బింబ ఫలా భీష్ట శుక వరదా యనంగ-షోడశసహస్ర చేడెల శుభు డనంగ-వెలయు రాధిక లోలుని వినుతి జేతు"అని కృతిభర్త వేనుగోపాలుని కమ్మగాస్తుతించాడు బొడ్డుకవి.

హేలాపురి శతకము,

ములేల। కాంత నావంత గెంతననంతనతుని। చెం
తసత్యంతనుతి జేతుసంతసింతు॥లలిత॥ ౬
హరిని శ్రీహరిని శ్రీహరిని బ్రోచిన వాని
చిరము సేవించినశిరముశిరము। తతము శ్రీ తత
ముసంతతముగల్గినవానిచింతామృతంబాను జి
హ్వజిహ్వ।భయమునిర్భయముగా భయముని
చ్చేసువానిఘనముగాధ్యానించు మనము మన
ము। దరముమందరముసుందరముదాల్చినవాని
చరణముల్ నర్చించుకరముకరము। గానగజ
యానసనీయానవానిదాన। దానవారినయాన
గానగాన॥లలిత॥ ౭
ఘనకాంతి జితదేహు జానుచతుర్బాహు
భండనోల్లాసుసన్మందహాసు। మానితపరిపూర్ణ
మకరకుండలకర్ణువరపీనవక్షు సరోరుహాక్షు।స

తర్వాత పుర వర్ణన చేశాడు. షట్ శాస్త్ర పండితోద్దండులు. భందనో ద్దండ ప్రచండ రాజులు. రత్నాలు మొదలైన అనేక ధనధాన్యాలు దానమిచ్చే వైశ్యులు. సతత హరిభక్తి కలిత హరిజనులు హేలాపురిలో ఉన్నారు. వేశ్యలు,సరస్సులు. పండ్ల తోటలతో కనులకింపుగా పురం ఉన్నది. ఆతర్వాత శ్రీ కృష్ణ బాల్య క్రీడా వర్ణన చేశాడు –"వసుదేవ దేవకీ వర సూనుడై పుట్టి. నంద యశోద లానంద పెట్టి –పాతదితిసుత వ్రాతంబులను గొట్టి చలపట్టి ఫణిఫణాదులను మెట్టి –కొదగక కుధరము గొడుగు చాడ్పున బట్టి పాకశాసను శాత భంగ పెట్టి –గొల్లల నెల్లను

కూర్మిని చే బట్టి పట్టాభి షేకుడై ప్రబలి నట్టి- జిష్ణు సన్మౌని హృదయ వర్తి ష్ణు- కృష్ణు నతులిత పదాబ్జ యుగము సేవింతు వ.సము".బాలకృష్ణుని శిఖిపించం మొలనూలు గజ్జెలు మురళి వాయింపు వ్రజభామినులతో సల్లాపాలు వర్ణించాడు. ఉట్టి లో ఉన్న సరుకు కొల్లగొట్టటాన్ని చక్కని పద్యం లో చెప్పాడు –"–ఉట్టి బెట్టినయట్టి చట్టి తూటేట్టి నోరట్టి పాలట్టెనోరట్టి పట్టి –అన్నన్న వెన్న పైనున్నదెన్నన్ననీ చిన్న చిన్నగ పిన్నపిన్నకన్నె కెట్టి-నత్తరాయత్తమై కొత్తబిత్తరి హత్త గుత్తముత్తమ గుబ్బ లొత్తబట్టి –ఇమ్ముగా నిమ్ము ఈ సొమ్ము నీ సొమ్ము చేకొమ్ము ముద్దిమ్ము శుభంబు బొట్టి-యంచు చెక్కు న నొక్కి యక్కజంబు –లంత నెంత వచియింతు కాంత నీకు "అంటూ కృష్ణ క్రీడలని అద్భుత పద్యరాజంగా రాశాడు కవి.

ఆపిమ్మట రాధా కృష్ణ విలాస వర్ణ చేశాడు –"కంతు శాస్త్రము జెప్పి. కలియలకలకు మల్పిగిలిగింత తతిసల్పి వలపు గొల్పి –చక్కర మోవిచ్చి చంగవ నందిచ్చి ముద్దులొద్దిక నిచ్చి ముదము బుచ్చి –తొడ తొడలను దార్చి తడబడక ను జేర్చి బుడి బుడి గడి దేర్చి బడలికోర్చి –మదిని జంకు దొలంగి మచ్చికల గరంగి. మెనూ మేనున బెరంగి మనము బొంగి –తక్కి నొక్కితిమరుబారి జిక్కు బడితి-ముందుగా నాస బడితి హా మోస బోతి" అని మొదలెట్టి అన్ని భంగిమలను కళ్ళముందు కట్టించి. మూడుకాళ్ల ముదుసలి కూడా రంకె వేసేట్లు శృంగారం దట్టించాడు. ఏ ముద్దు పలణో మళ్ళీ పుట్టి రాసిందేమో అన్నట్లు రతికేళిని సరస శృంగార బంధురంగా రాశాడు బొడ్డుకవి.

తర్వాత గ్రీష్మం తో ప్రారంభించి వర్షర్తు. శరదృతు వర్ణలను ప్రబంధకవులకు సాటిగా దీటుగా రాశాడు –గ్రీష్మం –"ముప్పేలుపుల ఇక్క ముదమున బెంపెక్క నలరు నదీ సమూజిక్క హములు –జలరాసి యుబో ఎంగ జలజ వైరి వెలుంగ లలిపల్లవలు భూజముల జెలంగ-పాంథులు తహతహ బడు చు జొక్క "వర్షర్తు-"దినమణి రుచిదప్ప దిమిర మొప్పుగ గప్ప వర నదీదములు పైసు నొప్ప –నింగి రంగారంగ నీరదము చెలంగ గేకముల్ గుమి గొని కేరిపొంగ---విరహిణుల నొంచ మారుడు వావిరి హింసించ"గా వానాకాలం వచ్చింది. శరత్తు –"సారంగ ధరుడు యిపారంగఛవినేడుమీరంగ జేసే సమీర మీసె-బీరంబు జెంది గంభీరంబు నొంది సరస్సుల్ జెలంగె వారవి దొలంగె –గానమ్ములందు సన్మానంబు లొందుభ్రున్గా నందమందె నీహార మొందె"అలలా సాగిపోతాయి ఋతు వర్ణన పద్యాలు నాన్ స్టాప్ గా. ఈ ఋతువులలో రాధామాధవుల విరహ వేదన కూడా చూపించాడు కవి. శరత్తు తర్వాత వినోదాలంకార పద్యాలు రాసి ఆతర్వాత చంద్రదూషణం చేయించాడు. తనకవితా ప్రాగాల్భ్యాన్ని తెలియ జేయటానికి అక్షరోపమాన,పంచపాద, సర్వ లఘు,మత్తేభ కంద గర్భిత. వనమయూర వృత్తాంత,,ఇంద్ర వజ్రాంత ర్భూత. స్రగ్విణీ వృత్తాంత ర్భూత. మత్తకోకిలాంతపాద. తరలాంత ర్భూత సీస పద్యాలు రాసి. చివర్లో. విచిత్ర సీస మాలిక అల్లితన కవితా విక్రమాన్ని చాటాడు బొడ్డులక్ష్మీ

నారాయణ కవి . శతకం చివరలో తనను గురించి చెప్పాడు అంతకు ముపద్యం లో మంగళం పాడాడు –"ఆశ్రిత పోషాయ యానంద కందాయ మందస్మితాయ తే మంగళంబు-గరుడ తురంగాయ ఘన శేష తల్పాయ భాసమానాయ తే మంగళంబు-రాధా వినోదాయ రాజీవ నయనాయ భవ్య కృష్ణాయ తే మంగళం "

కవి ప్రతిభకు గీటు రాయి ఈ శతకం. శతకం వ్యాజం గా తన కవితా విశ్వరూపం ప్రదర్శించాడు కవి. ఇంతటి ప్రతిభా వ్యుత్పత్తి. భావోద్రేకం. సృజన పుష్కలంగా ఉన్న మహా కవి  మన చరిత్రకారులు ఎలా మర్చి పోయారో ఆశ్చర్యమే. కొత్త సంవత్సరం ప్రారంభానికి ముందు ఈ పాత కవిని గురించి పరిచయం చేసే అదృష్టం నాకు దక్కిందని సంతోషంగా ఉంది. శ్రీ గుండు వల్లీశ్వర్ లాంటి ఏలూరు వాసులెవరైనా బొడ్డులక్ష్మీ నారాయణ కవి గురించి పూర్తి జీవిత విశేషాలు ఇతర రచనల గురించి తెలిసి ఉంటె తెలియ జేస్తే. ఇందులో పొందుపరుస్తాను.

రేపు 1-1-2021 శుక్రవారం 2021 నూతన ఆంగ్ల సంవత్సర శుభా కాంక్షలతో –

మీ -గబ్బిట దుర్గాప్రసాద్ – 31-12-20-ఉయ్యూరు.

## 19 నీలాచలేశ్వర స్తవం -- శ్రీ కపిల కృష్ణ శర్మ కవి '




శ్రీ కపిల కృష్ణ శర్మ కవి "కర్మశ్రీ "నామధేయం తో "నీలాచలేశ్వర స్తవం "రచించి సర్వ సమైక్య భావ గరిష్టుడు. అనవతర పర సేవా తంత్రుడు. సత్పుణ్య శాలి. దాన సద్ధర్మాదిమానవీయ నియమ పాలనా రతుడైన తన తండ్రి కపిల కామేశ్వరునికి అంకిత మిచ్చాడు. ఈపుస్తకం నరసాపూర్ లోని కమలాకుటీర్ పవర్ ప్రెస్ లో 1962లో ప్రచురితమైనది.

కర్మశ్రీ కవి "నా మనవి "లో "శివభక్త శిఖామణి కాకతి ప్రతాప రుద్ర దేవ చక్రవర్తి కాలం లో కోటలోనే కాకుండా. ఊరూరా పల్లెపల్లెలా వీధి వీధినా శివాలయాలు నెలకొల్ప బడినాయనీ. ఆలాయాదీశుడైన జగద్రక్షకుని పర్య వేక్షణ లో భారత దేశం సుభిక్షం గా వర్ధిల్లిందనీ. ఆకాలం లోనే "నీలాద్రి దుర్గం "వెలసిల్లిందనీ. అంతులేని వైభవం సాటిలేని వస్తుసామాగ్రి తో. విలువైన వస్తు వాహనాలలో నీలాద్రి దేదీప్యమాన వైభవంగా వెలిగిందని కాలక్రమంగా భక్త చక్రవర్తి పాలన ముగిసిందని చెప్పాడు.



అంకితము

సర్వసమైక్య లసద్భావగరిమచే
దిగ్వ్యాపిత యశస్స్థిరు డెవండు
పరహితార్థం బనవరతంబు శ్రమియించు
కలితసత్పుణ్యసంకల్పు డెవడు
దానసద్ధర్మాది మానవనియమముల్
తప్పక పాటించు ధన్యు డెవడు
ఘనకపిలాన్వయ కలశాబ్ధి పూర్ణసు
ధాకర విఖ్యాతి దనరు నెవడు
అట్టి ధీశాలి కామేశ్వరాహ్వయుండు
మజ్జనకు డమ్మహాపుణ్యు మహితపాద
పద్మముల చెంత వ్రాలి సభక్తికముగ
అంకితం బిత్తు నీకావ్య మధికభక్తి!

ఇట్లు
కపిల కృష్ణశర్మ
(కర్త)



నట్ట నడివి లో గుట్టలు రాళ్ళు పై ఉన్న ఈ దివ్య మూర్తిని దర్శించటానికి దారీ తెన్నూ లేకపోవటం తో భక్తులు గుంపులుగా అప్పుడప్పుడు వచ్చి దర్శనం చేసుకొని వెళ్ళేవారు. సమర్ధులు ఉపేక్షిస్తే, అసమర్ధులు వాపోయేవారు. ఇలా ఎన్నో శతాబ్దాలు కాలగర్భం లో కలిసి పోయాయి. ప్రజల్లో స్వామి పై ఆలోచన రావటం. స్వామి వైభవాన్ని గుర్తించటం. రెట్టింపు ఉత్సాహంతో తిరునాళ్ళు నిర్వహించి. పురాతన వైభవాన్ని మించిన వైభవం నీలాచలేశ్వరుని కి చేస్తూ ధన్యులయ్యారు. కవి గారు దర్శించి. భక్త్యావేశం తో పులకించి ఈ స్తవ రూప కావ్యాన్ని రాశారు. కానీ తనకున్న కొద్దిపాటి సాహిత్య జ్ఞానం తో రాసిన కావ్యం కనుక తప్పులు సరి చేసి పరిష్కరించమని తండ్రిగారి ప్రేరణతో కవి భూషణ. కవిశేఖర. శ్రీ శిష్టా వెంకట సుబ్బయ్య కవీంద్రుని ఆశ్రయించి అంద జేశారు.వారు అచిరకాలం లోనే శుద్ధి చేసి కవి గారికిచ్చారు . పుస్తకాన్ని బంధు మిత్ర హితుల సహాయంతో ముద్రించి పండితాభిప్రాయం సేకరించి కూర్చారు –శ్రీ శిష్టా వెంకట సుబ్బయ్యగారు –"18ఏళ్ళ బాలుడు ఇంతటి కవితా స్రవంతి ప్రవహింప జేశాడంటే ఆశ్చర్య పోయాను. భావాలు హృదయం గమాలు. భగ వత్ప్రేరి తాలు కనుక వేదాంత విషయాలు కూడా చక్కగా ప్రకటించాడు. వ్యాకరణం పై ఇంకాస్త శ్రద్ధ చూపించాలి. ఈ కవి. దీనితర్వాత "కృష్ణ శతకం "కూడా అనర్గళ ధారా ప్రవాహంగా రాశాడు". అని మెచ్చారు.

పాలకొల్లు వాసి శ్రీ ఆంధ్ర శేషగిరి రావు –"ఆవేశ హృదయుడైన ఈ కవి నా ప్రియ శిష్యుడు. చిన్నవాడు. సంస్కృతాంధ్రాలలో పెద్దగా ప్రవేశం లేకపోయినా పద్యాలలో అనర్గళ ధారా శుద్ధి ఉంది. ఈ పద్యాలు చదువుతుంటే నాకు తన్మయత్వం కలిగింది. అమేయ కవితాదురంధరుడు అవుతాడు. ఈఆవేశం తోనే శ్రీ వెంకటేశ్వర నక్షత్ర మాల "కృష్ణ శతకం కూడా కూర్చాడు ".అని కీర్తించారు.

ఆత్రేయ విద్వాన్మహా కవి పండిత శ్రీ పామర్తి సూర్య ప్రకాశ శర్మ –"ప్రాక్తన పుణ్య పరిపాకం చేత ఈకవి గొప్ప భక్తి కావ్యం రాశాడు. గురు శుశ్రూష లేకుండా నే. ఈకవి నాలుకపై సరస్వతీ దేవి చిందులు త్రొక్కింది. విద్యా వినయ

సంపన్నుడైన కర్మ శ్రీ కవి వ్యాకరణం క్షుణ్ణంగా నేర్చి. విద్యా వైశద్యం ఆర్జించి భవిష్యత్తులో మరిన్ని ఉత్తమ కావ్యాలు రాయాలి "అని ఆశీర్వదించారు..

కవి శ్రీ కృష్ణ స్తుతి. సరస్వతీప్రార్ధన,విఘ్నే శ్వర. గురు సుకవి సంస్తుతి చేసి,ఆతర్వాత తన వంశ చరిత్ర చెప్పాడు –తనతండ్రి కామేశ్వరుడు కాశ్యప గోత్రుడు. సర్వ శాస్త్ర పురాణ సాహిత్య నిష్ణాతుడు పండిత ప్రశస్తి పొందినవాడు ఆంధ్ర ఆంగ్ల సారస్వత కోవిదుడు. సూనృత వాక్య పాలకుడు. శక్తికి మించి దానధర్మాలు చేసినవాడు. తల్లి అన్నపూర్ణ సంప్రదాయ పరిరక్షకురాలు. అన్న భాస్కరుడు వదిన వెంకట రామణాంబ తనను భక్తి కావ్యం రాయమని ఎప్పుడూ ప్రోత్సహించేవారు. రామరాయ. విజయ లక్ష్మణ రావు అన్నలు. సూర్యారావు. లక్ష్మీ నరసింహారావు తమ్ములు. పెద్దవదినన విజయ లక్ష్మి చిన్నవదినన నిర్మల. కవి మధ్యముడు కృష్ణ శర్మ.

పిమ్మట నీలాచల విశేషాలు గద్యం లో చెప్పాడు –కీకారణ్యం లో నీలాచలం యోజనం దూరం వ్యాపించి ఉంటుంది. కదంబ కాదంబ క్రకచపత్ర మొదలైన వృక్షాలతో. ఖడ్గ శరభ శార్దూలాది మృగాలతో. చిలుక గోరింక పావురాది పక్షి సంతానం తో. త్రాచు. పింజర రక్త పింజరాది సర్పాలతో,రత్న వైడూర్య వజ్ర గోమేధికాది నిధి నిక్షేపాలతో. యక్ష గరుడ కిం పురుషాది గణాలతో వ్యాపించి ఉంటుంది. అక్కడ ఏక శిలా ప్రాగ్భారం లో నాలుగుస్తంభాలపై ప్రాకారం తో నందీశ్వరుడు ముందు ధ్వజ స్తంభం ఉంటుంది. లోపల గర్భగుడిలో శ్రీ పరమేశ్వర ఆత్మలింగం నీలాచలేశ్వరుడు. దానికి కుడివైపు పెద్ద పుట్ట. దానిదగ్గర చతుర్గజం అనే శిల.దీని మధ్యలో రంధ్రం దానినుంచి నిరంతర జలప్రవాహం కనిపించి ఆశ్చర్య చకితుల్ని చేస్తాయి. మహా వైభవంగా శివరాత్రి ఉత్సవాలు జరుగుతాయి.ఈ శివుడిని చూడగానే కవిగారిలో భక్తి పెల్లుబికి దండకం ఒకటి-"శ్రీ దేవా దేవా మహానుభావా. శంభో జటాజూట దారీ. పురద్వంసకా అర్ధనరీశ్వరా. సత్కృతాంబో నిధీ "అంటూ ధారాపాతంగా వచ్చేసింది. ఆ రాత్రి అక్కడే నిద్ర చేసి మర్నాడు ఉదయం స్వామిని దర్శించి. ఇంటికి వచ్చి. ఈ స్తవాన్ని రాయటం మొదలు పెట్టాడు. ఆ స్తవ వైభవం చూద్దాం –మొదటి పద్యం -

"శ్రీ శ్రీ నమశ్శివాయా –సుశ్రీ విహరణ విలసిత సుక్షేత్రా –హే,శ్రీధర సంచయ భూ –షా శ్రీకైలాస వాస సద్గురు శంభో "

"చంచలమైన దేహ మిల శాశ్వత –మంచును మూఢులెంచు –"అని అశాశ్వతాన్ని గురించి ఆలోచించే మనుసుల తీరు చెప్పి. "కాల కూట విషమ్ము కంఠమున ధరించి –సురకోటి కెవ్వాడు సుధ యొసంగె "అని

ఈశ్వరుని స్తుతించి. మార్కండేయుని యముడి నుంచి కాపాడినవాడు –"కారుణ్య గుణాదికా.అభవ హే రాకేందు సద్భూషణా-నీకు మ్రొక్కెద గావుమయ్య కరుణన్ –నీలాద్రి వాసా హరా "అని ఆర్తిగా ప్రార్ధించాడు. తన అజ్ఞానాన్ని –"బాలుడ జూడగా దెలుగు బాసయు బూర్తిగ రాదయెట్లు శా-స్త్రాలను నేర్తు నేగతి-జ్ఞానము నూనుదు నాత్మశక్తిమై"అని తన అశక్తత ప్రకటించుకొన్నాడు. ఒక భార్యనే భరించటం కష్టంగా ఉంటె గంగా పార్వతులతో ఎలా వేగుతున్నావని మేలమాడాడు.

"మృగనాభి పంకంబు బుగబుగల్ మెయి తోడ –నగ్ని జిమ్మెడు లలాటాక్షి తోడ-నిగనిగల్ వెదజల్లు నెమలి పించము తోడ-పోలుపారు జాబిల్లి పూవు తోడ –గోప్యమై యొప్పు వైకుంఠ వాసము తోడ -మహిత కైలాస దామంబు తోడ "అంటూ ధారాప్రవాహం తో పద్యాలు సాగించాడు. భక్తి కుమ్మరించాడు. శంకరుడు ఉబ్బు లింగం అనే మాట నిజం అన్నాడు –"శంకర భక్త సంతతి వశంకర నీల గిరీశ్వరా హరా "అన్నాడు. చివరగా –"ఆత్మ విశ్వాసమే ముఖ్య మందు రట్లు –గాన పూర్ణ విశ్వాసమున్ గడలు గొనగ –పల్కి నాడను నేనిట్లు పార్వ తీశ-నీలగిరి వాస కరుణా రసాలవాల "అని చెప్పుకొని చివరి సీసపద్యం లో చివరగా –భావా తీత మనో నివాస నగజా –భామా మణీహృద్విహా-రావారాశి గభీర ధీర ముని హృ-ద్రమ్యాబ్జవాసా నమో "అంటూ నీలాచల స్తుతి పూర్తి చేశాడు కవి కర్మశ్రీ.

"ఇది చక్రవరం వేంకట రామరాయ గురు కటాక్ష లబ్ధ కవితాదౌరేయ కాష్యపస గోత్ర పవిత్ర కపిల వంశాంబుదీ సుధాకర శ్రీ కామేశ్వర సూర్య నారాయణార్య ప్రియ మధ్యమ పుత్రశ్రీ కృష్ణ శర్మ నామ ధేయ ప్రణీతంబగు శ్రీ నీలాచలేశ్వర స్తవము సర్వము –ఓం తత్సత్ "అని పూర్తి చేశాడు. ఈ శతకం లోకం ప్రచారం లో ఉన్నట్లుగాలేదు. మంచి కవన వైభవానికి భక్తీ ఆర్తికి నిలయంగా పదహారేళ్ళ యువకవి రాసిన స్తుతికావ్యం. సమాదరణీయం.

## 20 శ్రీమదష్టోత్తర హనుమచ్చతకం -- శ్రీ పాటి బండ్ల వీరదాసు

శ్రీ పాటి బండ్ల వీరదాసు అనే భక్త శిఖామణి వ్రాసిన" శ్రీమదష్టోత్తర హనుమచ్చతకం"ను సత్తెనపల్లి లోని శ్రీ వీరయార్య వాఙ్మయ సమితి 1952లో రేపల్లె ప్రభాత్ ప్రింటర్స్ లో ముద్రించింది. దీనికి శ్రీ వీరయార్య వాఙ్మయసమితి కార్యదర్శి శ్రీ బోడేపూడి వెంకటరావు రాసిన "ఒక్కమాట" లో –వీరయార్యునిస్వగ్రామం దీపాల దిన్నెపాలెం లో వెలసిన శ్రీ హనుమతుని పై ఉన్న భక్తి తాత్పర్యాలకు నిదర్శనం గా ఈ శతకం రచించారు ద్వితీయముద్రణ 1998లో జరిగింది. శ్రీ దాసరి పరిపూర్ణయ్య నాయుడు గారు పూర్తి ఆర్ధికసాయం అందించారు. అలాగే వీరయార్యుని ఇతర కృతులూ ముద్రించాలని భావిస్తున్నాం "అని తెలియజేశారు.




వీరయార్యునిశతకంకం లో మొదటి పద్యం – "శ్రీ వసుధాత్మజ రాముల –సేవన్మెప్పించి తత్వ సిద్ధు డవౌ నీ- సేవకుడను గీర్తించెద-బ్రోవుము దీపాల దిన్నెపురవర హనుమా "

నాలుగవ పద్యం –"భవవార్ధి దాటవచ్చును – భువనాత్మక నీదు పాద పూజ నటంచున్ – దవిలి వచింతురు ప్రాజ్ఞులు-పవనజ దీపాల దిన్నె పాలెపు హనుమా "'ఛందస్సు తెలియకపోయినా స్వామి కృపతో సుందర కందాలు గూర్చగలిగే నేర్పు కలిగిందనీ – "శంకలు మాని ఛి బ్రోవుము –సంకటహర జాలమేల ?"అంటాడు. "వక్ష చరోత్తమ నీవతి-దక్షుడపై వనము బెరికిదర్ప మెలర్పన్ –యక్షుని జంపియు గరువపు –రాక్షసులగొట్టి నావు రణమున హనుమా "అని లంకలో వీరహనుమాన్ కృత్యాన్ని వీరోచితంగా పొగిడాడు కవి. "నీరాటం లో పట్టిన దాన్ని పోరాటం చేసి చంపి. దీరాటోపత రాముని ఆరాటం తీర్చావంటాడు. రోగాలు, రాగాలు వేగంగా పరిమార్చమన్నాడు. "హరి కమలాకర హంసా –వరతాపస నిచయ హృదయ వారిజ

హంసా –యరివర్గ భయద హంసా –పరమాత్మా నను గావు భక్తుడహనుమా “అని హంస శబ్దాన్ని సాభిప్రాయంగా ప్రయోగించి భక్త హంస అని పించాడు.

చండీ మొండీ దండీ గ్రహాలన్నీ హనుమపేరు చెబితే పరార్ అంటూ “అరయంగ సువర్చలయను –తరుణీ మణితోడ నిరుపమ సౌఖ్యము నొందెడు-కరుణాకరనాకు నీవె గతి యగు హనుమా “అని సువర్చలాన్జనేయం ను స్తుతించాడు. ”అంజని వరపుత్రుని భవ –భంజను దీపాల దిన్నెపాలెపు వాసున్ –రంజను గొల్చెద రయమున –మంజుల తరగాత్రు నిన్ను మది నిడిహనుమా “అని దీపాలదిన్నె హనుమకు కంద దీపాల దివ్వెల వెలుగు కురిపించాడు సత్కవి వీరయార్య. .పరధన,పరభామల హరించాలనుకొనే మనసును అతి రయంగా మార్చేవి స్వామి చరణాలు అంటాడు “తత్వ బోధ చేస్తూ –”కాయముధారుణిపాలగు –ప్రాయము బల్వేతలపాలగు పసిడియు గలుగన్ – దాయలపాలగు నెదలో –బాయని నీ సేవ తనదు పాలగు హనుమా “అని యదార్థం చెప్పాడు.

శ్రీ మదష్టోత్తర హనుమచ్ఛతకము

శ్రీవసుధాత్మజ రాముల
సేవన్మెప్పించి తత్వ సిద్ధుడవై నీ
సేవకుడను గీర్తించెద
బ్రోవుము దీపాలదిన్నె పురవర హనుమా. 1.

శరణార్థిని రక్షింపుము
కరుణాకర నేరమెన్న గాదిర వినుమా
దురితముల నెల్ల బాపుము
వరదా! దీపాలదిన్నె పాలెపు హనుమా. 2.

”శరణంటిననీవే నా-దొరవంటినిదునుము నాదుదురితము లంటిన్-పరమంటిని నీ సేవ యే-కరుణాకర బ్రోవమంటి గదరా హనుమా “అలాగే “హనుమంత వాయుతనయా –వనచర వరకీర్తి మంతవరగుణ నిలయా –దనుజాంతక దీనావన –యని నిను నమ్మి స్మరియించు వాడనయ్యా హనుమా “.తనశతకం చదివితే ఎలాంటి ఫలితం కలుగుతుందో చెబుతూ –”భూతలి నీశతకంబును –భూతంబులు నోకి దుఖమొందెడిజనముల్ –బ్రాతిగ బూజించిన నా –భూతములే దుఖమొందిపోవును హనుమా “

చివరలో తన వంశం గురించి చెప్పుకొన్నాడుకవి –"ధర బాపయ సుబ్బమలకు –వరపుత్రుడపాటి బండ్ల వంశోద్భవుడన్ –గరుణించు వీరయాఖ్యుడ-గరువలి సుత వేరు సేయగాదిక హనుమా ".తనగురువు పీరోజీ గురించి ఘనంగా –"పులహరి పీర్దేశికవరు –విలసత్కృప నొందినాడ వేడుకలలరన్ -లలితంబుగ జెప్పితి నిటు –వలదిక దప్పొప్పు లెన్నవాయుజ హనుమా "108వ పద్యం –"పుడమిని నీ శతంబును –గడు భక్తినిజదువ. వినిన గాంతురు వారల్ – కడు సంపదలును సిరులును –గడకును గైవల్యపదవి గలుగును హనుమా "అని ఫలశ్రుతి చెప్పి సాయుజ్యం కూడా లభిస్తుందని నొక్కి వక్కాణించాడు వీరయార్య హనుమ భక్తకవి. చక్కని ధారా, శబ్దసౌందర్యం. భావ పరిమళం. భక్తి గరిమ శ్రేష్ఠ కవనం తో శతకం ముగ్ధమనోహరంగా ఉంది. భక్తి శతకాలలో తప్పక చేరాల్సిన శతకం వీరయార్యుని "శ్రీ హనుమష్టోత్తర శతకం ".

## 21 మోదుకూరి చెన్న కేశవ శతకం -- శ్రీమాన్ రామానుజా చార్యులుకవి

గుంటూరు మండలం ఆలపాడు గ్రామ వాసి ధనకుధరవంశీకుడు శ్రీమాన్ రామానుజా చార్యులుకవి "మోదుకూరి చెన్నకేశవ శతకం "రచించగా,పెంటపాడు శ్రీ వైష్ణవ ముద్రాక్షరశాలలో 1925లో ముద్రింపబడింది. వెల అర్ధరూపాయ. కవిగారు శ్రీగోపాలశతకం. శ్రీ రామ చంద్ర శతకాలు కూడా అంతకు ముందే రాసిపేరు పొందారు. ఈ చెన్న కేశవ శతకం లో "శ్రీ మోదుకూరి చెన్న "అనేది మకుటం. చివరలో మాత్రమే తన గురించి కవి చెప్పుకొన్నాడు. ఔషధ వైద్యం సద్భూషణ వైశద్యం. జల. సూర్య చికిత్సావిధానం. జ్యోతిషార్ణవ మధనం., తాళ మృదంగ చతురిమ. సత్పఠనం,కవితా చతుష్క కళ,గణిత శాస్త్ర విజ్ఞానం. శ్రీ పాంచరాత్ర విశిష్ట గుణ సంపన్నత. ఇద్దరు పుత్రులు. ఒక కుమార్తె. ధన ధాన్య గృహ క్షేత్ర దాస దాసీ జనం ఉన్న వాడు కవి శ్రీరామానుజా చార్య. "గుంటూరు డిస్ట్రిక్టు నంటుతెనాలితాలూకాలో" సుక్షేత్రమైన మాగాణులతో ఆలపాడు గ్రామంలో శ్రీ వేణు గోపాలస్వామి ఉన్నాడు. ఆస్వామి కోవెలలో కవి అర్చకస్వామి. నాలుగు వర్ణాలతో సౌభాగ్య వృద్ధిగా ఉన్న ఊరు మోదుకూరు. ఈ స్వామి అర్చనలో కూడా కవి భాగ స్వామ్యముంది. ఈ స్వామిపైనే ఇప్పుడు ఈశతకం "హూణ శకం,వేదయుగ నవ సంఖ్య,సమరక్త నేత్ర వత్సరం. మార్గ శిర శుక్ల సప్తమి నాటికి శతకం పూర్తి చేశాడు. అంతకు పూర్వమే గోపాల. రామ చంద్ర శతక రచన చేశాడు. తండ్రి ప్రబంధ అచ్యుతాచార్య.

నరసమ తల్లి. భార్యపేరుకూడా నరసమ. సంతానం ముగ్గురు –ఇద్దరు కొడుకులు. ఒక్క కూతురు. ఇంతకంటే ఎక్కువగా యేమీచేప్పలేదు.


శ్రీ మోదుకూరి చెన్న కేశవ శతకము.
1925.

కవి అనేక ఛందో రీతులతో శతక శతపత్రాన్ని సుపరిమళ భరితం చేశాడు. ఆకవితా ప్రవాహం లో అలా కొట్టుకుపోతాం భక్తీ యుక్తీ సేర్పూ చాకచక్యం పద గుంభన,భావ విన్యాసం చూస్తే ప్రబంధకవుల సరసన నిలుస్తాడని పిస్తుంది. ఉదహరించాలంటే అన్ని పద్యాలూ ఉదాహరించాలి. దేన్నీ వదలి పెట్ట లేము. అంతటి ప్రతిభా విశేషాలున్న కవి శ్రేష్టుడు ఆచార్య వర్యుడైన కవి. ముఖ్యమైన కొన్ని వైవిధ్య భరిత పద్యాల చరణ మంజీర నాదం విందాం.

మొదటి సీస పద్యం లో –శ్రీ రమా వరసర్వ-శ్రితజనావన శర్వ –నుతపుణ్య జనగర్వహతసపర్వ –హరివంశ సత్పూర్వ హరత రణి కుల యుర్వ –రాది సఘన పూర్వ రాజపర్వ ---"ఈశ గోవింద పూర్వ ఈశ సర్వ –క్షోణి సంపన్న శ్రీ మోదుకూరి చెన్న ".తర్వాతపద్యం లో మనవాళముని మొదలైన వారి స్మరణ చేశాడు. ముక్త పద గ్రస్తం లో –సత్పుణ్య చారిత్ర సజ్జన నుతపాత్ర –సకల మోహన గాత్ర సర్వ మిత్ర –మిత్ర లోక పవిత్ర మిహిరకుల క్షేత్ర –మేదినీశ సు-పుత్ర మీననేత్ర "అంటూ సాగిస్తాడు. దశావతార వర్ణన –"మీనావతార దుర్దానవ సోమ ర-క్ష స్సుసంహార వర్చస్సుధీర "అని పరిగెత్తిస్తాడు. తర్వాత శుద్ధాంధ్రం లో దశరధ రామావతారం వర్ణించాడు –"పదియరదముల దొర,పజదొరముగ్గుర-తల్లుల మురువలర జెల్లు జివర - లలిత దమ్ముల లరనా –గలివరజుపేరమర –వల తెదగరమిరవు జెలువుడు దిర"అని మన బుర్రలకు పని కల్పిస్తాడు. ఆతర్వాత నిర్యోష్ట్య సీసం లో –"శంఖు గదావాసి శార్న్గ నాయక రుషి-లోకసన్నుతరాశి లోలదాసి –"అని లాగించి. సర్వ లఘు సీసం లో –"దనుజహర మురహర –ఘన సమత ను వరద –సురనుత మనుజపతి ధరధర హరి",సగర్భ చంకమాలా వృత్త ద్వయ సీసం లో –"పరమత మేఘువా-త రస పాప విదార –ణ ప్రభ సోమయానన శశి వర",సీస గర్భ చంపక మాల – "పరమత మేఘువాత రసపాపవిదారణసోమయానదా –శరపతి శీలఈశ హరి సంస్తుత ప్రాకృత నాశనారతా"

అలాగే సగర్భ మత్తేభం. సీస గర్భ మత్తేభం. సగర్భోత్పలమాలా,కంద వృత్త ద్వయం. సీస గర్భ కందం,స్వరూప కైంకర్య శుద్ధాంధ్ర సర్వత్రయ సీసం. నిత్య తత్సమ ద్రుత యతి సీసం. సర్వత్ర శకట రేఫప్రాస శుద్ధాంద్ర సీసంలలో చమక్కులు మెరిపించాడు. ,శుద్దాంధ్రస్వరయతి సీసం –"ఒడు వారలకొప్పు నొదుగు సంతోషంబు –నోర్పు రుసులకు బువి నోగిరంబు ".సర్వత్ర ప్రాసగర్భ కందం రాసి మురిపించాడు. గర్భ కందం-"నిజ మెదజేతుల మురి –బజలకు నందరికి మగడ వనగల మీమే –లు జదల బువిలో –నసమెస-గుజ వరమేబాసవాలు క్రొన్న ప్రోల మేల్".శుద్ధాంధ్ర నిర్యోష్ట్యసగర్భ ద్విపద ద్వ్యర్థి సీసం లో –"దణి కొలదణి యునై –తగి నేలలోను నని –సేయగా నౌనన జెల్ల", అని ప్రతిభ చూపాడు.


మోదుకూరి చెన్న కేశవ శతకము.

సంస్కృత తత్సమ సగర్భ ద్విపద -"శ్రీ రుక్మిణీ ధవ శ్రిత పారిజాత శ్రీ –రజత వాస శ్రీ రమ్య వేష. "శుద్ధాంద్రఅన్త్యప్రాసం –"చిలువల దణి సెజ్జ-చిని జగంబులు బొజ్జ –ససి చెదలు గడు హజ్జసావు రజ్జ "శుద్ధాంధ్ర అంత్యప్రాస సీసం –"అక్కునగద లక్కి. పక్కి గుఱ్ఱము నెక్కి –టక్కర సురల జెక్కి చొక్కమక్కి –లెక్కెదబోరక్కి చక్కని మెయి దక్కి –మక్కువ వలపెక్కి. యక్కరెక్కి "అని "కిక్కిస్తాడు". .సర్వ లఘు నిర్యోష్ట్యగర్భ కాదం,దానిచిత్రం కూడా గీసి చూపాడు. సచిత్రోష్ట్యావృత శుద్ధాంధ్ర సీసం కరిగించి పద్యం లో పోతపోశాడు. విషమ సీసమూ కూర్చాడు –"దేనుపురినివాస సుదీరసార సాక్షశ్రీ –వేణుకరధరాఖిల విష్ణు శబ్ద బోధ రా –మానుజ యభిదాన మమాత్మ రక్షణాంద్రపూ –ర్ణానిజ గురు నాథసురాధిపాష్ఠ మాతృకా ".

గర్భోత్తర మాలిక లో-"రంగడు రాయడౌరమణ రాణిని గూడి బువి ప్రియంబుగ-ధ్రుంగుడుగంగ నౌ దొలసిరూడి నడుంగులగుట్ర లేకను –గ్రుంకెదబూజలోకువను గోరిక జేసియు నిట్రనిక్క మ-గ్రుంగుడుబత్తులన్మోదల బ్రోచుయు నెంతయు వట్రిలందగన్".

చివరి పద్యం –"చింతిత సంతాన సంతత గోధన ని-రంతరాశ్రయ జన కంతు జనన –జంతుసంతాన నిజాంతరంగనిధాన –యంతక విజయఘున యంత మనన –యంతర సుభావన యంతఃపురావన –యంతి కాంతర సదన యంత రసన –యత ర్మఖాధీన. కుంతి సుత స్వాధీన –కుంతలాళి సమాన జంత్ర నటన –తంత్ర కామల వర కనకాంత తలిన –మంత్ర మంత్రార్ధ సద్భవన తాంత్రిక జన –తాంతి హర లోకపాలన. నితాంత కరుణ –క్షోణి సంపన్నశ్రీ మోదుకూరి చెన్న "

అర్థాల కోసం వెంపర లాడకుండా హాయిగా మందార మకరందం లాంటి పద్యాలు పాడుకొంటూ కేశవ స్మరణతో జన్మ ధన్యం చేసుకోవచ్చు. అమృత రసప్రవాహ మాధురీ విలసిత పద్య రచన మనల్ని ఎక్కడికో తీసుకు వెడుతుంది ఎక్కడికి ఏమిటి ?చెన్నకేశవ సాన్నిధ్యానికే తీసుకు వెడుతుంది. చెన్న అంటే అందమైన అని అర్ధం. పద్యాలూ అంత చెన్నం గా ఉన్నాయి. ఈ శతకమూ ఎక్కడా ఎవరూ ప్రస్తావించినట్లు లేదు. ఈ దువ్వూరి చెన్నకేశవ శతకాన్నీ. కవి శ్రీ రామానుజాచార్యను పరిచయం చేసే మహద్భాగ్యం నాకు కలిగి నందుకు ఆనందంగా సంతృప్తి గా ఉంది. ఇలాంటి వాటిని వెతికి నాకు పంపి పరిచయం చేయిస్తున్న మా అబ్బాయి శర్మకు అభినందనలు. ఇప్పటి దాకా వీకీ పీడియాలో చోటు చేసుకోని ఇలాంటి వాటిని చేర్చి అందరికి అందుబాటు లోకి తెస్తున్నాడు.

## 22 శ్రీ కురుమూర్తి నాథ శతకం -- శ్రీ చిలుకూరి నారాయణ రాయ కవి

శ్రీ కురుమూర్తి నాథ శతకం ను అమరచింత ఆత్మకూరు సంస్థానాదీశ్వరులుశ్రీ సవాయ్ రాజా రామ బహద్దర్ ప్రేరణ చే అమ్మాపూర వాస్తవ్యులు శ్రీ చిలుకూరి నారాయణ రాయ కవి రచించగా, శ్రీ వోతాప్రగడ బ్రహ్మానందం పంతులు గారిచే రాజమహేంద్రవరంలోని సుజన రంజని ముద్రాక్షరశాల లో 1924లో ముద్రించబడింది. వెల కేవలం పావలా. ఇది నీళా. భూదేవీ సహిత శ్రీ కురుమూర్తి నాథుడు అంటే శ్రీకూర్మం లోని కూర్మనాథ స్వామిపై రాసిన శతకం. "శ్రీ కూర్మ మూర్తి నాథ సుర వంద్యా పాహిపాహి ప్రభో "అనేది మకుటం.



శ్రీ

కూర్మమూర్తినాథశతకము.

1924.

రెండవ పద్యం –"తోలి సోమకు డెల్లవేదములదా దుర్బుద్ధియై మ్రుచ్చిలన్ –బలియై యాతని వెంబడింప నతడు వారాసిలో డాగె నా-ఖలునింద్రుంచి మత్స్య రూపమున వీకన్వేదముల్గాచు నిం-దలతున్ శ్రీ కూర్మ మూర్తి నాథ సురవంద్యా పాహిపాహి ప్రభో "అని దశావతారాలలో మొదటి అవతారం స్తుతించి "క్షీరాబ్ధి మధనం లో వచ్చిన గాకోలపున్ ఘోర జ్వాలలు జుచి యడరి వదలన్ గూర్మంబపై యెత్తినా వౌరా "అని రెండవ అవతారం ఆది కూర్మాన్ని వర్ణించారు. ఇలా దశావతార వర్ణన చేశాక బంగారం దొంగలించటం.బ్రహ్మ హత్య సురాపానం గోహత్య వర్ణాచార విసర్జనం గురు నిందా పాపాలన్నీ కూర్మప్రభువుపై భక్తివలన తొలగిపోతాయనీ భరోసా ఇచ్చారు. గజేంద్రుని కాపాడిన తీరు అజామిళుని ఆదరించిన వైనం వివరించారు. "అణుపై ఉండి,బ్రహ్మాండమంతా నిండిన వాడు. సకల లోక రక్షకుడు. కలికాలం లో ధర్మం తగ్గి పాపం పెరిగింది కనుక హరి నామ స్మరణమే రక్షణ అన్నారు.

"కాకుల్మున్గును. నేను మున్గుదును. కొంగల్సేయు ధ్యానంబు మి-ధ్యాకల్పంబుగ "అని దొంగ స్నానాలు జపాలు మేలు చేయవు. "నీవున్నేనును ఒక్కటే యనగ యత్నింతు ర్విమూఢాత్ములా-హా వాలాయముబుట్టి జచ్చు జనులయ్యా "సోహ"మన్మాటయేలా –వాసింగను. నీ పదాబ్జమ్ముల మ్రోల న్మ్రొక్కుచుం గాంతుభద్రావాప్తి "అని స్వామి చరణమే శరణం అన్నారు. బాలకృష్ణ లీలలూ వర్ణించారు. స్వామి గుహలో ఎందుకు దాగాడో తెలిసిందట. మత్తేభం లో సరిగమలతో చిరస్మరణీయ పద్య రాజం చెప్పారు కవి –"

"సరిగా నీపని సాగనీ. గరిప,దా. సాగారి సద్ధామ. మా –గరిమన్ సామ నిదానిగా. సమపధం గా సాని నీ సారి. మా

దరిగానీ. మరి దారి. సన్నిగమపా. దాసాగమాపా. సదా – దర మొప్పంగురు మూర్తి నాద సురవంద్యా పాహిపాహి ప్రభో "

కురవ గ్రామం లో కుమ్మరికి సాక్షాత్కరించి కురుమూర్తి అనే పేరు సార్ధకం చేసుకొన్నాడట స్వామి. ఛందో వ్యాకరణాలపై పట్టు లేకపోయినా స్వామి అనుగ్రహం పూర్తిగా ఉండటబట్టి ఈ శతకం రాయగలిగానని అత్యంత వినయంగా 108వ చివరి పద్యం లో చెప్పి నారాయనరాయ కవి శతకం ముగించారు. సర్వ శాస్త్ర పాండిత్యం, ఛందో వైవిధ్యం. లోకరీతి, భక్తి స్వభావం, శరణాగత తత్త్వం అన్నీ పుష్కలం గా ఉన్న శతకం ఇది. చదివి ఆనందం అనుభవించ వచ్చు.


శ్రీ

శ్రీ కురుమూర్తి నాథ శతకము.

శతకం జనం లో ప్రచారమైనదో లేదోకాని "సరిగమ "పద్యం మాత్రం బాగా వ్యాప్తి చెందింది.

శ్రీ కూర్మ దేవాలయ విశేషాలు

శ్రీకూర్మం పూర్వపు కళింగ రాజ్యమునందలి వరాహక్షేత్రములోని పాతాళసిద్ధేశ్వర క్షేత్రమే. ఇచటకల స్వయంవ్యక్త లింగమూర్తి బౌద్ధ మత ప్రభావం ఈప్రాతంలోలేని సమయంలో కళింగ దేశాధీశుడుఇన విజయసిద్ధి ప్రతిష్టించాడు.ఈ లింగమూర్తి వలయాకారపు పానవట్టముపై ఎత్తుగా ఉండి, దర్సన మాత్రమున లింగాకృతి కన్నులకు కట్టి యుండును.

శ్రీకూర్మం, అరసవల్లి, సిమ్హాచలం మొదలగునవి ప్రధమంలో శైవమతమునకు పుట్టినిల్లు. అయినప్పటికీ ఈనాడు వైష్ణవక్షేత్రాలుగా ఉన్నవి.శ్రీకూర్మాలయం, సింహాచలాలలో గల శిలాశాసనాలను బట్టి ఆకాలమున నరహరి తీర్ధులచే వైష్ణవమతము కళింగమున వ్యాపించెనని తెలుస్తున్నది. ఈతని కాలమునాటి శిలాశాసనములు శ్రీకూర్మంలోనూ, సింహాచలం లోనూ చాలా ఉన్నవి.

దీనిని క్రీ.శ. 12వ శతాబ్దంలో వైష్ణవ మతాచార్యుడు శ్రీ రామానుజాచార్యులు తీర్ధయాత్ర సందర్భంగా కళింగదేశం వచ్చాడని, శైవలలో మత సంబంధమైన చర్చలు జరిపి శైవులను అవలీలగా వాగ్వివాదంలో జయించి వైష్ణవాలయంగా మార్చి శ్రీకూర్మనాధుడని నవీన నామకరణం చేసినట్లు సంస్కృతంలోగల ప్రన్నామృతం వలన తెలుస్తున్నది. నాటినుండి పాతాళసిద్ధేశ్వర ప్రశంస మాసిపోయి శ్రీకూర్మనాధ ప్రశస్తి ప్రబలింది. విష్ణుమూర్తిని కూర్మావతార రూపాన ఇచట పూజించటం వలన ఈదేవాలయాన్ని శ్రీకూర్మనాధాలయమనీ ఆగ్రామాన్ని

శ్రీకూర్మమని పిలుస్తున్నారు.ఈ దేవాలయం చుట్టూగల స్తంభాల మంటపాలలో నల్లరాతితో చెక్కిన రమణీయమైన శిల్పాలు కలవు. దేవకోష్టమునందు త్రివిక్రమ, పరశురామ, బలరామ, సరస్వతి, కుబేర, మహిషాసురమర్దిని, ఇంకనూ అనేక శంఖచక్రధారియైన విష్ణుమూర్తి విగ్రహాలు కలవు. ఈ దేవాలయమునందు రెండు ధ్వజ స్తంభాలు కలవు. విమానం చోళ రాజుల వాస్తు శిల్పకళారీతులలో నిర్మించారు. చక్కగా కుదురుటచే కాబోలు కుదురుకు కూర్మము చిలుకునకు సింహాచలము అను లోకోక్తి వచ్చినది. శ్రీకూర్మ పురాణం శైవసంప్రదాయసారమై ఉన్నది. దీనిని రాజలింగకవి మండచిట్టి కామశాస్త్రి ఆంధ్రీకరించారు. ఈ క్షేత్ర మహాత్మ్యాన్ని దత్తాత్రేయులవారు వ్యాసమునీంద్రులకు వివరించారనీ, అందు స్థల పురాణం వలన స్వయంగా శ్రీహరిదత్తాత్రేయులకు శ్రీకూర్మనాథ మహాత్మ్యాన్ని గూర్చి స్వప్నంలో చెప్పినట్లు చెబుతారు.

ఇచ్చటి శిలాశాసనముల వలన నాల్గవ శతాబ్దం నుండి పదునాల్గవ శతాబ్దం వరకు పాలించిన తూర్పు గాంగరాజుల చరిత్ర పూర్తిగా తెలుస్తున్నది. క్రీ.శ. 1273లో పాలించిన తూర్పుచాళుక్య రాజైన రాజ రాజ నరేంద్రుడు తన ఆస్థానకవి అయిన నన్నయ్య భటారికుని సంస్కృతంలో కల భారతాన్ని తెనుగదించవలసినదిగా కోరినట్లు తెలిపే ఒక శాసనం కలదు. ఆనాటి సాంఘిక, రాజకీయ, పరిస్థితులను వివరించే అనేక శాసనములు కూడా ఇక్కడ కలవు.

తిరునాళ్ళు, ఉత్సవాలతో ఆస్తికులు ఆచరించే జీవిన విధానమే స్మార్తము. దీనిలో ఏ మతం వారైనా పాలు పంచుకొనే అవకాశం ఉంది. కాకతీయుల కాలంలో విరివిగా 'స్మార్తము' ఆచరించే కాలంలో, బౌద్ధ క్షేత్రంగా వెలుగొంది, అనంతర కాలంలో వైష్ణవ మత ప్రదేశంగా మారినట్లు చరిత్ర చెబుతోంది. శ్రీకూర్మం తో పాటు సర్పవరం, బాపట్ల కూడా ఇదే రీతిన బౌద్ధ మత కేంద్రాల నుంచి వైష్ణవ మత స్థలాలుగా మారాయి..

## 23 వీరభద్రేశ్వర శతకం-- శ్రీ మంకు శ్రీను

పగోజి కొప్పర్రు పద్య శతకకవి. కడిమెళ్ళ వారి పుష్కల ఆశీస్సులున్న మధురకవి. పండితుడు. సరసభారతికి ఆప్తుడు. మిత్రుడు శ్రీ మంకు శ్రీను తాజాగా “రాసిన వీర భద్ర శతకాన్నే నేను “తేట గీతి వీరభద్ర శతకం” అన్నాను అంతే. శివ కుటుంబం లోని వారిపై ఇప్పటికే రామలింగేశ్వర శతకం. రాజరాజేశ్వరిత్రిశతి వినాయక. మయూరశతకాలు రాసేసి ఇప్పుడీ శతకం రాశారు. వీరభద్రోత్పత్తి. దక్షయయజ్ఞ ధ్వంసం.. పార్వతీ కల్యాణం. కిరాతార్జునీయం శివభక్తుల చరిత్రల తో అల్లిన శతకం కనుక నేను పెట్టిన పేరు అతుకుతుంది.

వీరభద్రుని రౌద్ర భీభత్స భయానక హింసరచన ధ్వంస రచన ఇందులో బాగానే వర్ణించాడు కవి. "వీర భద్ర భీభత్స సంహార శీలి –వగు భవన్మహత్వము కొనియాడ దలచి –సంతరించితి నీ పైని శతకమొకటి "అని వినయంగా చెప్పుకొన్నాడు. శతక మకుటం "విశ్వ కళ్యాణ నిర్నిద్ర వీరభద్ర ".ఉమా దేవి "హిమగిరి వాసు. సుందరాంగు –అహి విభూషణాది మధ్యంత రహితు –అభవు చిన్మయు నవ్యక్తుడైన శివుని "చూసింది. అతనికి "గాలి మేతరులెహారాలు". మంచి మాట. "సిరిని కాదని శివుని మైసిరిని. ఆయన విభూతినే "కోరింది.ఆమె "కాల కంధర సతి. సుగుణాలవల్లి.

"మరుని విరితూపులకు విరామమ్ము లేదు-హరుని చిలిపి చైదములకు నడ్డు లేదు –ఉమ సరాగ సంపత్తికి నుపమ లేదు "అలా సాగింది వ్యవహారం. నిం డుజాబిల్లి నేస్తం పండు వెన్నెల బంధువు. ప్రణయ సంస్పర్శ వారికి బంధమయింది. ఉమా కల్యాణం అయింది. అల్లుడు అంటే మామ దక్షుడికి చులకన. అందుకే "అజ్ఞుడౌ దక్షునకు శివుడు అల్లుడయ్యాడు" అన్నాడు కవి. యజ్ఞ స్వామిశివుని పిలవకుండా మామ యజ్ఞం ప్రారంభించాడు. "తావిలేని పూవు. శశిలేని రాత్రి లా ఆ యాగం ఉందట. కూతురికీ ఆహ్వానం లేదు. కానీ ఆగలేక పిలవని పేరంటానికి విభుడు వద్దన్నా వెళ్లి అవమానం పాలై "దక్ష పుత్రి సతీ దేవి తనువు వీడింది ".వార్త తెలిసిన" ఉగ్రుడుగ్రుడై తాండవం"చేశాడు. ప్రతీకారం తీర్చుకోవాలనుకొన్నాడు –

"అది ప్రళయ కాల భీభత్సమది. మహోగ్ర –నృత్య కేళీవిలాస వేణీకలాప –మదిప్రియ సతీ వియోగ ధర్మాగ్రహంబు "గా భయం పుట్టిస్తోంది. కరుణ శ్రీ తన విజయశ్రీ కావ్యం లో "అది యొక వీర భారత కులాంగన కంటి కవోష్ణ బాష్పబిం –దువులు ధరిత్రిపై గురియు దుర్భర దుస్సహ దుర్దినమ్ముల-య్యవి పది మందిలో ఒక మహా సతి పైట చెరంగు పట్టి ధ –ర్మువు దిగద్రావి రక్కసి ప్రభుత్వము లాగిన దుర్ముహూర్తముల్ "అనే పద్యం ఎందుకో నాకకు ఈ సందర్భంగా స్ఫురించింది. అది పాంచాలీ సతి పరాభవం. చివరికి కౌరవ హననానికి దారి తీస్తే. ఇక్కడ శివుని సతి పొందిన అవమానం దక్ష వినాశనానికి దారి తీసింది.

లయకాలుడుశివ జటాజూటం నుంచి దక్షాధ్వర హంస రచనకు వీరభద్రుడు ఉద్భవించాడు. నీలదేహం వెయ్యి చేతులు,కపాలమాల దుర్నిరీక్షణంగా భీకరాకృతి తో భార్య భద్రకాళి తో కాలభైరవాదులతో శివాజ్ఞతో బయల్దేరిరాగా దిక్పతులు దిక్కులేక తలవంచారు. దక్షుని తలతెంచేశాడు. విధ్వంస రచన పూర్తి చేయగా -

"గళములో సర్పమాడంగ "కదిలి శివుడు వచ్చి"సతిని ఎత్తుకొని జగాలు సంచలింప "తాండవం చేసే ముక్కంటిని చూడటానికి ముక్కోటి దేవతలకు తరం కాలేదు. చక్రి వచ్చి చక్రం తోఆమే దేహాన్ని ఖండించగా అవి పడిన చోట్ల శక్తి క్షేత్రాలేర్పడ్డాయి. తనకు అప్పగించిన పని""పట్టిస" ఆయుధం తో పూర్తీ చేసి వైరి కంఠ విలుంఠ నం చేశాడు. తరువాత సతీదేవి పార్వతీ దేవిగా పుట్టటం శివుడి తపస్సు కు సాయం చేయటానికి తండ్రి హిమవంతుడు ఆమెను నియోగించటం. భావజును పూవు టమ్ములు భవునిపై ప్రయోగించగా మూడోకంటికి భస్మమవటం. పార్వతి శివుని భర్తగా పొందటానికి తీవ్ర శివ తపస్సు చేయటం "ఆకులైనా తినకుండా అపర్ణ గా ఉండటం. శివ

పరీక్షకు ఆమె నిలబడటం శివ పార్వతీ కల్యాణం జరగటం. వారిద్దరి శృంగారం కుమారస్వామి జననం. అతడి తారకాసుర సంహారం మొదలైన విషయాలన్నీ రాసి,శాంభరీ భిల్ల, అర్జున పోరాటం పాశుపతాస్త్రం పశుపతి పార్థునికివ్వటం. శివ భక్తులైన చిరుతొండనంబి, భక్త శిరియాళ తిరువెంగానాంచి మొదలైన కథలు వర్ణించి శివుని హాలాహల భక్షణం. శ్రీకాళహస్తి మహాత్మ్యం. మార్కండేయుని కావటం మొదలైనవన్నీ పద్య తోరణంగా చెప్పారు కవి. తర్వాత నేటి సామాజిక సమస్యలు ఏకరువుపెట్టారు.
దొంగ రాముడు సినిమాలో "వీరభద్రయ్య "ను అంటూ మీసాలు మెలేసే రేలంగి దొంగలు పడ్డాక మీసాలు దించి "వట్టి బద్రయ్య "నే అనటం గుర్తుండే ఉంటుంది. ఆంధ్ర దేశం లో పోలవరం దగ్గర పట్టిస గ్రామం లో దక్ష సంహారం చేసిన వీరభద్రస్వామి అక్కడి గోదావరి నీటిలో తన ఆయుధం పట్టిసను కడిగి రక్తపు మరకలు కడిగేశాడనే ఐతిహ్యం.. అందుకే ఆగ్రామం పట్టిస ఆ సీమ పట్టి సీమ అయి ఇవాళ కృష్ణా డెల్టాకు ఎత్తిపోతల ద్వారాతాగు సాగు నీరు లభిస్తున్నాయి. లేకపోతె కృష్ణా జిల్లా ఎడారి అయ్యేది. ఇదికూడా రాస్తే భేషుగ్గా ఉండేది అక్కడే గోదావరి మధ్యలో చిన్న కొండపై శ్రీ భద్రకాళీ సమేత వీరభద్రస్వామి ఆలయం ఉందనీ కవి గారు మర్చిపోయినట్లున్నారు. ఆస్వామి తిరునాళ్ళు కూడా మహోత్స వంగా జరుపుతారు. ఇవి రాయకపోవటం లోపం అనను, అనలేనుకానీ పరిపూర్ణం కాదని చెప్పగలను. అందుకే దీన్ని వీరభద్రేశ్వర శతకం అన్నాను

## 24 శ్రీ గురు నాథేశ్వర శతకం -- శ్రీ దోమా వెంకటస్వామి గుప్త

శ్రీ గురు నాథేశ్వర శతకం ను శ్రీమదాంధ్ర విద్యా వాచస్పతి. సాహిత్య సరస్వతి. శతావధాని శ్రీ దోమా వెంకటస్వామి గుప్త గారు రచించారు. దీన్ని గుంటూరు వాసి శ్రీ ఉప్పుటూరి వెంకట పున్నయ్య గారి ప్రోత్సాహంతో 1925లో గుంటూరు లో ముద్రించారు .




కీర్తి శేషులు శ్రీ ఉప్పుటూరి గురు నాదము గారి చే గుంటూరు తిలక్ పేటలో స్థాపింపబడిన "శ్రీ గురునాదేశ్వర స్వామిపై రాసిన శతకం అని కవి పేర్కొన్నారు. తన విజ్ఞాపన లో కవి గుప్తాగారు "గుంటూరులోని ఉప్పుటూరి వెంకట పున్నయ్యగారు విఖ్యాత వైశ్యులు. బ్రాహ్మణ, వైశ్యులకు అన్నసత్రాలు కట్టించిన వారు. కన్యకాంబ నిత్య నైవేద్యానికి కొరత లేకుండా చేసినవారు. ఎన్నో చోట్ల చలువ పందిళ్ళు నిర్మించారు. మంగళగిరి పానకాల నరసింహ స్వామి. నెల్లూరు శ్రీ రంగనాధ దేవాలయాలకు గోపుర. కలశాదులు ఏర్పాటు చేశారు. తాడికొండ క్రాస్ రోడ్ లో తటాకం నిర్మించారు. .ఎన్నో బ్రాహ్మణ వైశ్య బాలురకు ఉపనయనాలు చేయించారు. శివాలయ నిర్మాణం లింగ ప్రతిష్ట సంకల్పించారు . వారు కాలధర్మం చెందారు. ఆలయ నిర్మాణ బాధ్యత అన్నకుమారుడు శ్రీ ఉప్పుటూరి పున్నయ్యగారికి అప్పగించారు. .తానుకూడా కొంత ద్రవ్యం ఖర్చు చేసి శ్రీ గురు నాదేశ్వరాలయ నిర్మాణం పూర్తీ చేశారు. ఈ శతకం రాయటానికి ప్రోత్సాహం పున్నయ్యగారే "అని శతావధాని శ్రీ దోమా వెంకటస్వామి గుప్త గారు తెలియ జేశారు.

శ్రీ దోమా వెంకటస్వామి గుప్తాగారు నేను విజయవాడ లో ఎస్ ఆర్ ఆర్ సివిఆర్ కాలేజిలో ఇంటర్ చదువుతున్నప్పుడు తెలుగు ట్యూటర్ గా పని చేశారు. పొట్టిగా. లావుగా పంచ కట్టు హాఫ్ హాండ్ చొక్కా ఉత్తరీయం తో. ముఖాన కాణీకాసంత కుంకుమతో. ఒక చేతి సంచీ, దాని నిండా పంచాంగాల తో క్లాసుకు వచ్చే వారు. చాలా నెమ్మదిగా మాట్లాడే వారు ఎవరూ వినేవారు కాదు. పట్టించుకొనే వారుకాదు. తనూ తన పంచాంగాలు లేదా ఏదో రాసుకోవటమే కాని పాఠం చెప్పిన దాఖలా నాకు కనిపించలేదు. ఆయన గురించి గొప్పగా చెప్పుకోవటమేకాని.ఆయనను విద్యార్ధులెవ్వరూ పట్టించుకొన్న పాపాన పోలేదు. మా క్లాసులకూ వచ్చేవారు. అక్కడా అదే తీరు. దీనికి తోడు కాళ్ళకు కాఖీ రంగురబ్బరు బూట్లు వేసేవారు. నడక చూస్తే చవితినాడు ఉండ్రాళ్ళు బొజ్జనిండా తిన్న గణపతి నడిచినంత నెమ్మది నడక. ఆయన్ను చూస్తే హాస్యమే వచ్చేదికాని గౌరవం కలిగేదికాడు. అది విద్యార్ధులుగా మేము వారిని అర్ధం చేసుకోలేక పోయిన తుంటరితనమే అని ఇప్పుడని పిస్తోంది అప్పుడు అందరితోనూ నేనూ నవ్వినవాడినే . అప్పుడు కాలేజీ లో తెలుగు శాఖలో పని చేసిన శ్రీ విశ్వనాధ సత్యనారాయణ. శ్రీ మాధవ రామ శర్మ,అందరూ “ముర్గిగుంట “అని పిలిచే శ్రీ తంగిరాల సుబ్బారావు (ముర్గిగుంట అనే పేరు ఎందుకొచ్చిందో మాకు తెలీదు ),శ్రీ పొట్లపల్లి సీతారామారావు.శ్రీ శూలిపాలశ్రీరామ మూర్తి, శ్రీ పేరాల భరత శర్మ, శ్రీ అందవోలు సత్యనారాయణ. శ్రీ అక్కిపెద్ది సత్యనారాయణ గార్లు అందరూ గుప్తాగారినిఎంతో మర్యాదగా పలకరించేవారు. అలాంటి మా మాస్టారు రాసిన శతకం ఇది. విశేషాలు తెలుసుకొందాం.


శ్రీ

గురునాథేశ్వరశతకము

దోమా వెంకటస్వామిగుప్త గారిచే

1925.

ప్రార్ధన శ్లోకం గా “శ్రీమద్గర్తపురస్థపూర్ణ జనతానందాతిసంపత్ప్రదదు- జ్ఞానాబోనిది పారగాశ్రిత హృడబ్జాతార్క బింబోదయం

సూర్యేంద్రాగ్ని విలోచనం.పశుపతిం. కామ్యార్ధ సంసిద్ధయే –వందేహం శుభదం శివంచ గురునాధేశం జగద్వల్లభం “అని గొప్ప శ్లోకం చెప్పారు. ఆతర్వాత అదే సంస్కృత ధోరణిలో మొత్తం ఇరవై శ్లోకాలు బహు సునాయాసంగా చెప్పి. ఉప్పుటూరి వారినీ కీర్తించారు. ఆతర్వాత తెలుగు శతకం ప్రారంభించారు.

సశేషం

మీ -గబ్బిట దుర్గాప్రసాద్ -22-6-21-ఉయ్యూరు

శ్రీ గురు నాథేశ్వర శతకం -2(చివరిభాగం )

గర్త పురి అనే గుంటూరులో వెలసిన శ్రీ గురునాదేశ్వరస్వామిని అర్చించి మృకండ సూతి మృత్యువును జయించాడు. భస్మాసురిని కోరిక తీర్చాడు స్వామి. యోగి హృదయ నివాసి. నమ్మినవారికి కష్టాలు రావు. ఆయన "జగతీ బంధుడు హీళీ కన్నోకటియై. చంద్రుండు వేరొక్క క –న్నుగబోల్వారి. హుతాశానుండు ను నొక కన్నుంగా జెలగంగ లో –క గురుత్వంబును గన్న నీవన.నరోగత్వోరుధీ సత్ప్రభా-వాది గుణంబుల్ దయ సేసినట్టి వాడు ".ఆయన ులాయాసుర హారిణీపుడు..మొక్కగానే దనం యశం. సౌఖ్యం ఇచ్చే వేలుపు. కామారి అయినా "మేనసగంబు భార్యకు ఇచ్చినవాడు.

"జ్వాలాజ్వాల జటాలమై యటు జగజ్జాలంబు గాల్వంగ-నా –క్ష్వేళం బెంతో విజ్రుం భిలన్ "సురపతులు వచ్చి కావుమని ప్రార్ధిస్తే "కడు వేవే నుంచి నావయ్య సల్లీలం గొంతున నీల కంఠ"అని స్తుతించారు గుప్తా గారు . నత్కీరుని కాచిన పరమ దయాశాలి శూలి. ."నీవే హరి నీవే బ్రహ్మ. మాద్యత్సకలాబ్జ జాండములు నీవే 'అంటారు కవి. "వందేర్ధేందు కళాపరి ష్కృుత జతాభారాయ భావాయ. వా-తాన్ధఃపాలక కంకణాయ భవతే ధర్మాస్థిరాయేతి"అనే శోకం లో సగ భాగాన్ని శార్దూలపద్యం లో ప్రారంభించి మంచి ముగింపు ఇచ్చారు.

తర్వాత గుడి కట్టించిన ఉప్పుటూరి పున్నయ్య గారి గురించి వారి వంశాన్ని గురించి వారు చేసిన దాత్మిక కార్యక్రమాల గురించి కమ్మని పద్యాలలో వివరించారు కవి . ఫలశ్రుతి కూడా చెప్పారు. చివరగా "ఇది శ్రీతుంగ భద్రాతీరవిరాజమాన కందనవోల్మందిర శ్రీ రామ చంద్ర పరమాత్మ పాదార విందమరందపా నెందిందిరాయమానస దోమ గోవిందాఖ్యార్య వైశ్య శ్రేష్ఠ జ్యేష్టాత్మజాంధ్ర విద్యా వాచస్పతి సాహిత్య సరస్వతి. శాతావదానీ దోమా వెంకట స్వామి గుప్త ప్రణీత గురు నాథశతకం"అని మా మాస్టారు గుప్తా గారు శతకాన్ని ముగించారు. శతకం లో 125పద్యాలను వివిధ ఛందస్సులలో రాశారు. .పద్యం పరిగెత్తటమే కానీ ఎక్కడా కుంటి నడక లేదు. శాతావదానికదా. ఆశువు లో దిట్టతనం బాగానే ఉండి ఉంటుంది. లోకరీతిని కాచి వడబోసిన

అనుభవం పద్యాలలో ప్రవహించింది. వారి శివభక్తికి తార్కాణగా నిలిచింది ఈ శతకం.. 'కందంలో అందంగా రాసిన 124 వపద్యం –"శ్రీ గర్తపురి నిలయా –భోగి వలయ. కువలయహిత పుష్పా. విజయా

భోగ శ్రీకర సదయా –త్మా,గిరిజాంబా సనాధ,హర గురు నాధా"

మా మాస్టారు గుప్తా గారి గురించి నిన్న రాసిన దానికి అనుబంధంగా మరికొన్ని మాటలు. ఆయన హాఫ్ స్లీవ్ కోటు వేసేవారు. తెల్లగోడుగు ఎప్పుడూ చేతిలో ఉండేది. నడక మహా నిమ్మది.ఆయన గొప్ప పంచాంగ కర్తగా లోకం లో సుప్రసిద్ధులు. గుప్తా గారి పంచాంగం అంటే హాట్ కేకుల్లా ఆకాలం లో అమ్ముడు పోయేవి అంటే వారి పంచాంగ గణనం యెంత నిర్దుష్టం గా ఉండేదో తెలుస్తుంది. 65 సంవత్సరాలక్రితం మాకు విద్యాబోధన చేసిన మాస్టారు గుప్తా గారి శతకాన్ని పరిచయం చేయటం నా అదృష్టంగా భావిస్తున్నాను.

మీ -గబ్బిటదుర్గాప్రసాద్ -23-6-21-ఉయ్యూరు

## 25 అమ్మనబ్రోలు చెన్నకేశవ శతకం -- శ్రీ నాగినేని వెంకట కవి

అమ్మన బ్రోలు చెన్న కేశవ శతకాన్ని శ్రీ నాగినేని వెంకట కవి గారు 1914 మార్చి 10న రచించి 1914లో దుగ్గిరాలలోని ప్రబోదినీ ముద్రాక్షర శాలలో వ.నిరంజన శాస్త్రి గారి చే ముద్రింపబడింది. వెల కేవలం పావలా. "అమ్మనబ్రోల్పురి చెన్నకేశవా "అనేది శతకం మకుటం. కవి అమ్మనబ్రోలు వాస్తవ్యుడు. కమ్మవారు. ప్రకాశం జిల్లా ఒంగోలుకు 13కిలో మీటర్ల దూరం లో అమ్మనబ్రోలు ఉంది. అక్కడ ఉన్న చేన్నకేశవస్వామిని ప్రసన్న చెన్నకేశవస్వామి అంటారు



అమ్మనబ్రోలు శ్రీ చెన్నకేశ

నాగినేని వేంకటకవి గారిచే

రచియింపబడి

1914.

శతకాన్ని శార్దూల వృత్తం లో చెన్నకేశవ స్తుతితో కవి ప్రారంభించాడు-

"శ్రీ రమణీశ యోగిజన చిత్త సరోరుహ మత్త భ్రుంగ సా-కార సురేంద్ర వంద్య పద. కౌస్తుభవక్ష సుదీరకోటి మం

దార సువర్ణ చేల మురదానవ సంహార గోపికా మనో –హార సునీల వర్ణధర నమ్మనబ్రోల్పురి చెన్నకేశవా "

తర్వాత ద్విప్రాసానుప్రాస. అంత్యప్రాస ద్విపాది. ఏక యతిత్రిపాది పద్యాలు రాసి ముక్తపదగ్రస్తం లో -"అబ్జాధరాధరాధిపమురాంతక శాత్రవభీమ. భీమమో

హాబ్జ విలాస లాస కమలాసన సేవిత దేవ దేవ ర-క్షాబ్జసుధామ ధామకనకాంబర వారణరాజతాజ పా-లాబ్జ హితాజితాజిధర"---- తనకవితా విన్యాసాన్ని చూపాడు. తర్వాత తన చదువు సందె విషయాలు చెప్పుకొన్నాడు. 11వ ఏట బడిలోచేరి గురు సన్నిధిలో విద్య నేర్చి ధర్మమే లేని ఊరిలో తనను ఉంచినందుకు దేవుడితో మొరపెట్టుకొన్నాడు. చదువులేకపోతే రెండుకాళ్ళ పశువే అని గ్రహించి. పాపాలు చేయకుండా సర్వమత సామరస్యం నీతి విద్యా శుచి సత్యవచనం దైవభక్తి ఉన్నవాడే బ్రాహ్మణుడు అని తెలుసుకొన్నాడు. కులమత భేదాలు తంత్రాలు నచ్చలేదు. "వర్షబిందువులు కారుచు నన్నియు నొక్కరూపమై ఘన నదులై జనంబులకు కల్పమహీజాల్లాగా" ఉన్నట్లుగా మనుషులలో ఐకమత్యం ముఖ్యం అన్నాడు. పెళ్లి చేశారు. దరిద్రం. ఎటూ పాలుపోలేదు. ధనమే అన్నిటికి మూలం అని గ్రహించాడు. మాంసం తోలుతో ఉన్న "అంగజు మందిరం "పై వ్యామోహంతోం అన్నీ మర్చిపోతారుజనం. వేశ్యావృత్తిని నిరసించాడు. వేశ్యకు ఒళ్ళు అమ్ముకొని అమ్మనూ సోదరులను మేపటమే సరిపోతుంది.


నాగినేని వేంకటప్పయ్య.

"చదువులురాని నోరు. శృతి చక్కగ లేని సితారు. సద్గుణీ సుదతులు లేని గీము. వర శూరులు మెచ్చని సాము. నాటలో పదములురాని పాట,వర్తకులు లేనిపేట "నిష్ప్రయోజనం అన్నాడు. స్త్రీలకూ విద్య అవసరం అన్నాడు. పాటలేనినాటకం. పాకం దప్పిన భోజనం. సయ్యాటలు లేనిపొందు,ప్రియమాజ్యము జూపని విందు. కొలువులో మాటలురాని తేట,మతిమంతులు మెచ్చనిమాట వలన సుఖం "ఇల్లై" అంటాడుకవి. ధర్మం మాటలలోకాక ఆచరణలో ఉండాలి. ఆశకు మితిఉండాలి. మేఘాలు. సూర్య చంద్రులులాగా పరోపకారం చేయాలి మానవుడు. బలాత్కార వివాహం కూడదు అంటాడు. పరస్పర అంగీకారంతో వధూవరులు పెళ్లి చేసుకోవాలి. పరుషవాక్యాలుపలక పోవటం. పర స్త్రీ వ్యామోహం లేకపోవటం. పరధనం ఆశించకపోవటం,పండితుల్ని గౌర వించటం బుద్ధిశాలికి ఉండాల్సిన ముఖ్య లక్షణాలు.

కపట సన్యాసి లక్షణాలు. మురికిలక్షణం. కూడా వివరించి. ప్రపంచోత్పత్తి క్రమం వర్ణించాడు. ఆతర్వాత దశావతారాలు వర్ణించాడు -"వటువు నటంచు వేషమున వామన రూపముదాల్చి నేల మూడడుగులు చాలు నిమ్మని 'యాచన చేసి. ఒసంగ అడుగులుపెంచి. జగమంతయు జాలక విశ్వరూపమైన వామనావతారం వర్ణించాడు సహజంగా. దేవుడు ఎక్కడో లేడు "దేవమయంబు నీ జగము. దేవునిలోపల నుండు లీనమై. భావము లేచువేళప్రపంచము నేర్పడు "అని జగత్తుకు జగన్నాధునికి ఉన్న అనుబంధం వివరించాడు.కాలప్రభావం, మాయచెప్పాడు. ప్రళయం అంటే –"శ్రీకరమైన నీ పుడమి జెప్పక నీరము నందు పోవు. నా ప్రాటమైననీరుగన పావక కీలలయందు నింకు. బల్ తేకువ తోడ పావకుని తీక్షణ మంతనడంచు వాయువాకాశామునందు లీనమవటం "అని కళ్ళకు కట్టినట్లు వర్ణించాడు కవి అనుభవసారంగా. వేదాంత పరంగా.

కందగీతి గర్భ చంపకమాల లో –"ఘనఘన సుందరా. నిపుణకంతునిదు-గన్న ప్రవీణ సార దు-ర్జనహార ణాధిపాపరమ. శాంత శిఖామణి భక్త రక్షపా

వనముని సన్నుతా వరద. వారణపాలన వారిజాక్ష –రాయని యననే సదాసిరుల నమ్మనబ్రోల్పురి చెన్నకేశవా "

చివరగా గద్యం లో "ఇది శ్రీహరి చరణారవిందమకరంద బిందాస్వాదనేందిందిరా యమాన మానసుండు,కమ్మ వంశజుండును. క్రిష్ణయ్యతనూ భవుండు ను. నవనాట కాలంకార విరచిత యశో దురంధరుండు నగు నాగినేని వెంకట కవీంద్ర ప్రణీతంబైన అమ్మనబ్రోలు చెన్న కేశవ శతకము సంపూర్ణము.

చక్కని ధారాశుద్ధి. బహు చందోరీతి. చెన్నకేశవునిపై భక్తి శతకమంతా ప్రవ హించింది. ఏ విమర్శకుని దృష్టి కీ,చరిత్రకారుని దృష్టికీ  నాగినేనికవి పడకపోవటం విడ్డూరమే. ఈకవి గురించి రాసే అదృష్టం నాకు కలిగింది.

## 26 ఉగ్రనరసింహ శతకం -- శ్రీ భాస్కరుని వీర రాఘవరావు

మార్కాపురం తాలూకా ఉమ్మడి వర ఉగ్ర నరసింహ స్వామి పై ఉగ్రనరసింహ శతకం. దండకం. పంచ రత్నాలు,సీసమాలికా సభక్తికంగా శ్రీ భాస్కరుని వీర రాఘవరావు గారు రచించి నెల్లూరు ప్రభాత ముద్రణాలయం లో ముద్రించి ప్రచురించారు. వెల –కేవలం పావలా. ముద్రణ జరిగిన సంవత్సరం లేదు.

కందా శతకం ఇది –"శ్రీ రమణీ ధవ వామన -సారస దళ నేత్ర చక్రి సర్వేశహరీ –మారజనక మందరధర –క్షీరాబ్ధి విహార బ్రోవు శ్రీ నరసింహా "అని చెప్పి ఆయనమీద శతకం రాస్తున్నాననీ త్వరగా అయెట్లు చూడమని కోరాడుకవి. తనకుకవితా లక్షణాలు తెలియవనీ ఎదో ఉబలాటం కొద్దీ రాస్తున్నాననీ చెప్పాడు. తర్వాత దశావతారాలు అందంగా రాశాడు –"బాలకుని బ్రోచు కొరకై –వాలిని స్తంభంబు వెడలి ఉగ్రత దనుజున్ –లీల దునిమి ప్రహ్లాదుని –ఏలిన దొరవీవు గావె ఈశ

నృసింహా "అని ప్రస్తుత అవతారం గురించి రాసి –"సాక్షిగను నిలిచి జనులను –పక్షం బొక ప్రక్కలేక బహువిధములతో –రక్షించు బుద్ధరూపము –పక్షి గమన నీవు గావే పరమ నృసింహా "అని బుద్ధావతారం వర్ణించి కలికాలం లో జనుల ఇక్కట్లు బాపటానికి ఎత్తిన కల్కి అవతార విశేషం చెప్పాడు. ఆతర్వాత కపిల దత్తాత్రేయ అవతాలు వర్ణించాడు . "ఆకాశ వాయు తేజ భూమి జల బహు యోషధులు. అన్నం. ప్రాణం నువ్వే కదా స్వామీ అన్నాడు

64విద్యలు. 25తత్వాలు, "యాబదారు వర్ణాలు"26చందాలు నువ్వే అంటాడు దుష్కర ప్రాస తో – "ప్రాడ్భాయిరక్కసులగమి-కడ్భీతుల తుల జేసి దేవ గణములు యెల్లన్-పడ్బాధలు వారించెడి-షడ్భావ వికార దూర స్వామి నరసింహా "లో తన సత్తా చూపాడు. తర్వాత షట్ చక్రాలు వాటి వివరణ. అందులో ఉండే అక్షర సముదాయం. దేవతలవివరాలు వివరించాడు –"ఇరువదియొకవెయియార్నూ-ర్దిరుగును దినమునకు హంస దీవ్రము గాగన్ –పరమాత్మ నీకు హంసను – స్థిరముగ నర్పింప ముక్తి జెందునృసింహా "యోగ భోగ త్యాగ యాగాలు అన్నీ "రాగారహితా నీ మాయయే "అంటాడు. .ప్రణవ స్వరూపమైటివి –అణువైతివి,నాద బిందు వైతివి –"జననమరణాలు లేకఇన నోమాగ్నుల వయ్యావు అన్నాడు.


శ్రీ

ఉగ్ర నరసింహ శతకము

దండకము, పంచరత్నములు,

భాస్కరుని వీరరాఘవ రావుచే

విష్ణులోకం లో జయవిజయులు సనక సనందనాదులను స్వామి దర్శనానికి అనుమతించకపోవటం రాక్షస జన్మ లెత్తటం పేర్కొన్నాడు. "హరి ఎవ్వడు యేటనుండును – హరియింతును వాని నిన్ను "అని కొడుకు ప్రహ్లాదుని గర్జించిన తండ్రికి "సరగున స్తంభము వెల్వడి –బొరిగొని రక్కసుని. బాలు బ్రోచి నృసింహా "అని ప్రహ్లాదవరదుని కీర్తించాడు.

వేదాలుశాస్త్రాలు నృసిహుని తమపై ఉండమనికోరితే ఒప్పుకొని. వేద రాశి. శాస్త్రానీకం శైల రూపం ధరిస్తే. ఉమ్మడిగా అక్కడ వెలిశాడు నరసిహుడు –"ఉమ్మడిగా వరమిచ్చుట –ఉమ్మడి వర శైలమనగ నొప్పెను నామం-బిమ్మహి వేదము. శాస్త్రము –సమ్మతితో గూడె శైల సరణి "అని ఉమ్మడి వర మై ఆ కొండపై

ఉగ్రనరసింహుడు ఉద్భవించాడు. దేవాలయం. ప్రాకారాలు వెనువెంటనే ఏర్పడ్డాయి. రాజేంద్ర చోలుడుపిశాచి బాధ పడి,తీర్ధ యాత్రలు చేస్తూ ఇక్కడికి వస్తే అతడిని ఆదుకొన్నాడు స్వామి కళ్ళు పోయిన బ్రాహ్మణుడికి నేత్రాలు తెప్పించాడు. "సిరిధవ కేశవ నిను మది –మరువక సంస్మరణం సేయు మానవ తతికిన్ "వరాలిచ్చి మరణాలు మాన్పమని కవి కోరాడు.

శాలివాహన శకం ప్రజాపతి నామ సంవత్సరం లో వైశాఖ శుద్ధ చతురుర్దశి నాడు స్వామి ఆవిర్భావం రోజే శతకం పూర్తి చేసి అంకిత మిచ్చానని కవి చెప్పుకొన్నాడు. శతకం పేరు ఉగ్రనరసింహ శతకం. కానీ ఆఉగ్రత ఎక్కడా దర్శనమివ్వదు. శాంత నరసింహుడే కనిపిస్తాడు కవిత్వం లో. తర్వాత నరసింహ దండకం కూడా కూర్చాడు కవి. ఆతర్వాత నరసింహ పంచరత్నమాలిక వేశాడు. మచ్చుకి మొదటిపద్యం

"సీ-శ్రీధర భవహర చిన్మయ నలినాక్ష –కరుణాకర మహాత్మ –గరుడగమన

పురుషోత్తమావ్యయ శరణాగత త్రాణ –బిరుదాంకితాచ్యుత నిరుపమాన

చక్రదారణహరి శక్రాదిపూజిత –నీల మేఘ శరీర నిగమ వంద్య

కాంచన చేల శ్రీకర చతుర్భుజ శౌరి –కౌస్తుభ వక్ష శ్రీ కంఠ మిత్ర

ఉరు గుణ విశేష యుమ్మడి గిరి నివాస –వజ్ర నఖ తీక్ష్ణదంష్ట్ర ధీవర ముకుంద

పరమ పురుష పరాత్పర శరధి శయన –శ్రీ రమాధవ నను గావు శ్రీ నృసింహ "

చివరగా సీస మాలిక అల్లి –మార్కాపురం లో ఉమ్మిడివరం లో సాబాదు వారి వంశం లో ముగ్గురు మూర్తుల దయతో లక్ష్మీ నరసింహుడు పుట్టి. రామావధూతను గురునిగా పొంది. ఆసేతు హిమనగపర్యంతం పర్యటించి. చివరికి స్వగ్రామం ఉమ్మిడివరం చేరి ఉగ్రనరసింహుని అనుగ్రహంతో ప్రాకారగోపురాలుకట్టించి. నిత్యపూజా నిత్య సంతర్పణ ఏర్పాటు చేసి. చోళపురం లో శిష్యులనుచూడటానికి వెళ్లి. లంబికాయోగం లో చైత్ర బహుళ పంచమి నాడు తన హృదయపు వెలుగును విశ్వ వెలుగులోకలిపేశాడు. పద్యాలు శరవేగంతో పరిగెత్తి కందంలో అందగించాయి. పెద్దగా వర్ణన, స్వామి కధాకమామీషు లేదు వేదాంతం గుమ్మరించాడు. ఈ శతకం గురిచి,

ఈకవి శ్రీ భాస్కరుని వీరరాఘువ రావు గురించి లోకం లో ఎక్కడా ప్రచారం కనిపించలేదు. నాకు శతకం, ఆకవి, ఆక్షేత్రం గూర్చి పరిచయం చేసే అదృష్టం కలిగింది.

## 27 శ్రీ రేచర్లపురి శ్రీ రామ శతకం -- శ్రీ కంటా అప్పలదాసు

వాగ్గేయ కారులుయడ్ల రామ దాసుగారి శిష్యుడు కంటా అప్పలదాసు గారు శ్రీ రేచర్లపురి శ్రీ రామ శతకం రాసి గురువుగారితో పరిష్కరింప జేసుకొని. కాకినాడ శ్రీ సావిత్రీ ముద్రాక్షర శాలలో 1913లో ప్రచురించారు వెల. బేడ అంటే రెండు అణాలు.

పీఠిక లో కవిగారు "విజయనగర వాసి శ్రీ కంటాఆశిరయ, యల్లమాంబ దంపతులకు రెండవ కుమారుడు. 14వ ఏట కాకినాడ రేచర్లపేట లో నివసిస్తుండగా కేవలపరబ్రహ్మ. శివనారాయణ ద్వయ జ్యోతి స్వరూపులు. శ్రీ యడ్ల రామదాసు సద్గురువుల కటాక్షం తో సాంఖ్య,తారక. అమనస్క,పరిపూర్ణ రాజయోగాదులు నేర్చారు. 20వ ఏట "సుజ్ఞాన బోధిని "రచింఛి ముద్రించారు. గురువులు సంతోషించి "నీఉన్న స్వగ్రామం లో శ్రీరామమందిరం ఏర్పాటు చేసి. శ్రీరామ శతకంగా నూట ఎనిమిదిసీసపద్యాలురాసిఆ రామునికే అంకితమిచ్చి ధన్యుడవు కమ్ము "అని ఆశీర్వదించగా. వెంటనే శక్తికొలదీ రామమందిరం రేచర్లలో నిర్మించి శ్రీరామ శతకం రాసి. గురువుగారికిచూపి పరిష్కరింప జేసి ముద్రించారు. ముందుగా గురువుగారిపై రేగుప్తిరాగం ఆటతాలం లో ఒక తత్త్వం"నమస్తే శ్రీయడ్ల రామార్యా –శ్రీమత్పరబ్రహ్మ మిము స్మరామి గురురాయా –విమలమగు తత్పదములను హృత్కమలమధ్యమునందు జేర్చి,ఏమరక భజియించి మ్రొక్కెద ---" రాసి సంర్పించారు. –

"శ్రీ రఘువర పుత్రశృంగార గుణ గాత్ర త్రైలోక్యపావనధన్యచరిత –పార్వతి పతి మిత్ర పండిత గణ స్తోత్ర శ్రీ లక్ష్మి నాయకా శ్రిత పవిత్ర ---ధరను శ్రీ కంటా అప్పలదాస పోష –శరణు శ్రీరామ రేచర్లపురనివాసా "అని సీసాలు మొదలెట్టి. "యతిగణ ప్రాసలు. తర్కం తెలీదు నీ నామ సంకీర్తనే తప్ప సాధన యుక్తి తెలీదు కనుక నువ్వే అన్నిటికి ఆధారంగా నా శతకాన్ని పూర్తి చేయించాలని ఆపద మొక్కులు మొక్కాడు కవి. రాజాధి రాజైనా తీర్ధయాత్రలు చేసినా సకల విద్యాసారం తెలిసినా. సద్గురుని చేరకపోతే ఫలించదు అన్నాడు. రామ దాస

సద్గురువుల అనుగ్రహం తో "మమతలుడిగి నిశ్చలమతి "అయ్యాడు. "నారాయణా నీదు నామ స్మరణ మహిమ భవభయంబులెల్ల బారదోలు "అని నమ్మాడు. తర్వాత మాయ ను వర్ణించాడు. నిజసంపదలు భూమిమీద నిలవవు. కాయము నీటి బుగ్గ అని తెలుసుకోకపోతే యమ పాశం లో పడాల్సిందే అన్నాడు. హరినామ స్మరణ చేస్తే అరిషడ్వర్గాలు నాశానమౌతాయి అని భారోసా గా పల్కాడు. శబరి, కరిరాజులను కాపాడావు అనీ. రా అంటే పాపాలుపోతాయనీ. మా అంటే కవాటాలు మూసుకుపోతాయని రామశబ్ద మహాత్మ్యం చెప్పాడు."గోవింద సర్వేశ గోపాల మాధవా నా ఎదుట నిలువవే నల్లనయ్యా "అని ఆర్తిగా కోరాడు. పిపీలికాది బ్రహ్మ పర్యంతం నీ మహిమలే అని సత్యం చెప్పాడు. తల్లీ తండ్రీ గురువు నువ్వే రామయ్యా అన్నాడు. "శ్రీలక్ష్మి నా తల్లి శిరులిచ్చి బ్రోచును. శ్రీరాముడే తండ్రి చేబట్టి రక్షించును "అన్నాడు. అద్దం గుడ్డివాడికి అగపడనట్లు.  చెవిటి వానిముందు శంఖం ఊదినట్లు. కోతికి జలతారు కుళాయి ఇచ్చినట్లు చేన చెనటికి వేదం చెప్పినట్లు  పణ్యస్త్రీలకు పతిభక్తి బోధించినట్లు. విటులకు శీలం ఉందన్నట్లు,మందమతికి నీ మహా మంత్రం ఉపదేశించి నట్లు వ్యర్ధమే అన్నాడు.

"మదిలోన నీ యొక్క మహిమలు వర్ణించి స్మరియింప నారడుడను గాను. తండ్రితోపోట్లాడే ప్రహ్లాదుడను కాను. కనుక నీ పాదపద్మాలే నాకు శరణు అని విన్నవించుకొన్నాడు. అమరేంద్ర సుతునికి ఆత్మ తత్త్వం తెల్పి. పవన సుతుని అతిప్రేమగా చూపినట్లు. రావణానుజుడిని రాజు చేసినట్లు. పాంచాలి మానభంగం కాచినట్లు. గోపికలకు కూర్మి కలిగించినట్లు తనకు ప్రత్యక్షమవమని ప్రాధేయపడ్డాడు. నిరతం నిన్ను వర్ణించటం నా వంతు నిజంగా రక్షించటం నీ వంతు అని రామయ్యపైనే భారం మోపాడు గడుసుకవి. షణ్మతాలకు ఒక్కడే స్వామి. శృంగారాలకు సువర్ణం ఒక్కటే. తనువులకు జీవం ఒక్కటే. రంగుపశువులకు పాలు తెల్లవే. ఎక్కడచూసినా పరబ్రహ్మం ఒక్కడే.

ఆతర్వాత దశావతార వర్ణన చేసి. ఆవతార విశేషాలు సీసాలలో కరిగించి మెరుగుపెట్టాడు . చివరగా ఫలశ్రుతి చెబుతూ "ఈశతకమెల్ల సాంతము గాను చదివి,వినిన యట్టిసజ్జనులకు "పాపాలు తొలగి పరమపదమబ్బి. ఆయురారోగ్యాలు వర్ధిల్లు తాయని భరోసా ఇచ్చాడు కాటం కవి. శతకాన్ని 20-12-1912లో పూర్తిచేశాడు కవి.

ఈ శతకానికి శతాబ్ద చరిత్ర ఉంది. ఎవ్వరి కనుల్లోనూ పడలేక పోవటం వింత. చక్కని దారాశుద్ధి తీవ్రమైన భక్తీ ఆర్తి శ్రద్ధ విశ్వాసం ఉన్న శతకం ఇది. హాయిగా చదూకొని పారాయణ చేయ తగ్గది.దీన్ని పరిచయం చేసే అదృష్టం నాకు దక్కింది.

## 28 మాల్యాద్రి నృసింహ శతకం -- శ్రీ ముత్తరాజు నృసింహరావు



శ్రీరస్తు.

శ్రీమాల్యాద్రినృసింహశతకము.

ఇది.

శ్రీనృసింహభక్తాగ్రేసరుండగు

ముత్తరాజునృసింహరావుగారిచే

సర్వజిత్తుసం॥ పుష్యశుద్ధ తదియ స్థిరవాసరంబున

(1887 సం॥ డిసంబరు.)

రచియింపఁబడి

ఆ. సరస్వతి. నృసింహాచార్యనామధేయపండితవర్యు

నిచే లేఖకప్రమాదాదిదోషంబులునివర్తింపఁబడి

శ్రీరంగనాయకీవిలాసముద్రాక్షరశాలయందు

గ్రంథకర్తచే

ప్రకటింపఁబడియె.

నెల్లూరు.

1889 సం॥ నవంబరు 5 తేది.

---

శ్రీమాల్యాద్రి, నెల్లూరుజిల్లా కందుకూరు తాలూకా చుండి జమీందారిలోనుండునొక పర్వతము. ఇది నృసింహక్షేత్రము.

మాల్యాద్రి నృసింహ శతకాన్ని నరసింహ భక్తాగ్రేసరుడు శ్రీ ముత్తరాజు నృసింహరావు గారు సర్వజిత్ నామ సంవత్సర పుష్య శుద్ధ తదియ స్థిరవాసరం అంటే 1887 డిసెంబర్ లో రచించి,నృసింహా చార్య పండితుని చే పరిష్కరింప జేయించి. నెల్లూరు శ్రీ రంగనాయక లీలా ముద్రాక్షర శాల యందు 1889నవంబర్ 5న ముద్రించారు. మాల్యాద్రి నెల్లూరు జిల్లా కందుకూరు తాలూకా చుండి జమీందారీ లో ఒక పర్వతం. గొప్ప నృసింహ క్షేత్రం.

కవి గారు శతకాన్ని కందపద్యాలతో దేవతా స్తుతితో ప్రారంభించారు మొదటగా నృసింహ స్తుతిగా –”శ్రీ రామామణి సేవిత –స్మేరాంచిత భక్త కుముద సితకర విహితా –శ్రీ రాజిత శైల శ్రీ నృసింహ “చెప్పి. తర్వాత –”మురహర పురహర ధాతల –నిరవొందగ బ్రస్తుతించి ఎరగెదమదినీ –వరరూపములై చెలగుట –స్థిర తరముగా మాల్యశశైల శ్రీ నృసింహ “ఆతర్వాత శారద వినాయకులను స్తుతించి –

“శతకముగా గాను కందము –లతి పైఖరి తోడ జెప్పి యార్యులు మెచ్చన్ –గృతి నిచ్చెద వందనములు-క్షితి గైకొను-- “శతక మకుటం “మాల్యశైల శ్రీ నృసింహ “

ఆతర్వాత ప్రహ్లాద జనన దశకం రాస్తూ –”అన్నిటదానై వెలిగెడు –సన్నుత చరితుండవుకా –వెసద్భక్తులకైమిన్నగు రూపము దాల్చుట –చిన్నలెకదా—”

పిమ్మట నృసింహ ఉద్భవ దశకం చెప్పాడు –"ధవళ ధరాధర దీర్ఘ దు –రవలోక న దివ్య దేహ యాశాష్టగజా-శ్రవణవిభేదన గర్జన –శివసన్నుత మాల్య శైల --  అని నృసిమ్హావిర్భావం వర్ణించి. ఆతర్వాత శత్రు సంహార దశకం లో –"శాత్రవుని బట్టి బల్-సూత్రమునవధించి తౌర చూపరులు దగన్ –ధాత్రిని సంతోషింపగ జిత్రముగ –""అరి కసిపుని దునిమి భక్తుని –నరి సుతు ప్రహ్లాదు జూచి యఖిల సుఖంబు –ల్గరుణ యగుపడ గ నీయవే –సిరినాయక –"

శ్రీలక్ష్మీనృసింహాగురుపరబ్రహ్మణేనమః.

శ్రీమాల్యాద్రినృసింహాశతకం.

క॥ శ్రీరామామణిసేవిత । స్మేరాంచితభక్తకుము
దసితకరవిహితా । మారాకారవికాసిత । శ్రీరాజిత
మాల్య శైల్య శ్రీనరసింహా॥ (౧)

క॥ నిత్యాత్మీయసుఖప్రద। సత్యాత్మకవేదవేద్యస
న్మునిహృద్యా । సత్వగుణాశ్రయమాయా । స్థిత్యుద
యామాల్య శైలశ్రీనరసింహా॥ (౨)

క॥ మురహరపురహరధాతల । నిరవొందగఁబ్ర
స్తుతించిమెలఁగెదమదినీ । వరరూపములై చెలగుట। స్థి
రతరముగమాల్య శైల॥ (౩)

క॥ శారదవీణాగానవి । శారదమదిఁదలఁచి మ్రొ
క్కి శాంభవి శ్రీలక్ । చేరిమదిఁదలఁచిమ్రొక్కెద । శ్రీ
రంజిల॥ (౪)

ఆతర్వాత దశకం లో గ్రహోచ్చటన వర్ణించాడు కవి –"వేదం విచారులు కర్మా-మోదప్రచారులు-నీడయకే పాత్రులు అని వేదాన్తరహస్యం విప్పారు. నృసింహ అష్టాక్షరి మంత్రం జపిస్తే తీరని కోరిక ఉండదన్నారు. తర్వాత మహిమాను వర్ణన దశకం. లీలావతార వర్ణక దశకం చెప్పాడు –"నీలీలలు నీ చర్యలు –నీ లీలా జనకర్మ నిపుణత"ఎన్నాతానికి   ఆశక్తుడనన్నాడు  . ఇందులో దశావతార లీలలు వర్నిన్చాడుకవి. .ఆపిమ్మట అర్ఘ్యపాద్యాది పూజా వర్ణన పది పద్యాల్లో చెప్పి. ధూప దీప నైవేద్య దశకం చెప్పి. దూషణ భూషణ తిరస్కార దశకం చెప్పి. చివర్లో గడుసుగా "స్తుతి చేయ నేరని –నా స్థితి నంతయు జెప్పి నాడ జిత్తము నీవె-గతినైనను బ్రోవగ వలె"అన్నాడు.

గ్రంథాంత శాంతి రత్న మాలిక లోకూడా పద్య దశకం చెప్పి –"మంగళము శ్రీ నృసింహ్  -మంగళము సుభక్త పోషక మంజుల వేషా –మంగళము కావ్య రమకున్ –శృంగార కరుణ రస –మాల్య వర శైల నరశ్రీ –నరసిమహార్పణ మంచు మతినిచ్చి –కర మష్టోత్తర శతకము –సిరివర గొనుమా "అని ఆస్వికే అంకితమిచ్చి ధన్యుడయ్యాడు కవి శ్రీ ముత్తరాజు నృసింహారావు.

ఈశాతకమూ ఈకవీ కూడా లోకానికి పట్టినట్లు లేదు. ఈ శతకాన్నీ ఆనృసింహ భ్కకవినీ పరిచయం చేసే భాగ్యం నాకు కలిగిందని సంతోషిస్తున్నాను

మాల్యాద్రి అంటే కొండలహారం అని అర్ధం. మాలకొండ అని కూడా పిలుస్తారు. ప్రకాశం జిల్లా వలేటి వారి పాలెం లో ఈ మాల్యాద్రి ఉంది. స్వామి లక్ష్మీ నృసింహస్వామి. దీనికి పడమర అహోబిల నరసింహ దేవాలయం. ఉత్తరాన శ్రీ శైలం. దక్షిణాన వృక్షాచల క్షేత్రం. తూర్పున సింగరాయకొండ నరసింహ దేవాలయం ఉన్నాయి. మాల్యాద్రికి దక్షిణాన పినాకిని అంటేపెన్నా నది. ఉత్తరాన కృష్ణానది ప్రవహిస్తున్నాయి. మాల్యద్రిలోని భక్తులు తమ సంతానానికి మగవారైతే నరసింహ నామం. ఆడవారైతే మహాలక్ష్మీ పేరు ఎక్కువగా పెట్టుకొంటారు.

మాల్యాద్రి నృసింహ స్వామికి ఒక చేత సుదర్శన చక్రం మరో చేతిలో శంకు ఉంటాయి. అమ్మవారు శ్రీ మహా లక్ష్మి ఆయన అంకం మీద కూర్చుని దర్శనమిస్తుంది. స్వామి ఒక చేయి ఆమె బుజం పైనా. మరొక చేయి వరద హస్తం గా ఉంటాయి. స్వామివారు యక్ష కిన్నర సిద్ధ. దేవమునిగణాలకు ఆదివారం నుంచి శుక్రవారం వరకు ఆరు రోజులు దర్శన భాగ్యం కలిగిస్తారు. మానవులకు మాత్రం శనివారమే దర్శన భాగ్యం కలిగిస్తారు. మాల్యాద్రి దేవత మహా లక్ష్మీ దేవి మాల్యాద్రి పర్వత శిఖరం పైన కొలుపై ఉంటుంది. మహాలక్ష్మీ సమేత మాల్యాద్రి నృసింహస్వామి భక్త వరదుడు. పిలిస్తే పలుకుతాడనే విశ్వాసం భక్తులలో ఉన్నది

29 త్ర్యంబకేశ్వర శతకం శ్రీ కేసనపల్లి లక్ష్మణ కవి

శ్రీ కేసనపల్లి లక్ష్మణ కవి త్ర్యంబ కేశ్వర శతకాన్ని రచించి. 1936లో నరసరావు పేట కోటీశ్వర ముద్రాక్షర శాలలో ముద్రించారు. వెల-బేడ అంటే రెండు అణాలు. "కవిగారు గుంటూరుజిల్లా నరసరావు పేట కేసనపల్లి వాస్తవ్యుడు. ఆర్వేలనియోగి బ్రాహ్మణుడు. శ్రీవత్స గోత్రీకుడు. శ్రీ ఆంజనేయ వర ప్రసాది. సుబోధక యమక. అనుప్రాసలతో దీన్ని రాశాడు "అని నరసరావు పేటకు చెందిన పౌరాణిక శిరోమణి శ్రీ నందిగల సుబ్బా రెడ్డి ఈశతకానికి ముందుమాటలలో తెలియజేశారు. ఇది పెసరవాయి పురస్థిత త్ర్యంబ కేశ్వర స్వామిపై చెప్పిన శతకం. "పెసరవాయి పురస్థిత త్ర్యంబ కేశ్వరా"అనేది శతక మకుటం.



"శ్రీకర భక్తమానస వశీకర. సద్గుణ రత్నపుంజ. నీ-రాకర దుర్మదాసుర నిరాకర భీకర పాపవాయు ద

ర్వీకర వారిజోదర. విరించి. ముఖామర వందిత ప్రభావా –కరుణాకరా 'పెసరవాయి పురస్థిత త్ర్యంబ కేశ్వరా".అని ఎత్తుకోటం లోనేస్వామి మహిమను కీర్తించాడుకవి. పాక మృదుత్వం తో లలితభావ సమగ్రత తో కూర్చే నేర్పున్న వాడి నని చెప్పుకొన్నాడు. శాస్త్రాలు చదివి రంగుహం గు లతో రాస్తే అందులో "పే భంగుల నీదు వర్ణనలు "లేకపోతె దానిలో "దాన భిష్వంగము భంగమౌతుంది "అన్నాడు. "నుతిపాత్రమైన నీ సుచరిత్ర మొయ్యనన్ వాకొనకుంటే"కీర్తి హెచ్చదు అన్నాడు. "రుద్ర, దయాసముద్ర బహురూప వికార విదూర సార నిర్నిద్ర నిరంతరస్మరణ రీత్యనుమోదితరామభద్ర. యచ్ఛిద్ర యశోదిముద్ర "అంటూ రుద్రముద్రలు వేశాడు.

"సార విచార ఘోర తర సంగర శూర యుదార నిర్మలాకారుడని స్తుతించాడు. "శైల సుతా కళత్ర రవిచంద్ర హుతాశన నేత్ర పాప జంబాల సరోజమిత్ర "అని త్రకార ధ్వని మోగించాడు. "ఈ రసమూని నిన్ను. జగదీశ్వరు సర్వ ఫలప్రదాయకున్ –నీరసుడు " అనే వాళ్ళు కు బుద్ధి చెప్పటానికి దక్షయజ్ఞ ధ్వంసం జ్ఞాపకం చేశాడు. ."పంకజ నాభు డీవగును,బంకజ నాభుడ వౌదు నీవిటన్"అని శివ కేశవాద్వైతం చెప్పాడు."నీసగమేన పార్వతిని దాల్చి "లోకానికి అద్వైతమిథునం ఎలా ఉండాలో మార్గ దర్శివయ్యావు.



పీఠిక.

29-9-1936.

తనకు ఎడతెగని శివ భక్తి ప్రసాదించమని –"నీరము గ్రోలు నప్పుడును. నిల్చిన యప్డు., భుజించు నప్డు సం –చారము సేయునప్పుడు. ప్రసంగ ముననం దిగినప్డు. శయ్యకుం జేరినప్డు "నీమీదే చిత్తం ఉండేట్లు అనుగ్రహించమని వేడుకొన్నాడు. "మారహరా హరా త్రిపుర మర్దన శూరధరా. గిరీశ గౌ-రీ రమణా యటంచు "అంటూనే బూతుల బుంగను అయ్యానని. అన్నీ వోయి నువ్వే శరణు అంటున్నానని. ఆర్తిగా వేడాడు. .నీకెన నీవ యాట ఎరిగిననన్ను వదిలిపెట్టకు అని ప్రాధేయపడ్డాడు. "నీ నిస్తుల విశ్వ విభుత్వ లక్షణాన్ని నంది అపార్ధం చేసుకొని కొంతకాలం దూరమయ్యాడు.కానీ బహుకాల తపస్సుతో వ్యాసుడు "నీ మూల మెరింగి దాసుడయ్యాడు"అని పూర్వగాథాలహరి వివరించాడు.

"ఏ నరుడెద్ది యిమ్మనిన నిచ్చుట "అనేది వాడిలో నీకు నచ్చినదేదో ఉండటం వలననే కదా. అందుకే భోళా శంకరుదడివయ్యావు అంటాడు. "శంకర శంకరా నను. వశంకరు నేలుట "కు ఇంత ఆలస్యమా ?"వంకర వంకరాశ్రితుని వ్రాలుట. బాణ దైత్య రాట్కింకర కింకరా"ఒకటికి పది అడుగుతాడు వీడు అని నాపై అలుసా అన్నాడు.

107వ పద్యం లో తనగురించి చెప్పుకొన్నాడు కవి –"కేసనపల్లి వాసుడను. గేసనపల్లి కులుండ లక్ష్మణా-ఖ్యా సహితుండ. దావక పదార్చన తత్పర మానసుండ నే

జేసిన దోసముల్ వొలియ జేసి కరమ్ము వరమ్ము లీయరా –వాసవ వందితా పెసరవాయి పురస్థిత త్ర్యంబ కేశ్వరా"

"మంగళ మద్రిజా రమణ మంగళ మండజ రాడ్విభూషణా-మంగళ మంబుజాక్ష సఖ,మంగళ మంగజ గర్వ భంజకా

మంగళ మాది తేయనుత. మంగళ మెప్పుడు గాత నీకు స-ర్వం గత సంగతా పెసరవాయి పురస్థిత త్ర్యంబ కేశ్వరా"అని శతకం పూర్తిచేశాడుకవి.

దీనికింద గద్యం లో "ఇది శ్రీ మదాన్జనేయానుగ్రహోప లబ్ధ. సరస కవితా సామ్రాజ్యాధి వైభవ రమానాథాభిధేయ ద్వితీయ తనూభవ. "వికటవాద పరాయణ "ఇతి భీకర వినయ. నమిత సుకర. వశీకర లాక్షిణిక. జనవిధేయ. లక్ష్మణ నామ ధేయ ప్రణీతంబైన "పెసరవాయి పురస్థిత త్ర్యంబ కేశ్వర శతకము సంపూర్ణము "అని రాసుకొన్నాడు. మన వికటకవి రామలింగని వంటివాడే ఈ లక్ష్మణ కవి అనిపిస్తోంది. అతనిది సరస కవితాసామ్రాజ్య వైభవం. తండ్రిపేరు రమానాథుడు. కవి రెండవ కుమారుడు. తన వినయం భీకర వినయం ట.లక్షణ శాస్త్రాలన్నీ కరతలామలాకాలే కవికి. మీదు మిక్కిలి హనుమ ఉపాసకుడు. ఆయన బలవంతుడైతే,ఈ కవి కవితా బలసంపన్నుడు. అంతే తేడా. అందుకే ఏ పద్యాన్ని ఎత్తుకొన్నా. ఎక్కడా కుంటుపడక యమక అనుప్రాసలతో సర్వాంగ సుందరం చేశారు. 108 ఉత్పలాలతో శతక మాలిక అల్లి. తన హృదయేశ్వరుడైన త్ర్యంబ కేశ్వరుని అలంకరించి ధన్యుడయ్యాడు. చక్కని ధారా శుద్ధి ఉంది. సులభమైన పదాలతో నిజభక్తితో రాసి. కవి ధన్యుడైనాడు.

ఈ శతకం గురించీ ఈకవి కేసనపల్లి లక్ష్మణ కవి గురించి కూడా మనవాళ్ళు ఎవరూ. ఎక్కడా ప్రస్తావించినట్లు లేదనిపిస్తోంది. కవినీ శతకాన్ని పరిచయం చేసే భాగ్యం నాకు దక్కింది. కవి చెప్పుకొన్న మాటలుకాక. ఆయన గురించి వివరాలేవీ లేవు. త్ర్యంబ కేశ్వర స్వామి చరిత్ర కూడా కవి రాయ లేదు. భక్తిలో ఊగి పోయి రాసినకవిత్వమిది.

## 30 అగస్త్య లింగ శతకం-- శ్రీ తాడికొండ పూర్ణ మల్లికార్జున

శ్రీ తాడికొండ పూర్ణ మల్లికార్జున అయ్య వార్లంగారు “అగస్త్యలింగ శతకాన్ని పూర్తిగా సీసపద్యాలతో రచించి. 1935లో బెజవాడ ఆంధ్ర గ్రంధాలయ ముద్రాక్షరశాలలో. వరంగల్ కు చెందిన చిదర రాజమౌళి గారి రాజశేఖరం,అక్షయ లింగం గార్ల ద్రవ్య సహాయం తో ముద్రించారు. దీనితోపాటు శివభజన కీర్తనలు కూడా ఉన్నాయి. వెల తెలుపలేదు. దీనికి ముందుమాటలుకృష్ణాజిల్లా నందిగామకు చెందిన “నిగమాగమ విశారద ముదిగొండ వీర భద్రేశ్వరార్యులు రాశారు.




శ్రీ ముదిగొండ వీరేశ లింగం గారు కవిగారి జీవిత చరిత్ర చక్కగా తెలియజేశారు. మల్లికార్జునకవిది గుంటూరు జిల్లా తాడికొండ గ్రామం. ఇదే ఇంటిపెరుకూడా. వ్యవహార నామం పూర్ణయ్య శాస్త్రి. భారద్వాజస గోత్రం ఆపస్తంభ సూత్రం. యజుశ్శాఖ బ్రాహ్మణులు. మతం శైవం ఆరాధ్యులు. 1776 ఆనంద నామ సంవత్సరంలో గుంటూరుజిల్లా ఈమనిలో జననం.బుచ్చమాంబా. రాజ లింగారాధ్యులు తలిదండ్రులు. తల్లి పండితారాధ్యుల రాజలింగారాధ్యుల కుమార్తె. రాజలింగం గారు మంత్రం శాస్త్ర ప్రవీణులు. సోమవార. కార్తీక నక్త వ్రతాలు ఆచరించారు.



విజ్ఞాపనము.

శివభక్తశిఖామణులారా!

[illegible]

నందిగామ,
కృష్ణాజిల్లా.

ముదిగొండ వీరభద్రేశ్వరారాధ్యులు.

కవి తాత గారు మల్లనారాధ్యుడు సంస్కృతాంధ్ర కోవిదుడు. నంది వెలుగు గ్రామం లో తొమ్మిది ఎకరాల ఈనాము భూమి సంపాదించాడు.ఆ నాటి ప్రభువు శ్రీ మల్యాలరాయ వెంకట గుండారాయ ని దర్శించి ఆశువుగాతొమ్మిది సీసాపద్యాలు. ఏకాక్షర కంద శతకం చెప్పి,రాజును మెప్పించి ఏం కావాలని అడిగితె "ఈమనికి తూర్పుగా నా మాన్యం ఉంది. పంటపండటం లేదు. దీన్ని తీసుకొని దక్షిణంగా ఉన్న భూమి నాకు ఇవ్వండి అని మరి రెండుకందాల్లో తెలియజేశాడు. రాజుగారు కవిప్రతిభకు సంతోషించి ఈమనికి దక్షిణంగా ఏకంగా 25 ఎకరాల మాన్యాన్ని ఇచ్చి సత్కరించాడు.

మల్లికార్జునకవి కుటుంబం వాడైన శ్రీశైల పతిశ్రీ శైల తూర్పు ద్వారం వద్ద తపస్సు చేసి శివానుగ్రహం పొంది. వివాదాలలో బిల్వ దళం లో పంచాక్షరి రాసి దానితో తులాభారం తూగి "శ్రీశైల ప్రాగ్వార ప్రణవ పంచాక్షరీ తులాభార ప్రసిద్ధులు "అని పించుకొన్నాడు. చన్న బసవ పురాణకర్త అత్తలూరి పాపకవి. ఈ కవి వంశీకుడైన నందీశ్వరుడిని గురువుగా భావించి స్తుతించాడు. ఇలాంటి ప్రసిద్ధ వంశం లో పుట్టిన మల్లికార్జునకవి బాల్యం నుంచీ ఉభయ భాషా ప్రవీణుడై. సంగీత. మంత్రం శాస్త్రాలలో కూడా ప్రతిభా సంపన్ను డయ్యాడు. ఈతని గురువు. లింగ ధారణ నిచ్చినవాడు పండితారాధ్యుల రాజలింగ ఆరాధ్యులు. ఆతని రచన "కూకద మారయ్యకథ లో పద్యాలు తెలియజేస్తున్నాయి.

కవి పెద్ద సోదరి రాజమ్మ పండితారాధ్యుల జోగయ్యారాధ్యుల భార్య. చిన్నావిడ భ్రమరాంబ పండితారాధ్యుల కొటయ్యారాధ్యుల భార్య. మనకవి అష్ట విధ ఆర్జనపరుడు. షట్కాల శివ పూజాదురంధరుడు. ఎందరికో విద్యనేర్పిన గురువు. మొదటిభార్య ఇవటూరి లింగయ్యగారి కూతురు చనిపోతే. జగ్గయ్యపేటకు చెందినశివాపురం కోటయ్యా రాధ్యులపుత్రిక రాజేశ్వరి ని చేసుకొని. భ్రమరాంబ. పూర్ణానందం లను పొందారు. పెద్ద మేనల్లుడికి ఒకకూతురిని ఇస్తే కొద్దికాలం లో ఆమె చనిపోయింది. పూర్ణానందానికి శివపురం వీర భద్రా రాధ్యుల కుమార్తె అగస్త్యేశ్వరినిచ్చి పెళ్లి చేశారు.

మల్లికార్జున శాస్త్రి రెండవ భార్య కొడుకు పుట్టగానే చనిపోగా. కళ్ళికోట కు చెందిన మీనాక్షమ్మను తృతీయం చేసుకొని అయిదుగురు కుమారులను పొందాడు. మల్లికార్జున గారి శిష్యులు వరంగల్ చాందా. నాగపూర్. కామిరీ,ఆశనపర్తి సీతం పేట. కోరుపల్లి మొదలైన చోట్ల ఉన్నారు. మల్లికార్జునగారు –అచ్చతెనుగు హరిశ్చంద్రోపాఖ్యానం. కూకడ మారయ్య కదా. శ్రియాలుని కథ. రౌద్ర సత్తెక్క కథ. మిధున రామయ్య కథ. సిద్దేశ్వర శతకం. భజనకీర్తనలు. రామేశ్వర యాత్రా తటస్థ క్షేత్ర దేవతా పంచరత్నాలు. అష్టకాలు రాశారు. హరిశ్చంద్రోపాఖ్యానం నుంచి మచ్చుకు ఒక పద్యం –

"తలనాకసపు జాలు., మొలను బెబ్బులి తోలు –మేన వెన్నెల డాలు మేరుగులీన

చేత కంకాటి తుండు సికను జాబిలీ తుండు –నెడను తాచుల పిండు కుదురు దనర

నుదుట మండేడికన్ను. పెదవి నగవు చెన్ను –కురువులండలి యన్నుకులుకు గదుర

పూప జక్కవ రేని. రూపు ననెన్నగరాని –జడల క్రొమ్ముడి జిగి సౌరు చెలగ

తెల్లముగా చంక నొక జింక పిల్ల నిడుక –పూన్కపల్లెరమొక చేత బూని మిగుల

మత్తిల్లిన తెల్ల గిత్త నెక్కి –కనికరంబు న నా మ్రోల గానుపించె".

మల్లికార్జునుడు నిత్యం 21,600 జపం చేసేవాడు. ఆతపో ఫలితంగా శ్రీముఖ సంవత్సర మాఘ బహుళ చతుర్దశి మహా శివరాత్రి నాడు లింగోద్భవ సమయం లో. శిష్యుల సందేహాలు తీరుస్తూ శివ సాయుజ్యం పొందాడు. లింగైక్యం చెందాక,వరంగల్ లోని చిదరవారు లింగ ప్రతిష్టాదులకు. గ్రంధ ప్రచురణకు పూనుకొని నెరవేర్చారు.

అగస్త్యలింగ శతకాన్ని మల్లికార్జున ఆరాధ్యులు

"శ్రీ గిరిజా సతీ చిత్తాబ్జ రోలంబ –భక్త హృత్పద్మినీ భానుబింబ

తారకాచాలవాస తారతారక భాస –భూరి శైలస రాస-బుధవిలాస

ఇందు ఖండన వతంస ఈడిత ముని హంస –యాహి భూషి తాంస సంహత నరు శంస

హర గణ పరివార హత పురాసురవార –శరనిధి తూణీర శర్వ ధీర

పరమపావన నామ సద్భక్త ధామ –అభయ విశ్రాణన సుశీల అజిన చేల

అంగజ విభంగ పరమ దయాంతరంగ –ఈమని అగస్త్యలింగ బాలేందు సంగ “

అంటూ ప్రారంభించి “ఈమని అగస్త్యలింగ బాలేందు సంగ ‘ అనే మకుటాన్ని మకుటాయమానంగా పెట్టాడు.

పద్యాలన్నీ పరుగుదీస్తాయి –పులితోలు మొలకట్టు. తెలిగట్టు నీ పట్టు “అంటూ పట్టు పడతాడు. తర్వాత శివతాండవం వర్ణించాడు. త్రిపురాసుర సంహార విజ్రుం భణ కన్నులకు కట్టించాడు. ”నేరమా నినువేడ భారమా నను బ్రోవ బీరమానాతోడ “అని నిలదీశాడు. శివుని పంచముఖాలు పంచభూతాలకు ప్రతీకలన్నాడు. పంచముఖాలతో తానూ పంచ విషయాలు గ్రహించగా ఆయన చిదానంద రూపంగా వెలుగుతున్నాడట. శివభక్తుల చరిత్రలన్నీ విప్పి చెప్పాడు. ఒక భక్తుడు భార్య చర్మం వొలిచి చెప్పులు కుట్టి ఇచ్చాడు. ఒక భక్తుడిని బానిసనుఇమ్మని అడిగితె దభార్యనే ఇచ్చాడు

“నీ మన్కి నా యున్కి ‘ఒక్కటే అన్నాడు. ”సురపతి సురముఖ సురవర చయమకుటమనికిరణ పద కమల యుగళ”అంటూ గుక్కతిప్పుకోకుండా సీసాలు రాసే నేర్పుకవిది భక్తి పరవశంతో చెప్పినపద్యాలు. సముద్ర మధనం లో విషం పుడితే అందరూ భయంతో పారిపోతే “నువ్వు తొడరి భుజించ గా అమృతము పుట్టిద్దన్నాడు. ”వేదాంత వేద్యాయవిమలాన్తరంగాయ –మౌని హృన్నిలయాయ తే నమోస్తు “అని భక్త్యాంజలి ఘటిస్తాడు. బెజ్జమహాదేవికి కొడుకుగా పెరిగావు. గొడగూచి భక్తితో ఇచ్చిన పాలు తాగావు బాణాసురుని వాకిటి కాపలా కాశావు కన్నప్ప పుక్కిలించిన నీళ్ళు పోస్తే అభిషేకంగా భావించావు ఇలాంటి భక్త సులభుడు లేదు అన్నాడు. నీభూషణం పాము నీకొడుకు వాహనం ఎలుకను తినటానికి. మీకొడుకు కుమారస్వామి వాహనం నెమలి నీ పాముల్ని తినటానికి. నీభార్య పార్వతి వాహనం సింహం గజాన్ని కొట్టటానికి. నీభార్యలు సవతిపోరు,ఫాలాగ్ని చంద్రుడిని బాధ పెడుతూ ఉంటె ఎలా తట్టుకొంటున్నావు సామీ “’కుటుంబ కలహాలతో విసిగి విషం తాగుతున్నావేమో “అని చమత్కరించాడుకవి.

ఆరు మొగాల శూరుని కొడుకుగా. ఆరక్షరాలు మంత్రంగా. ఆరుపద్మాలలో ఆరు లింగాలుగా ఆరు చక్రాల అవతల జ్యోతిస్వరూపుడివిగా వెలుగుతున్నావని ఆరు సంఖ్య సార్ధకత వర్ణించాడు. నీకన్నా గొప్ప దేవుడే ఉంటె నిన్ను మహాదేవుడు అని ఎందుకంటారు అని సమర్ధిస్తాడు. అన్ని చక్రాలసస్థానాలను వర్ణించాడు ’. తన సీసపద్యాల చివర గీత పద్యాలు రాయటాన్ని సమర్ధిస్తూ –”చెరకునకు వంకబోయిన చెడదు తీపి –యనుచు బల్కెడి లోకోక్తి ననుసరించి

సీసపద్యాళి సుమమాల జేసి నీదు –కంఠమున దాల్ప నొసగితి కరుణ దాల్పు ము "అని చివరి పద్యం చెప్పాడు కవి.

తర్వాత ఇష్టలింగాన్ని పంచరత్న సీసాలతో స్తుతించాడు. ఆతర్వాత శివ భజన కీర్తనలు వివిధరాగాలలో కూర్చాడు.

గొప్ప శతకం ఇది మహా భక్తుడు రాశాడుకనుక ఉదాత్తంగా ఉత్తమోత్తమగా భక్తి భావ గర్భితంగా సరళంగా నడిపించాడు కవి ధన్యుడయ్యాడు. శివ భక్తులకు వరప్రసాదం అగస్త్య లింగ శతకం.

## 31 దీక్షిత శతకం -- శ్రీ నందిరాజు లక్ష్మీ నారాయణ

"శ్రీ నందిరాజు లక్ష్మీ నారాయణ దీక్షిత శతకం" కర్తవఝుల సూర్యనారాయణ కవి. ఇది బాపట్లలోని అత్రి –వాణి ప్రెస్ లో 1938లో ముద్రితం. వెల రెండు అణాలు అనబడే" బేడ". ముందు తన వంశ చరిత్ర సీసాలలో ఒలికించాడు కవి. కృష్ణానది బంగాళాఖాతం లో సంగమించే హంసల దీవి క్షేత్రంకు దగ్గరలో ఉన్న రేపల్లె కు దగ్గర ధూళిపూడిలో కవి పుట్టాడు. రామయామాత్య వరతనూజుడైన వఝుల వంశం లో సూర్యనారాయణ పేరుతొ పుట్టాడు. ఈశతకం రాయటానికి"ధీ విశాల కోటీశ్వర దీక్షితార్య సార్వభౌమ మార్కండేయ శర్మ ప్రేరణకల్పించారు.


176

26269
25-3-73.

శ్రీనందిరాజు లక్ష్మీనారాయణ

దీక్షిత శతకము.

—(o)—

శ్రీ మహీశాచార • శిష్టభూయిష్ఠ వ్రి
కాశితార్యావర్త • దేశమందుఁ
గలికాలవశమునఁ • గులధర్మములడంగి
వర్ణసంకరము గా • వచ్చినంత
విశ్వహితార్థమై • యీశ్వరాంశమ్మున
నాదిశంకరుఁడై • యవతరించి
తగువాదములదుర్మ • తంబులు ఖండించి
సన్మతస్థాపన • సలిపి యేఁగి
యప్పటప్పటికిఁ దెంచి • యరయవలసి
హరిహరాంశసంభూతిలో • యవనిఁ బర
రించియున్నై వ్రతమతము భా • గించినావు
రమ్యగుణధుర్య లక్ష్మినా • రాయణార్య!

నందిరాజు వంశం లో ఘంటయ్య. చిన్నమాంబ దంపతుల కుమారుడు దీక్షితులు. కొడుకును ఇంటివద్దనే వదిలి తండ్రి

దేశాటనం వెడితే. రేపల్లెలో దివాకరం రామమూర్తిగారు బాలుడిమీద అభిమానం తో సంస్కృత ఆంధ్రాలు. సాహిత్యం నేర్పగా వాటిలో గొప్ప దక్షుడయ్యాడు. తెల్లవారుఝామునే లేచి స్నాన సంధ్యాది విధులన్నీ యధాప్రకారం చేసి. బడికి వెళ్లి పాఠాలు బాగానేర్వగా సహాధ్యాయి విశ్వపతి ఓర్వలేక తనకంటే అన్నిటా ముందున్నాడని ఈర్ష్య తో రాజు శబ్దం పై అర్ధ వివరణ అడగటం లో ఈ భేదం మరీ ఎక్కి పోయింది .

కొంతకాలానికి సుంకర వంశంలోని మంత్రి ఒకాయన ఇతన్ని తీసుకొని వెళ్లి. బంధు మిత్ర సముదాయంమధ్యలో లో తనకూతురు వీరమనిచ్చి వైభవోపేతంగా వివాహం చేశాడు. తర్వాత భార్యతో రేపల్లెలో కాపురం పెట్టాడు. అక్కడ తర్క వ్యాకరణ మీమాంసాది శాస్త్రాలలో అక్కన శాస్త్రి వద్ద చదువుకోమని శేషగిరిరాయడు ప్రోత్సహించాడు. ఆయనవద్ద అలంకార శాస్త్రంతో సహా అన్నీ నేర్చాడు. గురువంతవాడు అనిపించుకొన్నాడు. అక్కడ నియోగి. వైదీకి తేడాలొచ్చాయి

తండ్రి దేశాటనం నుంచి తిరిగివచ్చి. కొడుకును ఇంటికి తీసుకొని వచ్చి నందిగామలో ఉన్న కోడలిని వెంటబెట్టుకొని తీసుకొని వచ్చాడు. ఈ దంపతులతో ఏకోదిష్టం, షోడశం మొదలైన హోమాలు చేయించాడు. గురువు వద్ద అనుమతిపొంది రేపల్లె చేరి నిష్టతో హరదత్తభాష్యాదులు ఆమూలాగ్రంగా చదివి. స్మార్తంలో నిష్ణాతుడై "అభినవ బ్రహ్మ "అని పించుకొన్నాడు.

బందరులో వడ్లమన్నాటి వెంకప శర్మ అనే ఆర్వేల నియోగి. త్యాగి యజ్ఞం చేసి అవభ్రుతస్నానం చేసి అన్న సమారాధన మహా వైభవంగా చేశాడు.వైశ్వ దేవం చేసేవారికి విడిగా వంటలు వండించాడు.. విశ్వపతి మొదలైనవారు వచ్చి నియోగుల ఇంట్లో భోజనం చేయము మా సామగ్రి మాకు ఇస్తే వండుకుతింటాము అన్నారు.




బందరులో నియోగులపాఠశాల వేదం పాఠశాల నెలకొల్పి తానె అధ్యక్షుడై తీక్షితులు చక్కగా నిర్వహించాడు. ఇందులో వైదీకులు చేరి చదవనే లేదు. కృత్తి వెంటి వారి పురోహితులం అని కొందరు వైదికులు వచ్చి. తమకు యాజకత్వం ఇవ్వమని కోరగా వెంకపసోమయాజి ఒప్పుకోలేదు రాజభటుల్ని పిలిపించి గెంటి వేయించాడు.

తానుస్థాపించిన రెండు విద్యాలయాలో సమర్ధులైన ఉపాధ్యాయులను నియమించి. విద్యాబోధన బాగా చేయించి ప్రామాణ్యం పెంచాడు.నియోగులుకూడా వైదీకులతో పోటీపదడిచెడుమార్గాలు పట్టి చెడ్డ పేరు తెచ్చుకొన్నారు. దీక్షితుల తండ్రి ఘంటయ సన్యసించి బ్రహ్మానంద సరస్వతి నామంతో పిలువబడినాడు. అప్పట్నించీ రేపల్లె వేద పాఠశాల బాధ్యతా తీసుకొన్నాడు. నూజి వీడు మొదలైన సంస్థానా ధీశులు వార్షి కాలు పంపుతూ శిష్యగణాలకు విద్యనేర్పటానికి సాయపడుతున్నారు. కలహాలు సద్దు మనగటానికి మేధా దక్షిణామూర్తి తపస్సు చేసి. ఆనందనామ సంవత్సరం లో అగ్న్యాధానం చేసి "దీక్షితులు "అనే సార్ధక నామం పొందాడు. "విశ్వపతి అసుర విజయం". పిష్టపశ్వధ్వరవివేకం "కావ్యాలు రాశాడు .

రక్తాక్షినామ సంవత్సర శరదృతువులో పుష్పగిరి పీఠాధిపతి రేపల్లెకు60మంది పండితులతోరాగా విశ్వపతి మంత్రిగా ఉన్నాడు. జంగనరాయ భూపాలుడు. తాటి రామయమంత్రి కొలువు తీరి ఉన్నారు. పుష్పగిరి స్వామినుంచి ఆహ్వానం రాగావెళ్లి యతిపతికి నమస్కరించి. ఎదురుగా "గ్రంధం"పెట్టగా అది ఆయనకు అవమానంగా భావించి చులకన చేశాడు శాస్త్ర చర్చలు ఒరుగా సాగాయి రెచ్చి పోయి వాదించాడు దీక్షితులు అందరూ భేష్ భేష్ అని మెచ్చారు కానీ యతిపతి"నువ్వే గెల్చావు "అనే మాట చెప్పకుండా మౌనంగా ఉన్నాడు. ఎదో ఒకటి చెప్పమని అధికారులు అనగా తీర్పు వ్రాసి పంపిస్తానన్నాడు. విశ్వపతి చిన్నబుచ్చుకున్నాడు మాటలతో గడిపాదేకాని పీఠాధిపతి తుది తీర్పు రాసి ప్రకటించలేదు.

ఇంతమంది మొనగాళ్లను వాదం లో ఓడించి దీక్షితనామానికి సార్ధకత కల్పించిన దీక్షితులను మెచ్చుకోకపోవటం తో కలత చెంది సభలోని వారంతా “దీక్షితుడన దేవ దేవుండు –తగు నీతనికి దీక్షిత ప్రశంస “అనగా దేవతలు పుష్పవృష్టి కురిపించారు. కులసతి కోటిమాంబ వలన యజ్న నారాయణ. సూర్యనారాయణ అనే ఇద్దరు కుమారులను పొందాడు. అద్వైతాన్ని అసురాద్వైతం దేవాద్వైతమ్గా విభజించి. అసురాద్వైతం దోషమని నిరూపించాడు. తనవారికి దైవతాన్నం పంచాడు. క్రమంగా బ్రహ్మచర్య. గార్హస్పత్య. వానప్రస్థాశ్రమం గడిపి. చివరికి తురీయమైన సన్యాసాశ్రమం తీసుకొని “చిదానంద సరస్వతి “నామ ధేయంతో విరాజిల్లారు.శ్రీముఖ నామ సంవత్సర కార్తీక శుద్దనవమి నాడు దీక్షితార్య అనే చిదానంద సరస్వతి సిద్ధి పొందారు. అప్పటినుంచి ఆరాధనలు జరుగుతూనే ఉన్నాయి.

ప్రజోత్పత్తి నామ సంవత్సరం లో 60వ ఏట ఈ దీక్షిత శతకం రాశానని కుమారుడు సూర్యనారాయణ కవి తెలిపాడు. ఈయన కోటీశ్వర దీక్షిత శతకం మొదలైనవి రాసినట్లు చెప్పి 100 సీస పద్యాలతో శతకాన్ని ముగించాడు.

మొదటి పద్యం –

“శ్రీ మహితాచార శిష్ట భూయిష్ట ప్రకాశితా –ర్యవర్తదేశమందు-గాలికాల వశమున గులధర్మము లడంగి –వర్ణ సంకరముగా వచ్చినంత

విశ్వ హితార్ధమై ఈశ్వరంశమ్మున –నాది శంకరుడపై నవతరించి-తగువాదముల దుర్మతంబులు ఖండించి –సన్మత స్థాపన సలిపి యేగి

యప్పటప్పటికరుగు దెంచి –యరయవలసి –హరిహరాంశను మరలి –ఈయవని కవత

రించి యద్వైతమతము భాగించినావు –భవ్య గుణ ధుర్య –లక్ష్మి నారాయణార్య”

హంసల దీవి వర్ణన –”

“కృష్ణా మహా తరంగిణి సాగరుతోడ –గాలియు నెయ్యది కేళికా గృహంబు –సరస యౌవన దశా పురుషయిత క్రియా –భోగంబులకేది పూలపాన్పు –ఉర్విపై నేయది పర్వకాలస్నాన –పుణ్యంబులకు నెల్ల బుట్టినిల్లు

పరమభాగవతాది బహు పురాణంబులు –వినిచి స్వర్గము చూర విడుచునెద్ది –అట్టి హంసల దీవి “

బందరు ఉప్పెన

“స్వామి తోడసే వచ్చే ఝుంఝూనిలంబది-ప్రళయ భైరవ ముఖార్భటి యనంగ నీల మేఘమ్ముబులానింగిపై గాలికి –గొట్టుక పోయెడుకొండలనగ

పృధు వర్ష ధారలా యింద్రచాప విముక్త –రసలోహమయపు నారసములనంగ

ధన జీవంబులకు నిర్దయుడై బాధించు –యతిరాజు లయకాల యముడనంగ

దోచె యుప్పెన బందరు నూచె సేచె-లోకములెల్ల నల్లకల్లోలమయ్యె-యయ్యయో ఏమనంగలదా యవస్థ “

చివరిపద్యం –

“బ్రహ్మ చర్యంబు గార్హస్త్యంబు నడిపి –వానప్రస్థమును దీర్చి సుప్రసిద్ధ

వాసరంబందు సన్యాసము గై కొంటి –రహి జిదానంద సరస్వతి యన

శ్రీ ముఖాబ్ది కార్తిక శుద్ధ నవమి ని –సిద్ధి గాంచితికీర్తి శేషుడగుచు

నాట నుండియు నీనాటికారాధనల్-వరలు చున్నవి నీకు వార్షికముగ

నఘ నిబర్హణమని భవదనఘ చరిత –సీస పద్యములయందు వ్రాసి శతకంబు

నీ దయన్ బూర్తి జేసితి నేర్చినట్లు –రమ్య గుణ ధుర్య-లక్ష్మి నారాయణార్య ‘

“దివ్య తేజుడైన కోటీశ్వర. దీక్షితాది –కృతున కలరుగగృతి సమర్పించి నాడ

నందుకొను మిపె నా యభినందనములు

రమ్యగుణదుర్య -లక్ష్మి నారాయణార్య”

’అని శతకం ముగించాడు కవి

పద్యాలన్నీ నవనవోత్సాహంగా గంగా తరంగ నిర్ఝరిగా పవిత్రంగా ప్రవహించాయి ప్రతిపద్యం దీక్షితులకే సమర్పయామిగా రాశాడు కవి "రమ్యగుణదుర్య -లక్ష్మి నారాయణార్య" అనే మకుటం మకుటాయమానమై భాసించింది. ఆయనకే శతకం విన్నవించుకొన్నాడు కవి. సార్ధక రచన. కవి గురించి. దీక్షితులగారి గురించి పెద్దగా మనకు తెలిసింది తక్కువే. ఆలోటు తీర్చాడు సూర్యనారాయణకవి. అరుదైన ఈ శతకాన్ని పరిచయం చేసే భాగ్యం నాకు కలిగింది.

## 32 లక్ష్మిజనార్దన చరిత్రము -- శ్రీ బొండాడ సూర్యనారాయణ

తూగోజి ధవళేశ్వరం పిడబ్ల్యుడి క్లార్క్ శ్రీ బొండాడ సూర్యనారాయణ లక్ష్మి జనార్దన చరిత్రం, దానికి అనుబంధంగా శ్రీ వెంకటేశ్వర శతకం రాసి. రాజమండ్రిలోని ఎస్ గున్నేశ్వరరావు బ్రదర్స్ కు చెందిన చింతామణి ప్రెస్ లో 1913 లో ముద్రించారు వెల మూడు అణాలు. విజ్ఞాపనం లో కవి "గౌతమీ తటం ధవళగిరి పై వెలసిన శ్రీ లక్ష్మి జనార్దన స్వామి కి అంకితం చేస్తూ రాశానని చెప్పాడు. దీన్ని ఆసాంతం విన్న వ.సు. కవి అంటే వడ్డాది సుబ్బారాయ కవి గారికి వందనాలు తెలియజేశాడు.

శార్దూలం లో మొదటి పద్యం "శ్రీ రామామణి తో. శేషాహిపై బండి. యే-కారుణ్యాంబుధి భక్త సంఘంబుల వేడ్కన్ గాంచి రక్షించు నే –

పారావార గభీరునిన్ గొలువగా బ్రహ్మాదులున్ జాల ర-ద్దీరున్ దైత్యకులాంతకున్. వరదునిన్. దీనావనున్ గొల్చెదన్" అని జనార్దన స్తవం చేసి. కైలాస విభుడు అర్ధనారీశ్వరుడై ఆమె కోరగా హరికధలు చెప్పే శివుని గణపతిని స్తుతించి. "పెన్నున్ నాభిలో జనించిన చిన్నికుమారుడు "బ్రహ్మను ఆయన అర్ధాంగి "విరించి కూరిమి రాణి "ని. "కరిముఖుని "కవిపెద్దలకు నమస్కరించి తర్వాత తన విషయం చెప్పాడు. తండ్రి కోదండరామస్వామి ఉదారుడు. తను బొండాడ సూర్యనారాయణ. మనసులో జనార్దానుని"భవ్యకథ" రాయాలని కోరికపుట్టింది సంస్కృతం తాను చదవలేదు. గౌతమీ మహాత్మ్యం లో ఉన్న కథను చదివి విపించి మనసుకు పట్టించారు శ్రీ నున్న వెంకటార్యులు. ఇక స్థల పురాణం జోలికి పోకుండా దానిసే ఆధారంగా రాశాడు.ఇక కథలోకి వెడితే

"సత్యలోకంలో బ్రహ్మ సభలో వాణీ నాథుడు కొలువు తీరి ఉన్న సమయం లో నారద మహర్షి వచ్చి "గౌతమీ తటమున ఉన్న తీర్ధాలలో ముఖ్యమైనదేది ?""అని అడుగగా. బ్రహ్మ "జహ్నుని సుతతో తుల్యమగుచుండును గౌతమి. దీన్ని గౌతమమహర్షి తెచ్చాడు. అనగా ఎందుకు తెచ్చాడు అని అడుగగా. గౌతముడు తీవ్ర తపస్సు చేస్తుంటే మునులు ఆయన ఆశ్రమం లో ఉంటూ సపర్యలు అందిస్తున్నారు. వామనావతారం లో బలిగర్వం పోగొట్టటానికి విష్ణువు వామనావతారం ఎత్తి. బ్రహ్మాండమంతా ఆక్రమిస్తే. అప్పుడు తాను తన కమండలోదకం తో ఆయన పాదాలు కడుగగా. ఆ జలం నాలుగుపాయలై. శివుని జటాజూటం చేరింది. ఆమెపై శివుడికి మక్కువ పెరగటం తో పార్వతి ఖిన్నయై ఎలాగైనా గంగను వదిలించుకోవాలని సాయం చేయమని కొడుకు వినాయకుని కోరితే. "తల్లి చింత వలదు. తథ్యంబుగా నీకు గలుగు –వంతదీర్ప గలను జమ్మీ -'ఎలుక వాహనం మీద పూర్వం ఘోరయుద్ధం చేశాను అని అభయమిచ్చి,తనకు అది పెద్దపనే కాదు అని "కొక్కు తేజిపై హాయిగా "కూర్చుని తల్లి దీవెనలు పొంది. అతి వేగంగా గౌతమాశ్రమం చేరి. అక్కడి మునిజనం తో సఖ్యంగా ఉంటూ ఉన్నాడు.

గౌతముడు నివ్వరి ధాన్యం పొలం లో చల్లి రోజు నీళ్ళు పెట్టి పెంచుతూ ఒక రోజు మర్చిపోతే. ఇదే అదను అనుకోని" మాయ గిడ్డి "ని కల్పించి ఆపొలం అంతా మేసేట్లు చేస్తే మునికి కోపం వచ్చి దర్భపుల్లతో ఆ ఆవును అదలిస్తే అది ముని ఆశ్రమం ముందు చనిపోతే దుఖభారం పొందిన గౌతముడు ని శ్చేష్టుడుగా ఉంటె మునులందరికీ ఒక ఉపాయం చెప్పాడు"కనకాచల ధన్వి జటను గలిగిన గంగన్ - ఇలకుగొని తెచ్చిగౌతముండిచట నదిని "పారిస్తే. మళ్ళీఆశ్రమం పవిత్రవంతం అవుతుందని సలహాచేప్పాడు. ఆమాట నచ్చి ముని గౌతముడు కైలాసం వెళ్లి శివుని మెప్పించగా. ఒక జడ ఊడదీసి గంగను పారించాడు. ఆ ముని వెంట ఆనది పరిగెత్తుకొంటూ ఆశ్రమం దాకా రాగా. అందరు పవిత్ర స్నానాలు చేశారు. గౌతముడు తీసుకు వచ్చాడుకనుక "గౌతమి "అయింది.

నారదుడు మళ్ళీ బ్రహ్మను "గౌతమమునిని వంచించటం వినాయకునికి సాధ్యమా ?""అని అడిగితె ""హరిహర లీలలు నెన్నగ-హరిహరులకే చెల్లుగాని యలవియె మనకున్ - నరులకు మేలొనగూర్ప-హరిహరు లిట్లాచరింతురాశ్చ ర్యముగాన్ "అన్నాడు. గౌతమీ తీరం లో జనార్దన తీర్ధం ఉంది అది చాలామహత్తరమైనది దాని వివరాలు చెబుతా వినమన్నాడు –మొదట్లో నాముఖ గహ్వరం నుంచి వెలువడిన వేదాలు అన్నిటా వ్యాపించాయికాని మునిజనాలకు అందుబాటు కాలేదు. వారి మనోబాద తీర్చటానికి" జనార్దనుడు వాటినన్నిటి

నొక ప్రోగుగా జేసె శిలోచ్చయాకృతిన్ –గాన జనార్దనాద్రి యన –గా నుతి గాంచెను నమ్మహీన్ద్రమున్ "ఇలా నాలుగు వేదాలను అద్రి రూపంగా మార్చికరుణా ప్రపూర్ణు డయ్యాడు హరి. అక్కడ జనార్దన స్వామిగా వెలిశాడు.ఆతర్వాత బాదరాయణ వ్యాసమహర్షి అక్కడికి వచ్చి "అత్యంత భక్తితో శిఖరి యందలి నాలుగు తున్కలన్ గడున్ బ్రీతి ఎలర్పగాగొనుచు బృధ్వికొసంగెను బ్రాతమిన్కులన్ ".

గౌతమి ఒడ్డున ధవళేశ్వరం గిరిపై జనార్దనుడు లక్ష్మీ దేవితోశంఖ చక్ర గదాది ఆయుధాలతో కొలుపై ఉంటూ భక్తజనావళిని కాపాడుతూ ఉంటాడు. తర్వాత వ్యాస బ్రహ్మ. శ్రీ కంఠుడు 10మత్తకోకిలలో జనార్దన స్తోత్రం చేసి పూజించారు. తర్వాత అనేక లలితపద వృత్తాలలో శ్రీ రమా స్తుతి చేశారు. క్రౌంచపద వృత్తాలో జనార్దనాష్టకం పాడారు. వ్యాసాదులు చేసిన ఈ స్తోత్రాలకు పరమ ప్రీతి చెంది దేవ దేవులు సంతోషించి ఈ స్తోత్రాలు భక్తిగా పఠించిననవారికి మంచి జరుగుతుంది అంటే వ్యాసుడు దర్శించినవారికి మోక్షం అనుగ్రహించమని కోరితే తధాస్తు అన్నారు. ఈ తీర్ధాన్ని వ్యాస కృత జనార్దన తీర్ధం అంటారని కూడా చెప్పాడు.

ఆతర్వాత రామావతారం వర్ణించాడు కవి. వనమయూర వృత్తం లో శ్రీ రంగాష్టకం చెప్పాడు –"దేవ నిను గొల్చెదను దీనుడను బాపిన్ –గావదగు బటేరిమి ని గంజదళా నేత్రా –నీ విమలకార్యములు నేర్తునె నుతింపన్ –దేవతలకెల్ల సుర దేనువవు రంగా '.తర్వాతస్వాగత వృత్తాలలో రామాష్టకం రాశాడు కవి –"నన్ను బ్రోవు రఘునందనరామా- సన్నుతించెదను,జానకి నాథా – నిన్నే నమ్మితి. నీకే భటుండన్-బన్నగారి రధ బంకజ నేత్రా ".భుజంగ ప్రయాతం ఇంద్రవ్రజం వృత్తాలూ సమర్ధంగా రాశాడు. చివరగా –

"నీరజ నేత్రా ఘన నీలగాత్రా –కారుణ్య ధామా. రిపుకంజ సోమా –శ్రీరామమూర్తీ. నరసింహమూర్తీ-సారెందు కీర్తీ సుర చక్రవర్తీ "అని 188వ పద్యంతో ముగించాడు.

తర్వాత శ్రీ వెంకటేశ్వర శతకం కూర్చాడు. మొదటిపద్యం గీతపద్యం –"శ్రీల జనులకోసగుచు సిరియు ధరయు –నీళలవయంబు రక్తితో నిను భజింప –వారలు నీ వొనరించెద వందనములు –విగత భవ పాశ తిరుపతి వేంకటేశ "

చివరి 101వ ఆట వెలది పద్యం తో శతకం ముగించాడు –"నిండుభక్తి తోడ బొండాడ సూర్య నా-రాయణుండుసేసుసెనర్పణము –గీత శతకమొకటి పీతాంబరా –దీని వేడ్కతోడ బొందు వేంకటేశ " తిరుపతి

వేంకటేశ మకుటం లో రాసిన శతకమిది. గోదావరీ తీర క్షేత్రమైన జనార్దనునిని క్షేత్రమహాత్మ్యాన్ని "గలగలా పారే గోదారిలా. కమనీయంగా మృదు మధురంగా. గోదావరీ పావనోదార పవిత్రంగా భక్తీ అనురక్తీ. కధాకధన శక్తీ మేళవించి మహా భక్తకవుల స్థాయిలో రసబందురంగా రాశాడు కవి. ఈ కావ్యం, ఈకవినీ పట్టించుకొన్న దాఖలాలు లేవు. నాకు పరిచయం చేసే మహద్భాగ్యం కలిగింది జైజనార్దనా.

## 33 ఏకప్రాస సీతారామ శతకం -- శ్రీ అల్లమరాజు రామకృష్ణ కవి

అల్లమరాజు రామకృష్ణ కవి ఏక ప్రాస సీతారామ శతకం రచించి జగ్గమపేట శ్రీ సీతారామస్వామి ఆలయ ధర్మకర్త శ్రీ మోగంటి కొండ్రాజు గారి ద్రవ్య సహాయంతో,కాకినాడ శ్రీ సరస్వతీ ముద్రాక్షర శాలలో 1913లో ప్రచురించాడు వెల.కేవలం పావలా.

పీఠికలో శార్దూల పద్యం లో –"శ్రీ మా హైమవతీ సరస్వతుల గూర్మిం బెన్నురంబందునన్-సామేనన్,రసనాగ్రభాగమున నిచ్చల్ దాల్చి ముల్లోకముల్

ప్రేమన్బ్రోచుపురాణ పూరుషులు పేర్మి గాస్తు రశ్రాంత మున్ –శ్రీ మోగంటి కులామృతాబ్ధిశశియౌ శ్రీ కొండ రాజాఖ్యునిన్ "అని కృతిభర్తను రక్షించమని లక్ష్మి. పార్వతీ సరస్వతులను వాళ్ళ భర్తలైన త్రిమూర్తులను ఒక్క పద్యం లోనే బహు చమత్కారంగా వర్ణించాడు కవి. తర్వాత జగ్గమ పేట పురాన్ని వర్ణించాడు.

గోదావరీ తీరం లో పిఠాపురం సంస్థానం లో రత్నగిరి దగ్గర సకల సౌభాగ్యాలతో జగ్గమపేట వర్ధిల్లింది. దానికి చెందిన 45 పల్లెలకు కరణీకం ఆర్వెల నియోగులైన మోగంటి వారు. రాజ్యాంగ మంత్రం తంత్రాలలో. పాలనలో ప్రసిద్ధులు.సత్యవాక్య పరిపాలనలో. సాదు సజ్జన సేవలో,వితరణలో మేటివారు . కాశ్యప గోత్రులు. ఈ వంశం లో –"తిరుపతి రాజు బుట్టె గవి దీన జనావళి గాచిబ్రోవ శ్రీ –తిరుపతి రాజే ఈతడన ధీవర సన్నుతుడౌచు దాన ని

ర్ఘరఝర కల్ప భూరుహ విశారద శారద నారదేందుధి-క్కరణ యశో శాలు డరికాలుడుసద్గుణ శీలు డౌనన్ "

ఈయనకొడుకు మల్లప రాజు గ్రామణిత్వం లో దిట్ట.ఈతిరుపతి సీతమ్మ దంపతులకు దుర్మతి నామ సంవత్సరం శుద్ధ చతుర్దశి సోమవారం నాడు గ్రహాలన్నీ ఉచ్చ స్థితిలో ఉండగా కొండల్రాజు జన్మించాడు. కాశీప్రయాగ మొదలైన తీర్ధ యాత్రలు చేసి. తృప్తి చెందక "రమాహృదీశు"దేవాలయం కట్టించి "శ్రీ సీతారామ స్వామి దేవాలయం "అని పేరుపెట్టి వైభవోపేతంగా విగ్రహాలను ప్రతిష్టించాడు.నిత్యపూజా శ్రీరామనవమినాడు కల్యాణం నిర్వహించాడు. తర్వాత భద్రాచలం శ్రీరంగం కంచి మొదలైన్ పుణ్య క్షేత్ర దర్శనం చేసి. తిరిగి వచ్చి భగవధ్యానంతో తరిస్తున్నాడు.

ఒక రోజు –"హరితస గోత్ర సంభవుడ నల్లమ రాజ కులాబ్ధి సోముడ-న్మరియునురామకృష్ణ కవి మాన్యుని పౌత్రుడ. రామ చంద్ర ధీ

వరుని తనూజుడన్. సుకవి వంద్యుడ గృష్ణ విలాస కావ్యమున్ –సిరిమగానిన్ గృతీన్ద్రునిగ జేసినా రామకృష్ణు డన్ "అని తన్ను గురించి చెప్పుకొన్న ఈ కవి ఆ సీతారామ దేవాలయ దర్శనం చేసి అందలి శిల్ప కళా వైభవానికి ఆశ్చర్య పడి,పరవశుడయ్యాడు. ఈ స్వామిపై ఏకప్రాస శతకం రాసి ఆలయ నిర్మాత కొండ్రాజుగారికి అంకితమిచ్చి జీవితం ధన్యం చేసుకోవాలనుకొన్నాడు. ప్రమాది వత్సర ఆషాఢ శుక్ల దశమిఆదివారం శతకం వ్రాయటం మొదలుపెట్టి. మూడే మూడు రోజుల్లో పూర్తి చేశాడు. తప్పులు ఉంటె మన్నించమని బుధులను కోరాడు కవి.

శతకాన్ని శార్దూలం లో శ్రీ సీతారామ స్తుతి చేసి ప్రారంభించాడు –"

"శ్రీమన్మంగళదేవతా హృదయ రాజీవార్కు మౌనీంద్ర సు –త్రామా బ్జాత శంకర ప్రముఖ గీర్వాణార్చి తాంఘ్రి ద్వయున్

శ్యామాంగుంజల జేక్షుణుం. గుణ నిధింస్వర్ణాంబరుం జిన్మయున్-రామున్సర్వ జనాభిరాము మదిలో బ్రార్థింతు నశ్రాంతమున్ ".

తర్వాత కందపద్యాలలో ఏక ప్రాసతో "శ్రీ జగ్గమ పేటధామ సీతారామా"మకుటం తో శతకం మొదలు పెట్టాడుకవి. మొదటిపద్యం –

"శ్రీ జనక తనూజా హృ-ద్రాజీవ విరాజ మాన. రాజీవాప్తా

రాజద్రూప పరాత్పర –శ్రీ జగ్గమ పేటధామ సీతారామా"

కొండ్రాజు గారు కట్టించిన దేవాలయం లో "ఓజన్ శ్రీ హరి. గిరిజా గణరాజార్క "స్థాపనం చేశాడు. -రాజ శరాబ్జసుపర్వో- ర్వీజ మహా జలదిరాజవిష్ణు పదీ-సత్తేజోవిశద యశా –"శ్రీ జగ్గమపేట".మరోపద్యం లో ఇంద్రుని "జీవనదాశ్వ "అన్నాడు తమాషాగా. ఉపాధులకు ఆజీవాలు అన్నాడు. "జాజుగల నీ పదంబులు –జాజుల చేమంతి పూల సంపెంగనలనం –భోజములతో పూజిస్తానన్నాడు. కావి రంగును జాజు అన్నాడు. అజాను వ్యాప్త సుబాహ్ అంటాడు. జాంబూనద చేలా అంటాడు పీతాంబర ధారి అనటానికి. జేజేలు రావణాదుల –చే జిక్కుల కోర్వలేక సేవించిన నెం-తే జంపితి వా దైత్యుల "లో జేజేలు అంటే దేవతలు. ఓజతో రామా అంటే ఏ జడుడికైనా వైకుంఠ ప్రాప్తి ఇస్తాడట. బీజం లో ద్రుమం లా, పృధ్వీజం లో బీజంలాగా "విశ్వము నీలో –నా జగతిలో న నీవును "అని జగత్పిత ను వర్ణించాడు. జిగి గుబ్బలకనులు అంటాడు. "జేజేపెద్దన నంగా –జేజే పెద్దను శివుండు –జెల్లిన శివుని-ట్లోజనెలకొల్పు చుంటివి "అని పురాగాధ వర్ణించాడు.

"స్త్రీజన నిందిత శూర్పణ-ఖా జారను రూపు మాపి ఖరముఖ రక్షో –రాజిని గూల్చిన మేటి "రాముడు అన్నాడు. ."ఆజియును నీ విలోకన-పూజా స్మరణాను లాపములు జరపని దు –ర్భాజనులు నరకగాములు 'అని చెప్పాడు. ఇక్కడ ఆజి అంటే క్షణకాలమైనా అని అర్ధం. పర్వతాన్ని జీమూతేశ ధారి అనీ. వాజీ శ్వారా ధిరోహ్ "అని గరుత్మంతుని వాహనంగా కలవాడా అనీ అన్నాడు . ఇక్కడ వాజీ అంటే పక్షి. ఏప్రయత్నమూ అనటానికి ఏ జతనమూ అన్నాడు.యత్నం ప్రకృతి జతనం వికృతి అని చిన్నప్పుడు చదువుకొన్నాం.. ."నీ జవుకుపలుకు లెన్నో –యోజన్ జవి గ్రోలు కర్ణ యుగళము కటువౌ – కాజనులమాటలానునె"లో జవుకు పలుకులు అంటే మనోహర శబ్దాలు.

. "తేజీ లందములు గో –రాజియు పెండియును బైడిరాసుల నిడి "కొండ్రాజును దయతో చూడు అని రాముడిని కోరాడు కవి."రాజీవ కులజు డల్లమ –రాజశ్రీ రామ కృష్ణ రాట్కవిశతకం –బోజరచించి యొసగె గొను "

తర్వాత అష్టకాలు రాశాడు. తర్వాత మత్తకోకిల గానం చేసి స్వామివారలకు కవిరాజ విరాజితం తో పూజించాడు.దత్తాక్షరీ. మందాక్రాంత వృత్తం చెప్పి సుగంధి వృత్తం లో సువాసనలు గుప్పించాడు. ఆఖర్న భుజంగ ప్రయాతం తో ఫినిషింగ్ టచ్ ఇచ్చాడు –ప్రభావంబునన్ పేచి భక్తి ప్రపత్తిన్ – శుభంబొప్ప నానంద శుద్ధిన్ సతంబున్-గాభీరాపగన్ జేయగా గల్గు పుణ్యం –బభీష్టంబు లన్సిద్ధి నందించు ధాత్రిన్ "

కవికి మంచి స్వారస్యం ఉంది. కవిత్వ శుద్ధి బాగా ఉంది. ధారాపాత కవిత్వం తో “జకార “ ప్రాసాన్ని ఓజస్సు తేజస్సు తో సఫలీ కృతం చేశాడు. జగ్గం పేట సీతారాముల కీర్తికి అక్షర పూజ చేసి ధన్యుడయాడు అల్లం రాజు రామ కృష్ణ కవి.

ఈ శతకమూ. ఈ కవీ పెద్ద గా ప్రాచుర్యం పొందలేదేమో అనిపించింది. పరిచయం చేసే భాగ్యం నాకు కలిగింది.

## 34 తాడిమళ్ళ రాజగోపాల శతకం -- శ్రీ మంగు వెంకట రంగనాథ రావు

1913లో కాకినాడ శ్రీ వెంకటేశ్వర విద్యాసాగర ముద్రాక్షర శాలలో శ్రీ మంగు వెంకట రంగనాథ రావు గారి వలన తాడిమళ్ళ రాజగోపాల శతకం ముద్రింపబడింది. వెల బేడ అంటే రెండు అణాలు. ”శ్రీ తాడిమళ్ళ వాస –రాజగోపాల నీ పూజ తేజమయ్య”అనేది మకుటం.

“శ్రీ కృష్ణు నెవ్వరు సేవింపు చుందురో వైకుంఠ పురమున వారు ఘనులు –కమలనాభుని చిత్తకమలంబులొ నున్న వసుధలో మెలగెడు వాడు రాజు –ధనము మెండుగ గూర్చిధన్యులెందరు నైన స్వామి భక్తులతో సాటి రారు వారు –హరినామ కీర్తన లతి భక్తి జేసిన వారి దుష్కర్మముల్వదలి పోను –కలియుగంబునం దొనర్చు నఘంబులెల్ల –బాసి పోగాక వెంబడి బడియు రావు –కల్లగాదయ్య శ్రీ తాడిమళ్ళ వాస –రాజగోపాల నీ పూజ తేజమయ్య “ అంటూ పద్యం తో శతకం ప్రారంభించాడు కవి.

గోపికలు గోపాలునిపై ప్రేమతో మసలుతున్నారు. ”ఎన్ని సోగసులుగలిగిన నేమి ఫలము –కలికి కృష్ణుడు వచ్చుట గాదె సొమ్ము “అంటోంది రాధ. తనమన్మథ బాధను చెలులకు చెప్పి నల్లనయ్యను తనదగ్గరకు వచ్చేట్లు చేయమని ఒక చెలికత్తె కు చెప్పింది –”సొరిది కృష్ణుని దేవమ్మ సుందరాంగి “.కృష్ణయ్యను తనకు కూర్చితే “గుండ్లపేరు. నాబన్న సరాలు. పొజులకమ్మలు. ముత్యాలసరాలు మొదలైనవి కానుకగా ఇస్తానన్నది రాధ. ”పగతుడై మదనుండు బాణములు సంధించి చురుచురుక్కున నేయ” జుస్తున్నాడట.వాటిని తప్పించుకోవటం తన తరం కావటం లేదట. ”పెడ విలుకాడు “తన వెంట నంటి వేధిస్తున్నాడట. ”గడియ గడియకు వేష గాడంచు తెలియక “వెర్రిగొల్లని కి ఏల వెలది నైతి “అని బాధపడింది. మనసంతా రుక్మిణీ పతిని చూసి విసిగిపోయింది వేగంగా రమ్మని చెప్పమన్నది

“పడతిరో నాదు కౌగిలి పంజరముయన్ –జేర్చి” పుణ్యం కట్టుకో మన్నది. ”శేషాహిపై పడుకొంటాను అనే గర్వంతో ఉన్నాడు కాని గొల్లభామల ఇళ్ళల్లో దొంగచాటుగా తిరుగుతాడు అలాంటి వారు ఆయనతోపడుకోవటం చెల్లుతుందా చెప్పు అంటోంది. “గొల్ల వానికి రాజకూతురు నియ్య మాతల్లి దండ్రులకు ధర్మం అవుతుందా ?”పసులకాపరికీలాగు బడతి జేసి గూర్చే గద దైవంబు కుటిల బుద్ధి “అని దైవాన్నీ నిందించింది ఆ దైవమె తన భర్త అని మరచిపోయి. నిందా గర్భం గా కృష్ణుని నిజాన్ని ఎండగడుతోంది –”తన తల్లి గుణములు దక్కించి చూచినా పుత్రుల గని చంపు పుణ్యశాలి –తన అక్క అయిదుగురికి భార్య అయిన గరిత-అన్నేమో దున్నుకు బతికెడి దుక్కి ముచ్చు”అని ఇంటి గుట్టుకాస్తా బయట పెట్టింది.

రాధ చెలికత్తె తో “పున్నమినాటి చంద్రునిగా సొగసుగా ఉన్నాననీ. జిగివన్నె బంగారు చీర కట్టాననీ. బంగారు ఆభరణాలు రత్నాలతో మెరిసిపోతున్నాననీ. అన్ని వేళలలో ఆయన్నే దైవంగా కొలిచేదానిననీ. రాకపోతే ఒక్క నిమిషం కూడా బతక లేననీ “దీనంగా మొరపెట్టుకొన్నది విరహిణి రాధ. .తన అధరామృతాన్ని తాగితాగి ఆనందించిన వాడికి తాను ఇప్పుడు విషం అయ్యానా అని దెప్పింది.

కృష్ణుని ఆనవాలు కూడా చెప్పింది అడగకుండానే చెలికి –”వేణువు దన చేత బూనువాడు –రహినొప్పుశంఖ చక్రంబులు గలవాడు. శ్రీ వత్స లాంఛన మున్నవాడు,కస్తూరి తిలకం, చెవులకు రత్నకుండలాలున్నవాడు. కమనీయ జీమూత కాంతి వాడు స్త్రీలతో నవ్వుతూ తిరిగేవాడు..వెన్నెలలో తన దగ్గర కూర్చున్నా ఒక్క ముద్దు కూడా ఇవ్వలేదట. గంధం పూస్తాను అంటే వద్దనేవాడు. నోరారా తన్ను ఎప్పుడూ పిలిచినా పాపాన పోలేదట కొంటె కన్నయ్య. కర్పూర తాంబూలం ప్రేమగా చుట్టినోట్లో పెడితే మొత్తం తినేవాడే కాని కొరికి సగం తనకు ఎప్పుడూ పెట్టలేదట. సిగ్గులేకుండా చెట్టెక్కి ఆడవారు జలక్రీడలాడుతుంటే కొంటె చూపులు చూసి వలువలు ఎత్తుకుపోయినవాడట. దిసి మొలలతో బయటికి వస్తే చీరలిస్తానని మొండికేసినవాడట.ఇలాంటి కొంటె కోణంగిని “మా తలిదండ్రుల మాట లాలింపక కుటిల బుద్ధిని గూడి, కోలుపోతి-వేగిర పడి నేను వేడుకొంటినిగాని, సవతి పోరు ఉంటుందని జడియ నైతి “అని రోట్లో తలపెట్టి రోకటి పోటుల బాధ భరించినట్లు రాధ తన బాధ వెళ్ళబోసింది. ఇదంతా ఆమెకు కన్నయ్యపై ఉన్న ఆరాధనాభావమే. ఆపనులన్నీ ఆమెకు చాలా ప్రీతికరమైనవే లోకం మెచ్చేవే ఆయన్ను భగవంతునిగా ఆరాధించిన చేష్టలే అవి.

చివరికి ఆపద మొక్కులు మొక్కింది రాధ –”దశరధ నందన ధాత్రీశ. యచ్యుత దైతేయ హర మీకు దండమయ్య –గౌతమాంగన శాప కలుషంబు బాపిన ధర్మాత్మ హరి మీకు దండమయ్య –వర నర వందన వారిధి బంధన దశ కంఠ సంహార దండమయ్య “అని రాముడిని. తర్వాత కృష్ణుడిని స్తుతించి. ”చల్లగా వర్ధిల్లు సరస సద్గుణమణీ సౌభాగ్యమే నీకు సత్యభామ,నీవు కోరిన కోర్కెలు నిత్యముగను సఫలమాయెను “అని మెచ్చి. క్షేమ సమాచారాలు అడిగి.మళ్ళీ మనసు కన్నయ్యపైకి మళ్లి “ఏమిరా కృష్ణ ఎంత గర్వమురా పిలిచినపలుకవు పిరికి తనమా ??”అని వాయించి కన్నయ్య చేసిన దొంగాటలన్నీ మళ్ళీ ఏకరువు పెట్టి ఉతికి జాడించి ఆరేసి అవతార పురుషుని లీలా విశేషాలు వివరించింది.

“ఆదికాలమునాడే అవతార మెట్టిన మత్స్యావతారమహిమ. చెప్పి అది హేయమైన అవతారమని దెప్పి. కుటిలబుద్ధితో కూర్మావతార తాబేలు అవటం తప్పుకాదా. పంది అవతారం ఎలా ఎత్తావయ్యా అని ఈసడించి. నరుడు –సింహగా. మరుగుజ్జు వాడిగా పుట్టటం “వేషధారికి నౌ బ్రహ్మ వెర్రియగుచు. అర్జునునికోసం కృష్ణావతారం. అర్జున రధానికి కపి ధ్వజంగా హనుమంతుని పెట్టి పదకొండు అక్షౌహిణుల సైన్యాన్ని చంపించి అర్జునునికాపాడి,ద్రౌపదిని నిండుసభలో కాపాడి న పరమాత్మను నిండారా స్తుతించి. పదేళ్ళ వయసులో గోవర్ధన గిరి ఎత్తి. ఇంద్రుడు రాళ్ళవాన కురిపిస్తే గో,గోపాలరులన్దర్నీ ఆ గొడుగు కింద చేర్చి రక్షించి న బాలగోపాల లీలలు వర్ణించింది. రామావతారం లో సీతాపహరణం రావణాది రాక్షస సంహారం.మళ్ళీ కృష్ణావతారాదిగాధలు చెప్పి చివరికి తనను ఆదుకోమని బతిమాలింది.

“జలధర దేహాయ శంఖు చక్ర గదాధరాయ మానిత భర్గాయతే నమోస్తు –పాలిత సుజనాయ భావజ జనకాయ. దీనార్తిహరణాయ తే నమోస్తు –సామజ వరదాయ శాసిత దనుజాయ. దేవకీ తనయాయ తే నమోస్తు –”అని ప్రణామము లొనరించియతని మదిని –గనికరము దోచునట్టుల గారవించి-తరుణ మిది యని తెలిసి –శ్రీ తాడిమళ్ళరాజగోపాలు దోడ్తెరె రమణు లార”అని ముగిస్తూ కూడా రాధ హృదయబాధను తీర్చమని ఆర్తిగా కోరింది.

కమనీయ పద్య రచన. సుమదురభావ జాలం. మనోజ్ఞ శైలి,ఆకర్షించే కథా సంవిధానం. విషయవివరణలో పట్టు తో శతకం బాగా రాణించింది. .తాడిమళ్ళ ఎక్కడ ఉన్నదో తెలియదు. ఆలయ చరిత్ర వివరంకూడా లేదు. ఒకసగటు మధ్యతరగతి స్త్రీ హృదయం ఆవిష్కరించి నట్లున్నది. తన పొరబాట్లు. తెలిసీ తెలియని తనం. సాటి

వారిలో పలచన అయిపోతాననే భయం. ధూర్త గోపాలుడే అయినా తనమనసు నిండా నిండిఉన్న తేజోమూర్తిగా. ఆరాధనాభావం ఉన్న రాధను కవి మనోహరంగా మన ముందు నిలిపాడు భేష్ అనిపించాడు. రాజగోపాలస్వామి మహిమా లేదు. .”రాధనురా ప్రభూ నిరపరాధనురా –అనురాగ భావనా రాదన మగ్న మానసనురా-కరుణించరా’,కరుణించరా ’అని కరుణశ్రీ పద్యాలు గుర్తుకు వస్తాయి. ఈ రాజగోపాల శతకం, కవి గురించి మనవారెవ్వరూ గుర్తించినట్లు లేదు. పరిచయం చేసే అదృష్టం నాకు దక్కింది.

## 35 హంసలదీవి శతకం -- శ్రీ కాసుల పురుషోత్తమకవి

మధురకవి కాసుల పురుషోత్తమకవి హంసల దీవి శతకం రాయగా. 1925లో మచిలీ పట్నం బుట్టాయ పేటలోని నేషనల్ ప్రెస్ లో వేమూరి చిరంజీవావదానుల చేత ప్రకటితమైనది. వెల తెలుపలేదు. ఎలాంటి ఉపోద్ఘాతం. కవి పరిచయాదులు కూడా లేవు. సూటిగా శతకాన్ని “’లలితా కృష్ణాబ్ది సంగమ స్థల విహార –పరమ కరుణా స్వభావ గోపాల దేవ”మకుటం తో ప్రారంభించి “శత సీస పద్యాల కాసులు రాల్చాడు “కాసుల పురుషోత్తమకవి. మొదటిపద్యం –

“శ్రీ రుక్మిణీ మనస్సార సేందిర-సత్యభామా ముఖాబ్జాత మిత్ర –జాంబవతీ పటుస్థన శైల జీమూత –ఘన సుదాంతాన యోవన మదేభ



లక్ష్మణా పరి రంభ లలిత పంజరకీర –భాద్రావలీతరంగ వనమరాళ-మిత్ర
విందా ధర మృదు పల్లవ పిత –రవి జాదృగుర్వల రాజబింబ

షోడశ సహస్రకామినీ స్తోమకామ –భావజ విలాస భావజ విలాస

హంసల దీవి వాస –లలిత కృష్ణాబ్ధి సంగమస్తల విహార –పరమకరుణా
స్వభావ గోపాల దేవ" అని శ్రీకృష్ణుని అష్టభార్యల వర్ణన చేశాడు.

కాసులకవి వ్యాజస్తుతి గా కావ్యాలు రాశాడు. క్రీశ.1791లో కృష్ణాజిల్లా దేవరకోట అనే చల్లపల్లి సంస్థాన రాజు అంకినీడు రాజా ఆస్థానకవి. మోపిదేవి దగ్గర పెద ప్రోలు గ్రామవాసి. నేను మొట్టమొదట మోపిదేవి హైస్కూల్ లో సైన్స్ మాస్టర్ గా చేరినప్పుడు ఈ పేద ప్రోలులోనే కాపురం పెట్టి రోజు మోపిదేవి వెళ్లి ఉద్యోగం చేసి వచ్చేవాడిని. పుల్లమ రాజు అనే పేరు కూడా ఈకవికి ఉంది ఈయన రచనలు అర్ధాంతర న్యాస అలంకారాలతో ఉంటూ రచనలకు వన్నె తెచ్చాయి.

వీరు జన్మించిన పెదప్రోలు గ్రామంలో, వీరి విగ్రహాన్ని, 2012, ఏప్రిల్-29నాడు ఆవిష్కరించారు. ఘంటసాల మండలంలోని శ్రీకాకుళం గ్రామములో వేంచేసియున్న శ్రీ ఆంధ్రమహావిష్ణువు ఆలయం ప్రాంగణంలో, శ్రీ కాసులపురుషోత్తమ కవి విగ్రహాన్ని, 2016, ఫిబ్రవరి-11వ తేదీనాడు ఆవిష్కరించారు. ఈ విగ్రహాన్ని శ్రీ కాసుల పురుషోత్తమ కవి వంశీకులైన శ్రీ జాడశ్రీజా సాగర్ రాజు, శ్రీ కాసుల కృష్ణంరాజు, శ్రీ కాసుల శ్రీధరరాజు ఏర్పాటు చేసారు.

రచనలు

విజయనగర సామ్రాజ్య ప్రాభవంలో వెలిగిన ఆంధ్ర మహావిష్ణువు దేవాలయం, తరువాత సరైన పాలన లేక నిర్లక్ష్యానికి గురి అయ్యిందిట. అప్పుడు కాసుల పురుషోత్తమ కవి ఈ స్వామి పై నిందాస్తుతిగా ఆంధ్ర నాయక శతకాన్ని రచించాడుట. ఇది విని అప్పట్లోని జమీందారు ఈ ఆలయాన్ని మళ్ళీ పునరుద్ధరించాడని చెప్పుకుంటారు.

ఆంధ్రనాయక శతకం:- ఈ శతకం సీస పద్యాలతో రచించ బడింది. అద్భుతమైన ధార, ఆకట్టుకునే శైలి ఈ కవి సొత్తు. మీరు ఈ శతకాన్ని ఇక్కడ చదివి ఆనందిచవచ్చు. శ్రీకాకుళం గ్రామములోని శ్రీ రాజ్యలక్ష్మీ సమేత శ్రీ శ్రీకాకుళేశ్వరస్వామివారిని కీర్తించుచూ రచించిన ఆంధ్రనాయకశతకం లోని 108 పద్యాలను, ఆ ఆలయప్రాంగణంలో రాతి శాసనాలరూపంలో భద్రపరచారు. ఈ పద్యాలను వారి వారసులు శ్రీ కాసుల కృష్ణంరాజు, రాజశ్రీధర్ లు, ప్రముఖ చలనచిత్ర నేపథ్య గాయకులు గాయకులు శ్రీ శ్రీకృష్ణచే ఆలపింపజేసి, సీ.డీ.రూపంలో నిక్షిప్తం చేసారు. ఈ సీ.డీ.లను 2016, ఫిబ్రవరి-4వ తేదీనాడు ఆలయంలో ఆవిష్కరించారు.

హంసల దీవి శతకాన్ని ఇది హంసలదీవిలోని అధిషాసనదైవమైన గోపాలదేవునిపై ఆంధ్రనాయక శతకకర్త శ్రీ కాసుల పురుషోత్తమకవిచే కూర్చబడినది. శ్రీ కాసుల పురుషోత్తమ కవి తలిదండ్రులు రమణమాంబ, అప్పలరాజులు, కాశ్యపగోత్రజుడు. విద్యాగురువు శ్రీమాన్ అద్దంకి తిరుమలాచార్యులవారు.

ఈ హంసలదీవి గోపాల శతకం, కవిగారు రచించిన నాలుగు శతకాల్లో మూడవది. మొదటి రెండూ, మానసబోధ శతకం,రామా! భక్తకల్పక ద్రామా అన్న మకుటం గల శతకాలు అలభ్యాలు. కవి ఈ శతకంలో భక్తిమీర భాగవతం లోని గాధలను తనివితీరా గానం చేశారు. ఆ చేసిన తీరులో భగవంతునితో ఆయనకు గల సన్నిహితత్వం ఎలాంటిదో అవగతమవుతుంది. పద్యం నడిపించిన తీరు అత్యద్భుతం. కాగా ఆయనకు గల శబ్దాధికారం నన్నయకు సాటి వచ్చేది. అంత్యానుప్రాస, ముక్తపదగ్రస్తాలు ఈయనకు ఒదిగినట్లు మరొకరికి ఒదుగలేదంటే అతిశయోక్తి కాదు. ఇక భాషాపటుత్వ విషయం చెప్పనే అక్కరలేదు. శతకమంటూ చదవటం ప్రారంభిస్తే, పూర్తి చేసే దాక వదలిపెట్టలేము. భక్తులు, విద్యార్థులూ, పఠించి లాభపుదురుగాక అని ఆశిస్తూ...

- ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు

ఒకవేళ చీకటింటికి దీప మిడినట్లు

తేటగా సర్వంబు దెలిసియుండు

నొకవేళ నీహార మెనసిన పద్మంబు

గతి బోల్పదగి మందమతిగనుండు

నొకవేళ ద్విరదమూరక త్రొక్కిన కొలంకు

పగిది నెంతయుఁ గల్కబారియుండు

నొకవేళ క్రొత్తనీటికి మీను బ్రాకిన

కరణి మహాశలఁ దిరుగుచుండు

గాని నిశ్చలపడదు నామానసంబు

భావజవిలాస! హంసల దీవివాస!

లలిత కృష్ణాబ్ది సంగమస్థల విహార!

పరమ కరుణాస్వభావ! గోపాలదేవ!

భావం - స్వామీ నామనస్సు ఏనాడు నిశ్చలంగా ఉండదయ్యా

ఒకసారి చీకటింట్లో దీపం పెట్టినట్టుగా, అంతా సుస్పష్ట

మౌతుంది. ఒక సమయంలో మంచుతో కూడిన పద్మంలా

మందమతిగా ఉంటుంది. ఒక్కోసారి ఏనుగు త్రొక్కిన

సరస్సులా కలుషితమైపోతుంది. ఒక్కొక్కప్పుడు క్రొత్తనీటికి

ఎదురు ప్రాకే చేపలా గొప్ప ఆశలతో తిరుగుతూ ఉంటుంది.

మన్మథాకారా కృష్ణా సముద్ర సంగమ స్థలమైన హంసలదీవిలో

విహరించువాడా దయాస్వభావా గోపాలదేవా - అని భావం

ఈ శతకంలో మకుటం మూడుపాదాలు గమనించగలరు.

అచ్యుతవరలబ్ధకవితా విదగ్ధుడు — ఆంధ్రనాయకశతక కర్త శ్రీ కాసుల పురుషోత్తమకవివరుడు.

ఈ శారదాతనయుడు ఆంధ్రశతక సారస్వతచరిత్రలోనే శాశ్వత నిరుపమ స్థానాన్ని సంపాదించుకున్న అకళంక, అపూర్వ పుణ్యమయ గ్రంథరచయిత. వీరి రచనలగురించి విశ్వనాథ సత్యనారాయణగారు “సాహిత్య సురభి” అనే తమ గ్రంథంలో ఇలా అన్నారు:

“– – -కాసుల పురుషోత్తమకవి- – -శతకములు మాత్రమే వ్రాసెను. అతని కవిత్వము కావ్యదోషము లెరుంగనిది“.

మరొక సందర్భంలో ఒక సభలో మాట్లాడుతూ విశ్వనాథవారే ప్రస్తావవశంగా ఇలాగ అన్నారట:

“తెలుగులో భాగవతాన్ని పోతనగారు రచించి ఉండకపోతే, పురుషోత్తమకవి తప్పక వ్రాసివుండేవాడు“.

అంటే పురుషోత్తమకవి పోతనగారి స్థాయికిచెందిన సహజకవి,పండితుడు, మహాభక్తుడు అన్నమాట.కృష్ణా జిల్లాలోని దివిసీమకిచెందిన పెదప్రోలు పురుషోత్తమకవిగారి స్వస్థలము. అప్పలరాజు-రమణమ్మ దంపతుల కుమారుడు పురుషోత్తమకవి. చిన్నతనంలో వారి పేరు ‘పుల్లంరాజు’ట! కాని పురుషోత్తమ నామధేయమే

ఆయనకి స్థిరపడింది. వారు “వంది”(తెలుగులో భట్రాజులు) కులానికి చెందినవారు. “వందంతే ఇతి వందినః” అంటే స్తోత్రముచేసేవారని అర్థం! “వది” ధాతువు-root-నుంచి ‘వంది’ అనేమాట వచ్చింది. ఈ ధాతువుకి “అభివాదనమూ,స్తుతి చేయుట” అని అర్థం. ఈ వందిపరంపర గురించి కాళిదాసమహాకవి తన రఘు వంశ మహాకావ్యం(IV—6.) లో ఇలాగ తెలియచేసేరు:

“పరికల్పిత సాన్నిధ్యా

కాలే కాలే చ వందిషు |

స్తుత్యం స్తుతిభిః అర్థ్యాభిః

ఉపతస్థే సరస్వతీ” ||

“ఆయా సందర్భానుసారంగా సరస్వతీ దేవి వందిలకి సన్నిహితంగావుంటూ, వారు స్తోత్రంచెయ్యవలసిన విషయానికి అనుగుణమైన అర్థ-శబ్దాలని వారియందు కలిగింప చేస్తూంటుంది”.

దీనివలన మనం తెలుసుకోవలసిన విషయం ఏమిటంటే వంది-మాగధులు ప్రత్యేక వాగ్దేవతానుగ్రహం-అంటే పలుకులవెలది ప్రసన్నతని సహజంగానే కలిగివుంటారన్నమాట.

కాసుల పురుషోత్తమకవిగారు ఈ దివ్యానుగ్రహాన్ని తన ఇష్టదైవమైన పురుషోత్తముడికి సంపూర్ణంగా సమర్పించుకున్నారు. ఈ దివ్యానుగ్రహంతో వారు నాలుగు శతకాలు రచించేరు:

కవిత్వం లో కాసులను ఏరుకొందాం –”కుబ్జగంధమొసంగి కొమరు ప్రాయంబున –శాతకుమ్భ శలాక రీతిగా “ఉందట. మాలికుడు మాలికలు అర్పిస్తే మౌనులు గగన నిర్మలత పొందారట. రీజకుడు శుభ్రవస్త్రాలిస్తే ఇహ పర సౌఖ్య లబ్దిపొందాడు. విదురుడు ఇష్టాన్న భోజనం పెట్టి పరమ భాగవతోత్తముడు అయ్యాడు. గురుపుత్రుని

బ్రతికించి కుచేలునికి కలుములిచ్చి. అర్జున సారధ్యం చేసి గెలిపించి ఉత్తర గర్భాన్ని కాపాడటమే సాక్షి ఆయన కృప అనంతం.

“గతి నీవే సుమ్ము. నీవతి వేగరమ్ము నా మతి బాదుకొమ్ము –కామితములిమ్ము – కృపాశాలి వన్న –సేనపచారి నన్న –నింత పరాకు నీకున్న నేపమురన్న “అంటాడు ఆర్తిగా. ”ఏ తండ్రి నిర్మించే భూతక పంచ క గునోపెతావయవ సర్వ చేతంబు /

?ఏ సద్గురుడు దెల్పెహితవుగా సుజ్ఞాన మెలమి గర్భస్థ జీవులనెల్ల”ఏస్వామి రక్షించాడు అని స్తుతించాడు. నిద్రలో కూడా స్వామి దర్శనమే కోరాడు. వరదివాకర నిశాకరులు నీ నేత్రాలు పరమేష్టి నీ నాభి పద్మ సంభవుడు. కమలజాండాలు  నీ చేతి బంతులు. నిఖిల తరంగిణులు నీ సపాదకములు “అని వర్ణిస్తాడు.

“అత్యున్నతా కారి వయ్యు బలీంద్రుని యాచించు చొ గుజ్జువైతి వీవు –సద్గుణ శాలివైనా సత్రాజిత్తుని శమంతకమణి ఇమ్మని  దేబిరించావు. అఖిల పూజార్హుడవైనా బాపనయ్యలని అన్నం అడిగావు. అసహాయ శూరుడవైనా పారిజాతం పీక్కొని పరుగోపరుగు లంకిన్చావు –ఘనులకు యాచన లాఘవమే అనిపించావు అని వ్యాజస్తుతి చేశాడు. అక్రూర విదుర భీష్మ అమ్బరీషుల పై చూపిన దయారసం తనపైనాచిలకమన్నాడు. శబరీ నహల్య పాంచాలి ఉత్తర లను బ్రోచినట్లు ధృవ,విభీషణ గుహులపై చూపినకూర్మి చూపమన్నాడు – ”నమ్మినాడను వోషించ న్యాయమయ్య”అని భారం ఆయనమీదే వేశాడు. ”భువనముల్ గన్న తండ్రివి నిజంబుగా నీడ –నీ బిడ్డ నని నే గణియిమ్పవలేనే “అని లోక రక్షా జాగరూకుడవైన నువ్వు నాపై పరాకు ఎందుకు చూపిస్తున్నావు. సకలాన్తరాత్మ స్వామివి. నా మనో వ్యధ నేనే చెప్పాలా ?”అని ప్రశ్నించి “ఎద్ది భవదిచ్ఛ నా రీతి నేలుమయ్య “అని ఆయనకే వదిలేశాడు

సముద్ర తరంగాలు లెక్కపెట్టవచ్చుకానీ నీ చరిత్రలు వర్ణించలేము –గంగానది నీటి ని గణించ వచ్చుకానీ. నీ గుణాలు వర్ణించలేము –వర్ష దారలు లెక్కపెట్టవచ్చుకానీ నీ లీలలు వర్ణించలేము. ఆకాశంలో చుక్కలు లెక్కవేయవచ్చుకానీ. నీ వినోదాలు వర్ణించలేము –"తరము గాదైన తోచినంతయే నుతించాను "అని వినయంగా చెప్పుకొన్నాడు. "జగతి జీవుడు పునర్జన్మ దుఃఖము బాయు –భద్రమౌ శాశ్వత పదము దొరకు –దాసులకు నీదు నామ కీర్తనల వలన "అని అభయమిచ్చాడు అందరికి పురుషోత్తమ మహాకవి.

నీ కథా కావ్యం నిర్మించి బమ్మెర పోతన. నీకు అర్పణ గా అన్నదానం చేసి కోట సింగన. అర్ధు లపాలిటి కల్పవృక్షం భాస్కరుడు. నీకు కోపెలకట్టి కృత్తి వెంటి వెంకటాచలం లు మృతి చెందినా కీర్తి స్థిరులయ్యారు అని అలాతరించినవారిని మనకు జ్ఞాపకం చేశాడు. తాను కాశ్యప గోత్రుడనని. కాసుల వంశం లో అప్పలరాజు. రమణాంబ లకు పుత్రుడననీ. అద్దంకి తిరుమలాచార్య తనగురువనీ. "భవ తీర్ధ మరందపాన ద్విరేఫా య మాన మానసు డను,-మాన్యహితుడ –పురుషోత్తమాఖ్యుండ-పూల్దండ వలె నీకు శతకంబు గూర్చితి శాశ్వతముగ-చిత్త గింపుము నీ పాద సేవకుడను –భావజ విలాస హంసల దీవి వాస –లలిత కృష్ణాబ్ధిసంగమ స్థల విహార –పరమ కరుణాస్వభావ గోపాల దేవ"అని నూరవ పద్యంతో హంసల దీవి శతకం ముగించాడు కాసుల పురుషోత్తమ కవి.

శతకమంతా ఉదాహరింపదగిన పద్యాలే. ఆయన భావుకతకు పరమ భక్తి తాత్పర్యాలకు వర్ణనా వైదుష్యానికి. ఔచిత్య ప్రకర్షకు. ఆర్తికి అద్భుత శయ్యా సౌభాగ్యానికీ. కృష్ణాప్రవాహ సదృశ పద్య ఝరి కి అబ్బురపడతాం. ఆశ్చర్యాంబు ధిలో మునిగి తేలుతాం. హంసల దీవి కృష్ణా సంగమ పవిత్ర స్నానం చేసినంత అనుభూతి పొందుతాం. కవీ, మనమూ ధన్యులం. ఇప్పుడు శ్రీ వేణుగోపాల స్వామి ఆలయ చరిత్ర తెలుసుకొందాం –

శ్రీ వేణుగోపాల స్వామి ఆలయం ఒక పవిత్ర పుణ్య స్థలం. పూర్వం దేవతలు ఈ గుడిని నిర్మించారు అని ఇక్కడి ప్రజల నమ్మకము.ఈ ఆలయానికి గాలిగోపురం ఉండదు. ఇక్కడ మాఘ పౌర్ణమి నాడు ప్రత్యేకమైన పూజలుమహోత్సవాలు, అన్నదానం జరుగుతాయి. ఈ ఆలయంలోని శ్రీ వేణుగోపాలస్వామి పిలిస్తే పలుకుతాడని భక్తులు విశ్వసిస్తారు. ఈ ప్రాంతంలో బయటపడిన శ్రీ కృష్ణుడి విగ్రహం అనుకోని కారణంగా

దెబ్బతినడంతో, దానిని ప్రతిష్ఠించే విషయమై ప్రజలు ఆలోచనలో పడ్డారు. అప్పుడు వారిలో ఒకరికి స్వామి కలలో కనిపించి చెప్పిన ప్రకారం కాకరపర్రు వెళ్ళి ఓ గృహస్థుని ఇంట్లో కాకరపాదు కింద భూమిలో వున్న స్వామివారి విగ్రహాన్ని వెలికితీశారు. ఈ కారణంగానే ఆ ఊరికి కూడా కాకర పర్తి అనే పేరు వచ్చి ఉంటుందని భావిస్తున్నారు. ఇక్కడ బయటపడిన శ్రీ వేణుగోపాల స్వామిని హంసలదీవికి తెచ్చి ప్రతిష్ఠించారు. అయితే ప్రపంచంలో ఎక్కడా కనిపించని విధంగా ఈ విగ్రహం నీలమేఘ ఛాయలో ఉండటాన్ని విశేషంగా చెప్పుకుంటారు.

ఈ దేవాలయం, విజయవాడ శ్రీ దుర్గా మల్లేశ్వరస్వామివారి దేవాలయానికి దత్తత దేవాలయంగా ఉంది.

ప్రత్యేక పూజలు.

ఈ ఆలయంలో వేణుగోపాలస్వామి శ్రీ రుక్మిణీ సత్యభామ సమేతుడై పూజలు అందుకుంటూ ఉన్నాడు. ఇక్కడి దేవాలయ కుడ్యాలపై రామాయణ ఘట్టాలు అందంగా చెక్కబడి ఉన్నాయి. తూర్పు చాళుక్యుల శిల్పకళా వైభవానికి అద్దం పడుతుంటాయి. ప్రతి యేడు మాఘ శుద్ధ నవమి నుంచి బహుళ పాడ్యమి వరకూ స్వామివారికి బ్రహ్మోత్సవాలు నిర్వహిస్తుంటారు. ఈ సందర్భంగా వేలసంఖ్యలో వచ్చిన ప్రజలు స్వామివారిని దర్శించుకుంటారు. ఆ తరువాత అక్కడికి దగ్గరలో ఉన్న సాగరంలో కృష్ణానది (తుంగ - భద్ర నదులను తనలో కలుపుకున్న కృష్ణవేణి ఇక్కడే సముద్రంలో కలుస్తుంది) క్షేత్రంలో స్నానం చేసి తరిస్తుంటారు.

ఈ ఆలయంలో ప్రతి సంవత్సరం స్వామివారి వార్షిక బ్రహ్మోత్సవాలు, మాఘ పౌర్ణమికి వైభవంగా నిర్వహించెదరు. మాఘ శుద్ధ త్రయోదశినాడు ఉదయం స్వామివారిని శాస్త్రోక్తంగా పెళ్ళికుమారునిచేసి ప్రత్యేకపూజలు నిర్వహించెదరు. చతుర్దశినాడు ఉదయం శ్రీ రాజ్యలక్ష్మీ అమ్మవారికి కుంకుమపూజను రాత్రికి స్వామివారి కళ్యాణం నిర్వహించెదరు. పౌర్ణమినాడు రథోత్సవం మరుసటిరోజున చక్రస్నానం (వసంతోత్సవం) మొదలగు కార్యక్రమాలు నిర్వహించెదరు.

## 36 పుత్ర శతకం -- శ్రీ లక్కైన మల్లికార్జునుడు


శ్రీ గురుభ్యో నమః

పుత్రశతకము

గ్రంథకర్త:
కవిరత్న లక్కన మల్లికార్జునుఁడు

కృతిపతి:
కొడాలి పున్నయ్య చౌదరిగారు
గ్రామసంఘము ప్రెసిడెంటు,
వల్లూరుపాలెము.

1938.

కాపీరైటు రిజిష్టర్డు] [వెల రు 0-3-0

కవిరత్న శ్రీ లక్కైన మల్లికార్జునుడు రచించి. వల్లూరుపాలెం గ్రామ ప్రెసిడెంట్ శ్రీ కొడాలి పున్నయ్య చౌదరికి అంకితం చేసిన కందాలతో కూర్చిన ”పుత్ర శతకం “1938లో ఎ.జి. ప్రెస్ విజయవాడ లో ముద్రింపబడింది. వెల.3అణాలు. బాలబాలికలకు ఉపయోగ పడేట్లుగా శతకాన్ని రాశానని కవి చెప్పారు. దీనికి వీర శైవగురుకులం భూషణులు “వేద కావ్యస్మృతి దర్శన తీర్ధ సాహిత్య విశారద శివశ్రీ పండిత చిదిరిమఠంవీర భద్ర శర్మగారు ముందు మాటలు రాస్తూ “ఉపాధ్యాయుడైన ఈ కవి బాలుర హృదయాలను గ్రహించి సరళంగా ఈశతకం రాశారు. దీన్ని విద్యాధికారులు అనివార్య పాఠ్యం గా నిర్ణయించాలి “అన్నారు. విజయవాడ సీనియర్ డిప్యూటీ ఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్స్ వేదమూర్తులు శ్రీ కుప్పా వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రి “ఈ కవి మల్లికార్జున శతకం. శ్రీ సీమంతిని., కరి బసవేశ్వర బోధామృతం కూడా రచించారు. పుత్రశతకం ప్రాధమిక స్థాయిలో తప్పక బోధింప వలసిన పుస్తకం. ఇందులో నీతి. సత్సంఘం దైవ భక్తీ చదువు వినయ సంపద అభిమానం ధైర్యం ఉపకారం మొదలైనవన్నీ వివరించారు. ప్రతి పద్యం అర్ధ గాంభీర్యం తో ఉంది “అన్నారు. మచిలీ బందరుకు చెందిన వ్యాకరణ విద్యా ప్రవీణ శ్రీ బివి వరప్రసాద రాయ వర్మ “శతకం సరస వచో లాలిత్యంగా ఉంది ;శైలి హృద్యం”అన్నారు. వల్లూరు పాలెం బోర్డు ఉన్నత ప్రాధమిక పాఠశాల ప్రధానోపాధ్యాడులు శ్రీ లొల్ల బాలకోటేశ్వరరావు “రసవంతమైన పద్యాలతో నీతికి నిధిగా ఉన్న శతకం.బాలుర కోమల హృదయాలలో ఈ పద్య భావాలు నాటితే వారి జీవితం మూడు పూలు ఆరు కాయలుగా వర్ధిల్లటం ఖాయం..సత్ప్రవర్తన అలవడుతుంది. విద్యా శాఖాధికారులు ఈ శతకాన్ని 2,3తరగతులకు పఠనీయ గ్రంథం గా తప్పక చేయాలి “అన్నారు. ఈ బాలకోటేశ్వర రావు గారు నేను సైన్స్ మాస్టర్ గా మోపిదేవి జిల్లా పరిషత్ హైస్కూల్ లో మొదటి సారిగా1963లో ఉద్యోగం లో చేరినప్పుడు అక్కడ సెకండరి గ్రేడ్ టీచర్. గా ఉండేవారు. వీరిని మా హెడ్ మాస్టర్ శ్రీ తూమాటి కోటేశ్వరరావు గారు “గురువుగారు “అని చాలా భక్తితో పిలిచేవారు.


శ్రీ గురుభ్యోనమః

పుత్రశతకము

గ్రంథకర్త:
కవిరత్న లక్కన మల్లికార్జునుఁడు

కృతిపతి:
కొడాలి పున్నయ్యచౌదరిగారు
గ్రామపంచాయతీ ప్రెసిడెంటు,
వల్లూరుపాలెము.

1938.

కాపీరైటు రిజిష్టరుడ్]

[వెల రు 0-8-0



మోపిదేవిలో ఉండగానే ప్రభావతి తో నా వివాహం జరిగింది. .ఆయన సుబ్రహ్మణ్యేశ్వర స్వామి దేవాలయం లో ఒక నెలరోజులు రోజూ ఒక దంపతుల చేత కల్యాణం చేయించారు. మా దంపతులతో కూడా చేయించి ఆ పుణ్యాన్ని మాకు దక్కించారు. వీరి పెద్ద కుమారుడుశ్రీ శ్రీరామమూర్తి జూనియర్ తెలుగు పండితులుగా మాతో పని చేశారు. ఇంకొక కుమారుడు మా హైస్కూల్ లో అప్పుడు 9వ తరగతి చదివేవాడు.తెల్ల పంచే తెల్ల లాల్చీ ఉత్తరీయం.పిలకా తరచూ ముక్కుపొడుం పీలుస్తూ తో తమాషాగా ఎడమకన్ను మూసి కనిపించేవారు.ఆయన. ఆ పరిసర ప్రాంతాల వారందరికీ గురు సమానులే.. ఆయుర్వేద శిరోమణి శ్రీ మద్దాలి వెంకటేశ్వరరావు "భక్తీ యుక్తి ముక్తి తో సరస పద గుంఫితంగా శతకం ఉంది.చిరుతలపాలిటి"జేజేల మ్రాకు "అనవచ్చు "అన్నారు.

ఆ తర్వాత కవి కృతి కర్తపై పద్యాలు రాసి "మృదు మధుర స్వభావి. శాంతమనస్కుడు. గ్రామాభ్యుదయానికి పాటుపడినవాడు. లోకజ్ఞాని. సంపదలతో తులతూగే వాడు కీర్తి సాంద్రుడు అయిన గ్రామ ప్రెసిడెంట్ శ్రీకొడాలి పున్నయ్య చౌదరి అని కీర్తించి –"ఎన్నో శుభముల నాతడు –నెన్నగ నా కొసగి యుంట నిది యర్పింతున్ –చెన్నుగ నిలగలదాకను-మిన్నగ నలరారునట్లు మేదిని యందున్ "అని శుభం పలికారు.

ఆ తర్వాత శివ. శివా విఘ్నేశ బ్రహ్మ వాణీ స్తుతి చేసి. శ్రీనాథ నన్ని చోడ సోమనాథ భవభూతి. నన్నయ తిక్కనాది కవులను స్మరించి. వీర భద్ర గురుదేవుని కీర్తించి "పుత్రా "మకుటంతో మొదలు పెట్టాడు. ధర్మం వేదం శాస్త్రాలు వీరశైవం గురించి చెప్పి –"శ్రీకర విద్యల గరపుచు –ప్రాకటముగ నీతిగరపి భవ్య శుభంబుల్ –చేకూర చేయు వారలు – నీకెప్పుడు దైవ సములు నిక్కము పుత్రా "అని దైవసమానుల గురించి ఘనం గా చెప్పారు. తలిదండ్రులు గురువులు జ్ఞానం తెలిపేవారు, అగ్రజులుపెద్దలు దైవ సమానులే అన్నారు. భారతం నీతులకు పెన్నిధి. అభి వృద్ధికోసం సత్సంఘాన్ని నెరపాలి. పండిత గోష్టిలో ధర్మం మెండుగా గ్రహించాలి. "చదువే జ్ఞానమొసగును- చదువే గురు భోగ భాగ్య సంపదలొసగున్ –చదువే పాత్రత నొసగును –చదువే సత్కీర్తి నొసగు చదువుము పుత్రా "అని పుత్ర వాత్సల్యంగా చదువుకొని బాగు పడమన్నారు. వినయం బహుజన మైత్రిని

సంపాదిస్తుంది. కోరిన కోర్కెలిచ్చి సద్గుణాలు కలిగిస్తుంది. సంపాదనకంటే ఖర్చు తక్కువగా ఉంటేనే పురోగతి ఉంటుందని హెచ్చరిక చేశారు. ”మన యాంధ్ర భాష మీదను –మన యాంధ్ర జనంబుమీద మహిమాస్పదమౌ –మన యాంధ్ర భూమిమీదను –మనుజున కభిమాన ముంట మంచిది పుత్రా “ అని ఆంధ్రం ఆంధ్ర భాష పై అభిమానముండాలని 80ఏళ్ల క్రితమే చెప్పిన గొప్పభాషాభిమాన కవి.పరహితం చూడక. పరులకు నష్టం కలిగిస్తే “పరమేశుడే నిను జెరచుపుత్రా “అన్నారు.

“నీరము కానని పంట కు –నీరదముల్ గురియ ఫలము నెగడిన రీతిన్ –దీరాత్ముల కిడివిత్తము –దారుని సత్కీర్తి “పొందు అన్నారు. గురువులకు ఎదురాడవద్దనీ. అధికారులవద్ద అబద్ధాలు చెప్పద్దనీ. పుణ్యప్రదమైన ధర్మమూ మరువ వద్దనీ “హితవు చెప్పారుకవి. ”యాచకుల బాధ బెట్టకు –మాచారము వదలబోకు “శత్రువుతో మర్మం చెప్పకు. త్రాచులతో స్నేహం చేయకు అన్నారు. పొడవటానికి వచ్చే దున్నల్ని శిక్షించినట్లే దుర్మార్గులకు గుణ పాఠం చెప్పాలి.”నడవడి కీర్తికి మూల – మ్మడకువమూలంబు విద్య లార్జించుటకున్-తొడవగు ధర్మము కలిమికి –చెడుటకు మూలమ్ము చెడ్డ చేతలు పుత్రా “అని కారణాలు చెప్పారు. ”సభలలో పలుకే పస –కులుకే పస వేశ్యలకు కుజనులకెంతో-యలుకే పస భోగులకును-వలపే పస దీని తెలియ వలయు పుత్రా “అని సనిగా పస ను పనసపండు వొలిచి చేతిలో పెట్టినట్లు చెప్పారు. దొంగల్ని రాజు కొరత వేయిస్తాడు. చోరత్వంతో సిరి దూరమై పోతుంది. చోరత్వం లేకపోతె శుభాలు కలుగుతాయి. పరనింద చేస్తేదురితాలు,క్రూర దుఖం. విరోధం. ఆపదకలుగుతాయి కనుక వద్దు అన్నారు. కన్యాదానం కంటే “దీనులకు అన్నం పెట్టటం అధిక పుణ్యం అన్నారు కవి. .సత్యం పల్కితే కీర్తి పెరుగుతుంది సద్గతి సత్కీర్తి. సకల సుఖాలు లభిస్తాయి. ”మురికియే వ్యాధులకు మూలము –మురికియే దారిద్ర్య దుఖమూలముధరలో –మురికియె గౌరవహీనము –మురికిని కలనైన నుంచ బోలదు పుత్రా “ఇదే కరోనాలో మనకు గుణ పాఠమైంది. సర్వజీవులను ప్రేమిస్తే ఘనకీర్తి వస్తుంది. ”తన పేరు నిల్ప జాలిన తనయుం –డొక్క డైన జాలు తండ్రికి పెక్కం-డ్రనయగ  నీచులు గల్గిన –తన పేరును పాడు చేయు తధ్యము పుత్రా “అని సాంఘిక నీతి చెప్పారు.

శతకం చివరలో కవి తన గురించి చెప్పుకొన్నారు. తల్లిపేరు నాగమ్మ. మంగళం లో –జయజయ లోకా ధీశ్వర –జయజయపరమేశ ఈశజయ భవ నాశా –జయజయ శంకర యంచును –జయముగా బఠియించు చుందు సతతము పుత్రా “”మంగళమో విశ్వంభర -మంగళమో శ్రీ గిరీశ మాధవ మిత్రా –మంగళమో శశి ధర యన –మంగళములొసంగు మీ”కుమాపతి “పుత్రా “అంటూ 113వ కందం తో శతకాన్ని ముగించారు కవి.

పుత్ర శతకం భావ గర్భితం. నీతి,భక్తీ. మర్యాద వినయ  నడవడి సద్గుణ సౌశీల్య. బోధకం సరళం సుందరం సురుచిరం. సుమతీ శతకం, కరుణశ్రీగారి తెలుగు బాలశతకం వంటి ఉత్తమజాతి శతకాలలో సమాన స్థాయి పొందదగినది. మా కృష్ణా జిల్లాలో, మా తోట్లవల్లూరు దగ్గర కాలువ వొడ్డున వున్న వల్లూరు పాలెం కు చెందిన కవిరత్న లక్కన మల్లికార్జున సత్కవి రాసిన గొప్ప శతకం. ప్రేరణ కలిగించేది. అత్యంత ఉపయుక్తమైనది. ముందు మాటలలో పెద్దలు చెప్పినట్లు ఈ శతకం ప్రాధమిక స్థాయిలో పాఠ్యాం శం గా పెట్టారోలేదో తెలీదు. పెట్టి ఉంటె అభినందనీయులే. ఈశతకం. ఈ కవి గురించి కూడా ఎక్కడా మనవాళ్ళు ఉదాహరించిన దాఖలాలు కనపడ లేదు. ఈ కవినీ. ఈ శతకాన్ని పరిచయం చేయటం నాకు అబ్బిన మహద్భాగ్యంగా భావిస్తున్నాను.

## 37 మల్లికార్జున శతకం --  శ్రీ లక్కెన మల్లికార్జునకవి

కవి రత్న శ్రీ లక్కెన మల్లికార్జునకవి రాసిన "మల్లికార్జున శతకం "15-3-1936 న పుత్రశతకం కంటే ముందే ప్రచురించాడు. మకుటం "మల్లికార్జునా ".


శ్రీ గురుభ్యో నమః

శ్రీ మల్లికార్జున శతకము.

శ్రీజలజోద్భవాండములఁ • జెన్నలరారు త్వదీయశక్తియే
యాజలజాప్తుగాఁ బరగి • యాదర మొప్ప మదీయచిత్తవాం
ఛాజలజంబు లన్నిటికి • సత్ఫల మియ్య బతిత్వమంది సత్
భూజనవంద్యుఁ జేయుగదె • భోగివిభూషణ! మల్లికార్జునా. 1

శ్రీధవపద్మజాదిసుర • సేవితపాద! అనంతరూప! స
[illegible]ధులకల్పభూజ! యమ • శాసన! రౌప్య నిగమస్వరూప స
[illegible] భక్తరక్షణ ప్రభో యని నిన్మది వేడుచుండెదన్
[illegible]కము తోడ నన్నెపుడు • బ్రోవర శ్రీగిరి! మల్లికార్జునా. 2

అక్షయ! దుష్టశిక్షణ! యజాండనివాస! త్రిలోకపాలనా
ధ్యక్ష! మునీశరక్ష! నిగమాంతవిహార! రమేశమిత్ర! రా
గక్షయ! దీనపక్ష! సురకామితదాయి! శశాంకమౌళి! దు
ర్దక్షమదాపహార! యని • ధ్యానమొనర్చెద మల్లికార్జునా. 3

శాంకరి శారదాంబ సిరి • శౌరి విరించి వినాయకుండు ని
శ్శంకితులౌచు నాహృదయ • సారసమందు వసించి మించి యా
తంకము లేక నారచన • తప్పక సాంగము జేయు గావుతన్
శంకర! భక్తవత్సల! నిశాకరశేఖర! మల్లికార్జునా. 4

సూరిజనంబులన్ దలచి • సొంపుగ నీపదసేవకావళిన్
గౌరి కవీంద్రమండలముఁ • గూర్మిని జేసి భవత్పదాబ్జముల్
మీరినభక్తి నాత్మ నిడి • మేలుగ సత్పలచంపకంబులన్
పేరులఁ గూర్చి నీకిడెద • పేర్మి నుమాపతి! మల్లికార్జునా.

మొదటి పద్యం –"శ్రీ జలజోద్భవాండజముల జెన్నలరారు త్వదీయ శక్తియే –యా జలజాప్తుగా బరగి. యాదరమొప్ప మదీయ చిత్త వాం

ఛా జలంబు లన్నిటికి సత్ఫలమియ్య బతిత్వ మంది సన్-భూజన వంద్యు జేయగదదెభోగి విభూషణ మల్లికార్జునా !"అని ప్రారంభించి "అక్షయ దుష్ట శిక్షణ యజాండ నివాస త్రిలోకపాలనా –ధ్యక్ష. మునీశ రక్ష,నిగమాంత విహార రమేశ మిత్ర రా

గక్షయ  దీనపక్ష. సురకమితదాయి శశాంక మౌళి దు-ర్దక్ష మదాపహార యని ధ్యానమొనర్చెద మల్లికార్జునా "అంటూ క్షకార ప్రాసతో సునాయాసంగా పద్యం నడిపాడు. కొండ

నివాసం కొండ చాపం. కొండ మామ. కొండకూతురే సతి. కుంభజులు భక్తులు. భూమి రథం. అయిన "నీ దండికి జాలి నట్టి ఘన దైవము లేదు"అన్నాడు. "తిట్టియు గొట్టిమొట్టినను నిను బాధ బెట్టినన్ –చుట్టమె యక్కిరీటి ?"కాదు సొంపుగా కాచావు "అన్నాడు దిట్ట తనంగా. జూదం వద్దు సత్యం పలుకు. తండ్రిమాట విను. కోపం నాశనకారణం.  మూర్ఖ స్నేహం వద్దు అనిహితవు చెప్పాడు. ప్రతిభ ఉంటె దేనినైనా జయించ వచ్చు. దొడ్డ గుణాలున్నవాడి దగ్గరకు దుర్భర శత్రువు వచ్చినా, కీడు ఒడ్డక కోరికలు తీర్చి పంపుతాడు ఎలాగంటే దుడ్డుతో మోది బంధం వేసి పాలు తీసే దుష్టుడికైనా దొడ్డగ ధేనువు పాలిచ్చినట్లు అని దొడ్డ సూత్రాన్నే చెప్పాడు. రౌద్ర సత్తక్క. సిరియాలుడు. భల్లాణ రాజు. కన్నప్ప ల లాగా రాళ్ళతో కొట్టటం తెడ్డుతో బాదటం బాలుడినికోసి వండి భోజనం పెట్టటం కనులు పీకి అమర్చటం చేయలేని అసమర్దుడిని కనుక నాపై కటాక్షం చూపు అని ఎనేక్డోట్స్ లను బాగా ఉపయోగించాడు . ఇలాంటి పద్యాలు శైవ సాహిత్యం లో కోకొల్లలే.



విజ్ఞప్తి

ఇట్లు విన్నవించు,

15—8—1936.

లక్కాన మల్లికార్జునుడు.

భక్తిలేని ప్రవిమలజ్ఞానం. మంచి ధ్యానం. ఉప్పులేని వంటకంరుచి నివ్వనట్లు ముక్తినివ్వదు.సిరిబాగా ఉంటె బంధు జనం కుప్పలు తెప్పలుగా వచ్చి వాల్తారు. సిరి పొతే కనీసం పలకరించటానికి కూడా ఎవరూ రారు అనే కఠోర సత్యం చాటాడు. జననం కర్మ బద్ధం. సంపదలు ఎండమావులు. దారాపుత్రాదులు రుణానుబంధాలు.సంసారం చెరసాల. కనుక మనుషుడికి శాంతి ఎక్కడ ?అని ప్రశ్నించాడు. .'కృపగనగా వలెన్ దానను గీర్తమ జేసిన వాని నెట్లోకీ-డపరమితంబుగా నొసగునట్టి దురాత్మకు నేని దొల్లి క్రూర ఘణచయంబునన్. గరువరా విదిలించి. పదాన ద్రొక్కినన్ –గృప గనుమన్న కాళియుని కృష్ణుడు కావడె మల్లికార్జునా ?"అని కాళీయమర్దనం లో శ్రీ కృష్ణ దయామృతాన్ని చూపించాడుకవి. దుష్టుడు అని తెలిసినా కొడుకును సమర్ధిస్తే వంశనాశనమేజరుగుతుంది. గుడ్డిరాజు చూపిన పుత్రా వ్యామోహం కురువంశ నాశనానికి కారణమైనట్లు అని సందర్భ శుద్ధిగాచెప్పాడు. సభలో ఎందరున్నా. గుణ సంపద ఉన్న పండితుడు లేకపోతె రంజకం కాదు. ఆకాశం లో తారలెన్నిఉన్నా. చంద్రుడులేకపోతే శోభ

లేనట్లుగా. ఘనుడైన వాడి గౌరవాన్ని భంగపరిస్తే –నవనందులు ధనగర్వం తో చాణక్యుని అవమానించి నంద వంశ నిర్మూలనం చేజేతులా తెచ్చుకొన్నట్లు సర్వ నాశనమౌతారు. "మాతకు మ్రొక్కటం,తండ్రిని గౌరవించటం తాతకు సేవ చేయటం తాపస వర్యులను చేరి కొలవటం. భూత దయ చూపటం సజ్జనులకు సహజ సిద్ధమైన లక్షణాలు.

"బొట్టు విభూతి భూషణము భోగి. సఖుండు కుబేరుడాలియౌ-గట్టుల రేని బిడ్డ. నిజకార్ముకమాహరి. తేరుభూమినీ

పెట్టెడి పువ్వు చంద్రుడును. పెక్కులు నిట్టివి గల్గి యుండగా –గట్టిగ భిక్ష మెత్తుటకు కారణమేమిర మల్లికార్జునా ?".అంటూ వ్యాజ స్తుతి చేశాడు.

"ప్రవిమల జ్ఞాన వహ్నిని యవారణ వృక్షరాజముల్ –దవిలి దహించి భస్మమును దాల్చి త్వదీయస్వరూప లింగమున్ –భవముల బాసి కంఠమునభక్తిని గట్టెద భక్తులన్దరిన్ –భువిని దలంచి కొల్చెదను బ్రోవర శ్రీగిరి మల్లికార్జునా "అని తన నిశ్చయాన్ని తెల్పాడు. ఏ మతం లో ధర్మలో ఉంటూ. శాంతంగా నియమం తోజపిస్తారో. కామాన్ని జయించి దీక్షతో విద్య నేర్చే వారుంటారో,ఆ మతం భూమిపై పూజ్యత పొందుతుంది అన్నాడుకవి.

చివరగా "జయజయ భక్త దీనజన సాదు మునీంద్రాసురాలిరక్షణా –జయజయ వీరశైవమతసంతత వర్ధితమూల కారణా

జయజయ మంగళ ప్రద నిశాకర శేఖర పాప నాశనా –జయజయ స్రష్ట శౌరి నుత సంపద శ్రీ గిరి మల్లికార్జునా "అని జయం పలికి

"మంగళహారతుల్ గొనియు. మామక కర్మము ద్రుంచి ప్రేమతో –మంగళముల్ జెలంగపరమార్ధ మొసంగుచు బ్రోవవే వెసన్

అంగజభంగలింగ. నగజాధిప కంజభవాండ రక్షశ్రీ –రంగనుత ప్రదీపముని రంజిత శ్రీగిరి మల్లికార్జునా "అని మంగళం 102వ పద్యం తో పాడి శతకం ముగించాడు కవి. వీర శైవం బాగా జీర్ణించుకొన్న ఈ కవి రత్న శ్రీ లక్కెన మల్లికార్జునకవి.ధారాపాతంగా భక్తిభావ కవిత్వాన్ని ప్రవహింపజేసి తన ప్రతిభా వ్యుత్పత్తులను ప్రదర్శింప జేశాడు. ఈ శతకం వీర శైవ సాహిత్యం లో ప్రముఖమై విరాజిల్లి ఉండాలి. మన వారెవరూ ఉదాహరించినట్లు

కనిపించదు. రసగుళికలే పద్యాలన్నీ. నిన్న ఈకవి పుత్ర శతకాన్ని, ఇవాళ శ్రీ మల్లికార్జున శతకాన్ని పరిచయం చేసే భాగ్యం నాకు దక్కింది.

## 38 కోటి లింగ శతకం -- శ్రీ సత్యవోలు అప్పారావు

కోటిలింగ శతకాన్ని శ్రీ సత్యవోలు అప్పారావు గారు రచించగా 1912లోరాజమండ్రి లోని మనోరమా. బ్రౌన్ ఇండష్ట్రియల్ ముద్రాక్షర శాలలో ముద్రింపబడింది. వెల-మూడు అణాలు. ఈశతకం రాజమండ్రి లోని "మానవ సేవా "పత్రికలో మొదట ప్రచురించబడింది. పత్రిక సంపాదకులు శ్రీ నాళం కృష్ణారావు గారు. శ్రీసత్యవోలు అప్పారావు గార్లు. ఈ పత్రిక సంవత్సర చందా 3రూపాయలే. అభిమానులు 5రూపాయలు. పోషకులు 10రూపాయలు. రాజపోషకులు వారి వదాన్యత బట్టి చేరవచ్చు. ఈ పత్రిక ప్రచురణలు –కబీరు, బంగాళాదుంప. అగ్గిపెట్టెల పరిశ్రమ. లోకపావన శతకం. కోటిలింగ శతకం. స్త్రీలకు మనం చేసే పంచ మహాపాతకాలు. వీరమతి నాటకం. కవికొండల వెంకటరావు గారు రాసిన "భారతీయ సందేశం" భాణ0,భక్తి తరంగిణి.. ఇవన్నీ చాలా తక్కువ ధరలకే అందిస్తున్నట్లు ఈ శతకం లో రాశారు.


కోటిలింగశతకము.

15

కోటిలింగ శతకం సీసపద్యాల శతకం. "కుటిల జనభంగసత్సంగ కోటిలింగ"మకుటం. "శ్రీల చెలంగు నీ క్షితి జీవరాసులసతతంబు గాపాడు సామి ఎవరో "అని మొదలుపెట్టి మొదటి పద్యాన్ని –కలిసిమెలసి యుండు నరులకు గష్ఠంబు లుండ కున్నే –కుటిల జనభంగ సత్సంగ కోటిలింగ "అని ముగించారుకవి. అన్ని పదార్ధాలు సమకూర్చి జీవులను కృపామతి చూసే పంట కాపు. అంధకారాన్ని పోగొట్టే చందమామ. మనసులో జ్ఞాతేజం కూర్చే ప్రభాకరుడు శాంతాది గుణాలిచ్చే సంప్రదాత,ఉన్నవాడు లేడను కొన్నవాడు మానసోద్యానంలో విహరిన్చేవాడు అని రెండో పద్యం. ధర్మ

సత్య శౌచాలు లేకుండా ఎన్ని తపాలు జపాలు చేసినా ప్రయోజనం లేదనీ. దేహం అస్థిరం అని తెలుసుకోవాలని. స్నానాలు ఉపవాసాలు చేస్తే మోక్షం రాదు నీటిలో ఉండే చేపలు మోక్షం పొందుతాయా అన్నాడు.సాధువుల వద్ద కుటిలాత్ముల ఆటలు సాగవు. నడవడి సరిగ్గా లేకపోతె ప్రక్కవారిని మోసం చేస్తారు,పరమపావనులైనా పడతి కనిపిస్తే మదనార్తి పొందుతారు. తుంటరి వారి వెంట వెళ్ళరాదు.పలుగాకితో ఉండే పండితుడు కోతిచేతిలో పువ్వు. పాము నోట్లోకప్ప. చలిచీమల మధ్య పాము. పాదరసంలో ఈదులాడే బంగారం అని జాగ్రత్తలు చెప్పాడు. అంతాఒక్కటే అనుకొంటే సహనం. బీదల్ని ఆదరిస్తే పిసినిగొట్టుతనం. విద్యా బుద్ధులు నేర్పిస్తే గర్వం. మరులు చిక్కబెడితే.మన్మధుడు పారిపోతారు పతిలేని భామ అడవి కాసిన వెన్నెల. ఆడవారిని చులకన చేస్తే నష్ట పోతారు. కార్యసాధకుడు ఏది లేకపోయినా బాధపడడు. దూరదేశం వెళ్ళటానికి సందేహించడు.

మకరందాన్ని చిమ్మే మల్లెపువ్వును గొంగళి పురుగు కొరికినట్లు క్రొమ్మావి పండ్లను చిన్నచీమలుకొరికినట్లు. కమలాల మకరందాన్ని తేనే టీగలు ఇష్ట మోచ్చినట్లు జుర్రినట్లు "పరమ పావనులగు వారి పజ్జ జేరి సద్గుణంబుల గ్రహియింప జాలని దుర్జనులు "అన్నాడు. విత్తమార్జించే వేళ మావాడని బంధువులు మూగుతారు,భాగ్యం ఉంటె పరమపావనుడు అని పొగుడుతారు. లేమికలిగితే దగ్గరకు కూడా రారు పలకరించరు.భాగ్య వంతులమని గొప్పలు చెబుతారుకానీ పిల్లికి బిచ్చం పెట్టరు. కాషాయం రుద్రాక్ష మాలలు ధరిస్తే మనసులోని చెడు తొలగిపోదు. బాల్యం లోఆటలపై. యవ్వనం లో తరుణులపై కౌమారం లో కడగండ్లు.. బ్రతికి ఉన్నప్పుడు బ్రహ్మం గురించి ఆలోచించరు. దారిద్ర్య దేవతను తరమాలంటే చేతి పనులు నేర్వాలి. బ్రహ్మాండమంతా ప్రజ్వరిల్లుతూ మానస వీధిలో ఉండేది. అణురూపంపొంది అనవరతం చావు పుట్టుక లేక జరిగేది. పుత్ర మిత్రాదుల రూపంలో దేహం లో తిరిగేది ఆదిమధ్యాంత శూన్యమైనది అయిన పరమాత్మ నిత్యం అని బోధ చేశాడు. చివరగా 100వ పద్యం లో –


సేవ.

"కస్తూరికార్ణవ గర్భ వీచిమ తల్లి కడుపార నెవ్వాని
గన్నతల్లి –దీన జనంబుల సీమ మానససీమ లెవ్వడు
ఫలియింప గ జేయు కాపు పంట

విద్యార్థి వత్సల వెత దీర్చి ఎవ్వాడు పరితుష్టి నొందించు
పాడి మొదవు –ఆర్తజనంబుల ననిశంబు నెవ్వాడు
కరుణమై కాపాడు కల్ప శాఖి

యతడు వెలుగోందు రామరావనగ బుధులు –కరము
నొగడగ గొంగు బంగారమౌచు

వానికిది పూలహారమై వరలుగాక –కుటిల
జనభంగసత్సంగ కోటి లింగ"

ఆ రామారావు ఎవరో చెప్పలేదు. కోటిలింగం శతకమే కానీ ఏ లింగాన్నీ పేర్కొనలేదు. శతకమంతా మానవ విలువలగురించి చెప్పాడు కవి. కవిత్వం ఉరకలు వేసింది. మనసును తాకే పద్యాలే ఇవిచదివిఆచరిస్తే మానవత్వం వికసించి జగతి గొప్ప అభి వృద్ధి చెందుతుంది. ఈశాతకమూ ఈకవిపేరు మన వాళ్ళు ఎవరూ ఎక్కడా ముచ్చటించిన దాఖలాలు లేవు. నాళం కృష్ణారావు గారి గురించి లోకానికి బాగా తెలుసు. ఈ శతకం. ఈ కవినీ పరిచయం చేసే భాగ్యం నాకు కలిగింది

## 39 శ్రీ తిన్నెలపూడి వేణుగోపాల శతకం -- శ్రీ జూటూరు లక్ష్మీ నరసింహయ్య

శ్రీ తిన్నెలపూడి వేణుగోపాల శతకం ను వాకాడు వాస్తవ్యులు జూటూరు లక్ష్మీ నరసింహయ్య రచించగా కావలిలోని వాయునందన ప్రెస్ లో 1931లో ప్రచురింపబడింది. వెల బేడ.అంటే రెండు అణాలు. విజ్ఞప్తి లో కవి కూడలి గ్రామ సమీపం లో వేదికాపురి అనే పేరున్న తిన్నెలపూడి గ్రామం లో భక్తీ విద్యా వినయ సౌశీల్య సుహృద్భావ గౌరవాదులున్న శ్రీ కోటమ రెడ్డి చెంచు రాఘవరెడ్డి గారు శ్రీ వేణు గోపాల మందిరం కట్టించి

స్వామికి సకల విధ పూజలు జరిపిస్తూ ఆ క్రితం ఏడాది స్వామి కళ్యాణోత్సవానికి ఆహ్వానించగా కవి గారు వెళ్లి. ఆఉత్సవ వైభవం చూస్తూ ఉండగా మనసులో "వేణుగోపాలుడు కృష్ణమూర్తి మము బాలన సేయు దయాంతరంగుడై "అనే మకుటం ఆశువుగా స్ఫురించి వెంటనే రెండు పద్యాలు జాలువారాయి. రెడ్డి గారు విని ఆ మకుటంతో శతకం రాయమని కోరగా. స్వామి అనుగ్రహం తో రాసి నాయుడి పేట వాస్తవ్యులు ఉభయ బాషా పాండితీ ధురీణులు,"శ్రీ సోమశైలం "మొదలగు గ్రంధకర్తలు బ్రహ్మశ్రీ ఉత్పల నరసింహ శాస్త్రి గారు. ఆయనసోదరులు శ్రీ కృష్ణ శాస్త్రి గారు కొన్ని పద్యాలు సవరించారు. తర్వాత గూడూరు హైస్కూల్ ప్రధాన తెలుగు పండితులు. ఉభయ భాషా వేద,వేదాంత విదులు. లక్ష్మీ కటాక్షం మొదలైన గ్రంధకర్తలు ఆమూలాగ్రం సవరించి ముద్రణ కు అనుమతిచ్చారు. శ్రీ పైడిపాటి సుబ్బయ్యగారు కొన్ని సవరణలు చేశారు. రెడ్డిగారు స్వంతఖర్చుతో శతకం ముద్రించి అందించారు అని తెలియ జేశారు. ఉభయ వేదాంత శ్రీ కాండూర్ కృష్ణమాచార్యులు అభిప్రాయం తెలియజేస్తూ "భాగవత కథాబోధనంగా శతకం ఉంది. శతకం లకార ప్రాస తో రాయాల్సి వచ్చినందువలన పునరుక్తులున్నా. శ్రవణానదకం గా. రసజ్ఞా హృదయ రంజకం గా శతకం ఉంది "అని శ్లాఘించారు.



శ్రీ వేణు గోపాల
కృష్ణ శతకము

కవిగారు శతకాన్నిఉత్పల మాలగా అల్లి, వేణు గోపాలుని అలంకరించారు. మొదటి పద్యం –

"శ్రీ లలనా మనోహరుడు. సేవక నేత్ర చకోర చంద్రుడా –పాలిత సర్వలోకు డఘుపంక్తి విభేదకుం డాశ్రితాలికిన్

శ్రీల నొసంగువాడు. శుభ శీలుడు తిన్నెలపూడి వేణు గో –పాలుడు కృష్ణమూర్తి మము బాలన సేయు దయాంత రంగుడై"అని రాశారు. తర్వాత ఉత్పలలు సువాసనలు వెదజల్లుతూ పరిగెత్తాయి. బాలుడు చిన్ని కృష్ణుడు శుభంకరుడంచిత బర్హి బర్హ సంకీలిత మౌళి "అన్నారు కాల గళార్చితుడు,సహితి కంఠ శరాసన భంజనుండు. శంపాలతికాభ చేలుడు "అనికీర్తించారు. లీలతో జగాలని తిప్పుతూ మాయకు దూరుడై ఉంటాడనీ. "శీలి. సుగంధ పాత్ర తులసీ నవ పత్ర విరాజ మాన సన్మాలి. కలాప మౌళి అనీ.

మకరిపాదం పట్టి లాగుతుంటే “గోలుకోనంగ లేను నిను గోరితి మురారి “అని వేడుకొన్న “శుండాలం” ను రక్షించాడు. ”బాలశిఖామణీ దనుజబాధలకోర్వలేకున్నాము “.అని ప్రార్ధించిన దేవతలను కాపాడాడు స్వామి.

స్వామిముగ్ధమోహన రూపాన్నివర్ణిస్తూ –

“చాల విశాలమౌ నురము. శాంత శుభాకృతి బద్మ నేత్రముల్ –బాలకరీంద్ర యానము. శివంబగు భావము. నీశ్వరత్వమున్

వ్యాళ శయానమున్ గరుడ యానము గల్గి న యట్టి “వాడు వేణుగోపాలుడు. బాలిక యోగమాయ ను చూసి బాలిశుడైన కంసుడు కాళ్ళూ చేతులు పట్టి. కళ్ళల్లో నిప్పులు రాలుస్తూ నేలకు లాగితే, పైకెగసే నేర్పు చెప్పిన నేర్పుగాడు. ”బాలుడటంచు ముద్దులిడు భామల బట్టుచు మోవినోక్కి. కేంగేలులన్ జెక్కులన్నిమిరి గేలి చేసే చిలిపి కృష్ణయ్య. దూడలు పాలకు ఏడుస్తుంటే ఆవులదగ్గరకు దూడల్ని తోలి ఆడుతూ పాడుతూ వెళ్ళే గోపాలుడు కన్నయ్య. బ్రహ్మ చేసిన తప్పిదానికి “బాలక. వత్స రూపముల దాల్చి న విశ్వమయుడు “.అత్తమామల్ని పిల్లని వదిలేసి అర్ధరాత్రిలో వేణునాదానికి ఆకర్షితులై రావటం బాగుందా “అనే బోధగురువు స్వామి. మీ మనస్సంతాభక్తితో నిండింది కదా ఇంకా చాలదా అని కొంటె ప్రశ్న వేసినవాడు. ”సాలము నెక్కి తద్వసన జాలము దాచిన దన్ను జూచి యా –బాలికలెల్ల సిగ్గువడి. వారి తరంగల నుం డలేక –దత్సాలము జేర వల్వలనోసంగి మమత్వము బాపు వేణుగోపాలుడు కేవలతత్వాన్ని బోధించాడు. 121వ పద్యం లో తప్పులుంటే క్షమించమని చెప్పి. 122వ పద్యం లో ధర్మకర్త కోటమ రెడ్డి రాఘవరెడ్డి గారిని యశస్సుతో కాపాడమని వేడాడు వేణుగోపాలుని.



iv

బ్రహ్మశ్రీ ఉ॥ వే॥ కాండూర్ కృష్ణమాచార్యులుగారి అభిప్రాయము.

శ్రీమత్ బ్రహ్మశ్రీ జూటూరు లక్ష్మీనరసింహయ్యగారు భక్తిపూర్వకముగ విరచించిన (తిన్నలపూడి) శ్రీవేణుగోపాల కృష్ణశతకమును ఆమూలాగ్రము వింటిని. అందు మొదటఁ గొంతభాగము స్తోత్రరూపముగను, దక్కినభాగము శ్రీభాగవత కథలను బోధించునదిగను నున్నది. కవిత్వము సాధారణశైలితో నెల్లరకుఁ దెలియునటుల రమ్యముగ నున్నది. శతకమంతయు నే (ల) [illegible] యుండుటచే [illegible] ద్రాక్షాపాకమందుఁ గొన్నిపద్యముల నెక్కడను భావముల [illegible] టకు వలనుపడ లేదనియుఁ దోచెను. కాని మొత్తముమీఁద కొన్నిపద్యముల భావములు [illegible] శ్రవణానందములై యున్నవి. రసజ్ఞులగు పాఠకమహాశయులాదరించి ఈకవిగారిని ప్రోత్సహించు మనకుఁ దల్లియగు నాంధ్రభాషామతల్లికి నుల్లాసముఁ గలిగింతురుగాకయని యా దేవదేవునిఁ బ్రార్థించుచున్నాను.

ఇట్లు,
కాండూర్ కృష్ణమాచార్యులు,
[illegible] పండితులు,
బోర్డు హైస్కూలు,
[illegible], ([illegible] జిల్లా.)

తే 10—3—1931 ది

చివరి 124వ పద్యం లో –

"మూలము బ్రహ్మమంచు దలపోసెడు జూటురు పద్మనాభ స – చ్చీలి కుమార లక్ష్మీ నరసింహ ధరామారు నెల్ల వేళలన్

శ్రీల నొసంగి బ్రోచు, శుభ చిత్తుడు,సద్గుణమూర్తి వేణు గో-పాలుడు కృష్ణమూర్తి మము బాలన సేయు దయాంత రంగుడై"అని ముగించారు కవి.

ఇంతకంటే కవి ఏమీ తనగురించి చెప్పుకోలేదు. కవిత్వం ద్రాక్షాపాకం. బాలకృష్ణ లీలా విలాసంగా భాగవత ధర్మాను గుణంగా శతకం రాశారు కవి. కవిపేరు, శతకం పేరు మన వాళ్ళు ఎక్కడా పేర్కొనక పోవటం ఆశ్చర్యమే. గొప్ప భక్తి శతకం ఇది. కవినీ, శతకాన్నీ పరిచయం చేసే భాగ్యం నాకు దక్కింది.

## 40 ముక్తీశ్వరశతకం -- శ్రీ ముదిగొండ బసవయ్య శాస్త్రి. శ్రీ కొండపల్లి లక్ష్మణ పెరుమాళ్ళ రావు

శ్రీ ముదిగొండ బసవయ్య శాస్త్రి. శ్రీ కొండపల్లి లక్ష్మణ పెరుమాళ్ళ రావు కలిసి "ముక్తీశ్వర శతకం "రాస్తే. శ్రీ గరిణే సత్యనారాయణ బెజవాడ శ్రీ వాణీ ముద్రాక్షర శాలలో1916లో ముద్రించారు. . వెల రెండుఅణాలు.

"శ్రీ మత్సర్వ జగస్వరూప విబుధ శ్రేణీ నుతప్రాభవా –కామక్రోధమదాద్యరిప్రకార శిక్షా దక్ష సద్రక్షకా

భూమానంద మరంద సంభరిత హృత్పుల్లాబ్జ లోకేశ్వరా –శ్రీ ముక్తీశ్వరపూర్నివాస హరగౌరీ నాధ ముక్తీశ్వరా

"అంటూ జంటకవులు శతకం ప్రారంభించారు. "ముక్తీశ్వరా "అనేది శతకానికి మకుటం.



ముక్తీశ్వర శతకము.

ముదిగొండ బసవయ్య శాస్త్రి చేతను
కొండపల్లి లక్ష్మణపెరుమాళ్లరాపు చేతను
రచియింపబడి

గరికె సత్యనారాయణచే
ప్రచురింపబడినది.

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు
బి. కే. స్వామిచే
ముద్రింపబడినది.

రెండవ పద్యం లో మనః ప్రక్షాళనం కోసమే శతకం రాశామన్నారు. రసమో నీరసమో కవిత్వం చెప్పి డబ్బు సంపాదించము నీభక్తితో చెప్పాం. ”పరుసంబుననం గలిసి స్వర్ణంబైనట్లు “మాకృతిశుచి అవుతుంది. కొద్దో గొప్పో కవిత్వం నేర్చి నీ ఎదుట గంతులేస్తూ పద్యాలు చెప్పి జన్మ సార్ధక్యం చేసుకొంటాము. దైవోత్తముడవు భక్తజన పారిజాతానివి నిన్నే నమ్మి రాశాం. నీ హృదయ కాసారం లో జగం అనే పద్మం పుట్టి. దానినుంచి నిగమ నిగామాంతాలు పుట్టాయి.అందులోని తేనెను జుర్రటానికి భక్తగణం అనే తుమ్మెదలు ఎగబడి హాయిగాతాగి మత్తెక్కుతాయి.కించిత్ జ్ఞానిలాగా భిక్షుకుడవైతే నేను నీకు దాసుడిని. నిన్ను నమ్మాను జన్మ రాహిత్యం కల్గించు. ”ఆపాతాళ వియత్ ప్రవృద్ధ”ఐన నీ మొదలు. తుది తెలుసుకోవటానికి బ్రహ్మ విష్ణులు బయల్దేరి “చూపోపక “తిరిగి వచ్చారు. సత్వరస్తామోగుణాలు పెరిగి నన్ను పాతాళానికి నేట్టేస్తున్నాయి దీనినుంచి నువ్వే కాపాడాలి.

“అణుపైనన్ బరమాణుపైన భావదీయాకార రేఖావిచారణ పాత్రంబగు “.”పరమార్ధం బన నెట్టిదో ఎరుగను “.రాజు అనుగ్రహానికి ఎన్నోకష్టాలు పడ్డాను.”జననీ గర్భం లో ఉన్నప్పుడు నిన్ను నెమ్మనంబుతో ఎంచాను “.తనువూ డస్సింది నాడులు సడలాయి దంతాలు పట్టుతప్పాయి యవ్వనం పోయి జరప్రాప్తించి బలం తగ్గి దౌర్బల్య పాపభీతి వణుకు కుంగ దీశాయి. నువ్వే కాపాడాలి. నీ విశుద్ధ భజనోద్రేకాలే మోక్షానికి మార్గం. నీ వోక్కడివే జనాళి హృదయాదర్శ మ్ములన్ నిల్చు వాడివి “.

“భూమీ చక్రము స్యన్దనంబుగా నభంబు నీ కపర్దంబుగా –స్వామీ దిక్కులు కట్టు పుట్టములుగా వర్ధిల్లు నీ ఉన్నతా-పే మూలం గలదంచు నెంతు “అని శివరహస్యం చెప్పారు. .నిత్యానిత్య పదార్ధభావన కలానిర్నిద్ర తన్ గాంచి నీ –సత్యాకారమే నిత్యవస్తువని “జగత్తు మిధ్య అని తెలుసుకొన్నాను. ”అధికార్తిం గుందగా జాల నింక నను బ్రోవగ రమ్ము భక్తజన రక్షా లోల ముక్తీశ్వారా “అంటూ 93వ పద్యంతో శతకం పూర్తీ చేశారు.


శ్రీ

ముక్తీశ్వర శతకము.

ఈ శతకం సాధారణ శివ మహాదేవునిపై రాసిందే కాని ఏదో ఒక క్షేత్రం లోని స్వామి పై రాసినది కాదు ముక్తీశ్వరస్వామి జగ్గయ్యపేట దగ్గర కృష్ణానది ఒడ్డున ఉన్న ముక్త్యాల స్వామి కావచ్చు. శతకం అశ్వధాటి పరుగుతో నడిచింది. భక్తిజ్ఞాన వైరాగ్యాల త్రివేణీ సంగమంగా భాసించింది. కవుల గురించి ఎక్కడా చెప్పుకోలేదు. ఈ శతకాన్ని, కవులను పరిచయం చేసే అదృష్టం నాకు లభించింది.

ఈ శతకం లోనే అనుబంధంగా గుంటూరు మండల సంతమాగులూరు గ్రామ వాసి. సుకవి జనమిత్రుడు శ్రీ పొత్తూరి రాఘవయ్య రాసిన "శ్రీ సానందోపాఖ్యానం "హరి కధ కూడా ఉన్నది. దీన్ని అదే గ్రామానికి చెందిన వైశ్యకుల తిలకుడు శ్రీ గుర్రం రామసుబ్బయ్య శ్రేష్టి ద్రవ్యసాయంతో బెజవాడ వాణీ ముద్రాక్షర శాలలో 1916లో ముద్రించారు. వెల-రెండు అణాలు. .అన్ని హంగులతో సలక్షణంగా సానంద రుషి చరిత్రను నవరస సమ్మేళనంగా కవిగారు మధుమదురంగా రచించి సార్ధకం చేశారు.

41 కుక్కుటేశ్వర శతకం -- శ్రీ వక్కలంక శ్రీనివాసు కవి

పిఠాపురం అనే పాదగయా క్షేత్రం లో వెలసిన శ్రీ కుక్కుటేశ్వరస్వామిపై శ్రీ వక్క లంక శ్రీనివాసు కవి శతకం రాశారు. స్వామి కోరి రాయించి అంకితమివ్వమని కలలో చెబితే కవిగారు నెరవేర్చారు. .”కువలయానందకర శర్వ కుక్కుటేశ “అనేదిమకుటం. స్వభాను సంవత్సర చైత్ర శుద్ధ శుద్ధ అష్టమి కి శతకం పూర్తీ చేసి అంకితమిచ్చాడు కవి.



శ్రీరస్తు

శ్రీః

కుక్కుటేశ్వర శతకము.

సుజనసన్నుతు విఘ్నేశు, సుందరముగ
మదినిధ్యానించి భారతిన్ మదినుతించి
శతకము వ్రాయఁదొడఁగితి, శరణుగొనుము;
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 1

అరయ స్వభాను చైత్రము అష్టమితిథి
శుక్లపక్షాన నీకృతి శోభఁదనిసె;
చిత్తగింపుము శ్రీకంఠ, చిద్విలాస,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ! 2

సుగతినొప్పారు గౌతమీసురవరతట
పులినస్థిత “పాదగయ” పార్శ్వపుణ్యమూర్తి,
వందనము, శూలి, భక్తాళివశవినోది!
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ!! 3

”సుగతి నొప్పారు గౌతమీ సురవరతట-పులినస్థిత”పాదగయ “పుణ్యమూర్తి

వందనము శూలి., భక్తాళి వశ వినోద - కువలయానందకర శర్వ కుక్కుటేశ”అనేది రెండవ పద్యం. క్రోధ తిమిరం మన్నూ మిన్నూ కానకుండా చేస్తోంది శరణు ఇవ్వు. పిఠాపురం లో నువ్వున్నావని మర్చేపోయాను క్షమించు. సర్వం నీకే ఇస్తా. శరణు. దక్షిణకాశి పీఠికాపురం లో వెలిశావు.కాలం పరిగెత్తిపోతోంది . మాత రాజేశ్వరి మహిమ తో నీ పాద సంసేవనమివ్వు. ”ప్రధమేశ “అని మొక్కితే అన్నీ తీరుస్తావు. ”భక్తజన భాగధేయ –సుభాగ్య చరిత –పాపజనులను క్షమ జూచే భవనాశుడవు “.పిత్రువనం లో పాదగయ లో నీ మూర్తి బహు సుకీర్తి “అన్నాడు.

2 కుక్కుటేశ్వర శతకము.

"వత్స, మెచ్చితి భవదీయ వస్తుతతిని
శతకరూపానఁ జొప్పించి శరణుఁజొరితి
వదియ యిదుఁ నాకు సంకీర్తనమలర సిరులు"—
అనుచు సద్భృత్యమైన నీయానమెయిని
విగతసంచితపాపినై వేడుదు నిను,
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ!

వక్కలంక శ్రీనివాసుండు శతకంబు
కుక్కుటేశుభక్తిఁ గూర్చి రచన
సంతరించె; బుధులుసాహ్వరవస్త్రకున్నను,
గ జ్ఞానంగఁ గర కరము వేడు!

రాజరాజేశ్వరీనత, రమ్యగతిని
స్వీకరింపంగ, రా, తండ్రి, సిద్ధసేవ్య,
నీదుశతకంబుసంకీర్తనమ్ముగాఁ గొనుచు
నెరసులున్నను మన్నించు నిటలనేత్ర!
కువలయానందకర, శర్వ, కుక్కుటేశ!!



శివరాత్రినాడు జరిగే కోటి శతవ్రత పూజ చూసి తరిస్తాను. ”బేసికన్నుల ప్రౌఢ హో భేషు నీదు –చరితం “ఇంత అని ఎవరూ తెలుసుకోలేరు. ”పునుకుల పేరు వదిలి –రావోయి మాతోడి విందు గుడియ “అని ఆహ్వానించాడు. ”ఆరుత రుద్రాక్ష జపమాల అగ్రముననను –యాగవాటిక. పాణినియతుల యష్టి –లింగరూపము “ఇవే నీ లీల. ”హే ప్రపన్నార్తి హరా శంభు హేకృపాళో-పాహిమాం భక్తజనపాల పాహి శర్వ “అని వేడుకొన్నాడు. సూనృత వాక్యం ఘనం అది సువ్రత ఫలం. అదే పరం ఏదీనీకంటే పేరు కానేకాదు. ”సచ్చి దంబోధి హంసపై సాగరమున –నిరత కేళిని దేలెడి నీలకంఠ”మాపాపాలుమాన్పు. .అష్టమూర్తి. రుద్రా గుణ భద్ర శాంతంపు రూపసి నువ్వు “సూర్య శశినేత్ర-నీ అగ్ని నేత్రం తెరిచి ఇబ్బంది పెట్టకు. ”శంకరా పాహిమాం “అంటే పొంగిపోయి రక్షిస్తావు. “పాదగయ లో స్నానం చేసి శైవ వైష్ణవులందరూ వరుత నరిగినా వైష్ణవులు ఎందుకో నిన్ను ఎరగరు ?”చంద్రునకు నూలుపోగు “చందంగా రచన సాగించి “గీతాల రత్నహారం “సమర్పించాను అన్నాడు భక్తిగా కవి. మాసశివరాత్రి సోమవారం ఉపవాసంతో నిన్ను కొలిచే భక్తులకు కొదవ ఏమీ ఉండదు “అని భరోసా ఇచ్చాడు. ”కుక్కుటాకార మామక కూర్మి మనము –వేగ నీ యందచిగిరించి విరుయునట్లు –వరము దయచేసి. నీలోక వసతి నిమ్ము –కువలయానందకర. శర్వ కుక్కుటేశ “అని 104గీతం పాడి చివరిదైన 108లో “భక్తితో ఈ కుక్కుటేశ్వర శతకం పఠించే వానికి “ఇచ్చెదవు గాతవీ విమలపథము-కువలయానందకర. శర్వ కుక్కుటేశ “అనే పద్యంతో శతకం పూర్తి చేశాడు కవి. కింద గద్య లో భ్రమరాంబికా రామలింగేశ్వర రత్న పుత్రుడు భారద్వాజస గోత్రుడు సుజన విదేయుడు శ్రీ వక్కలంక శ్రీనివాసరాయ ప్రణీతం “అన్నాడు.

గీతపద్య శతకం ఆద్యంతం భక్తి రసప్రవాహంగా నడిచింది సరళపదాలు.పాదగయ క్షేత్ర వైభవం. స్వామి కున్న అపార కారుణ్య దృష్టి అన్నీ కవితలలో పొంగిపారాయి. ఈ శతకం గురించి. కవి గురించి మన చరిత్ర కారులు ఎక్కడా చెప్పినట్లు నాకు తెలియదు. పుస్తకం ఏసంవత్సరం లో ప్రచురింపబడిందీ, వెల వివరాలు కనిపించలేదు ముందు పేజీలు లభ్యం కానందున.

## 42 శ్రీ ఆలూరు కోన రంగనాయక శతకం -- శ్రీ యమ చిడంబరయ్య

శ్రీ ఆలూరు కోన రంగనాయక శతకం -అనే శతకాన్ని తాడిపత్రి వాస్తవ్యులు శ్రీ యమ చిడంబరయ్య రచించి కడపలోని తమ భాగాధేయుడు కావ్య పురాణ తీర్ధ,విద్వాన్ శ్రీ జనమంచి వెంకట సుబ్రహ్మణ్య గారి చే పరిష్కరింప జేసుకొని 1934లో ముద్రించారు. మకుటం రంగ నాయకా. . ఉత్పలమాల లతో అల్లిన భక్తి శతకం. ఘటికా సిద్దుడైన శ్రీ ఘటికాచలేశ్వరుడే తన ఆధి వ్యాధులను తీర్చగల సమర్ధుడని నమ్మిసేవిస్తే తగ్గి ఆరోగ్యం చేకూరినందువలన కవి ఈశతకం రాసి స్వామికి సమర్పించినట్లు కవి చెప్పాడు.

పీఠిక.

భక్తజనాగ్రగణ్యులారా!

ఈ శతకము భక్తిపారవశ్యమున వ్రాయఁబడినది. ప్రాచీనకాలంబునుండియు భక్తిని బెంపొందించుటలోఁ బ్రాశస్త్యంబుఁబొందియున్నవి. ఈశతకకర్త తాను వ్రాసినరీతిగా ననన్యశరణ్యుఁడై శ్రీరంగనాయక పదారవిందముల గట్టిఁగఁ జిత్తంబున నుంచిన మహనీయుఁడు. తనస్థితిగతులనన్నింటిని భగవంతునకు విన్నవించి కష్టజాలంబులనుండి కాపాడవలసినదిగాఁ గోరినాఁడు. ఆపన్నగశాయి యాపన్నుఁడగు నీకృతికర్త సన్నుతినాదరించి కల్గినవిపత్తులను బోఁగొట్టి కాపాడినాఁడు. భగవద్భక్తులకుఁ "బ్రార్థితార్థములు ఫలించుటలోఁ గొఱంతలుండవు," ను పెద్దలవాక్యము లీ కవిపుంగవునియెడ సార్థకములైనవి. కవిత్వము నాతికఠినమై సరళగతినలరారుచున్నయది. కవితకియ్యది మొదటిప్రయత్నము గాన సందంధాదిపూరణ పదప్రయోగంబులుఁ గనఁబట్టినను మొత్తముమీఁద భక్తియుక్తంబగు నీశతకము చదువుటకు హృద్యముగను, భక్తిసంజనకంబుగను నున్నదనుటలో నతిశయోక్తిలేదు. ఈ కృతికర్త యిట్లే భక్త్యుద్బోధకంబులగు శతకములను రచించి భగవత్కృపాపాత్రుఁడై చిరాయురారోగ్య భాగ్యంబులతోఁ దులఁదూఁగుఁ గాక యని పరమేశ్వరుఁడగు శ్రీరంగనాథునిఁ బ్రార్థించువాఁడ. ఇక్కడికి ఆలూరికోన శ్రీరంగనాథుఁ డిష్టార్థప్రదాయకుఁడై నిరంతర కుశలసంధాతయగుం గాక!

కడప
5—5—34

పండిత పాదసేవకుఁడు,
విద్వాన్ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మ.
కావ్యపురాణతీర్థ.

మొదటిపద్యం –"శ్రీ రఘుకుల వార్ధికులశేఖర మన్మధ కోటి సుందరా –కార ధరాత్మజాహృదయ కామిత పూర,మునీన్ద్రమానసా

ధార ధరాధరా దనుజ దైత్యహరా జగదేకవీర నా –కోరిక దీర్చు మొక్కటియకూరిమి తోడుత "రంగనాయకా ". నీకధలు వింటూ నిత్యధ్యానం చేస్తూ ఉన్నవారు ఏ కులం లో ఉన్నా వారి బాధలు తొలగిస్తావు. పూర్వం విభీషణుడు శరణు అనగానే కాపాడావు. కోపం పోగొట్టి శాంతం ఇచ్చి బుధజన సేవ ఇచ్చి నా ఆపదలు హరించు. "మానము పోవు జీవనం మంచిదికాదు బిరాన ప్రాణమే మాన సుఖాలిస్తుంది. బుద్ధి పాడయిపోయింది. మనసు ఒక చోటనిలవటం లేదు. "శ్రీరమణ వెంకట నాయకా "అంటే అన్నీ సుఖాలే ఇస్తావు. అంటాడు.

“చప్పుడు కాని లోపల ను సన్న తలంపు లుగాని దాహమున్-జెప్పగరాని యాకలియు. జిన్నని పిల్లలు భార్య యంచు నే –”స్రుక్కుతూఉన్నాను. ”నీ దయగల్గ నన్ ధనము నిర్మల తేజము జ్ఞానసంపదల్ –శ్రీ దయితా లభించును “అని గట్టి నమ్మకంతో చెప్పాడు. ”శ్రీ రఘురామ సర్వ సుర సేవిత నామ సురారి భీమ దు –ర్వార పరాక్రమక్రమ. సువర్ణ సుపర్ణ విహార రామా “నా కోరికలు తీర్చు అని వేడుకొన్నాడు. ”నా టక్కరి బుద్ధి కోరికలతో తాండవమాడుతుంది “అక్కటా నీ చరిత్ర ఒక్కనాడైనా నామనసులోకి రాలేదు క్షమించి కాపాడు. జాతి నీతి శాస్త్రం నిర్మలత్వం  లేకపోయినా  ”నీ స్మరణ పల్మరు జేసిన వారి బ్రేమతో నేతరియైన వత్సలత నెంతువు రంగనాయకా “అని నమ్మకం తో ఉన్నాడు

“నా శిరస్సుకొట్టు. దేహం తెగగొట్టు. ఆలుపిల్లలను పట్టు. పొట్టకూటికి బట్టకు బెట్టక –నీపాదాలుపట్టాను వదలను నన్ను రక్షించు. ”కుండలి శాయి పైన నీ భజన పనికిరాదని దుర్జనులు మొండి శిఖండులై ముక్తిమార్గం తెలుసుకోలేక “పాషన్డులైపాపులై యమలోకం లో బాధలనుభావిస్తారు.

“ఉత్పల పద్యపుష్పముల నుంచితి హారము గూర్చి నీ మెడన్ –సత్పురుషుల్ సుహారముల జాలగ నియ్యరే ఎత్తుకెత్తుగా-సత్పధ గామిగాక నుతి సన్నుతి కెక్కునె యంచు నెంచకీ –నీ ఉత్పల మాలికాళిగొను మోపికతో నిక రంగనాయకా “ అని కవి శతక సమర్పణ చేశాడు గడుసుగా.

శ్రీరస్తు.

ఆలూరుకోన రంగనాయక శతకము.



1. శ్రీరఘువంశ వార్ధికుల ♦ శేఖర! మన్మథకోటి సుందరా।
కారా! ధరాత్మజాహృదయ ♦ కామితపూర! మునీంద్రమానసా।
ధారా! ధరాధరా! దనుజ ♦ ధైర్యహరా! జగదేకవీర! నా
కోరికఁదీర్పు మొక్కెదను ♦ కూరిమితోడుత రంగనాయకా॥
2. కోవసుంధరాస్థలిని ♦ గోప్యములు పెక్కులు నిత్యముం మహా।
ఘోరదురంతపాతకము ♦ క్రూరముదాటఁగరాని భూరి సం।
సారమహాబ్ధిఁగట్టుఁగన ♦ సారెకు మ్రొక్కెద శ్రీనివాస! నా।
కోరికలిచ్చి నిత్యమును ♦ గూరిమిఁబ్రోవవె రంగనాయకా॥
3. మాధవ! నీపదాబ్జములు ♦ మానక మానసమందునిల్పి యే।
బాధలు బొందకుండనిను ♦ బ్రస్తుతిఁజేసెడిభాగ్యమిమ్ము స।
ద్బోధయొసంగి నిత్యమును ♦ భుక్తియు ముక్తియు నివ్వఁజట్టి స।
త్సాధులపాదసేవ సత ♦ తంబు నొసంగవె రంగనాయకా॥
4. మానసవీథి నిత్యమును ♦ మాధవ నీనుతిభక్తి చేయఁగాఁ
గానసెటుట్లు లోచనును ♦ గానని మేమము నిల్వఁబోదు నా
మానసమక్కటా! యెటుల ♦ మన్ననఁ జేయుదొ దీనపాల! శ్రీ
మానసనిత్యవాస! యను ♦ మానము సేయక రంగనాయకా॥

ఈ శతకం లో కవి తనను గురించి ఏమీ చెప్పుకోలేదు. రంగనాయకుని గురించీ ప్రత్యేకంగా చెప్పలేదు. పెలకూడా తెలియదు. కానీ పద్యాలన్నీ రసబంధురాలే. సరలపద సంజాతాలే.భక్తిభావ సుమవిలసితాలే. చక్కని ధారాశుద్ధి మనసులను ఆకర్షిస్తుంది. ఈకవి ఈశాతకం గురించి మనవాళ్ళు ఎవరూ ఎక్కడా పేర్కొన్నట్లు లేదు. పరిచయం చేసే భాగ్యం నాకు దక్కింది.

ఇప్పుడు ఆలూరు కోన శ్రీ రంగనాయక స్వామి దేవాలయం గురించి తెలు అనంతపురానికి 67 కిమీల దూరంలో ఉంది. ప్రకృతి ప్రియులకు ఈ ప్రాంతం భలే నచ్చేస్తుంది. కొండ పైభాగాన 400 ఏళ్లకు పైబడిన చరిత్ర గల హజీ వలీ దర్గా ఉంది. ఇక్కడి జలపాతాలు పర్యాటకులను ఆహ్లాదాన్ని అందిస్తాయి. ఇక్కడి ఆలూరు రంగనాయక స్వామి దేవాలయం కూడా చూడదగినదిసుకొందాం –

అసుర సంహార దోషపరిహారం కావించడానికి ఒక శివలింగాన్ని ప్రతిష్టించమని చెప్పాడు విశ్వామిత్రుడు. తాటకిని సంహరించి, ఆమె ప్రాణాలు వదిలిన స్థలంలో శివలింగాన్ని ప్రతిష్ఠ చేయడానికి నిశ్చయించుకుని తగిన చోటు కోసం వెదికాడు రాముడు. పెన్నానది ఒడ్డున అడుగుపెట్టిన రాముడు ఒక చిన్న ప్రాంతంలో ఉన్న ఒక బుగ్గలో కైలాసనాధుడు స్వయంభువ లింగరూపంలో దర్శనమివ్వడంతో పరమానందభరితుడయ్యాడు. పరుశురాముడు పూజించిన స్వయంభువు లింగం అదే అని తెలుసుకున్న విశ్వామిత్రుడు ఆ లింగాన్ని అక్కడే ప్రతిష్ట చేయమని చెప్పాడు. ఆ లింగాన్ని ప్రాణప్రతిష్ఠ చేసి పూజలు భక్తితో చేశాడు రాముడు. అసుర సంహారం వల్ల అదీ ఒక స్త్రీని సంహరించినందువల్ల పొందిన దోషం పరిహారమయ్యింది. ఆ తర్వాత అయోధ్యకు వెళ్ళే మార్గంలో విశ్వామిత్రుడి మార్గదర్శకత్వంలో రాముడు జనక మహారాజు కుమార్తె జానకిని స్వయంవరంలో గెలిచి పరిణయమాడాడు శ్రీరాముడు.

తాటకికి మోక్షం శ్రీరాముడి పరిణయం ఈ దృశ్యాలన్నిటిని విశ్వామిత్రుడు తన దివ్యదృష్టితో ఏనాడో తెలుసుకున్న విషయాలు. తాటకికి మోక్షప్రాప్తి లభించిన చోటే ఈనాడు తాడిపత్రిగా పరిగణించబడుతుంది. ఇక్కడ రాముడు ప్రాణప్రతిష్ఠ చేసి పూజించిన లింగాన్ని రామలింగం అంటారు. ఆలయం నిర్మించబడింది. క్రీ.పూ. 1460 సంవత్సరంలో మొదలైన ఆలయనిర్మాణం క్రీ.పూ 1475 సంవత్సరంలో ముగిసింది. బుక్కా రామలింగస్వామి ఆలయం పేరున పిలువబడుతుంది. ఒక అద్భుతమైన శిల్పకళా నైపుణ్యం చూడగలం. విశ్వామిత్రుడు యాగం జరిపిన అరణ్య ప్రాంతం తాడిపత్రికి దగ్గరలో వున్న కొండ చరియపై నెలకొన్న ఆలూరుకోన అని అంటారు. పురాణకధ ప్రకారం ఈ పుణ్యక్షేత్రం 14వ శతాబ్దంలో పాలించిన ఎర్రమ్మ తిమ్మరాజు అనే రాజు ఆలయాన్ని నిర్మించారు.

ఆ ఆలయంలో తాటకికి మోక్షాన్నిచ్చిన వైకుంతవాసుడు శ్రీరాముడికి కులదైవమైన శ్రీరంగనాధుని విగ్రహాన్ని ప్రతిష్ఠించారు.కొండపై చిన్న ఆలయ ద్వారం దాకా మనం వాహనాల్లో వెళ్ళగలిగేంత సౌకర్యంగా ఉన్నాయి రహదారులు. తాడిపత్రి నుండి ఆరు కి.మీ దూరంలో ఉన్న ఆల్లూరు కోన దట్టమైన అడవిలో పక్షులు కలకలరవాలు మధ్య ప్రయాణం చేయాలి. సహజమైన ప్రకృతిని ఆస్వాదిస్తూ కోనను చేరుకోవచ్చు. ఆలయ దరిదాపులకు వెళ్ళినప్పుడు ఎక్కడో జలపాతం సవ్వళ్ళు మంద్రంగా వినిపిస్తాయి. సుమారు 50 మెట్లు ఎక్కి వెళ్తే ఒక మండపం ఆ తర్వాత ఆలయగోపుర ద్వారం గుడి లోపలికి ప్రవేశిస్తే విశాలమైన వసార చివర బలిపీఠం, ధ్వజస్తంభం, గరుడ ్భగవాన్ సన్నిధి. గరుడ భగవాన్ శ్రీరంఘునాధుని సేవలంోనిరంతరం తన్మయత్వంతో ఉన్నట్టు దర్శనమిచ్చే శ్రీ రంగనాయక విగ్రహం.

గరుడ భగవాన్ ఎదుట ఒక మండపం ఆ తర్వాత గర్భగుడి. భక్తుల కోరికలను తీర్చే ఈ శ్రీరంగనాధుడు పడమటి దిక్కున శిరస్సు నుంచుకొని తూర్పువైపుకి కాళ్ళు పెట్టుకుని శేషశయనంపై పవళించిన విగ్రహం పాదాల వద్ద శ్రీదేవి, భూదేవి కూర్చున్నట్టున్న విగ్రహాలు దర్శనమిస్తాయి. నాభియందు బ్రహ్మ సాక్షాత్కరిస్తాడు. మాములుగా శేషశయనంపై పవళించే శ్రీరంగనాధుని విగ్రహాలు మట్టితో తయారు చేసినవే. కాని ఈ క్షేత్రంలో వున్న శయనించిన శ్రీరంగనాధుడి విగ్రహం నల్లరాతితో చెక్కిన విగ్రహం. వైష్ణవ గురువైన శ్రీరామానుజల వారికి గర్భగుడి నిర్మించారు.

బయటి ప్రాకారంలో వరుసగా శంఖుచక్రాలు దర్శనమిస్తాయి. ప్రతి సంవత్సరమూ చైత్రంలో బ్రహ్మోత్సవము జరుగుతుంది. ధ్వజారోహణ, సింహవాహనము, హనుమాన్ వాహనములపై స్వామి వారి ఊరేగింపు పురవీధులలో జరుగుతుంది. రధోత్సవము, కళ్యాణోత్సవము మొదలైనవి చాలా ఘనంగా జరుగుతున్నాయి. శ్రీరాముడి కులదైవమైన శ్రీరంగనాధుడే ఈ ప్రాంతం లోని ప్రజలకు ఇష్టదైవం. ఇంటి దైవముగా

బాసిల్లుతున్నాడు. తమ కోర్కెలు తీర్చే ఈ దేవుడికి ముడుపులు చెల్లించడానికి ఎందరో భక్తులు అనంతపురం, ధర్మవరం, బళ్ళారి, కదిరి, నుండే కాక ఆంధ్ర రాష్ట్రములో పలు చోట్ల నుండి కూడా వస్తారు. ఆలయంలో వాయువ్య మూలలో ఎప్పుడూ ఊరే బుగ్గలో స్నానం చేసి స్వామిని దర్శించి కానుకలను, ముడుపులను చెల్లించి ప్రశాంతంగా ఆలయం వెలుపలికి వస్తారు భక్తజనులు. పచ్చని చెట్ల మధ్యన ప్రకృతి సౌందర్యంతో నెలకొన్న ఈ ఆలయంలోని శ్రీరంగనాధుని దర్శించి స్వామి వారి అనుగ్రహం పొందుతాం.

## 43 ఆత్మ లింగ శతకం-- శ్రీ ఆకుల గురు మూర్తి యోగీంద్ర

"శ్రీ మదనంత సనాతన అచల బోధ సిద్ధాంత సద్గురు దత్తాత్రేయ పరంప  రాచార్యులైన ఆకుల గురు మూర్తి యోగీంద్ర విరచిత "ఆత్మ లింగ శతకం  విజయనగర రామానుజ ముద్రాక్షర శాల లో ముద్రింపబడింది. 125పద్యాల ఈశతకం ఎప్పుడు ముద్రింపబడిందో. వెల ఎంతో తెలియదు. కవి గారి విశేషాలు లేవు.."అఖిల జీవన సంగ ఆత్మ లింగ "అనేది మకుటం. అన్నీ గీత పద్యాలే.


ఆత్మలింగ శతకము

"శ్రీ పరశివ నీదు శృంగారతత్వంబు –నీ మహీ తలంబు నెచ్చు గాను  - నేను చెప్పబూన నేర్చితి నీ కృప –నఖిల జీవన సంగ యాత్మ లింగ "అని కవి శతకం మొదలుపెట్టి. తానేమీ శాస్త్రజ్ఞుడను. పండితుడినికాదని. వంకలు ఎంచకుండా ఆదరం గా చూడమని కోరాడు. మొదట జగములేక మూడు రేకుల చెట్టు –తుదనుకొమ్మలైదుతూగులాడి-కొమ్మకొమ్మలందు కోటి కాయలు గాచే "అన్నాడు తాత్వికంగా. పత్రం పుష్పం ఫలం వేరు కూడా లేవు. అది వేత్తలకు కూడా తెలీని రహస్యం. మాయకు మూలం లేదు తెలియరాదుకూడా. మమత తో మద అహంకారాలుపుట్టాయి. పంచ వన్నెల పంజరం లో మంచి చిలుక మఠం తీర్చి. మాణిక్యాలమాటల మూటలు పలుకుతుంది . ముక్తి కాంత చిక్కులు పెడుతుంది. అల్పమతులకు చిక్కదు.చూపు మనసులో పెట్టి చూడాలి. రెండుకొండలమధ్య రేవతి అనే చుక్క. చుక్క మధ్యలో సుధపురం.  పురం లో పురహరుడు కనిపిస్తాడు.

ధారణా దారి తెలిసిన యోగి. మేరువు చేరి మేను మరచి. తానుతాను అనే తలపే మర్చి. పొతే మళ్ళీ జన్మించడు. "తోలు కొండ దీని తొమ్మిది వందలు –గండుపులులు చుట్టూ గాచి యుండు –కొండ శిఖరమందు కోమలి యొకతుండు".అదికామరూపి దాన్ని కామించి. కొండేక్కిపులుల వాత బడ్డారు "అని అన్యాపదేశంగా చెప్పాడు. నల్లతామరాకు మధ్య రంధ్రం లో కుండలుపెట్టి పాము గుడ్లు పెట్టి –రెండు పిల్లల్ని ఈని రాత్రి పగలు అరుస్తోంది. అదే అఖిల వేదార్థం. వాటం తెలిసి మాయ మాతను దాటాలి. విషయ గుణాలలో ఉన్నది విషమే. ఏదైనా ఏకాగ్ర చిత్తం తో చేస్తేనే చెల్లుబాటవుతుంది. తత్వ వేత్త అల్ప తలపు లేకుండా నిత్యం ఒకే రీతిగా నిజసమాధిలో ఉంటాడు.

కాయ సిద్ధికోరి. గహనాలు చేరి. వాయు భక్షణం చేస్తే. మాయతనువు మట్టి పాలౌతుంది. "బంటు లింద్రియములు పనులెల్ల జేయంగ –మనసు మంత్రిగాను. మసలు చుండు –తననుతాను గన్న తత్వంబు తద్రూపు "అంటాడు. ఆత్మజ్ఞానం అనే అగ్నిలో కాలితే తత్వవేత్త తనువూ భూ సమాధి తప్పక చేయాలి. యోగిది నిద్ర కాదు నిర్వికల్ప సమాధి. కఠినమనస్కులకు ఆచలయోగం అంటుకోదు. తుదీ మొదలూ లేదు తుర్యమూ తానుకాదుఅదీ పరమాత్మ రూపం. "తన్ను తానూ గనదు –తానేది గనబోడు-మూర్చ నొందబోదు –మూర్ఖులకందదు. జడలుపెంచి జపతపాలు చేసినా అందుకోలేరు. కారణం శివుడు. కార్యం జీవుడు.

చివరగా "మంగళము మీకు మహిప్రకాశ –మంగళంబు జేసి మరిమరి మ్రొక్కెద

అవని నా కవిత్వ మాచంద్ర తారార్క-మగు విధంబుగాను నార్య మీకు –సమర్పణంబు జేసి యానంద మొందితి"అంటూ కవి అచల బోధతత్వాన్ని నింపిన ఈ ఆత్మ లింగ శతకాన్ని పూర్తీ చేశాడు.

గహనమైన వేదాంతాన్ని అరటిపండు వొలిచి చేతిలో పెట్టినట్లు రాసిన ఆకులగురుమూర్తి సత్కవి యోగీంద్రుడు ధన్యుడు. చదివి మనమూ ధన్యత చెందుతాం. ఈకవినీ, శతకాన్ని పరిచయం చేసే అదృష్టం నాకు దక్కింది.

## 44 రొయ్యూరు శ్రీ వేణుగోపాలస్వామి శతకం -- శ్రీ జోగిరాజు

కృష్ణా జిల్లా కంకిపాడుకు సుమారు పది కిలోమీటర్ల దూరం లోపల కృష్ణా తీరం లో రొయ్యూరు గ్రామం ఉంది. కృష్ణ కరకట్ట పై నుంచి కూడా రొయ్యూరు చేరవచ్చు. షుమారు ఒక శతాబ్దం పూర్వం రొయ్యూరులో రొయ్యూరు జోగిరాజు., గోపరాజు అనే సోదరులు ఉండేవారు. ఆర్వెల నియోగులు. భారద్వాజ గోత్రీకులు. తండ్రి అచ్యుతరామయ్య. తాత రామరాజు ఈ గ్రామం లో మొదట నివాసులు. జోగిరాజు భగవద్భక్తుడు నిష్టా గరిష్టుడు. ,కవి వరేణ్యుడు. కాళ్ళకు గజ్జలు కట్టి చిందులు తొక్కుతూ,ఒక చేతిలో తంబూర. రెండవ చేతితో తాళం వేస్తూ. పరవశంగా నృత్య గీతాలు చేస్తూ అభినవ భక్త రామదాసు గా. కబీరు గా త్యాగయ్య లా ఉండేవాడు.నారదుడో తుంబురుడో అని పించేవాడు. కవి. భక్తుడు కనుక మొదటగా ఈయన గురించే అందరూ చెప్పుకొనేవారు.

తానూ రచించిన కీర్తనలను తన్మయా వస్తలో మమరచి గానం చేసేవాడు కవి భక్త జోగిరాజు. తానూ బీద వాడైనా అశక్తుడు అనిఅనుకోకుండా ఊరిలో ఒక దేవాలయం కట్టాలనే సంకల్పం కలిగింది. .సోదరుడు గోప రాజు కూడా ఈ మహత్కార్యానికి అంగీకారం తెలిపాడు. ఈ సోదరులు ప్రతినిత్యం జపతపాలు. దేవతార్చన నియమం తప్పకుండా చేస్తూ, సీతారామ కల్యాణం. రామాయణ పారాయణం. సంతర్పణలు చేస్తూ ఉండేవారు.

రొయ్యూరు వల్లూరు జమీ లోభాగం కనుక గోపరాజు సంస్థానం లో ఉద్యోగం చేస్తూ. లౌకిక వ్యవహార దక్షుడయ్యాడు. ప్రజలలో సోదరులకు మంచి పేరు ప్రతిష్టలు ఉండటం. కార్య దక్షులవటం వలన జమీందారు సాయంతో. ప్రజా సహకారం తో శ్రీ వేణుగోపాలస్వామి ఆలయం. శ్రీ పార్వతీ సమేత శ్రీ సకలేశ్వరాలయం అద్భుతంగా నిర్మించి నిత్య పూజాదికాలకు అన్ని ఏర్పాట్లు చేశారు. వీరు నిర్మించిన శేష తల్ప విమానం కల విష్ణ్వాలయం. శివాలయం అత్యంత శిల్ప శోభితం. తమ స్వంత ఈనాము నుంచి కొంత పోలముకూడాస్వామివార్లకు సమర్పించారు.

వీరికి గురువులు వైష్ణవులు. తమకున్న గురుభక్తిని ప్రకటిస్తూ గురువుగారిపై ఒక అనేక గ్రంథాలు రాసి సమర్పించారు. వీరు రాసిన వేణుగోపాలశతకం లో మూడవ పద్యం లో వీరి గురుభక్తి ప్రత్యక్ష మౌతుంది. -

సీసపద్యం –"శ్రీరామ తారక సేవాభి రతుడనై –ముందు విష్వక్సేన మూర్తి దలచి

పరమ త్రైలోక్య దీపాంకుర జనని యైన –త్రివిధంబు మెలగు ఇందిరకు మొక్కి

రామానుజాచార్య రాజితాళ్వారాది-పరమ వైష్ణవులకు ప్రణతి జేసి

తిరుమల పురిహాళ్ళదేశకాన్వయ కంధి –సోముడౌ రఘునాధ సూరి సూను

గీ-రాఘవా చార్య కృపను విరాజితముగ-సన్ను తించెద నిన్ను

భూరి గుణ జాల రొయ్యూరి పురవిలోల –వేణు గోపాల శ్రీలోల విజయ శీల".

గురుదేవులకు పది ఎకరాల ఈనాం భూమిని కూడా ఇచ్చి తమ గురుభక్తి చాటుకున్నారు. జోగిరాజకవి రాసిన "పారిజాతాపహరణం "మొదలైన కావ్యాలను తానె అచ్చు వేయించి ఇస్తానని గురువు తీసుకొని వెళ్లి. ప్రచురించలేదు. తిరిగి కవి గారికి ఇవ్వనూ లేదు. ఒకరకంగా పంగనామాలు పెట్టాడు. అదొరకమైన "కైంకర్యం" అని పించింది. ఆ వంశ పారంపర్యంగా పునర్లిఖింపబడిన,కొంపల్లి కాగితములపై వ్రాయబడిన గోపాల శతకం. హనుమంత శతకం. వామన విజయం., కీర్తనలు. పాటలు మాత్రం తమకు దక్కాయని రొయ్యూరు గురించి రాసిన శ్రీ రొయ్యూరి రామ చంద్ర ప్రసాద రావు బాధతో తెలిపారు.

రొయ్యూరు గురించి నా జ్ఞాపక శకలం – వత్సవాయి లోసైన్స్ మేస్టర్ గా.. పెనుగంచి ప్రోలులోనో. హెడ్ మాస్టర్ గా వత్సవాయి లోనో పని చేస్తున్నప్పుడు ఒక శనివారం సాయంత్రం స్కూల్ అయ్యాక. బస్ మీద బయల్దేరి ఉయ్యూరు వస్తూ అంచెలంచెలుగా బస్సులు మారుతూ. నిద్రమత్తులో జోగుతూ ప్రయాణం చేస్తూ. కంకిపాడు దాకా వచ్చే సరికి రాత్రి సుమారు 9అయింది. అక్కడి నుంచి ఉయ్యూరు రావాలి బస్ లో. కంకిపాడు బస్ స్టేషన్ లో బస్సు ఎక్కాను. మంచినిద్ర మత్తులో ఉన్నాను. ఒక అరగంట తర్వాత బస్ ఆగింది. తీరా చూస్తె అది రొయ్యూరు. ఉయ్యూరు అనుకోని రొయ్యూరు బస్ ఎక్కానని అర్ధమైంది. అక్కడినుంచి మళ్ళీ కంకిపాడు కు రావాలంటే బస్ లేదు. ఏం చేయాలో అర్ధం కాక దిగి అటు ఇటూ తిరుగుతుంటే ఒకాయన గుడిదగ్గర బిజెపి వాళ్ళ సభ జరుగుతోంది. కాసేపట్లో అయిపోతుంది. వాళ్ళ వెహికిల్ లో కంకిపాడు వెళ్ళండి అని చెప్పాడు. అక్కడికి వెడితే తెలిసిన ఆర్ ఎస్ ఎస్ వర్కర్ కనపడ్డాడు. ఆయనకు నా గొడవ చెబితే" మా కారు లో డ్రాప్ చేస్తాం మాష్టారూ "అన్నాడు. వాళ్ళ మీటింగ్ పూర్తయి కారు బయల్దేరే సరికి రాత్రి 11దాటింది. వాళ్ళ కారులో

కంకిపాడుకు వచ్చేసరికి 11-30అయింది. రోడ్డుమీద వచ్చే పోయే లారీలను ఆపమని చెయ్యి చూపుతూ చివరికి ఏదో లారీ దొరికితే ఉయ్యూరు కుచేరేసరికి  అర్ధరాత్రి 12-30అయింది. ఇదొక తమాషా అనుభవం.

గత మూడేళ్ళుగా సరసభారతి నిర్వహించే త్యాగరాజ ఆరాధనోత్సవం లో శ్రీ టేకుమళ్ళ వెంకటప్పయ్య గారితో పాటు రొయ్యూరి సురేష్ అనే ఆయనకూడా వచ్చి పాల్గొని చక్కగా గానం చేసేవారు. ఈ రొయ్యూరు కు చెందిన వారేమో తెలీదు

## 45 నగజా శతకం --   శ్రీమతి చుక్కా కోటి వీరభద్రమ్మ

కృష్ణాజిల్లా వల్లూరు పాలెం కవయిత్రి శ్రీమతి చుక్కా కోటి వీరభద్రమ్మ నగజా శతకాన్ని రచించి. బెజవాడ ఎజి ప్రెస్ లో ముద్రించి 1940లో ప్రచురించింది. వెల ఒక్క అణా మాత్రమె. విజ్ఞప్తి వాక్యాలలో కవయిత్రి "శ్రీ మద్వేద కావ్య స్మృతి దర్శన తీర్ధ. సాహిత్య విశారద. ధర్మాచార్య. విద్యానిధి విద్యారత్నాది బిరుదాంకితులు. ఆధునిక వీరశైవ మతోద్ధారకులు శివశ్రీ చిదిరి మఠంవీరభద్రశార్మగారి పాదపద్మాలకు సమర్పించినట్లు తెలిపింది.




."పతి బూజ బాయక ధ్రుతమతిని నాగార్యుని –క్షితి గలదాక మతిలో కొనియాడెద. లక్షణము నేర్పిన లక్షణ వంతుని –కొనియాడుచు తనివి చెందేద. పిన్నపెద్దలను చిన్ని యన్నలను. పండిత వరులను దండి కవీంద్రులను –ఒప్పులగొని. తప్పుల ద్రోసి –తప్పక నాకవితకు మెప్పుకు తేగలరని –కరములు మోడ్చి శరణు చేసేద "అని విన్నవించింది. చిదిరి మఠం వీరభద్ర శర్మగారు "తన ముద్దుల మేనకోడలిని సంబోధిస్తూ. భక్తీ నీతితి సదాచారాలను సరళ భాషలో "నగజా శతకం "రాసింది. ఆధునిక ఆంద్ర శైవ ప్రపంచం లో ఈమె ఒక్కతే శతకకర్త అవటం అత్యంత మోదం కలిగించింది. భావ ప్రౌఢిమ గొప్పగా ఉంది. వయసున చిన్న గుణమున మిన్న. "అని

అభిప్రాయం వెలిబుచ్చుతూ ఆశీర్వదించారు. నగజా కుమారి అనే తన మేనకోడలి ని సంబోధిస్తూ "నగజా "మకుటంతో కందపద్యాలలో రాసిన శతకం ఇది. అందంగా ఉంది.



మొదటిపద్యం –"శ్రీ గౌరీ ప్రాణేశుడు –బాగోగులు చిరాయువిచ్చి బ్రతికెడు దనుకన్ –శ్రీ గౌరియు కుంకుమనిడి-బాగుగ నిన్ను మనుచునమ్మ వసుమతి నగజా "అంటూ శివపార్వతుల ఆశీస్సులు మేనకోడలికి కోరింది. తర్వాత పనులు పూర్తీ చేసే విఘ్నేశుని. వీరశైవ పంచా చార్యులను స్తుతించింది. "అర్ధించిన వే-అరదంబుల నిచ్చు "బసవేశుని "భక్తితో కొలిచి. చిదిరి మఠం వీరభద్రగురుస్వామిని. దీక్ష ఇచ్చిన శంభు మూర్తిని. తండ్రి వైద్యుడు పట్టిస వీరయ్యను. తల్లి నాగమ దేవిని. చిన్నతనం లో తన్ను పెంచిన సంగయ. మల్లాంబలకు.విద్యాగురువు లక్కన మల్లికార్జున కు. మతిమంతుడైన భర్త నాగార్యునికి. పెద్దన్న బసవ. సోదరులు యల్లమార్య. వీరభద్ర లను. అక్కయ్య మహాదేవిని స్మరించి. భవభూతి బసవ,నన్నెచోళ,కాళిదాసు. బూసా మల్లయ కవీశ్వరులను 18పద్యాలలో స్తుతించింది.

19వ పద్యం నుంచి నీతులు ఉపదేశాలు రాసింది. "సిరి గలదంచును పురుషులు –పరుల హింసింప జనదు పాండవులను నా –కురునాధుడు నిందించుట –ధర బడెగా భీము చేత దప్పక నగజా "అన్నది. దీక్ష వదలక కష్టాలకోర్చి కాపురం నిలబెట్టుకొని పుట్టింటి కీర్తి పెంచాలి. పతి భక్తీ భవనాశం. దానికి మించిన వ్రతం లేదు. ఇరుగుపొరుగువారితో అనురక్తి తో ఉండాలి. బంధువులను గౌరవించాలి. ."హృదయేశు మీద ప్రేమను మదిలో నిల్పుకోవాలి ".కష్టాలొస్తే నిష్టూరాలు పలకరాదు.గురునిందా పరనింద పరమేశు నింద చేటు తెస్తాయి. "కట్టిన శివ లింగము నె-ప్పట్టునబాయంగారాదు"అలావదిలేస్తే కులట అనిపించుకొంటుంది. సత్యమే యశానికి మూలం. భవమోహనాశనం. శీలం నిలిపేది. "పంచాక్షరి భవహరణము –పంచాక్షరి మోక్షనెలవు ".విభూతి రుద్రాక్షలు చేతులలో తాళంతో గౌరీపతిని కీర్తించే వాడే యతి. శివభక్తితో మార్కండేయుడు చిరాయువు పొందాడు. అంగం మాయామయం. లింగం సర్వేశుని గుర్తు. లింగాన్ని అంగాలను ఏక దృష్టితో చూడాలి. "అప్పే ముప్పును తెచ్చును –తప్పే యపకీర్తి తెచ్చు ".సురతాగితే ఆరోగ్యం సిరి వంశ ప్రతిష్ట స్థిర చిత్తం విజ్ఞానం అన్నీ నశించిపోతాయి. "ముక్కంటి మంత్రం ఎక్కడ ఉంటె అక్కడ శివుడు ఉంటాడు.

చెడి బతకటం తేలిక బ్రతికి చెడటం చాలా కష్టం. కాలాన్ని పురుషార్ధగతికి వెచ్చించాలి. "కక్షలు పుట్టించటానికి. రక్షకులకు చేటు కూర్చి లక్షణ పరులే –పక్షము నాతొ సరియని –శిక్షల గనకుండి వదరు చెనటియు నగజా "అంటూ క్షకార ప్రయోగంతో అక్షరరమ్యత చేకూర్చింది కవయిత్రి. శిల. మణి భేదంతో ఉంటాయి మారవు. అలాగే దుర్మార్గులు. సత్పురుషులు ఉంటారు. కులకాంత కు సద్విద్య బోధించిన వాడే గురువు. "శ్రీ గురు పదపద్మమ్ములు-భోగీశుని లింగ మాత్మ బోల్పుగ నుంచే –రాగంబుల బడయకెతా –బాగుగ జరియించు వాడె భక్తుడు "

"జిలిబిలి పలుకుల పలుకుచు –కులికెడు మురిపెంపు మేనకోడలవనుచున్ –లలి న"న్నత్తా'యనుటను –యిల నీకే కృతి నొసంగి తింపుగ నగజా "అని మేనకోడలు కు అంకితమిచ్చినది మేనత్తకవయిత్రి. పద్యం రాయటం నేర్పిన అన్న ను స్మరించినది. "లక్కన వంశోద్భవనై –చుక్కావారింటమెట్టి సుజనావలికిన్-మొక్కులిడి వీరభద్రమ-ఇక్కబ్బము చెప్పెనమ్మ ఇంపుగ నగజా "

చివరి 107,108పద్యాలు

"జయజయ హరినుత పాదా – జయజయ ప్రమధార్తిహరణ జయ చంద్రధరా –జయజయ పురహర యనుచును –నియమంబుగ దలతు మతిని నిక్కము నగజా "

"మంగళమో భవ హరణా –మంగళమోభక్త పోష మాపతి రమణా-మంగళమోశివ యంచును –పొంగుచు నే పాడుచుందు ముద్దుల నగజా "

ఈశతకం లో భక్తి,నీతి. సద్వివేకం. స్త్రీపురుషులకు సద్ధర్మ జీవన విధానం. శివ భక్తి పారమ్యం పుష్కలంగా. ధారశుద్ధి కల సరళపదాలతో మనసుకు ఆకర్షణ కలిగించే రీతితో కవయిత్రి శ్రీమతి చుక్కా కోటి వీరభద్రమ్మ తన ప్రతిభను చాటింది. కుమారీ శతకంలాగా "నగజా "శతకం కూడా చక్కని శైలిలో నడిచింది. సాహిత్యం లో ముఖ్యంగా శైవ సాహిత్యం లో చిరయశస్సు పొందే ఉంటుంది. కానీ మన వారి దృష్టిలో పడలేదని పించింది. ఆధునిక శైవ కవయిత్రిగా వీరభద్రమ్మ గొప్ప స్థానం పొందింది. ఆమెనూ ఆమె శతకాన్నీ పరిచయం చేసే మహద్భాగ్యం నాకు కలిగి నందుకు మహదానందంగా ఉంది. వల్లూరి పాలెం మా ఉయ్యూరుకు సుమారు అయిదారు కిలో మీటర్ల దూరం లోనే ఉన్నా. ఈ కవయిత్రి గురించి నాకు ఇప్పటిదాకా తెలియక పోవటం నా

అజ్ఞానమే. మా అబ్బాయి శర్మ ఇలాంటి కవులను శతకాలను వెతికి పంపించి నాతో రాయిస్తున్నాడు. అతడికి అభినందనలు.

## 46 సంస్కృతం సుమతీశతక -- శ్రీ జానపాటి పట్టాభి రామయ్య గారు



గుంటూరు జిల్లా పలనాడు తాలూకా చానపాడు లో నివసించిన శ్రీ జానపాటి పట్టాభిరామయ్య గారికి తిరుపతికవులంటే అత్యంత గురుభావం. అందుకే తమ జీవిత విశేషాలను "జాతక చర్య "అని భక్తిభావంతో పేరు పెట్టుకొన్నారు. "అభినవ సరస్వతి"అనే సాహిత్య పత్రిక స్థాపించి నాలుగు దశాబ్దాలు నిర్విరామంగా నిర్వహించారు. గుంటూరు జిల్లా నివాసం తర్వాత సికందరాబాద్ వెళ్లి అక్కడే ఉంటూ తెలంగాణా సాహిత్యాన్ని కూడా అధ్యయనం చేసి తమ స్వీయ చరిత్రలో చేర్చారు.

పట్టాభి రామ శాస్త్రిగారు అంటరానివాళ్ళు' అనే శీర్షిక కింద 1922 ఏప్రిల్ నుండి సెప్టెంబర్ వరకు ఐదుసంచికలలో సుదీర్ఘ వాదన చేసారు.

అంటరానివాళ్ళా అన్న కరపత్రపు శీర్షిక లోనే భాషాదోషం ఉందని. వాళ్ళా ?వాండ్రా ఇందులో ఏది సరైనదంటూ కరపత్ర రచయితలను ఎద్దేవా చేయటం దగ్గర మొదలు పెట్టి ' అస్పృశ్యతా దోషం ఉండబట్టే అస్వతంత్రులమై స్వరాజ్యము పొందలేక పోతున్నాం అన్నవారి వాదాన్ని అపహాస్యం చేస్తూ స్వరాజ్య సంపాదనకు అంటరానితనం అడుగంటించటం సాధనం కాదని వర్ణధర్మ భేదములు ఉండవలసినవే అని పేర్కొన్నాడు. అవి భగవంతుడి ఆజ్ఞ అని, స్పర్శ, సహపంక్తి భోజన నిషేధాలు పరమార్ధ సాధనకు ఏర్పడ్డాయని, స్వరాజ్య సుఖం కన్నా పరమార్ధ సుఖం అత్యుత్తమమని వాదించాడు. " మమ్ములను దక్కువగా జేసినారని తక్కువజాతి వారెక్కువ జాతివారిని నిండించగూడదని, తమతమ తక్కువతనమునకు తమతమ కర్మయే కారణము కానీ

ద్వేషముతో ఇతరులచేత ఏర్పరచబడినది కాదు” అని చెప్పటానికి కూడా జంకని కరుడుగట్టిన సంప్రదాయ బ్రాహ్మణవాదం అది. పంచములను అంటరాని వారని బాధపెట్టటం హిందూ ధర్మాలలో ఒకటి అంటే నేను హిందూ మతమునకే ప్రబల విరోధిని అని చెప్పిన గాంధీ దగ్గర నుండి అంటరానితనమేమిటని అసహ్యపడిన బరోడా మహారాజు, బాలగంగాధర తిలక్ మొదలైన అందరినీ నిరసించాడు ఈ శాస్త్రి.

1922 అక్టోబర్ సంచికలో ఈయన పంచమ వ్యతిరేకత ను బయలు పరిచే రచన ఒకటి ఉంది. ఆదిమాంధ్రులు చేయతలపెట్టిన గోరక్షణ సభకు సంబంధించి సుండ్రు వెంకయ్య, కుండజోగయ్య చేసిన విజ్ఞాపన కరపత్రం ప్రచురించాడు. అంతవరకు బాగానే ఉంది. వెనువెంటనే గూడూరి రామచంద్రరావు గుడివాడలో ఏర్పరచిన సేవాశ్రమం నుండి 7- 6- 22 న నిమ్న జాతుల ఉద్ధరణకు పాటుపడుతున్న కుసుమ వెంకట్రామయ్య, కుసుమ ధర్మన్న, శెట్టిబత్తుల వీరన్న, రాయడు గంగయ్య, కె. నారాయణ దాసు, కె. జోగయ్య, కె. నాగూరు, కనుపర్తి రంగయ్య, సుండ్రు వెంకయ్య సమిష్టిగా అభినవ సరస్వతి సంపాదకులకు తమ ఆశ్రమానికి ఉచితంగా పత్రిక కాపీ పంపమని, తమ సంఘాభ్యుదయానికి సంబంధించిన రచనలను ప్రచురించమనీ కోరుతూ రాసిన ఒక ఉత్తరం కూడా ప్రచురించి ఇక ఆ రెండింటి మీద అభ్యంతరాలు వ్యక్తం చేస్తూ రాసుకొంటూ పోయాడు.నాగర ఖండ. స్వర్ణ కార వ్యవహారం మొదలైన రచనలు శాస్త్రి గారు చేశారు. ”అంటరాని వాళ్ళు “అని పట్టాభిరామ శాస్త్రి గారు రాసిన పుస్తకం గుంటూరు చంద్రికా ముద్రాక్షర శాలలో 1926న ముద్రించారు. వెల.అర్ధరూపాయి. ఇందులో అస్పృశ్యతా నిరూపణం పేరుతొ మల్లాది రామ కృష్ణ చయనులు గారు రాస్తే. దాన్ని కాదని అస్పృశ్యతా నివారణ అనే పెద్ద ఎత్తున ఉద్యమాన్ని నిర్వహించటానికి శ్రీ పెరి వెంకట రత్న దీక్షితులు గారి ఆహ్వానం పై 19-6-1925న అమలాపురం తాలూకా పాలగుమ్మి గ్రామం లో శ్రీ చేన్న మల్లెశ్వరస్వామి దేవాలయం లో ఒక పెద్ద విద్వత్ సభ జరిగింది. శ్రీ నోరి సుబ్రహ్మణ్య శాస్త్రి శ్రీ కాశీ భట్లబ్రహ్మయ్య. శ్రీ బులుసు అప్పన్న శాస్త్రి. శ్రీ పుల్య ఉమామహేశ్వర శాస్త్రి మొదలైన దిగ్దంతులైన సిద్ధాంతులు సోమయాజులు సుమారు 70మంది హాజరయ్యారు. ప్రేక్షకులు అన్ని వర్ణాలవారు కలిసి 400మంది వచ్చారు. శ్రీ జయంతి రామయ్య గారు శ్రీ కప్పగంతుల రామశాస్త్రి గారు సభాధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. ఎవరివాదాలు వారు చేశారు.

శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు తమ “ప్రబుద్ధాంధ్ర “పత్రికలో ఒక తమాషారాశారు. పుల్లంరాజు చక్రవర్తి ఒకసారి గుర్రప్పందాలు చూడటానికి మరి కొన్ని స్వంత పనులమీద బొంబాయి వెళ్లి కొన్ని రోజులున్నారు. అక్కడ ఆయన అనేక సభల్లో పాల్గొని వస్నె తెచ్చారు అందులో ఆయనకు బాగా నచ్చింది. మనసుని కదిల్చిందీ “అస్పృశ్యతా నివారణ సభ “.అక్కడి పేపర్లన్నీ రాజుగారిని బాగా మెచ్చాయి. తిరిగిరాగానే ఇక్కడ కాంగ్రెస్ వాళ్ళు జరిపిన సభలలో స్పందన కనిపించకపోయే సరికి తానె నడుం కట్టాలనుకొన్నారు. అస్పృశ్యులు పెద్ద సభాజరిపి తమల్ని ఎందుకు దూరం పెడుతున్నారో తెలీదని తాములేకుండా సంఘ జీవనం సాగుతుందా అని రాజుగారికి

మహాజర్ పంపి వెంటనే కల్పించుకోమని కోరారు. రాజు బాగా ఆలోచించి అందర్నీ సంప్రదించి దుప్పలపూడి సామ్రాజ్యం లోఅస్పృశ్యత లేకుండా చేసి అందరి మెప్పూ పొందాడు. పై విషయాలన్నీ పట్టాభిరామశాస్త్రిగారు గ్రంధస్తం చేసి కళ్ళు తెరిపించారు. పుస్తకం చివర్లో అంటరాని తనాన్ని సమర్ధిస్తూ మల్లాది చయనులు గారు రాసిన పుస్తకం కూడా చేర్చి దాన్ని చదివి అర్ధం చేసుకోమని అస్పృశ్యతను నివారించమని పట్టాభి రామ శాస్త్రిగారు చెప్పారు

పట్టాభిరామ శాస్త్రిగారు "ఆరోగ్య భాస్కరం "అనే మరొక గ్రంధాన్ని 1933లో రచించి గుంటూరు చంద్రికా ముద్రణాలయం లో ముద్రించారు దీన్ని త్రిలింగ పత్రిక. శ్రీ వావిళ్ళ వెంకటేశ్వర్లుగారు శ్రీ శిష్ట్లా హనుమత్సాస్త్రి. శ్రీ మల్లాది విద్వత్ చయన్లు. శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి మొదలైనవారు అమూల్య అభిప్రాయలు తెలియజేశారు. ఇది మొదట్లో త్రిలింగ పత్రికలో ధారావాహికంగా వచ్చింది.

మొదటిపద్యం –"శ్రీపతి నీదు మండలము చేరివసింప ద్రయీతనుండపై –రేపులుమాపులున్ ద్విజులు ప్రీతి నొసంగు జలాంజలుల్ కరం

బొపిక తోడ గొంచు మరి యూరకయుండక వారి బాధలన్ –పాపుచు నుండు నీదు పదపద్మములన్ శిరముంతు భాస్కరా "

సంధ్యల నర్ఘ్యముల్ ల్విడిచి సంస్తుతి చేయుచుంటి "అనీ రుగ్యుతు డేంచ నౌ నిను ","మిత్రుదతంచు నిన్ శ్రుతియే మిక్కిలి పేర్కొనే –రోగాయుద్ధాత్రుని పట్ల మిత్రు దదికంబుగా జూపడే మైత్రి భాస్కరా "అంటూ భాస్కరా అనే మకుటంతో 126చంపక శార్దూల మత్తేభ ఉత్పలమాల పద్యాలతో భాస్కర శతకం రాసి ఆరోగ్యమిచ్చే భాస్కర మిత్రుడికి అంకితం చేశారు కవి. చివరికి గద్యం లో తనగురించి చెప్పుకొన్నారు.

"ఇది శ్రీమజ్జగద్గురు కరుణా కటాక్ష సంప్రాప్తోభయ భాషా పాండిత్య. రసవత్కవిత్వ నిధాన హరితస గోద్భవ లక్ష్మీ నారాయణ. పేరమాంబికాగర్భ శుక్తి ముక్తాయమాన. విద్వత్సభావిష్కృ తావధాన విధాన. జానపాటి పట్టాభిరామాభి ధాన విలిఖతంబగు ఆరోగ్య భాస్కరం"

ఇంతటి విద్వత్ కవి గురించి మనవాళ్ళు ఎవరూ ఎక్కడా పేర్కొనకపోవటం. విడ్డూరంగా ఉంది. వీరిని వీరి శతకాన్ని పరిచయం చేసే మహద్భాగ్యం నాకు దక్కింది. మా అబ్బాయిశర్మ పంపిన ఈ శతకాన్ని బట్టి రాయగలిగాను. కవి గారిఇతర రచనలగురించి మరో వ్యాసంలో తెలియ జేస్తాను.

సశేషం

శత శతక ప్రసాద సమీక్ష

గబ్బిట దుర్గా ప్రసాద్ -9-5-22-ఉయ్యూరు .

సుమతీ శతక సంస్కృతానువాదం

శ్రీ జనపాటి పట్టాభి రామయ్య గారు 1910లో సుమతీ శతకం ను సంస్కృతం లోకి "నీతి గీతలు "గా అనువాదం చేసి నరసరావు పేట భారతీ విలాస ముద్రాక్షర శాలలో ముద్రించారు. వెల-రెండు అణాలు మాత్రమె. తెలుగు పద్యాన్ని దానికింద సంస్కృత అనువాదాన్ని అందించారు.

1-కం.-"శ్రీరాముని దయచేతను –నారూఢిగ సకల జనులు నౌరా యనగా –దారాళమగు నీతులు –నోరూరగ జవులు బుట్ట నుడివెద సుమతీ "

సంస్కృతనువాదం –శ్లో –శ్రీరామ చంద్ర కృపయాక్షిత్యాం-శ్లాఘ్యంభవేద్య ధామనుజైః –ధారాళ నీతిశతకం –తథాతి రుచిరం ప్రవచిన్మధురతరం "

3-అడిగిన జీతం బీయని –మిడిమేళపు దొరను గొల్చి మిడుగుటకన్నన్-వడిగల ఎద్దుల గట్టుక –మడి దున్నుక బ్రతకవచ్చు మహిలో సుమతీ

శ్లో –యోభ్యర్థితోపివిత్తం –యచ్ఛతినహి తజ్జనస్య సేవాతః –కృత్వా కృషిమతి విపులాం – కుంభిన్యాం జీవనం వరం "

5-ఆధరము గదిలియు గదలక –మధురములగు భాష లుడిగి మౌనవ్రతమౌ –యధికార రోగ పూరిత –బధిరాంధక శవము జూడ బాపము సుమతీ

శ్లో-అనుదిత మధుర వచస్కం –మౌనిన మధికార రోగ భూయిష్టం –దృష్ట్వా బధిరాంధ శవం –దోషీస్యాన్ముద్రితా ధరం మనుజః

12-ఇమ్ముగ జదవని నోరును –నమ్మా యని పిలిచి యన్నమడుగని నోరున్ –దమ్ముల బిలువని నోరును –గుమ్మరి మహి ద్రవ్వినట్టి గుంటర సుమతీ

శ్లో –యద్వక్త్రం నహి పతతే –జననీ త్యాహూయయాచ తేనాన్నం-యత్సహజాన్నాహ్వయతే తద్వక్త్రం –కుంభాకార కృతం గర్తం.

104-సిరిదా వచ్చిన వచ్చును –సలలితముగ నారికేళ సలిలము భంగిన్ –సిరి దా బోయిన బోవును –కరిమింగిన వెలగపండు గదరా సుమతీ.

శ్లో –శ్రీరాయాత్రికమ శస్త్వారామ –గ నారి కేళనీరమివ –భూరి క్షయ మేత్యచిరం –వారణ కబలీ కృతః కపిత్థ ఇవ.

108-పేసరపు జాతి గానీ –వీసము దా జేయనట్టి వ్యర్థుడు గానీ –దాసీ కొడుకైన గానీ –కాసులుగలవాడే రాజు ధరలో సుమతీ.

శ్లో-హీన కుల స్థోభూయా –దితర ప్రజ్ఞా భిరన్వితోనస్యాత్ –సూరు ర్వాస్యాద్దాస్యాః-క్షోణీనాధస్తువిత్తవానేవ.

ఇలా శతకాన్ని చక్కగా గీర్వాణీకరించారు కవి జానపాటి. తనసంస్కృత సత్తా చాటి చెప్పారు.

స్కాంద పురాణం లోని “నాగర ఖండం “6,7,8ఆశ్వాసాలను ను పట్టాభి రామయ్య గారు సరళమైన తెలుగులోకి అనువదించి తన ప్రతిభ చాటారు. ఇది 1928లో గుంటూరు చంద్రికా ముద్రణ శాలలో ముద్రించారు. వెల-కేవలం అర్ధరూపాయి మాత్రమె.

ఇందులో అజాగృహోత్పత్తి,ఖండశిలా సౌభాగ్యకూపికల ఉత్పత్తి. పతివ్రతా దీర్ఘిక చరిత్ర. మాండవ్య మునిని గొల్ల వారు కొరతవేయటం. యముడు దాసీ గర్భం లో పుట్టటం. చనిపోయిన బ్రాహ్మణ బాలకుడు బతికి రావటం. యుధిష్టిర ఉపాఖ్యానం. అనూదకదాన ఫలం. పార్వతి గణపతిని సృష్టించటం. రంభ జాబాలి మహర్షి తపస్సు భంగం చేయటం. రంభకు ఫలవతి పుట్టటం. చిత్రాన్గాదేశ్వరుడు ఆమెకు వరాలివ్వటం. స్త్రీల ఉత్కృష్టత ప్రశంస. శివవారంతో దేవతలు రాక్షసులని పారద్రోలటం. వసురుద్రాదిత్య వర్ణన. శుక వ్యాస సంవాదం. వ్యాసుడికి పటికలో కపిష్టలుడు పుట్టటం. త్రిపురాసుర సంహారం. నారసింహ మంత్రం ప్రభావం. వశిష్ట విశ్వామిత్ర పోరాటం. పిప్పలాద జననం. పద్మావతి చరిత్ర. పుష్కర త్రయ వర్ణన. బ్రహ్మ నారద సంవాదం. శివుడు కపాలం పోగొట్టుకోవటం. నాగతీర్ధ మహాత్మ్యం. పింగలోపాఖ్యానం. యక్ష్మ తీర్ధ ఉత్పత్తి. గయా శ్రాద్ధఫలం. సామ్బోపఖ్యానం. విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అవటం వగైరాలున్నాయి.

ఇవన్నీ పద్యాలుగా అనువాదం చేశారు కవి. మార్కండేయ మహర్షి రోహితాశ్వుడికి చెప్పాడని సూతమహర్షి శౌనకాదులకు తెలియజేశాడు. .

మొదటి పద్యం –"శ్రీ యాడవరవిమృష్టన్యాయా –విమర్శనావసర ధృతా –మేయసమవర్తికాయ మహాయా – వరబాకరాత్పరాం కుశ రాయా "

మరోపద్యం 8వ ఆశ్వాసం లోనిది –"కలదిల నాగరాఖ్య గడు ఖ్యాతము క్షేత్రము కుష్టు రోగ సం-కలితుడనై తడనంతరమొకానొక కాలము నందు తీర్ధ యా –త్రలు నొనరించు జనుడు దత్ స్థలవర్తి తపస్వి యొక్క డి-బ్బలు రుజ నొంది కుందునను బాగుగ జూచి కృపావిశిష్టుడై ".

దాదాపు తొమ్మిది వందల పద్య గద్యాల అనువాదం ఇది. తపస్సుగా చేసి ఫలితం మనకు అందించారు. లోకం ఆయనకు సదా రుణ పడి ఉంటుంది.

పట్టాభి రామకవి గారు "చమత్కార మంజరి "అనే పద్య కావ్యం ను 132పద్యాలలో రాసి నరసరావు పేట భారతీ విలాస ముద్రాక్షర శాలలో 1911న ముద్రించారు. వెల పావలా.

ఇవికాక విరూపాక్ష పీఠ గురు పరంపర. వాసంతికా పరిణయం నాటకం. కరణీకోద్ధారిణి,విశ్వ బ్రాహ్మణ శబ్ద ఖండనం –బ్రాహ్మణ శబ్ద విచారం. విగ్రహారాధన ఖండనం. స్వర్ణకార వ్యవహారం. శుద్ధాంధ్ర హరిశ్చంద్ర చరితం. ఆంధ్ర సూత సంహిత. భారతీయ ప్రబోధం. ధర్మ నిర్ణయం. అస్పృశ్యతా నివారణఖండనం. పల్నాటి వీర చరిత్ర. భాగవత రహస్యములు. సోమేశ్వర శతకం. వధూ శాకంబబరీ విడంబనం మొదలైనవి రచించి అతి తక్కువ వెలలో అందజేశారు.

ఇంతటి విశిష్ట రచయితను ఆంధ్ర సాహిత్యలోకం నిర్లక్ష్యం చేసిందేమిటి అని బాధగా ఉంది. నలభై ఏళ్ళు "అభినవ సరస్వతి "పత్రిక ను నడపటం ఆషా మాషీ కాదు. అందులో ఉభయ తెలుగు రాష్ట్రాలకు చెందిన ఎన్నెన్నో విషయాలు,వారి జీవితానికి సంబంధించిన విషయాలు నిక్షిప్తమై ఉన్నాయి.చదివి తెలుసుకోవాల్సిన బాధ్యత మనది అని మనవి.

## 47 శ్రీ భీమ లింగేశ్వర శతకం -- శ్రీ శానం పూడి వరద కవి

పల్నాడు తాలూకా జూలకల్లు గ్రామవాసి శ్రీ శానం పూడి వరద కవి శ్రీ భీమేశ్వర లింగ శతకం రాసి. వినుకొండ తాలూక ముప్పాళ్ళ గ్రామస్తులు శ్రీ కాకుమాను కాశీ విశ్వానాథం ఆర్ధిక సహకారం తో గుంటూరు కన్యకా ముద్రాక్షర శాలలో శ్రీ పెండేల చక్రపాణి సోదరుల చే 1924లో ముద్రించారు. ''కృతి గ్రహింపు ము బిడ్డలకింపు నింపు –దీవెనలు సల్పి మనుపుము దీర్ఘమతిని –రామయామాత్య గృహిణి సాధ్వీమతల్లి –విష్ణు పద రోలంట వేంక మాంబ"అని శ్రీమతి వేంక మాంబ కు అంకితమిచ్చారు.


శుభమస్తు.
శ్రీ
భీమలింగేశ్వర శతకము.
ఇయ్యది
పల్నాడుతాలూకా జూలకల్లు గ్రామనివాసుడగు
శానంపూడి వరదకవిచే
రచియింపబడి,
వినుకొండతాలూకా ముప్పాళ్ళ గ్రామకాపురస్థుడు
కాకుమాను కాశీవిశ్వనాధ
ద్రవ్య సహాయమునచే
గుంటూరు: కన్యకా ముద్రాక్షరశాలయందు
పెండేల చక్రపాణి సోదరులచే ముద్రింపబడినది.
మొదటి కూర్పు 250 ప్రతులు.
1924

భూమిక లో కవి వచనం లో తాను జూలకంటి భీమేశ్వరుని పేర ఒక శతకం రాయటానికి 28-8-1922 న పూనుకొని పది పద్యాలురాసి. తీవ్రమైన వ్యాధితో పది నెలలు ఇబ్బందులు పడి,వ్యాధి నివారణ పొందాక మళ్ళీ ఉత్సాహంతో మొత్తం 50పద్యాలు రాసి. మేళ్ళ వాగు స్కూలు నుంచి ముప్పాళ్ళ స్కూలు కు బదిలీ అయి తృతీయ ప్రధానోపాధ్యాయుడై. కొద్దికాలం లోనే శతకం పూర్తీ చేసి శ్రీ భీమ లింగేశ్వరుని సమర్పించి నట్లు చెప్పాడు కవి.

అందులోనే దేవాలయ చరిత్ర గురించి చెబుతూ పల్నాడు తాలూకా జూలకల్లు లో శ్రీ భీమేశ్వర స్వామి వెలసి ఉన్నాడని. కాకతి రాజులు ప్రతిష్ట చేశారని చెప్పే శిలా శాసనాలున్నాయని. నిత్యపూజాదికాలు ఉత్సవాలు జరపటానికి తగిన భూ వసతి కూడా కల్పించారని. ఆ గ్రామం లో ని గుంటుపల్లి వారు ఆలయాన్ని శ్రద్ధా భక్తులతో నిర్వహిస్తున్నారని చెప్పారు. ముప్పాళ్ళ వాసి వైశ్యకుల ప్రముఖులు శ్రీ కాకుమాను కాశీ విశ్వనాథం ఈ శతక ముద్రణకు కావలసిన ధన సహాయం చేశారనీ. వారు. వారి వంశీకులు ఆ చంద్ర తారార్కం గా సుఖ సంతోషాలతో వర్ధిల్లాలని కోరారు. శ్రీ కింతాడ వీరభాద్రాచారి కవి గారి కృషిని పద్యం లో అభినందించారు.

శతకం లో మొదట వంశ వర్ణ చేశాడు కవి. మొదటి సీసపద్యం లో శ్రీ ఆది నారాయణ స్వామిని స్తుతించాడు. తర్వాత వైశ్య వర్ణం ఏర్పడిన విధానం. కాకుమాను వారి వంశం గురించి చెప్పి వారిది నాభిళ్ళ గోత్రం అనీ అందులో బసవయ్యగారు ప్రముఖులనీ. ఆయన భార్య శాయమ్మ అనీ. వారికి ఆరుగురు పుత్రులని. అందులో రంగయ అనంతమ్మను పెళ్లాదాడని. వీరి సంతానం లో పట్టాభి రామయ్య దంపతులకు కలిగిన కాశీ విశ్వనాధం కనకాంబను పెళ్ళాడి. ఆమె కొద్దికాలానికే చనిపోతే ఆమె చెల్లెలు అన్నపూర్ణను ద్వితీయం చేసుకొని గొప్ప శ్రీమతుడై దాతగా కీర్తిపొంది,ఈ శతకాన్ని ముద్రించటానికి ధనం అందించాడు. తర్వాత కవిగారు ఆయనకు పద్యాశీస్సులు వర్షించారు.



అంకితము.

సీ॥ కడుభరమయిన నీ ♦ గర్భంబునం దాల్చి
గాంచితి మమ్ముల ♦ గారవమున
సంరక్షఁ గావించి ♦ చదివించి బుద్ధుల
గఱపితి వసూన్యాన ♦ కరుణఁ గలిమి
పట్టి నీదు ఋణమ్ము ♦ వంశయుఁ గడవంగ
రాక యుండిన నాక ♦ రవ్వయేని
తీర్పఁగాఁ దలఁచెంచి ♦ దిటవుగఁ నీ భీమ
లింగశతకము నా ♦ సంగినాఁడ

గీ॥ కృతి గ్రహింపుము బిడ్డల ♦ కింపుమింపు
దీవనలు సల్పి మనుపుము ♦ తీర్థమతిని
రామయామాత్య గృహిణి, సా ♦ ధ్వీమతల్లి
విష్ణు పదపద్మరోలంబ ♦ వేంకమాంబ!

శ్రీ గోపాలుని హనుమంత రాయ శాస్త్రి. అష్టావధాని శ్రీ పోతరాజు లక్ష్మీ నరసింహకవి పద్యాలతో కవిని అభినందించారు.

కవిగారు ముందుగా "శ్రీ మన్మహా దేవ దేవేశ -సోమార్ధ జూటాగ్ర-భూమీధరాధీశ కన్యా మనః పద్మ షట్పాద-శ్రీదా-సుధా ధామ మందార –బృందారకాధీశ దంతావళ శ్రేష్ఠ దుగ్ధోధదీ ట్కుంద-డిండీర ధావల్యకీర్తుజ్వలా "అంటూ దండకం మొదలుపెట్టి "క్రూర రాత్రించరధ్వంస –శ్రీ జాలకల్యాస శ్రీ భీమ లింగేశ –సే దండకంబొండు,నీనామ రూపంబులన్ జేసి యర్పించితిన్ –దీని రత్నోరు హారంబుగా దాల్పవే –నాపయిన్ నీ కృపన్ నిల్పవే –శూల హస్తా –నమస్తే నమస్తే నమస్తే నమః "అని భక్తి చిప్పిలేట్లు ముగించాడు. మత్తేభ. శార్దూల పద్యాలతో "భీమ లింగేశ్వరా "మకుటంతో రాసిన పద్య శతకం ఇది.

సశేషం

మీ-గబ్బిట దుర్గా ప్రసాద్ -1-6-22-ఉయ్యూరు

మొదటి పద్యం –'శ్రీ వాణీశ ముఖామర ప్రకరసంసేవ్యాంఘ్రి పంకేరుహా –భావాతీత సుమంగళాంచిత గుణా,భద్రేభ చర్మాంబరా

ధీ విభ్రాజిత దాసకల్ప కుజ దాత్రీ భ్రున్నివాసొన్నతా –గ్రావా ధీశ కుమారికా రమణ భర్గా శ్రీ రామ లింగేశ్వరా "అని మొదలుపెట్టి "ఘనపాండిత్యం. సూరి జన సాంగత్యం సాధన సంపత్తి తనకు లేవని. శివునిపై భారమేసి శతకం రాస్తున్నాని చెప్పాడు. ఆయన్నుసేవించినవారి పాపాలుపోతాయి. ఆయన స్మరణైక దాస్యమిమ్మని., ఆయన మహిమలు పొగడటానికి శక్యం కాదని. ఆత్మలో ఆయన పాదాబ్జాలు కొలిచే భాగ్యమిమ్మని కోరుతూ "రారా శైల నికేతనా వడిని సంరక్షించ"అంటూ ఆయనలాంటి వారు లేరనీ. "రంగత్తుంగ తరంగ గంగ "ను సుమూర్ధం లో."మకుటాగ్రం లో రోహిణీ పతిని దాల్చి శరణన్న వారిని వెంటనే కాపాడేవాడని స్తుతించాడు. ఎద్దు వాహనం క్రూరసర్పాలు హారాలు ధరించటం ఎందుకు నీ మిత్రుడు ధనాధిపతి కదా అన్నాడు.

"పరి పూర్ణుడవు. నిర్వికల్పుడవు శోభా రమ్య దేహుండు. విద్ధరుచిన్,ప్రాపగు దేవతా మణివి,ఆద్యంతాలు లేనివాడవు "అని కీర్తించాడు. మూర్ఖుడైన వాడి జడాత్మను మార్చటానికియే విజ్ఞుడూ సమర్థుడు కాడు."దక్షుం డద్వర మొప్ప జేయ నట దాక్షయణీపిల్వకే –నక్షుద్రోక్తి ని బోవ. తారచట గర్వాంధంబున దూల ప్ర-త్యక్ష ప్రౌఢిని ప్రాణముల్ విడువ వీరావేశతన్ వీరభ –ద్రాక్షుద్ర స్థితి జంప జేసితివి కావా భీమలింగేశ్వారా "అని క్షకార ప్రాసతో దక్ష యజ్ఞ ధ్వంసాన్ని కనులకు కట్టి నట్టు వర్ణించి శ్రీనాధుడు భీమ ఖండం లో క్షకార ప్రాసతో వ్యాసుడుభిక్షా పాత్ర నేలకేసికోట్టటం అన్నపూర్ణమ్మ పిలిచి పెట్టిన కమ్మని భోజనం గుర్తుకు తెచ్చాడు కవి. . చీమకు ఏ వస్తువు కనిపించినా తన వారికి జాడలు చూపించినట్లు నాకూ దారి చూపించు 'క్రీడా ఖేలన శైల కంధర హరా శ్రీ భీమేశ లింగేశ్వరా "అని లోకోక్తిగా వేడుకొన్నాడు. సత్యమే జగత్తును ఉద్ధరిస్తుంది అదే మోక్షాన్ని,ఆనందాని యిస్తుంది.

"పద వైశద్యం అర్ధగౌరవం శోభారమ్యభావం కల చంచలాక్షి లాగా బుద్ధిబలం తో ప్రబంధాలను సత్పద వైశద్యంతో అర్ధగౌరవ శోభా రమ్యత తో రాసేవాడే కవి అన్నాడు ఈకవి. ."కనులా కల్మష పూతిగంధజల ముక్త ద్వారకా చాంకముల్ –చనులా క్షీర ప్రవాహ వాహయుగమాంస స్ఫారకంకాళముల్-వెనులా ?బంధుర శల్య సంచయ కళా వేశ్మైక చర్మా ధ్యముల్ –"అలాంటి వామాక్షులను కోరటం సబబా ?అని వేదాంత ప్రవచనం చేశాడు కవి. "శివ ఈశాన పరాత్పరా వరద దాక్షి ణ్యైకభావాం బుధీ-పవమానప్రియ భాస్కరాబ్జ నయనా బాలేందు మౌళీహరా

–భవమృత్యుంజయ పార్వతీ రమణ సౌభాగ్యప్రదాధీమణీ"అని ఎలుగెత్తి స్తోత్రం చేశాడు ఆర్తిగా. చంద్రుడు ఏ చుట్టమయ్యా నీకు నెత్తికేక్కించు కొన్నావ్ ?అని ఈసడింపుగా అన్నాడు.

"స్వర్ణ గ్రావము కార్ముకంబు రాజతక్ష్మా ద్రంబు వాసంబు –సంపూర్ణజ్యోత మణీప్రముక్త చాయ శంభూ తాబ్ధి తూణంబుశ్రీ –పూర్ణ స్ఫారుడపై కరంబు సతతంబు న్ భిక్ష మందేగేదో-కర్ణ భ్రాజిత కుండలా తగునె ఏగన్ భీమ లింగేశ్వరా "'అని "వాయించాడు". పూలను రువ్విన వాడికి దేహం లేకుండా చేశావు. మరి రాళ్ళు రువ్వితే ఏం చేస్తావ్ (ఏం పీకుతావ్ )అని దెప్పిపోడిచాడు . నీటిలో వహ్నిలో కాష్టం లో బయలులో నీరేజం లో భూమిలో వాయువులో సకలప్రాణులలో సంక్రాంతం ఎప్పుడూ ఉంటాడు శివుడు అని ఆయన విభూతిని కీర్తించాడు. అపరిచ్ఛిన్నం అద్వితీయం ఆద్యన్తశూన్యం అయిన బ్రహ్మం ఒక్కటే సదానందంగా వెలుగుతూ ఉంటుంది. అంటూ 88పద్యాలు చెప్పాడు.

89నుంచి "శ్రీ భీమేశా వరద కవి నుతపద"లోని మొదటి అక్షరాలతో 91వరకు పద్యాలు చెప్పాడు. 99వ పద్యం లో –'జయ సర్వేశ్వరా శాశ్వతా గిరిధరా సర్వం సహ్ వందితపదాచంచత్కటాక్షోదయా -జయకాత్యాయినీ నాయకా శశిధరా. సంక్రందనాభ్యర్చితా –జయ మృత్యుంజయ జూలకల్లు పురవాసా భీమ లింగేశ్వరా "అని పార్వతీ వల్లభుని స్తుతించి. తర్వాత రెండుపద్యాలలో తనగురించి చెప్పి "శ్రీ భీమ లింగేశ్వరార్పణ మస్తు "అంటూ 101పద్యంతో శతకం ముగించాడు శానం పూడి వరద రాజ కవి.

చక్కని ధారా శుద్ధి విశుద్ధమైన భక్తీ తాత్పర్యాలు గొప్ప ఊహ్. కమనీయ కవిత్వం తో శతకం అత్యద్భుతంగా నడిచింది. భక్తులకు కొంగు బంగారం గా వెలసిన శతకమిది. దీన్ని గురించి, కవి గురించి మన మహానుభావుల దృష్టిలో పడి నట్లు తోచదు. ఈ కవినీ, శతకాన్ని పరిచయం చేసే మహద్భాగ్యం నాకు కలిగింది.

మీ –గబ్బిట దుర్గా ప్రసాద్ -2-6-22-ఉయ్యూరు

--

## 48 ద్వారకాపతి శతకం -- శ్రీ మదాది భట్ల శ్రీరామమూర్తి కవి

విశాఖ జిల్లా బొబ్బిలి తాలూకా అజ్జాడ వాస్తవ్యులు శ్రీ మదాది భట్ల శ్రీరామ మూర్తి కవి శ్రీ ద్వారకాపతి శతకం రచించి. కృష్ణాజిల్లా కైకలూరు తాలూకా శోభనాద్రి పుర అగ్రహార వాస్తవ్యులు బ్రహ్మశ్రీ కాశీ నాధుని సుబ్బారావు గారి ద్రవ్య సహాయం చేత బెజవాడ ఆంధ్ర గ్రంధాలయ ముద్రాక్షరశాలలో శ్రీ కుందా లక్ష్మీ నరసింహయ్య చేత 1942లో ముద్రించారు. వెల-4అణాలు.



2386 శ్రీ

ద్వారకాపతి శతకము.

664 / 9964

ఇది

విశాఖపట్టణము జిల్లా, బొబ్బిలి తాలూకా, అజ్జాడ వాస్తవ్యులగు

శ్రీమదాదిభట్ల శ్రీరామమూర్తి కవిచే

రచింపబడినది

కృష్ణాజిల్లా కైకలూరు తాలూకా శోభనాద్రిపురం అగ్రహార వాస్తవ్యులగు

బ్ర|| శ్రీ కాశీనాధుని సుబ్బారావుగారి

ద్రవ్య సహాయమున

ముద్రించి ప్రకటింపబడినది.

సీస పద్యం లో ఆశీస్సు పలుకుతూ "ఆత్రేయస గోత్రులు శ్రీ కాశీ నాథ నాగ లింగారాధ్య తాత. శ్రీలలితాంబ పుత్రుడు మల్లయ్యఅన్నపూర్ణ గారి పుత్రుడు సుబ్బారావు. భార్య మహలక్ష్మి ని వివాహమాడి తాత,తండ్రులు లాగా ధర్మతత్పరతతో దాత అయి ప్రఖ్యాతి పొందాడు వారిని ద్వారకాపతి కాపాడాలని" అన్నారుకవి.

పీఠిక లో కవిసామ్రాట్ విశ్వనాధ సత్యనారాయణ గారు "ఈ కవి రాసిన శ్రీమద్రామాయణ గీతమాలికలు అక్కడక్కడ చదివాను. ధార అనర్గళం గా ఉంది. మకార ప్రాసతో కుంటు పడకుండా రసం చెడకుండా రాయటం అసాధ్యమే. మధు వాహిని ప్రవహింపజేశాడు. వీరి రామాయణ కీర్తనలు రమ్యాతి రమ్యాలు.సుబ్రహ్మణ్య కవి ఆధ్యాత్మ రామాయణానికి వన్నె పెట్టినట్లున్నాయి. ఈకవి రాసిన గీతాకావ్యం, నారాయణ శతకం పాండిత్యానికి ప్రతిభకు నిదర్శనం. క్రమాంత స్వాధ్యాయులైన



పీఠిక

బ్రహ్మశ్రీ ఆదిభట్ల శ్రీరామమూర్తిగారిచేత రచింపబడిన శ్రీమద్రామాయణ గీతమాలికలు అందందు చదివితిని. ధార అనర్గళముగా నున్నది. ఇంత గ్రంథములు ఒకటి రకారప్రాసము, ఒకటి మకారప్రాసముతో కుంటు లేకుండ, రసము చెడకుండ వ్రాయుట, సామాన్యులు చేయలేని పని. దీని కింత చేతోపికి కావలయునో భగవంతుని కెఱుక. అందులో నాద్యంతము నొక్కటే యొక్కపోని మధువాహినిగా బ్రవహింపజేయుట పూర్వపుణ్య విశేషము. వీరి రామాయణ కీర్తనలు రమ్యాతిరమ్యములు. సుబ్రహ్మణ్య కవి యధ్యాత్మరామాయణమునకు వన్నె పెట్టినట్లున్నవి. ఇదిగాక వీరి యితర గ్రంథములును, గీతాకావ్యము, నారాయణ శతకమును, వీరి పాండిత్యము, గడుసుందనము, ప్రతిభను వెల్లడించుచున్నవి. వీరు క్రమాంతస్వాధ్యాయులు, అమోఘ జ్యోతిష పాండిత్యము కలవారు. వేదాధ్యయనగరిష్ఠులు భగవత్కృపాపాత్రులు. వీరు గుంటూరు సాటిగా మాటాడుదురు. అట్టి ప్రకృతి స్వామికి దగ్గఱగా నున్నది. ఇందొక్క యక్షరము అతిశయోక్తి కాదు.

విశ్వనాథ సత్యనారాయణ,
బెజవాడ.
13—3—42.

ఈకవి జ్యోతిష పాండిత్యం లో దిట్ట. ఇలాంటి గుణ గరిష్ఠుడైన ఈ కవి మాటలు గుండెకు సూటిగా తాకుతాయి. ఇదంతా అక్షర సత్యం. "అన్నారు. ద్వారకాపతీ అనే మకుటం తో ఉత్పల. చంపక మాలపద్యాలతో శతకం కూర్చి సుగంధాన్ని వెద జల్లారు.

మొదటి పద్యం ఉత్పలమాలలో –"శ్రీ రమణీ మనోహర విశేష కృపాకరయాదవాన్వాయో –దార పయోధి శీతకర దానవదూర. వినమ్ర దాసమం-దార మధాంధ చైద్య ముఖ దర్ప కుఠార,కళింద నందినీ –తీర విహార గోపవర ధీర వశీకర ద్వారకాపతీ'అని స్వామిని స్తుతించాడుకవి. విఘ్నాలుకలిగించవద్దు అని గణపతిని కోరి. వాణిని తన నాలుకపై నర్తించమని ప్రార్ధించి. వాల్మీకి వ్యాస కాళిదాసాదులను స్మరించి. సిరికి తలిదండ్రులకు నమస్కరించి తర్వాత తన వంశాన్ని గురించి చెప్పుకొన్నాడు ం-భారద్వాజవంశం లో రామయలక్ష్మి తన తాతగారు. అవధాని. ఉపాధ్యాయుల వెంకటా ర్యుని సుబ్బమ దంపతుల కుమార్తె కాత్యాయని సాటి పాపమ,తల్లీ తండ్రీ. తనపేరు రామమూర్తి అని చెప్పుకొన్నాడు. తర్వాత విశేషాలు రేపు తెలుసుకొందాం.

'నలువయి సృష్టి సల్పితి,జనార్దనుపేర బెంచుచుంటి వీ-లనరగా జంద్ర శేఖరుడ పై నశియింపగా బుచ్చుచుంటి వి"నిర్మలంగా మూడు పేర్లూ నీవే. తర్వాత మత్యావతార,కూర్మ. వరాహ నరసింహ. వామన పరశురామ. రామ,కృష్ణ. బుద్ధ. కల్కి అవతారాలు, చేసిన అద్భుతకార్యాలు వేర్వేరు పద్యాలలో వర్ణించి'వేల్పుల గిడ్డివేల్పుల నవీనపు బువ్వలబెట్టి ప్రోచు నా –వేల్పుల వేల్పు వౌదు "అని తనకు శరణు ఇమ్మనికోరాడు కవి. వేద పరిపూర్ణులను చూస్తే నీకు సంతోషం. శాస్త్ర సంవాదుల్ని చూస్తే ఆనందం. పండిత భాషకు ఆహ్లాదం చెందుతావు. వివాదం వస్తే కాలుదువ్వుతావు అన్నాడు. "క్షాత్రవ శిక్ష సల్పగా విచక్షణ దక్షుడవౌదు. ఆ క్షాత్రపు చిహ్న లొందుచూ,విశాలయశస్సు పొందావు. "గొల్ల చేడియలను వికార చేష్టలతో మోహపెట్టావు. జార చోర బిరుదులూ పొందావుకానీ వేదాలకు ఆధారమే నీవని నాకు తెలుసు. "వెన్న దొంగపై రంగడవన్న కీర్తిపొందావు.సిరికి మగడపైన నువ్వు మమ్మల్ని దరిద్రం లో ఉంచటం నీ మగసిరికే అవమానం. "దారము కూర్చు పుష్పముల దండ గతిన్ వసియించి. జీవులం దారయ నీవే యంతట మహాత్ముడవు "అని చక్కగా చెప్పాడు.

శ్లేషలకు ఉబ్బిపోతారు కొందరు. ఆడవాళ్ళుకూడా అంతే కానీ "గొప్పగా మృదూక్తి పద్య సంభాషలకు లోకులు గొప్పగా ఆనందిస్తారు. జుట్టూ జుట్టూ ముడిపెయ్యటం లో మహా నేర్పరివి. కౌరవులని చీల్చి పాండవులకు

రాజ్యమిప్పించావు. అలాగే నాకోరిక తీర్చు. ”అపగత కిల్బిషు డవు,మహాత్ముడవు అలాంటి నిన్ను నా చపల కాంక్షతో నిన్ను నిందించాను. నీభక్తినిచ్చి నన్నుకాపాడు. చరాచరాలకు నువ్వు జీవనం. నీ విలసనం ప్రాణులకు విస్తృత తేజం. నన్నుకాపాడు. ”ఫుల్ల సరోజనేత్ర. పరిపూర్ణ జలాంబుదగాత్ర. శాంభవీ –వల్లభ మిత్ర. లోకనుతిపాత్ర మహాఘులతాలవిత్ర స-ద్ధల్లకపత్ర చిత్రతర దామ విదర్భ సుతా కళత్ర రా –జిల్లెడుత్వత్కృపా రసముం జిందవె నాపయి ద్వారకాపతీ’అని పరవశంతో కవి కీర్తించాడు.

“సూనృత భాష. నీల ఘన సుందరవేష,యశో విశేష సు-జ్ఞాన మనో విభూష వర కౌస్తుభన్మణి కాంతి పూషసం-ధానిత సర్వ భక్త వరదానక తోష. యశేష లోక దు-ర్మానిత భూరిదోష “అంటూ భక్తపోతనలా తేనెలు రంగరించి కవిత్వం చిలికించాడు ఈభక్తకవి. ”నెలకు ద్రివృష్టి నింపి ధరణిలో సస్య గో సంవృద్ధిపెంచి. సర్వజీవులు ఆనంద మయ సుఖ జీవనం చేసేట్లు చెయ్యమని ద్వారకాపతి ని వేడుకొన్నాడు. చివరి పద్యంగా చంపకమాలలో –”యువ యను నేటమాధవ సితో త్ర్పతిపత్థిర వాసరాం మం-దవిరళ భక్తి దావక పదాంబుజ యుగ్మ సదర్చ సేయనే –ప్రవిమల పద్య పుష్పముల బాగుగనూటొకయెన్మిదింటి మా –ధవ యిడియుంటి గొంచునను దన్పవె నీ కృప ద్వారకాపతీ’అని శతకం ముగించారు శ్రీమదాది భట్ట శ్రీరామ మూర్తి కవి.

మంచి భక్తి శతకం. విశ్వనాథ ఆశీస్సు పొందిన కవి రచన. సర్వోత్కృష్టంగా సాగింది. చదివి ఆనందించి తరించాల్సిన శతకం. పరిచయం చేసే భాగ్యం నాకు దక్కింది.

## 49 హరిహర నాథ శతకం -- శ్రీ మహమ్మద్ హుస్సేన్




పశ్చిమ గోదావరిజిల్లా భీమడోలు మండలం దొరసాని పాడు గ్రామానికి చెందిన టీచరు. కవి మహమ్మద్ హుస్సేన్ గారు హరిహర నాథ శతకం రచించి. 1959లో ప్రచురించారు. ఈశతకానికి ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు అభిప్రాయం రాస్తూ "ఎలిమెంటరి స్కూల్ మాస్టర్ అయిన మహమ్మద్ హుస్సేన్ నాకు 20ఏళ్ళ నుంచి పరిచయం. .శిష్యప్రాయుడు. గర్వం లేని సజ్జనుడు. మతసహనమున్నవాడు. ఈ శతకం లో కవిత్వం సరళం ధారాళం,మనోహరం. చక్కని కల్పనలతో భక్తి రస ప్రవాహంగా రాశాడు. ఇప్పటికే 15పుస్తకాలు రచించిన సామర్ధ్యం ఉన్నవాడు. చదివి ఆదరించి ప్రోత్సహించమని కోరుతున్నాను "అన్నారు.

భీమడోలు BDO శ్రీ బాలకృష్ణ "ఈ కవి నాకు చాలాకాలంగా పరిచయమున్నవాడు. ఈ శతకం మధుర మంజులంగా రాశారు. కందాన్ని అందంగా నడిపించిన నేర్పున్నవారు. శతకం చదివి ఆనందంతో పులకిస్తారు అందరూ. అభ్యుదయకవిగా పేరు పొందాలి 'అని అభిప్రాయం రాశారు.

శతకాన్ని కవిగారు వితరణశీలి విద్యాభిమాని శ్రీమతి గారపాటి హైమవతీ దేవి ఆర్ధిక సాయంతో ప్రచురించినట్లు కందపద్యాలలో కృతజ్ఞత చెప్పుకొన్నారు. "హరిహర నాథ స్మరణ –స్ఫురణం బాధ్యాత్మిక ప్రబుద్ధ విశుద్ధం –బరయుము. మద్రచితంబిది-హరిహరనాథ శతకము మహత్కృతి చరితా "అని వినయంగా చెప్పి "ఆశుకవిని గాను. హాస్య చతురత లేదు –గర్భ బంధ చిత్ర కవిత రాదు –దేవ దేవు డిచ్చు భావభక్తి ప్రేర-ణంబు మామక కవనంబు డంబు"అని విస్పష్టంగా చెప్పుకున్నాడుకవి. కవి గారి అభ్యర్ధన పై హైమవతీ దేవిగారు "మీరు కవితారూపం లో మానవ కల్యాణానికి. విజ్ఞాన దాయకంగా వికసించు మీ వాణి ద్వారా మానవ అజ్ఞాన అంధకారాన్ని పారద్రోలుతూ మహోపకారం చేస్తున్నారు. విద్యపై నాకున్న అభిమానం తో 116రూపాయలు

మీకు అందిస్తునాను. గ్రహించి శతక ముద్రణకు ఉపయోగించండి "అని రాశారు. అనన్య వదాన్య శేఖరులు. కేవల కీర్తి వాంఛా పరులు ఉదార మనస్సంపన్నులు గుండుగోలను వాసి శ్రీ మావులేటి సోమరాజు గారిని కీర్తిస్తూ కవి రెండు పద్యాలు రాసి "కృతులు శాశ్వత బుధనుత కీర్తి నిధులు –బళిర మిము నుతింప నేపాటి వాడను 'అని వినయం ప్రకటించారు కవి.


ర చ యి త :
మ హ మ్మ ద్ హు స్సే న్

ఆకాంక్ష లో హుసేన్ జీ "సార్దీకృత జన్ముడుగా నర్ధింటు ననుగ్రహింప హరిహరనాధా ",''వెలి చూపును. లోజూపును –వెలివోని సుధీ బలమ్ము విలసించు సము –జ్జ్వల ఫాలజ్యోతిని నా –నకలవడ.నిలబడ నొనర్చు హరిహరనాథా ". హరిహరనాథా మకుటంతో ఉన్న ఇది కందాల శతకం 'ఇందులోని అందాలు తర్వాత తెలుసుకొందాం.

"శ్రీకరమై నీ నామము –ధీకరము నగణ్యపుణ్య దీప్తి కరమ్మై-లోకోత్తర శీలకర-మ్మై కావుట మమ్ము నెపుడు హరిహరనాథా "అని కంద శతకం మొదలుపెట్టి మహమ్మద్ కవి. "కందమ్ములు భక్తి రసా-నందంబులు. నవ రసార్ద్ర నానాగుణమా –కందంబులువరశిల్పపు -టందంబులు స్వీకరింపు హరిహరనాథా "అని ప్రార్ధించి కందం అందంగా చెప్పారు. "నీ కరుణ కృతార్ధ సుధా –సేకరణ. మఖర్వ వృజిన జీమూత విశు-ష్కీకరుణ మపూర్వ ప్ర-జ్ఞా కరణ మకారణముగ'అంటూ కవితా రామణీయకంగా అన్నారు. "కవి "ముసిలి"మ్మట వ్రాసెడి-కవనమ్ము జాను తెనుగునట కవితా ప్రభువో –భవహర హరిహర పతివట-హవణిల్లదే సుంత వింత "అని మనకొచ్చే అనుమానం ఆయనకే వచ్చి సమాధానం చెప్పారు. "ఇరు తెగల అఖిల మతుల నరిగెడి వారలకు హరిహర నాథుడు పతి అని శివ విష్ణు అద్వైతాన్ని తెలియజేశారు. క్రోధం అధముని విత్తం,బాధాకరం. కుటిల వ్యాపారానికి సాధన కనుక ఆ వ్యాధినుంచి విముక్తి చేయమని వేడారు.

శత్రువులకంటే అంతశ్శత్రువులే పరమ డేంజర్.వీటినుంచి బయట పడేట్లు చేయి. ఇదికాదు అదికాదు అంటూ అన్నీకాదని దేన్నీ చెప్పలేకపోయాయి పరమాత్మను. నీ కరుణా పీయూషాన్నిజుర్రకపోతే వెయ్యి పుటాలు పెట్టినా అజ్ఞానం తొలగదు. 'అక్కజపు నింగి రిక్కల –లెక్కను దక్కువలు సేయులే –నా దొసగుల్-ఉక్కు సెడే-టెక్కు యతనము –లక్కున గ్రక్కున గదింపు ".పూచిక పుల్లను కూడా కదల్చ లేని వాడిని –"నీ చెయిది విశ్వ సృజనము "కనుక నీ కరుణ యాచిస్తున్నాను. ఇంగువ కట్టిన గుడ్డ వాసన అంతావ్యాపించినట్లు పూర్వజన్మ పాపాలన్నీ నావెంట వచ్చాయి దాన్ని వదిలించు. 'ఏ నాటి కు సంస్కారమో "అని మొదటి పంక్తి తో మూడు పద్యాలురాసి కుసంస్కారం. ఇంద్రియ లోలత్వం. జ్ఞానులను సాధువులను చులకన చేయటం లో కొట్టు మిట్టాడే వారిని ఉద్ధరించు అని కోరారు. అలాగే "నీ యాజ్ఞామాత్రమ్మున"తో అయిదు పద్యాలురాసి వాయువు వరుణుడు క్రమం తప్పకుండా విధి నిర్వహణ చేస్తున్నారు. చంద్ర సూర్యులు వేడి వెలుగు ఇస్తున్నారు. సప్త సముద్రాలు తమ ధర్మాలను నేరవేరుస్తున్నాయి. పంచ భూతాలూ ప్రకృతి ధర్మాలను తుచ పాటిస్తున్నాయి. నీ ఆజ్ఞ లేకుండా చీమకూడా కదలదు అని ఉపనిషత్ రహస్యాలను అందంగా కందంలో బంధించారు. "బలవంత మెంత చేసినా భోగాలపై ఆసక్తి పోగొట్టమని., విషయ వాంఛలను తుదముట్టించమని. పర ద్రవ్యాపేక్ష కూకటి ప్రేళ్ళతో కూల్చమని వేడుకొన్నారు. "నీ కూర్మిలేకుండా మేమేమీ సాధించలేం ".నీ నెనరు లేకపోతె స్నానధ్యానజపతపాలు ఫలించవు. చేతులు కాలాక ఆకులు పట్టుకొన్నట్లు పాపకూపాల్లో పడి క్షోభిస్తున్న నాకు నువ్వే దిక్కు. "తెలివి తక్కువ ఆకలి ఎక్కువ "అనే సామెత నిజం అవటానికి నన్ను పుట్టించావు –లెక్కకు మించిన ఇక్కట్లతో చతికిలపడ్డాను" అంటారుకవి. నీ సంకల్ప బలం కొంచెం ఉంటె చాలు సింధువు బిందువు అవుతుంది హిమాలయం వట్టి రాయి అవుతుంది. నీ యక్కటికము బోలని –మాయత్నము పురుషాహంకారమా –కాదు ప్రభూ 'నీ వద్ద అద్దం వెలుగులు చిమ్మగలుగుతుందా "అని వేదాంత రహస్యం బోధించారు.

"నా మేధా వైదగ్ధ్యం –నీ ముంగల దాప నేర్తునె?"తల్లి పుట్టిల్లు మేనమామకు తెలీదా స్వామీ ?ఎండినమాను చిగిర్చివసంతం లో శోభించినట్లు 'బెండు పడిఉన్ననన్ను నువ్వే అనునయించాలి. ఏదో అభిశాపం నాపై దారుణ దాహమూని- బలవత్కామోన్మాదిగ బాధిస్తోంది తరుణోపాయం నువ్వే చెప్పాలి. గోరంత గౌరవం వస్తే కొండంతగా చాటి చెప్పుకొని భీర స్వాంతంతో అల్పునిగా బతికే నాకు నువ్వే ఏడుగడ హరిహరా. .కొండంత దేవుడికి

కొండంత పత్రి ఇచ్చుకోలేముకదాకనుక "గుండియనుడుగర సేసెద –నండగ నీ నెనరు నింపు 'అని ప్రార్ధించారు కవి. "దేవర చిత్తం నా భాగ్యం 'అంటూ 113 వ పద్యంతో శతకం పూర్తి చేశారు.

శతకానికి అనుబంధంగా ప్రాతస్మరణ. నిద్రా సమయస్మరణ. కూడా కందాలు రాసి చివరి కందాలలో "పది తొమ్మిది వందల నలు –బది ఏడవ వత్సరాంత వాసరముల స-మ్మదమున దీని రచియించితి –నదిరా క్రీస్తు శకమందు హరిహరనాథా "అనీ తర్వాతపద్యంలో ద్వారకా తిరుమల పుణ్య క్షేత్రానికి సమీపం లోని "దొరసాని పురం "లో జన్మించాననిచెప్పారు. 130వ పద్యం లో "దీని రచించిన నీ –సేవానిరతున్. గుణ గణాఢ్యు.వరమహమ్మద్ హు –స్సేనాఖ్యు గవిత్వ పద –ధ్యానపరున్,నన్ను గావు హరిహర నాథా "అని శతకం పూర్తి చేశారు కవి మహమ్మద్ హుస్సేన్ జీ.

దీనికి బోనస్ గా "పంజాబ్ దురంతాలు "శీర్షికతో 45 పద్యాలు రాసి ఆ దృశ్యాలను కళ్ళకు కట్టించారు. కవి గారు లోతైన పాండిత్యం. సకల శాస్త్రాలలో గొప్ప అవగాహన ఉన్నవారు. మీదు మిక్కిలి ఆంధ్ర ఆస్థానకవులు శ్రీపాద వారి ప్రియశిష్యులు. వారి వాత్సల్యామృతాన్ని పుష్కలంగా గ్రోలినవారు. ద్రాక్షాపాకంగా. సరళ మృదు మధుర పదజాలంతో రాసిన శతకం. హరిహరనాథునికి మరో అరుదైన కానుక ఇది. భక్తకబీర్ రామనామ పారాయణ చేసి ధన్యుడైనట్లు మహమ్మద్ హుస్సేన్ కవిగారు హరిహరనాథుని స్మరించి ధన్యులయ్యారు. వారికి ఆంధ్రలోకం కృతజ్ఞత తో కైమోడ్పు ఘటించాలి. ఈ శతాకాన్ని, కవి హుసేన్ గార్ని పరిచయం చేసే మహద్భాగ్యం నాకు కలిగినందుకు పొంగిపోతున్నాను.

## 50 శ్రీ మద్ధయ వదన (శ్రీమత్ హాయ వదన )సంస్కృత శతకం -- శ్రీ బెల్లం కొండ రామరాయకవి

అంటే శ్రీ హయగ్రీవ శతకం. శతకకర్త శ్రీ బెల్లం కొండ రామరాయకవి. .రామరాయకవి గా ప్రసిద్ధులు. శతకానికి సంస్కృత వ్యాఖ్యానం కూడా ఆయనే రాశారు. నరసరావు పేట డిస్ట్రిక్ట్ మునసబ్ కోర్ట్ ప్లీడర్ శ్రీ నడింపల్లి జగన్నాధ రావు గారిచేత భారతీ ముద్రాక్షర శాలలో ప్రచురితితం వేల కేవలం అర్ధరూపాయి.

మొదటి శ్లోకం –స్వతస్వేతంమందస్మిత రుచిరపరీ వాహ సుభగం –సముద్యడ్డిండీరచ్చవి పరివృతం కేసర భరం –స్రజాప్తం. మల్లీనాం కటి విలసిత క్షౌమ రుచిరం –తత శ్రీ ఖండాంబుం,హయవదన మిందు స్థిత మయే "

దీనికి సంస్కృత వ్యాఖ్యానం కూడా రాశారు హయవదనం తో. మందస్మిత ముఖారవిందం తో. కాంతి ఛటలతో. ధీరోదాత్తంగా.షడ్గుణ పరిపూర్ణుడై,నురుగు వంటి తెల్లని శరీరం నవ్వు లతో. కేసరాలతో శోభిస్తున్నాడు హయగ్రీవుడు. చివరిదైన 100వ శ్లోకం –

"భవల్లీలా పాంగ స్రుతత నవసుధాప్లావవివశ –త్వదీయాస్య భ్రష్టం ప్రలపిత శతం కేవలమయ –శబర్యా ఉచ్ఛిష్టంఫలమివ కియంతంరసమిదం –ప్రదత్తేవా తే త్వాంహయవదన మిందుస్థితమయే"




శబరీ ఎంగిలి పండ్లను ఆస్వాదించి ఆనందం పొంది. కరుణతో మోక్షం ప్రసాదించిన హయవదనుడు శ్రీ హయగ్రీవుడు. నేను రాసిన రసభ్రష్ట శతకాన్ని ఆయనలాగా రసమయంగా భావించి స్వీకరించి. కటాక్షించు. హయవదన మిందుస్థితమయే" అనేది శతక మకుటం.

"ఇతి బెల్లంకొండోప నామక –రామకవి కృతి షు హయ వదన శతకం సంపూర్ణం

శ్రీ హయగ్రీవార్పణ మస్తు.

బెల్లంకొండ రామరాయ కవీంద్రుడు, ప్రముఖ పండితులు, కవి శిఖామణి. ఇతడు గుంటూరు జిల్లా నరసారావుపేట సమీపంలోని పమిడిపాడు గ్రామంలో యువ నామ సంవత్సరం మార్గశిర అమావాస్య నాడు (డిసెంబరు 28, 1875) జన్మించారు. వీరి 39 సంవత్సరాల జీవితంలో సుమారు 148 గ్రంథములను రచించారు. వానిలో అష్టకములు, స్తుతులు, అష్టోత్తర శతనామ స్తోత్రములు, సహస్రనామ స్తోత్రములు, గద్య స్తోత్రములు, దండకాలు, శతకములు, కావ్యములు, వ్యాఖ్యాన, వ్యాకరణ, వేదాంత గ్రంథములు మొదలైన అనేక వాఙ్మయ ప్రక్రియలు చోటుచేసుకున్నాయి.

జీవిత విశేషాలు

వీరి తండ్రి మోహన్ రావు, తల్లి హనుమాంబ. వీరిది నియోగి బ్రాహ్మణ కుటుంబం. వీరి పూర్వులు దొండపాడు, గుంటగర్లపాడు అను రెండు అగ్రహారములకేకాక 84 గ్రామములకు ఆధిపత్యము కలిగియుండిరి. వీరందరును దాతలు, శ్రోత్రియులు, నిత్యాన్నదాతలు, విద్యాదాతలు. ఈ వంశములో స్త్రీలు సంస్కృత పాండిత్యము కలిగియుండిరి.శ్రీ రామరాయకవికి ఐదవ సంవత్సరము వచ్చునాటికే తండ్రి దివంగతుడు అయినారు. వీరి



పినతండ్రి కేశవరావుగారు శ్రీరామరావు కుపనయనము గావించి కొంత ప్రాధమిక విద్యనేర్పించి తరువాత ఆంగ్ల విద్యాభ్యాసము కొరకు గుంటూరులో ఒక ఉన్నత పాఠశాలలో ప్రవేశపెట్టెను.సంస్కృత సాహిత్యమునకు అద్వైత సాహిత్యమునకు అపారమైన సేవ చేయవలసి యుండిన శ్రీ రామరావుకు ఆంగ్లవిద్య వలదని తలచెను కాబోలు ఆయనకు నిత్యము శరీరావస్థత కలుగుచుండెను.విసిగిపోయిన కేశవరావు శ్రీ రామరావును పమిడిపాడులో బెల్లంకొండ సీతారామయ్యగారి వద్ద సంస్కృత విద్యనభ్యసించుటకు ప్రవేశపెట్టెను.అందరికి ఆశ్చర్యపరుచునట్లు సంస్కృత విద్యాభ్యాసముతో శ్రీ రామరావుకు స్వస్థత చేకూరెను.బాల్యము నుండి శ్రీ రామరావు అసమాన ప్రజ్ఞాశాలి. తమ పురోహితులవద్ద కొంత వైదిక విద్యను నేర్చుకొని ఉత్తమ విద్యాప్రాప్తికొరకు తమ ఇంటివద్దనున్న ప్రాచీన హయగ్రీవ సాలగ్రామమునకు భక్తి శ్రద్ధలతో నిత్యము అర్చించుచుండెను

.ఒకనాడు హయగ్రీవుడు ఒక వృద్ధబ్రాహ్మణ రూపమున స్వప్నములో శ్రీ రామరావుకు సాక్షాత్కరించి హయగ్రీవమంత్ర ముపదేసించి ఆ మంత్రమునకు అవసరమగు కవచము, మాల, పంజరము, యంత్రము మొదలగువాటిని సమీపమునున్న దమ్మాలపాడు గ్రామములో వైభానస రత్నమాచార్యులవద్ద లభించునని చెప్పి అంతర్ధానమాయెనట.శ్రీ రామరావు గారు దమ్మాలపాటికేగి రత్నమాచార్యుల నుండి హయగ్రీవ మంత్రాంగములగు కవచ, పంజరాదులను సంపాదించుకొని శాస్త్ర విధి అనుసరించి అక్సరలక్షలు జపించి మంత్రమునకు పునశ్చప్రాణము గావించుకొనిరి.తత్ఫలితముగా వారికసాధారణ మేధ, ధారణశక్తి, కవిత్వము లభించెను.తనయొందు పొగి పొరలు భక్తి భవమునకు కవిత్వము తోడుగా రమావల్లభరాయ స్తోత్రము, రమావల్లభరాయ శతకము మొదలగు స్తోత్రములను తమ 16వ యేట రచించిరి. తమ పదునారువ

సంవత్సరమునకే "రుక్మిణీపరిణయ చంపూ" "రమాపరిణయ చంపూ" కందర్పదర్ప విలాస భాణము" మొదలగు కావ్యములను రచించిరి. అటుపై తన 19వ సం.న నెల్లూరు వాస్తవ్యులు సింగరాజు వేంకటరమణయ్యగారి ద్వితీయ పుత్రిక ఆదిలక్ష్మమ్మతో వివాహము జరిగెను.వీరికి సంతానము కలుగలేదు.చాలామంది విద్యార్ధులకు అన్నము పెట్టి చదువు చెప్పించి విద్యాసేవ చేసిరి.

గోదావరి మండలము నుండి పురిఘల్లు రామశాస్త్రి, సుబ్రహ్మణ్యశాస్త్రి అను సోదరులు గద్వాల సంస్థానమునకు వెళ్ళుచు పమిడిపాటు చేరి శ్రీరామారావు గారి కోరికపై వ్యాకరణ తర్కశాస్త్రములను బోధించిరి.గురు దక్షిణగా చంపూ భాగవతమునకు "మంధర" అను వ్యాఖ్యను వ్రాసి ఇచ్చిరి.భయంకర రంగాచార్యుల అను శ్రీవైష్ణవ గురువులు తో విభేధము వలన ఆయన వైష్ణవ సంప్రదాయమును తిరస్కరించి స్మార్త బ్రాహ్మణ సాంప్రదాయమును అనిసరించి విభూతి, రుద్రాక్షలు ధరించుచు అప్పటినుంచి విశిష్టాద్వైతమును విభేదించుచు శంకర అద్వైతమును పోషించిచు అనేక విధమైన గ్రంధములను రచించిరి. తమ శిష్యుడగు రాళ్ళభండి నరశింహశాస్త్రి కోరికపై శ్రీ శంకరరామానుజాచార్యుల గీతభాష్యములను రెంటిని చదివి శ్రీరామానుజ గీతాభాష్యము శృతి, స్మృతి ప్రమాణ విరుద్ధమని నిరూపించుచు మూడు మాసములు పాఠప్రవచనము గావించిరి. ఇదే "భగవద్గీతాభాష్యార్క ప్రకాశిక" అను గ్రంధముగా వెలయించిరి.

నిరంతర గ్రంధ రచనానిరతులు, బ్రహ్మచింతా నిమగ్నుడునగు శ్రీరామారావు బాల్యమునందుండి అజీర్ణవ్యాధితో బాధపడుచుండిరి. దానికితోడు మధుమేహ వ్యాధి మరింత పీడించసాగెను. తమ కిష్టములేకున్నను బంధు మిత్ర, శిష్యగణ నిర్బంధముచే చికిత్స కొరకు మద్రాసులోని సుప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులగు పండిత డి.గోపాలాచార్యుల వారి కడగేగిరి. కొంతకాలము మానసిక పరిశ్రమకు తావిచ్చు గ్రంధ రచనము మానుకొనినచో వ్యాధి చికిత్స చేయగలమని చెప్పగా శ్రీరామారావు గారు దానికి అంగీకరింపక చికిత్సను తిరస్కరించి స్వగ్రామమునకు మరలిరి.దినదినమునకు వ్యాధి ముదురుటచే తనకు అంత్యకాలము ఆపన్నమైనదని గ్రహించిరి.బంధు మిత్రాదులు, భార్య బలవంత పెట్టుటచే దత్తపుత్రుని స్వీకరించిరి. చివరకు మధుమేహ వ్యాధి ముదరగా ఆనంద సంవత్సర కార్తీక శుద్ధ నవమి (27-10-1974) నాడు శ్రీరామారావుగారు అస్తమించిరి.

వారి మరణానంతరము బంధువుల నిరాదారణము, శిష్యుల అజాగ్రత వలన వారి ఆముద్రిత గ్రంధములలో కొన్ని నష్టము కాగా కొన్ని అన్యాక్రాంతములయినవి. మిగిలినవి విజయవాడలోని అడ్వొకేటు శ్రీ పాటిబండ సుందరరావుగారు అధీనములోని కొంతకాలమున్నవి. శ్రీరామారావు జీవితాకాలములో కొన్ని మాత్రమే ముద్రింపబడి ప్రకటింపబడినవి.అటుపై ప్రఖ్యాత ఆయుర్వేద వైద్యులు నరసారావుపేట వాసి అగు శ్రీ కంతా వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి పలు విరాళములు సీకరించి కొన్ని సంస్కృత లిపిలోను మరికొన్ని తెలుగులోను ముద్రించిరి.

రచనలు[మార్చు]

- చంపూ భాగవతం
- శ్రీ హయగ్రీవ నవరత్న స్తుతి
- వివర్ణాది విష్ణు సహస్రనామ స్తోత్రము
- సిద్ధాంత సింధువు
- భాష్యార్క ప్రకాశిక
- శరీరక చతుస్సూత్రీ విచారము
- వేదాంత ముక్తావళి
- శంకరాశంకర భాష్య విమర్శనము
- శరద్రాత్రి
- శ్రీ రమావల్లభరాయ శతకము
- వేదాంత కౌస్తుభం (1918)
- రుక్మిణీ పరిణయము
- గరుడ సందేశము
- హయగ్రీవ శతకము

- కందర్ప విలాసము
- కృష్ణలీలా తరంగిణి
- కరిభూషణమ్
- కామ మీమాంస
- ధన వర్ణనమ్
- ధర్మ ప్రశంసా
- విద్యార్థ విద్యోత:
- శూద్ర ధర్మ దర్పణమ్
- అద్వైతాన్యమత ఖండనమ్
- అద్వైతామృతమ్
- అద్వైత విజయః
- వేదాంత నిశ్చయః
- శంకరా శంకర భాష్య విమర్సః
- సిద్ధాంత సిందుః (శ్రీ మధుసూదన సరస్వతి విరచిత సిద్దాంత బిందువునకు విపుల వ్యాఖ్య)
- భగవద్గీతా భాష్యార్క ప్రకాశిక (శ్రీ శంకరవిరచిత గీతాభాష్యమునకు విపుల వ్యాఖ్య)
- చిత్ర ప్రభోపోద్ఘాతః
- త్రిమత సమ్మతమ్
- సుమనో మనోరంజనమ్
- రామాయణాభ్యుదయ హరికథా
- శ్రీ వీరరాఘువస్తోత్రమ్

- శివభుజంగ ప్రయాతమ్
- శరద్రాత్రి (వ్యాకరణ గంథము-సిద్ధాంత కౌముదీ వ్యాఖ్యానము)
- గుంజు గర్వ భంజనం (తిరుపతి వెంకట కవులతో విమర్సనా వ్యాసములు)
- పంచానన పలాయనమ్

## 51 శ్రీ రాఘవ వేంకటేశ్వర బృహత్ శతకం -- శ్రీ మత్తిరుమల రాఘవాచార్య కవి

శ్రీ మత్తిరుమల రాఘవాచార్య కవి "పెద్దాపురీ వాస. వేంకటేశ్వర "మకుటం తో 165 సీస పద్యాలతో శ్రీ రాఘవ వేంకటేశ్వర బృహత్ శతకం రచించారు. శ్రీ ఘంటసాల పూర్ణయ్యగారు పిఠాపురం లోని శ్రీ విద్వజ్జన మనోరంజని ముద్రాక్షర శాలలో 1941 న ప్రచురించారు. వేల ఆరు అణాలు.




కవి గారు సీస పద్యాలలో తన తండ్రి శ్రీ తిరుమల దేశికా చార్య అనీ. తల్లిగారు రంగాంబ అనీ. చూడామణి తన భార్య అనీ. కొడుకు పేరు శ్రీనివాసుడు అని చెప్పారు. తమ్ముడు సీతారామమూర్తి. అక్కగారు నరసమాంబ. తనపేరు రాఘవాచార్య. షట్ శాస్త్ర ప్రవీణుడు చేవలి సుబ్రహ్మణ్యం గారునూనూగు మీసాల నాడే వైద్యంతో పాటు సంస్కృతం నూరి పోశారు. తమ కుటుంబానికి ఉమా మహేశ్వరం అనే అగ్రహారం ఉంది. పద్నాలుగు ఏళ్ళకే తనను కవితా కన్య పాణి గ్రహణం చేసింది. 18వ ఏట భీష్మ సంభవం. 19వ ఏట పార్వతీ వల్లభ శతకం రాసి., ఇప్పుడు ఈ ఇరవై రెండవ ఏట ఈ రాఘవ వేంకాటేశ్వర శతకం సంతరిస్తున్నానని చెప్పుకొన్నారు. కూచిమంచి తిమ్మన సంస్కృతంలో కుక్కుటేశ్వర శతకం. ధూర్జటి కాళహస్తీశ్వర శతకం.

భాస్కరుడు భాస్కర శతకం రాసి వన్నె కెక్కినట్లు తానూ “అనవద్యహృద్య పద్య రత్నమాలికల గూర్చంగ నూతన గతులలో ‘ఈ శతకం రాస్తున్నాని స్వామికి నివేదించు కొన్నారు.

గ్రుడ్డులోపల పిల్ల ఎవరి కారుణ్యం చక్కగా ఎదుగుతుందో. ఆకాశం లోఎంతో ఎత్తున ఎగిరే పక్షి మళ్ళీ ఎలా భూమిని ఎవరి కరుణతో చేరుతుందో,కర్మ బంధాలు ఎవని పాద ధ్యానం వలన విచ్ఛిన్నమవుతాయో అలాంటి “దేవాది దేవా దివ్య ప్రభావ. ఆది మధ్యాంతశూన్య లోకైక మాన్య “అయిన వేంకటేశుని నమ్మాను అన్నారు. ,లోకంలోని అన్ని విషయాలపై తన ఆవేదన వ్యక్తం చేశారు. ధర్మ దేవత నాలుగు పదాలు విరిగాయని బాధ పడ్డారుకవి. అక్క చేల్లెల్లమధ్య అన్నదమ్ముల మధ్య సఖ్యత కరువైంది. వైష్ణవంలో పుట్టి. వగలు పోయిన నారి వేశ్యగా మాలజాతిలోపుట్టి. అగ్రజన్మలో పేద బ్రాహ్మణుడి సొమ్ము హరించిన విప్రునిభార్య కడజాతి కాంతగా,అన్త్యకులం లోపుట్టి సార్వ భౌమి గా ప్రసిద్ధి చెందుతారేమో అని పురాణకధలు వివరించారు . ఆత్మను తెలుసుకున్నవారికి అందరూ పూజనీయులే.

విటులను తార్చే వేశ్యకు. ఒక్క నిమిషం హరిని ధ్యానిస్తే ముక్తికలుగుతుంది. మేకల్ని కోస్తూ హరినామ స్మరణ చేస్తే కైవల్యం వస్తుంది కటిక వాడికి.సంసార బంధం లో చిక్కుకున్నా చిత్తం శివునిపై లగ్నం చేస్తే జన్మ సాఫల్యం కలుగుతుంది. గోవింద స్మరణ చేసిన వారందరూ ఇహ పరసౌఖ్యాలు పొందుతారు –”కలదు భగవంతు డను నమ్మకంబే చాలు –ప్రజలకెల్లను భ్రుత్యుడై పరగు శౌరి”అని గ్యారంటీ ఇచ్చారు . చక్రవర్తికి పుత్ర ప్రేమ ఎంతో. మాలవాని పుత్ర మమత అంతే.పట్టపురాణిపై పతికి ఎంత ప్రేమో., నిరుపేదకు ఆలి పై ప్రేమ అంతే.సుఖభోగాలు అందరికీ సమానం. పండితుడు ఎలాంటి ఖ్యాతికోరుతాడో. నోరులేనివాడూ అంతె.అంటూ అన్నమయ్యలాగా చక్కని వేదాంతం చెప్పారుకవి.


రాఘవవేంకటేశ్వర శతకము.

ఎండిన చెట్టు చిగిర్చటం. పెద్దగా పెరిగిన వృక్షం నేలకూలటం. పనికి రానివాడే అన్నీ సాధించటం. మహాబలశాలి కూడా ఒక్కోసారి ఓడిపోవటం. పండిన చేను ఒరిగిపోవటం. మహా విద్వాంసుడుకూడా ఒక్కోసారి కటిక నెల మీద పడుకోవాల్సి రావటం.

రారాజుకూడా చెయ్యి చాచి బిచ్చం అడుక్కోవాల్సి రావచ్చు. మహా దరిద్రుడు రాజుకావచ్చు. ఏది ఎలా జరుగుతుందోఎవరికే తెలీదు –"కాక మానదు కానున్న కర్మ ఫలము –సర్వము నీ కృతమే కదా శ్రీనివాసా "అన్నారు. గయ్యాళి భార్యకు భయపడే వారు కులమతాచారాలను వదిలేసిన వారు. అష్టకష్టాలు పడి పెంచిన తలిదండ్రుల చావు కోరేవారు. పరము అనేదిలేదని విర్రవీగేవారు. కుటిలమతులు ఈరోజుల్లో గడ్డాలుపెంచి సన్యాసులై,అమాయకుల్ని మోసగిస్తున్నారు. కాకిగూటిలో కొంతకాలం ఉంటె కాకి కోకిల అవుతుందా. పాము పడగ విప్పకుండా పడుకొన్నమాత్రాన వానపాము శేషభోగి అవుతుందా ?మట్టి కొట్టుకు పోయిన బొగ్గు మాణిక్యం అవుతుందా ?అని ప్రశ్నించారు. "మానినీ మణికి మారు మనువులేదు –సతుల విడనాడు పతులకు గతులు లేవు "అని ధర్మ సూక్షం చెప్పారు.

గార్ధభం అశ్వం. కాకికోయిల. ఉల్లి మల్లి. సింహం నక్క. ఆవుబర్రే. నెమలి ఎరికోడి. బంగారం. కాకిబంగారం ఒక్కటికావు. దేని స్థాయి దానిదే. నువ్వు ఆకాశం అనటానికి సాక్షి దూర దృష్టికల అనంతుడివిఅవటం. జలరూపదారి అనటానికి సాక్ష్యం గంగ నీ పాదోద్భవ. పృధ్వీస్వరూపం అనటానికి సాక్షి నీ భార్య భూదేవి కావటం. వాయు స్వరూపానికి సాక్ష్యం భూత పాలన. అగ్ని స్వరూపం అనటానికి సాక్ష్యం నీ విగ్రహం "హాటక చ్ఛవి"వెలుగు ఉండటం –"పంచ భూతములీవ ప్రపంచమీవ. "అని స్వామిని పంచభూతాత్మకునిగా చక్కగా వర్ణించారు కవి.

మొదటిపద్యం –'శ్రీ మీర తిరుపతి క్షేత్రమందు వసించి –మూడులోకమూల నేలు మొదటి వేల్ప –

అజ రుద్రులను గూడ గజగజ లాడించు –దేదీప్యమాన మూర్తి ప్రభావ

పాహిమా యని వేడు ప్రజల బ్రోవగ ధాత్రి –నవతరించిన స్వయం వ్యక్తరూప

నీకు నోదరమూర్తి నీవయిద్వారకా- తిరుపతిబాలించు పరమ పురుష

తండ్రులకు దండ్రివైకుంఠ ధామ నిన్ను –బొగడ బూనితి నా పూర్వ పూజ వలన

నిహపరములిచ్చి మముగావు మిందిరేశ-విదిత పెద్దాపురీ వాస వేంక టేశ - తో ప్రారంభించి 165వ చివరిపద్యం –

"కాంచ నోజ్వల చేల కారుణ్య మయ శీల –యఖిల కళ్యాణ గుణాల వాల

రక్షితామర గణాధ్యక్ష కౌస్తుభ వక్ష –కమలాయతాక్ష రాక్షస విపక్ష

పరమ భక్తిజ్ఞాన. పటు నిశ్చలధ్యాన –ఘనజన ప్రత్యక్ష కల్ప వృక్ష

సకలలోకస్వామి జంగమమస్థావరాం –తర్యామి గరుడ పతంగ గామి

చిన్మయానంద లక్ష్మీ విహార –పరమ గుణ సద్మ-భవదీయ పాద పద్మ

సేవకుండను ననుగావు దేవ దేవ –విదిత పెద్దాపురీ వాస వేంక టేశ"అని శతకం ముగించారు శ్రీమత్తిరుమల రాఘువాచార్య కవి.

ఈశతకం లో భక్తి వెల్లువగా ప్రవహించింది. లోకోక్తి తేజస్సుతో ప్రకాశించింది. నడక కావేరీ ప్రవాహం. శైలి అద్భుతం. అత్యంత రమణీయం. ఈ శతకమూ లోకం దృష్టిలో పడ లేదని పించింది. వైష్ణవం లో ప్రచారం లో ఉందేమో ?మంచిశతకాన్ని కర్త అయిన విద్వత్ కవిని పరిచయం చేసే భాగ్యం నాకు కలిగింది.

## 52 నీలకంఠేశ్వర శతకం-- శ్రీ బళ్ళకనకయ్య

తూర్పు గోదావరి జిల్లా రాజోలు తాలూకా పుల్లేటి కుఱ్ఱు వాస్తవ్య దివ్యాంగ శ్రీ బళ్ళకనకయ్య గారి ప్రధమ పుత్రుడు మల్లయ్య చే రచించబడి. దివ్యాంగ శ్రీ చింతా వీరభద్రయ్యగారి చే పరిష్కరింపబడి న శ్రీ నీల కంఠేశ్వర శతకం పాలకొల్లు రాజరత్న ముద్రాక్షరశాలలో 1936లో ప్రచురింపబడింది. దీని ప్రోత్సాహకులు శ్రీ దగ్గులూరి శ్రీనివాసులగుశ్రీ విశ్వనాధం కోటయ్య. శ్రీ సోమన బసవ రాజు గార్లు. వెల-రెండు అణాలు.పుస్తక ముద్రణకు ద్రవ్యసాయం చేసిన వారు శ్రీ దగ్గులూరి వాస్తవ్యులు


ఓమ్.
బాలా పరమేశ్వరీ దేవ్యైనమః॥
నీలకంఠేశ్వర శతకము.
శ్రీ ఇయ్యది —
తూర్పు గోదావరి జిల్లా, రాజోలు తాలూకా,
పుల్లేటికుర్రు వాస్తవ్యులును దివ్యాంగ
శ్రీ బల్ల కనకయ్యగారి
ప్రథమ పుత్రులును నగు
మల్లయ్య చే రచియింపబడి,
దివ్యాంగ శ్రీ చింతా వీరభద్రయ్య కవిగారిచే
పరిష్కరింపబడి
దగ్గులూరి నివాసులగు మ॥ రా॥ శ్రీ
విశ్వనాథం కోటయ్య, సోమన బసవరాజు
గార్ల ప్రోత్సాహంబున, సజ్జనుల
ద్రవ్య సహాయంబుచే,
పాలకొల్లు రాజన్న ముద్రాక్షరశాలయందు
ముద్రింపబడి
ప్రకటింపబడినది.
మొదటి కూర్పు 1000 ప్రతులు.
1936.
రిజిస్టర్డు కాపీరైటు. [వెల 0-2-0.

సామంత పూడి పెద వెంకట నృపాలుని ప్రియ సుతుడు శ్రీమతి బంగారాయాంబ దంపతుల ప్రియపుత్రుడు శ్రీ సత్యనారాయణ. పీఠిక లో కవి గారు తాను అప్పుడప్పుడు భక్తి గ్రంధాలను చదివి వినిపిస్తున్నప్పుడు తనమిత్రుడు దగ్గులూరి వాస్తవ్యుడు కర్ణ వంశానికి చెందిన శ్రీ వాసా సూర్య సోమ లింగం గారు. ఆగ్రామ పాలకుడైన శ్రీ నీలకంఠేశ్వరస్వామి పై ఒక శతకం రాయమని కోరితే,రాసి, తనగురువు శ్రీ చింతా వీరభద్రయ్య కవికి చూపించగా తప్పులు సరిచేసి. శుద్ధ ప్రతి తయారు చేసి ఇచ్చారు. ఈ శతకం పై పెన్నాడ అగ్రహార వాసి శ్రీ మల్లిపూడి వీరయ్య సిద్ధాంతి తన అభిప్రాయం రాస్తూ -కవి మృదుమధుర లలితా పదజాలంతో శతక రచన చేశాడని అన్నారు. పాలకొల్లు వాస్తవ్యులు ఉభయ భాషాప్రవీణ శ్రీ ధర్మపురి తిరుమల లక్ష్మీ కుమార వేదాంత తిరుమలాచార్యులు అభిప్రాయం తెలియజేస్తూ -సుధీ జన చిత్త రంజకంగా. శబ్దాలంకార శోభితంగా కవిత్వం ఉందని మెచ్చారు. దగ్గులూరి వాస్తవ్యుడు శ్రీ పూడి భోగ లింగకవి "సుధారసం తో. మృదూక్తులతో. గంగాలహరీ ప్రవాహంగా శతకం ఉన్నది "అన్నారు. పాలకొల్లుకవి శ్రీ కడియం తమ్మన్న "నీతి దాయకం భక్తి ముక్తి ప్రదంగా ప్రాచీనకవుల ధోరణిలో శతకం నడిచింది. సర్వపాప సంహారకంగా ఉంది "అని శ్లాఘించారు. లంకల కోడేరు వాసి పండిత బొండాడ లక్ష్మణ కవి "బాలకవి బిరుదున్న ఈకవి రాసిన శతకం చదివి ముక్తిపొందాలి "అని అభిప్రాయం రాశారు. వీరందరికి కవి కృతజ్ఞతలు తెలిపారు. ఇది సీస పద్య శతకం. "దగ్గులూరి నివేశ. పాతక వినాశ – నీలకంఠేశ నన్నేలు నిరతమీశ"అనేది శతక మకుటం.

మొదటి పద్యం –"శ్రీమన్మహేశ్వరా శ్రితాజన మందార -శంకర పాహిమాం -పాహి శరణు-భోగీశా వరాభూష. ముని మనోంబుజ పూషా -సర్వేషా పాహిమాం పాహి శరణు శరణు

గజచర్మ పరీధాన కైవల్య సంధాన -సర్వజ్ఞ పాహిమాం పాహి శరణు -లింగ. సుచారిత్ర. లేఖర్షభ స్తోత్ర -పరశివ పాహిమాం పాహి శరణు



గరీమతో సీస శతకమను కమలములను -మాలగా గూర్చి యర్పింతు మది నుతింతు[BG1] - దగ్గులూరి నివేశ పాతక వినాశ -నీలకంఠేశ-నన్నేలు నిరతమీశ". తర్వాత పద్యంలో శ్రీ వీరభద్రదేశికునికి నమస్కరించాడు. తనది దేవల బ్రహ్మ వంశమని. ఇంటిపేరు బళ్ళ ఆశ్వాలాయన సూత్రులమని. గౌరమాంబ మల్లికార్జునుల తనయుడు. అచ్చమాంబ కు భర్త అయినకనకయ్య తన తండ్రి అని వారి ప్రధమకుమారుడైన తనపేరు మల్లయ అని తెలిపాడు.తనతలిదండ్రులు తన్ను "శివ దత్తకుమారుడు "అని పిలిచేవారని. కనుక శివుడు తనకు అన్నయ్య. అంబికా గంగలు అమ్మలు. గణపతి కుమారస్వామి వీరభద్రుడు అన్నలు. వాళ్ళ అర్ధ శరీరులు తనకు వదినెలు అని చమత్కరించాడు. ఓం నమ శివాయ పంచాక్షరీ మంత్రం లోని మొదటి అక్షరాలతో మరో సీసం అల్లాడు. అక్షరాలకు ఆద్యుడు. బిందుయుత ప్రణవం. వర్ణత్రయంలో వాక్ సతీ,మా ఉమాకాంత లై పతులు సై శోభించాడు. పంచభూతాలు. పగలు రాత్రి. లోపల బయటివాడై. సకల చరాచరమ్మై సర్వం శూన్యమై. ఎంచటానికి అశక్తమై. ఆది మధ్యాంతరహితుడవు నువ్వు అన్నాడు.ఊపిరి వదిలేలోపు నిన్ను ఎన్నగలనో లేనో అని సందేహపడ్డాడు.

పౌలస్త్యుడు ఆర్తితో ఆర్థిస్తే నవనిధులు. ఆగరాజసుత ఆర్చిస్తే అరమేను. ఫల్గుణుడు తపిస్తే పాశుపతం. ఇచ్చిన భక్త సులభుడవు అన్నాడు. మైదున రాముడిని కోర్కె తీర్చాడు. సంధ్యా నృత్యం చేసి అందర్నీ అలరిస్తావు. "అత్యంత భారమౌ యవనీ తలంబొక శేషుండు శిరమున జెర్చి యుండే-నా భోగి కులనాధు నవలీలగా నొక కమతంబు వెన్నున గదలకుంచే -నా కచ్చపాంబును నతి సూక్ష్మముగా-నొక క్రోడంబు మునిపంట కూర్మి నుంచె-నా వరాహంబును అణుమాత్రముగనెంచి-జలధి మోయుచు నుండే గలత లేక - యోగ్యులగు ధీరులోరులకు నోపినంత -సాయమొనరింతురది వారి సఃజ గుణము "అని చాలా చమత్కారంగా పద్యం అల్లి సూక్తి తో ముక్తాయింపు ఇచ్చాడు కవి. కోపం వదలటం ఘనం. శక్తిలేక వృద్ధాప్యంలో ఉన్న వృద్ధులను కాపాడాలి. డబ్బుమదం గర్వం పతన హేతువు అని సూక్తి ముక్తావళి కూర్చాడు. "ఏరననుబ్రోవ విదినీకు మేర యటర "అని ఆర్తిగా ప్రార్ధించాడు. శ్రీ ధాత్రు నామ సంవత్సరం వైశాఖ శుద్ధ పాడ్యమి నాడు ఈశతకాన్ని స్వామికి

ఆర్పణం చేసి ముగించాడు 101వ సీసం లో. తర్వాత గద్యంలో –"ఇది శ్రీ మదుమా రమణ పాదారవింద మకరంద పానేందిందిర,బాలపరమేశ్వరీకరుణా కటాక్ష వీక్షణ సమాలబ్ధ. సరస కవిత వైభవ. మన్మహారుషిగోత్ర పవిత్ర. అశ్వలాయన సూత్ర. బళ్ళవంశపయఃపారావార కైరవ మిత్ర. కనకాభి దేయ సత్పుత్ర. మల్లయ నామ ధేయ ప్రణీతంబగు నీలకంఠేశ్వరశతకము సర్వంబును సంపూర్ణము "అని ముగించాడుకవి.

భక్తి ముక్తి దాయకమైన శతకం కవి ప్రతిభ ప్రతిపద్యం లోనూ కనిపిస్తుంది. లోకరీతి, జన ప్రవృత్తి,ధర్మ సూక్తాలు. నీతులు,నిష్ఠూరాలు కలబోసి రచించిన శతకం.

53 శ్రీ కాశీ విశ్వ నాద శతకం =–తంగెడంచ -- శ్రీ రామకృష్ణ సీతారామ సోదరకవులు

శతావధానులు రామ కృష్ణ సీతారామ సోదరకవులు రచించిన **శ్రీ కాశీ విశ్వ నాథ శతకం- తంగె డంచ - కర్నూలు జైహింద్ ముద్రాక్షర శాలలో 1950లో ముద్రితమైంది వెల నాలుగణాలు. ఈశతకం కర్నూలు జిల్లా నంది కొట్కూరు తాలూకా తంగెడంచ గ్రామం లో వెలసిన శ్రీ కాశీ విశ్వేశ్వరునికి అంకితం. ఈ గ్రామం కర్నూలు నుంచి శ్రీశైలం వెళ్ళేదారిలో ఉంది. ఇక్కడ కర్నూలు వాసి వెండి. బంగారం వ్యాపారి శ్రీ చాగాపురం చిన్న యల్లచిప్ప గౌడుగారు ఇద్దరు భార్యల సహకారంతో శివాలయం కట్టించి. 25-2-1948సర్వజిత్ మాఘ బహుళ విదియ బుధవారం ప్రతిష్టా సంకల్పం చేసి. 26-2-1948జలదివాసాలు నిర్వహించి 27-2-1948 సర్వజిత్ మాఘ బహుళ తదియనాడు శ్రీ సుబ్రహ్మణ్యాది పరివారంతో శ్రీ అన్నపూర్ణా విశాలాక్షీ సమేత కాశీ విశ్వనాథ లింగ ప్రతిష్ట చేశారు.**




**తర్వాత సోదరకవులు ఆలయనిర్మాత వంశ చరిత్ర పద్యాలలో రాశారు. ."తంగెడంచపుర కాశీ విశ్వనాథ ప్రభూ" అనే మకుటం తో 110మత్తేభ. శార్దూల పద్యాలతో శతకం అల్లారు. మొదటిశార్దూల పద్యం –"శ్రీ వాణీశ గిరీశపద్మహిత లక్ష్మీ శాంబికా. భద్ర కా-ళీ వీరేశ కుమారభక్తజన పాళిస్,దేశిక శ్రేణినా**

నా విద్వత్కవుల న్నుతించి. పరమానందంబుతో నీకు వా-క్సేవం జేతుము తంగెడంచ పుర కాశీ విశ్వనాథ ప్రభూ "అని శివ పంచాయతనం వాణీ లక్ష్మీ మొదలైన వారిని గురువులను స్మరించారు. దురహంకారంతో బుద్ధినాలుగు విధాలపోతుంది వానరంలాగా. నీ భక్తి సూత్రంతో దాన్ని బంధించు అని శివానందలహరిలో భగవత్పాదులు అన్నట్లే అన్నారు. సారంగాసురహారి. సారంగ ప్రతిభా విహారి అని శివుని కీర్తించారు. శివ పంచాక్షరి శ్రీశైల శివ దర్శనం కాశీవాసం బిల్వపూజ నీ కిష్టం.



తర్వాత ఈ ప్రదేశం గొప్పతనాన్ని వర్ణించారు. ఇది అపరాకాశి.ఇక్కడి గోస్తనీ నది గంగానదితో సమానం. ఇక్కడ శివ తీర్థం అనే కొత్తబావి ఉంది. ఇంద్రద్యుమ్న మహారాజుఇక్కడ తటాకం. శివాలయం కట్టించి. లింగ ప్రతిష్ట చేసి. ఒకబావి తవ్వించాడు. బావినీరు కొబ్బరి నీటి రుచి. స్వామి దర్శనం మోక్షదాయకం. శివరాత్రికి శ్రీశైలం వెళ్ళే భక్తులు ఇక్కడికివచ్చి పానకంగా రుచిగా ఉన్న యీజలం తాగి ఎండనుంచి ఉపశమనం పొందుతారు. ఇక్కడి పుష్పవనం సకల పుష్పజాతులు తమ పుష్పాలను హరకైంకర్యంగా ఉపయోగపడతాయి. ఇక్కడి స్వామికి జరిగే మహాన్యాసపూర్వక రుద్రాభిషేకం చూసి భక్తులు పులకించి పోతారు. కైలాసం లో ఉన్న అనుభూతికి లోనౌతారు.

శ్రీ కృష్ణుడు సాయం పూజ చేస్తే మోకాలు చూపిస్తే దాన్ని పూజించి మొకాలే నువ్వు అని భీముడికి అర్జునుడు తెల్పాడు. పతివి గౌడ సతిని రతికి ఒప్పించి. ఆమె భర్తరాగా భయంతో సురాభాండం లో దాగి. ఆదంపతులు భక్తితో ప్రార్ధిస్తే మోక్షం ఇచ్చావు. అని చాలా శివలీలలను వర్ణించారు. హరి నీభక్తుడు నిత్యం వెయ్యి పద్మాలతో పూజిస్తాడు ఒకరోజుఒక పువ్వు తగ్గితే కన్ను పీకి పుష్పంగాసంర్పించిన పరమ శివభక్తుడు శ్రీహరి. కిరాతార్జునీయం. దక్ష గర్వభంగం వగైరా వర్ణించారు. వ్యాసుడిని కాశినుంచి గెంటేయటం,రావణుడు నిత్యం కోటి శివాలయాలలో పూజ చేయటం. శిరస్సు కోసి అర్పించిమెప్పించటం. బాణాసురుడు భక్తితో మెప్పించిశివపార్వతులను తన ద్వారానికి కాపలా వారినిగాచేయటం చెప్పారు.

ఆతర్వాత పద్యాలలోసంసార జంఝాటనం మనసు శివునిపైనిల్పలేకపోవటం చెప్పారు. "ఆశా వృక్షము భూమిలో బొడమి,యాశాన్తముల్నిండియా-కాశం బంటెడు వేళ-పద్మభవు కల్పద్రుమం బడ్డమై'' నాశనం

చేస్తుంది. ఇక ఫలవంతం ఎలా అవుతుంది అని ప్రశ్నించారు. గళం లో మహావిషం సగభాగంలో నిలిపి నేత్రాగ్నిజ్వాలల కొలిమిలో కరగించి. మోహమద లోలత్వం కలిపి "మాయలరంగు ల్బయి పూతపూసి. విషకన్యల్సల్పి. తచ్చిత్తముస్ శిలగా చేశావుకదా సామీ అన్నారు. నేటిపరిస్తులను చెబుతూ "సినిమావచ్చెను పూర్వ నాట్య కళలస్ చేదింప –ఆచార దీక్షను గంగానదిలో కలపటానికి కాఫీ ప్రత్యక్షమైంది అని బాధపడ్డారు. సాలె పురుగు దారం అల్లి. గూడు నిర్మించి తానె దాన్ని నాశనం చేసినట్లు నువ్వు "నానాలోకముల స్ సృజించు మనుచు న్నా శంబు "చేస్తావుకదా అదే నీలీల.

బౌద్ధులు చెలరేగిపోతుంటే సంకల్పం తో శంకరుడపై జన్మించి. అనేక భాష్యాలురాసి "సంసరణాంబోధి తరియింప ఉపనిషత్సార ప్రచారం చేశావు. దాస్యం పొట్టకూటికే మానలేక పోతున్నాం. మాకు మోక్షం ఎన్నడో ?కాలుడు


శ్రీ కాశీ విశ్వనాథస్వామివారి దేవాలయము, లంగోటంద. (నందికొట్కూరు తాలూకా)

దున్నపోతునుఇవ్వగా.నీదగ్గరున్న ఎద్దుఉండగా.పుష్కలంగా గంగాజలం ,కుబేరుడు విత్తనాలు ఇస్తాడు నాగలి బలరాముడిస్తాడు. నీకుకృషి చేతనౌను. హాయిగా పంటలు పుష్కలంబుగా పండించి మా ఆకలి దప్పులు తీర్చి

రేషను బాధనుంచి గట్టెక్కిన్చవయ్యా. అని చమత్కరించారు కవీశ్వరులు. నువ్వు నిత్య భిక్షార్ధివి మాలోకనికి వస్తేపిడికెడు భిక్షంకూడా నీకు వెయ్యరయ్యోయ్. నీకు రేషన్ కార్డు కూడా ఇవ్వరు జాగ్రత్తసామీ.

మా భారత సోదరీమణులకు 30ఏళ్ళు దాటినా పెళ్ళిళ్ళు కావటం లేదు. వాళ్ళ వివాహం సంతానం సంగతి చూడవయ్యమహానుభావా. ''దానంబిచ్చిన రాజు లేగిరి. శిలా తామ్రాది తచ్చాసనా లేనాడో చనె. విప్రవంశ భవులా ఇంగ్లీషు వారైరి "ఇంకా అగ్రహారాలలెక్కడ అమ్ముకుపోయారు. బ్రాహ్మణుల తపోమహిమ చచ్చింది. బ్యాటరీ గొట్టాలోచ్చాయి. కరంట్ లేదు జపతపాలు లేవు అని వాపోయారు.

"ఈవీశుండవు నే కవీశ్వరుడ. స్వర్ణ రౌప్యాగామముల్ -దావుల్నీకు శతావధాన మునుపాధ్యాయ త్వము నాకు "అయ్యో దరిద్రం తీరటం లేదు. చివరి 113వ మత్తేభ పద్యం –"శత లేఖిన్యవధాన ముల్సలుపు. సంచారంబు నన్సేలువల్ –పతకంబుల్గొని. నాటకంబులును. కావ్యశ్రేణినిట్లేన్నియో

శతకంబుల్విరచించి డస్సితిని. నా సామర్ధ్యముం బూర్వపు స్-స్థితికి దేగదే తంగెడంచ పుర కాశీ విశ్వనాధ ప్రభూ''



"ఇది- శ్రీ మద్ గౌరా వఝుల- సీతమాంబాసుబ్బరామా ర్య తనూభవ రామ కృష్ణ సీతారామ సోదరకవి ప్రణీతంబగు శ్రీ కాశీ విశ్వనాథ శతకం సంపూర్ణం.

ఈసోదరకవులు శతావధానులుకనుక పద్యాలు నల్లేరుపై బండినడక. చక్కని ఊహ నిర్వహణ తగినట్లు భక్తీ అందుకు తగ్గ పాండిత్యం తో శతకం రసవత్తరంగా రచించారు. అయితే మన వాళ్ళ దృష్టిలో పడిన దాఖలా నాకు కనిపించలేదు. వీరిని వీరి శతకాన్నీ పరిచయం చేసే మహద్భాగ్యం నాకు కలిగింది.

## 54 శతక భాగవతం-- శ్రీ పిసిపాటి సోమయ్య కవి

శ్రీ పిసిపాటి సోమయ్య కవి రచించిన శతకభాగవతం 1942లో నూజివీడులోని గౌరీ ముద్రాక్షర శాలలో ముద్రింపబడింది. వెల పేర్కొనలేదు. కంద పద్యాల్లో భాగవత కథా శతకం రాశాడు కవి. .''కృష్ణ. పరమాత్మ హరీ "అనేది మకుటం.

మొదటి పద్యం –"శ్రీ కళ్యాణ గుణాకర-లోకేశ్వరసాధు భక్త లోక యనంతా

నీ కథల స్మరియింతును –బ్రాకట సద్భక్తి గృష్ణ పరమాత్మహరీ "

తర్వాత భాగవతాన్ని సంస్కృతంలో రాసిన వ్యాసుని తెలుగులో రాసిన పోతనను స్మరించి. అప్పటికే శతక రామాయణం శతక భారతం రాశానని. ఇప్పుడు భాగవత శతకాన్ని కూడారాసి అర్పిస్తున్నాననీ విన్నవించాడు. శిరములు కన్నులు కరములు శత వేలు కలిగి సర్వాతీతుడవై జలధిలో ఉంటావు. ధర్మానికి విఘాతంకలిగినపుడు ప్రతియుగం లో అవతరించి ధర్మోద్ధరణ చేస్తావు. మొదట పెనుమీనంగా విలయాబ్ది విరించి కునుక, వేదాలను అపహరించిన హయగ్రీవుని మలపినావు. ''నిద్దుర మానిన వేలుపు -పెద్దకు నిగమముల చిక్కు విచ్చుచు మగుడన్ –"ముద్దుగా తెచ్చిచ్చి విపద్దశ బాపావు. సత్యవ్రత రాజుకు బ్రహ్మమార్గం తెలిపావు. ప్రళయాబ్దిలో మనువు. విత్తనాలు ఓషధులు మునులు మునిగిపోతుంటే,పెద్ద నావతో వచ్చి తేల్చి కాపాడావు.




తర్వాత క్షీరసాగర మధనం. కూర్మావతారం. అమృతాన్ని మోహిని రూపంలో దేవతలకుపంచి దనుజుల పరిభవం చేశాడ్.సనకసనందులు విష్ణుద్వారపాలకులకుశాపం ఇవ్వటం వారు భూలోకంలో పుట్టటం. భూమిని చాపచుట్టగా చేసి సముద్రంలో దాక్కున్న హిరణ్యాక్షుడిని మహావరాహ రూపం లో మర్దించి కోరపై భూమిని నిలిపితే భయపడిన భూదేవిని భయం పోగొట్టటం. హిరణ్యకశిపుని చంపి ప్రహ్లాదుని కాపాడి ప్రహ్లాద వరదుడవటం చక్కగా వర్ణించాడు కవి. వామనుడపై బలిని మూడడుగుల భూమి కోరి. మూడో పాదం "నతుడై శిరమం జూపిన –మతియుతుబలి దైత్యు బొగడి –మానుగానతని సుతలమునకు బనిపి "దేవతలను బ్రోచాడు హరి . రాముడుగా "ఒరులేరును విరువంగానెరుగని శివధనువు దునిమి –మిధిలా వరు సద్మంబున - సీతను'' పరిణయమాడావు . తర్వాత రామాయణ కథ అంతాకందాలలో అందంగా నడిపారు. తర్వాత కృష్ణావతారం. ''అష్టమ గర్భంబున బహు –లాష్టమిగల రోహిణీ సమన్వితరాత్రి స్-సృష్టిం గంటివిధర్మ –భ్రష్టుల దండింప కృష్ణ పరమాత్మహరీ "అని చక్కని చిక్కని పద్యం రాసి శ్రీకృష్ణజననం చెప్పారు. అక్కడినుంచి కృష్ణ కథ మొదలెట్టి. నంద యశోదల గారాబు పట్టిగా పెరగటం. పూతన శకటాసురాది రాక్షస నిధనం వర్ణించి బాల కృష్ణుని లీలావినోదాలను తనివార వర్ణించి. కాళీయ మర్దనం గోపికా వస్త్రాపహరణం. గోవర్ధనోద్ధరణం మేనమామ కంసవధ. ''లేపనముల నంది కుబ్జకు –బాపంబుల బాపి దేహ వక్రత బోవ సద్రూపం "ఇచ్చాడు

కాశీకి వెళ్లి సాందీపముని ఆశ్రమం లో అన్న బలరాముడితో చదివి 'ఎల్ల విద్యల బనుపడ''నేర్చాడు. చనిపోయిన గురు సుతుని "జము నడిగి తెచ్చి-గురు దక్షిణగా స్థిరభక్తి "తో అందించి లోకానికి మార్గదర్శకుడయ్యాడు. సముద్రంలో ద్వారక నిర్మించి మదురానగర వాసుల్ని యుద్ధభయం లేకుండా కాపాడాడు. రుక్మిణీ కల్యాణాన్ని –"సిరి మున్ను గొన్న వడువున –నెరి నోరిచి చైద్య పక్ష నృపతుల నాజిస్-బరిణయమైతి విదర్భే-శ్వర సుత రుక్మిణిని కృష్ణ పరమాత్మహరీ ".ఆతర్వాత శ్యమంతక మణి వృత్తాంతం. అష్టభార్య వివాహం. పారిజాతాపహరణం. ధర్మరాజుతో రాజసూయం జరిపించటం భీష్మ వచనం ప్రకారం అగ్ర పూజ అందుకోవటం. చైద్యుని చంపటం సూటిగా వర్ణించాడు.

"సుదతి దను బంప నడుగుల - బదిలముగాదేచ్చి యీాయబత్తి గుచేలుం –డొదవిన కరుణను బలు- సంపద లిడి "స్నేహధర్మాన్ని లోకానికి చాటాడు. ద్రౌపదీ వస్త్రాపహరణం. అక్షయ వస్త్ర ప్రదానం. ధర్మాత్ముల్లైన పాండవుల పక్షం లో ఉండి కురుపాండవ సంగ్రామం జరిపించి ధర్మాన్ని కాపాడాడు. ద్రోణ సుతుని అస్త్రం నుంచి ఉత్తర గర్భాన్నికాపాడి పరీక్షిత్తు ఉదయానికి కారకుడవటం వివరించారు "భేదా చారులు దుర్నయ –వాదులు లోకాపకార పరులు జెలగస్ –మేదిని బుద్ధుడవై "పుట్టి నీతిని బో ధించాడు . చివరగా కల్కి అవతారం దాల్చాడు హరి.

ఇన్నీ చెప్పి "నీ లీలలలెల్ల బేర్కొన –జాలరు బ్రహ్మాదులరయ సంకర్షణ –"నా వల్ల ఏమౌతుంది అని కాడి పారేశాడుకవి. 111వ కందం లో "భారద్వాజస గోత్ర వి-హారుని బిసపాటి సుబ్బయార్య తనూజుస్ –ధారుణి సోమయ సుకవి గృ-పారతిరక్షించు కృష్ణ పరమాత్మహరీ "అని ముగిస్తూ చివరిపద్యంలో ఫలశ్రుతి రాశారు.

ఈ శతకం గురించి ఒక్క మాటలో చెప్పాలంటే "సుత్తి లేకుండా సూటిగా భాగవతామృత పానం చేయించిన శతకం " అనాలి. సోమయ్య గారికి సాహిత్యం లో గొప్ప పేరే ఉంది . తన అనుభవం భక్తీ కి కలిపి తన పాండిత్యాన్ని ఇక్షురసంగా మార్చి కవి రాశారు. పండితలోకం గుర్తించే ఉంటుంది. అయినా పరిచయం చేసే సౌభాగ్యం నాకు దక్కింది.

## 55 శతక భారతం-- శ్రీ పిసిపాటి సోమయ్య కవి

కృష్ణా జిల్లా నూజి వీడుకు చెందిన శ్రీ పిసిపాటి సోమయ్య కవి మహా భారత కథను "భారత శతకం "గా రచించి 1935లో. అక్కడే ఉన్న శ్రీ గౌరీ ముద్రాక్షర శాలలో ప్రచురించారు. వెల 5 అణాలు. దీనికి ముందుమాటను నూజివీడు ఆర్.ఆర్. అంటే రాజారంగయ్యప్పారావు హైస్కూల్ రిటైర్డ్ హెడ్ మాస్టర్, జిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిల్ మాజీ ప్రెసిడెంట్ శ్రీ మద్దిరాల రామారావు ఆంగ్లం లో రాశారు అందులోని విశేషాలు –"భక్త వత్సల కృష్ణ "మకుటంతో కవిగారు మహా భారత ఇతి వృత్తాన్ని శతకంగా చెప్పటం నమ్మలేక పోతున్నాను. ఈనాటి యువతకు ప్రోత్సాహకరంగా ఉంది. భారత దేశ క్లాసిక్ కావ్యాలలో భారతం ఒకటి. భారతం లోలేని విషయాలు

ఎక్కడా ఉండవు. ఎక్కడున్న విషయమైనా భారతం లో ఉంటుంది. యువత ఈశతకం చదివి భగవద్ భక్తిని, మన సంస్కృతిపై ఆరాధనా భావాన్ని పెంపొందించుకోవాలి. “




బందరు హిందూ కాలేజి ఎక్స్ ప్రిన్సిపాల్ శ్రీ వారణాసి శ్రీనివాసరావు కంద పద్యాలలో పండితాభిప్రాయం చెబుతూ “ఒక చులుకమ్మున గుంభజు –డకలంక ప్రతిభ గ్రోలె నంబు ధులింకస్ –సుకరమ్ముగాని భారత –మొక శతకంబయ్యె నీదు యుక్తి స్ఫురణచే “,అంటూ కవిది “అతులిత మనీష “అని శ్లాఘించారు. కవిసామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు “శయ్య మనోహరం ప్రధానాంశాలు వదిలిపెట్టకుండా భారతాన్ని శతక కమండలం లో ఇమిడ్చారు “అన్నారు. కలువపాములనుంచి శతావధాని శ్రీ హరి రామలింగ శాస్త్రి “రసమున్నించి. యలంకృతులస్ జొనిపి. మహాకథా విశేషముస్ గుంచించి ముఖ్యాంశపు గోసలైనస్ విడబోక. యాగమహితోక్తుల్ వెల్లిగా “రాసినందుకు పద్యాలలో మెచ్చుకొన్నారు. నూజివీడు డిప్యూటీ తాసిల్దార్ ఆఫీస్ హెడ్ క్లార్క్ –శతావధాని శ్రీ పాగోలు సత్యనారాయణ “భారత సారము శతకము –గా రచియించితివి ముద్దుగా బాలురకుస్ –దీరైన శబ్ద సంపుటి –నౌరా యని యబ్బురంబు నంద మనీషుల్ “అని ఆశీర్వదించారు. కలువపాములవాసి శ్రీ హరి రాదా కృష్ణ మూర్తి “లలి లక్షాధికమైన భారతము నెల్లస్ నూరు పద్యంబులం-బలుకంగా వలెనందుగందముల గావ్య ప్రక్రియస్ “భక్త వత్సల కృష్ణా యను సత్కిరీటమున –ఓహో నీకృతి దివ్యం “అని వెన్ను తట్టారు. నూజివీడు కో ఆపరేటివ్ సూపర్వైజర్ శ్రీ జోశ్యుల సూర్యనారాయణ శాస్త్రి “నన్నయ తిక్కన యెర్రన-పన్నిన యా ఫక్కి నెందు బస చెడకుండస్ –సన్నుత గతి శతకంబున –వన్నె లొలుక బలికి తీవు భారత గాథస్”అన్నారు. కనుక ఈశతకం కంద శతకం. మకుటం –”భక్త వత్సల కృష్ణా “.ప్రతిపద్యానికి సూక్ష్మగా తాత్పర్యమూ రాశారు కవి.

మొదటి కందపద్యం –"శ్రీ రుక్మిణీ మణిహృ-త్సార సమద భ్రుంగాపార్ధ సారధి చక్రి

ద్వారవతీశా నీపద –వారిజ ములగోలుతుభక్తవత్సల కృష్ణా ".తర్వాత దశావతారాలు ఎత్తిన నీకు స్తుతి అంటే లోకోపకారమైన జండాను ఎత్తటమే.తర్వాత వ్యాస వాల్మీకాదికవులను తెలుగు కవులను ప్రస్తుతించి "మద్గ్రంథోచిత రచనాధిక వాగ్వై చిత్రి "ప్రసాదించమని కంసారిని మనసారా కోరారు. భూదేవి ధరించిన ఆభారణమా అన్నట్లు హస్తినాపురమున్నది. పుట్టు గుడ్డి ధృత రాష్ట్ర మహారాజు న్యాయంగా పాలిస్తున్నాడు. పాండురాజు అన్నకు సాయపడుతున్నాడు. చాపకళా విదుడుబ్రహ్మచర్యాశ్రమ దీక్షా పరుడు పెదతండ్రి భీష్ముడు అన్నివిధాలా ప్రాపు. "నయ విద్యా పాండితిలో మేటి విదురుడు రాచకార్య నిర్వాహకుడు. తర్వాత పాండవ కౌరవ జననం. పెంపకం. పాండురాజు "కిందమముని "శాపంతో చనిపోవటం. మాద్రి సహగమనం చేయటం. కుంతితో పాండవులు హస్తిన చేరటం విద్య విలువిద్యాదులలో పెరుపొందటం. దుర్యోధనాదులు భీమాదులను అవమాన పరచి దుష్టంగా ప్రవర్తించటం,ద్రోణ గురువు వద్ద ధనుర్విద్యాభ్యాసం చెప్పారు.

పండితాభిప్రాయములు.

2—1—35,

వారణాసి శ్రీనివాసరావు,
ఎం.ఏ. (ఆనర్సు) ఎల్.టి.

"నరశర విద్యాకుశలత., మరుదాత్మజు బాహు విక్రమం. యుధిష్ఠిరుని పదవి చూసి సహించలేకపోయాడు దుర్యోధనుడు. సౌబల కర్ణాహ్వయులు అతడికి దుష్ట సలహాలిస్తూ దుష్ట చతుష్టయంయ్యారు. తండ్రికి మాయమాటలు చెప్పి పాం డుకుమారుల్ని వారణావతం పంపి. లక్కింట కాపురం పెట్టించి, అర్ధరాత్రిదహనం చేయించాడు. "విదుర దూత సమకూర్చిన భూబిల మార్గం లో అడవి లోకి ప్రవేశించారు తల్లితోసహా. హిడింబ భీమ వివాహం. ఘటోత్కచ జననం. విప్రవేషంలో ఏక చక్రపురం చేరి. భీముడు బకాసుర సంహారం చేసి ప్రజల బాధలు తీర్చటం. ద్రౌపదీ స్వయం వరంలో పాల్గొనటం. "వచ్చిన రాసుతు లెల్లరు –జెచ్చెర జని భంగపడుట చే యంత్రం –బచ్చపు ద్విజ వేషుడువి-వ్వచ్చుడు దాని నేసె భక్తవత్సల కృష్ణా ".తల్లికుంతి,వ్యాస మహర్షి అనుమతితో పాండవులు అయిదుగురు ద్రౌపదికి భర్తలయ్యారు. ఈ విషయం తెలిసిన పెద్దరాజు వారందర్నీ గజపురికి ఆహ్వానింఛి అర్ధ రాజ్యమివ్వగా ఇంద్ర ప్రస్తాన్ని రాజధానిగా ధర్మరాజు తమ్ముల సాయంతోపాలించాడు. తర్వాత "మేనరిక మని త్వదీయసహోదరి సుభద్ర దేవేరిగనీ –వాయర్జునునకు "కూర్చాడుకృష్ణుడు . సుభద్రార్జునులకు మహా పౌరుషవంతుడు అభిమన్యకుమారుడు జన్మించాడు. ద్రౌపదికి

ధర్మజ భీమార్జున నకుల సహదేవుల వలన ప్రతి వింధ్య. శ్రుతసోమ. శ్రుతకీర్తి శతానీక. శత్రుసేన అనే ఉపపాండవులు జన్మించారు

అర్జునుడు ఖాండవ దహనం చేసి అగ్నిని మెప్పించి. ఇంద్రాదులను జయించి వీతి హోత్రుని తృప్తి పొందించాడు. మయుడు అలాగ్ని జ్వాలలో చిక్కుకొని కిరీటిని శరణు వెడితే. అతడు రక్షించగా. కృతజ్ఞతగా అతడు "శ్రీమన్మణి సభ –నాకస్వామియు నరుదొంద''ధర్మపుత్రునికి నిర్మించి ఇచ్చాడు. మయసభా ప్రవేశం చేసి యుధిష్ఠిరుడు ధర్మ బద్ధంగా రాజ్యపాలన చేస్తూ. నారద మహర్షి రాజసూయ యాగం చేయమని హితవు చెప్పగా బావ కృష్ణుని ఆహ్వానించి "నీ నియోగంతో రాజలోకాన్ని జయించాలి "అని కోరగా. జరాసంధుని హతమార్చటానికి కృష్ణ భీమార్జునులు వెళ్లగా.భీముడితో మల్ల యుద్ధం లో వాడు చనిపోయాడు. తమ్ముల సాయంతో పూర్వోత్తర పశ్చిమ దక్షిణ దిగ్విజం పొంది ధర్మరాజు రాజసూయాధ్వరం చేశాడు. అగ్రతాంబూలం శ్రీ కృష్ణుడికి ధర్మరాజు ఇస్తే. శిశుపాలుడు అతడిని,కృష్ణుని దూషిస్తే. ''నిన్నుదిట్టు శిశు పాలుస్ –గూలిచి చక్రముచే –క్రతుపాలన "చేశాడు.

పాండవ వైభవాన్ని కనులారా చూస్తున్న దుర్యోధనుడికి అ సూయ పరాకాష్టకు పెరిగి. మాయాద్యూతం ఆడించి వనవాస అజ్ఞాత వాసాలకు పంపాడు పాండవుల్ని 'కౌంతేయులు సతితో కాననమున బలు పాట్లు పడ్డారు. ''బకుని తమ్ముడు కిమ్మీరుడు అడ్డు వస్తే భీముడు చంపేశాడు. ''ఈశునికై తపము –పారాశర్య ననుజ్ఞ సల్పి –ప్రత్యక్షముగా జేసికొని-నరుడు వొందెను - పాశుపతాస్త్రము ".శతమఖ నందనుడు అర్జునుడు అమరావతికి వెళ్లి ఊర్వశికామించగా. నిరాకరిస్తే "పేడిగ బ్రతుకు మని "శపించింది. ఇంద్రుని ఆజ్ఞతో పార్ధుడు పాతాళం లో ఉన్న నివాత కవచులు అనే 3కోట్ల రాక్షసులను. హిరణ్య పురవాసులైన పౌలోమ కాలకేయాది 60వేల రాక్షసులని చంపి దేవతా ప్రీతి చేశాడు.

గంధర్వులు దుర్యోధనుడిని బంధిస్తే. విడిపించి "గంధర్వుల నోరిచిన –సద్బంధులు పాండవులు. కామ్యవనంలో పాండవులు ద్రౌపదిని ఒక్కదాన్నే ఆశ్రమ లో ఉంచి వేటకు వెడితే "ద్రుపద సుత వలచి సైంధవుడు అపహరణము సేయగా –మారుతాత్మజుడు "వాడి గర్వం అడచి ద్రోవదిని తెచ్చాడు. ''సురయక్ష మౌని భూసుర సమూహం వరాలు ఇస్తే. 12ఏళ్ళు సుఖంగా పాండవులు వనవాసం పూర్తి చేశారు. అజ్ఞాతవాసం ఏడాది గడపపటానికి మత్స్యనగరి వెళ్లి. విరటునికొలువులో మారువేషాలతో ఉన్నారు. ''నరుడు బ్రహన్నల నాగను బరగెను బేడియయి ".ద్రౌపదిని గాం క్షించియుంట-దుర్జ్నే య విధిస్ –దేవి సహోదరు గీచకు –బావని వధించాడు "అని కీచకవదను ఒకే ఒక పద్యంలో చెప్పేశారు. తర్వాత దక్షిణ గోగ్రహణం.''అత్తరి విరటుని పుత్రకు –నుత్తరు గని

పసుల వార లోగివెడితే "అర్జునుడు వెళ్లి ఆలను రక్షించి దుర్యోధనాదులకు యుద్ధంలో బుద్ధిచెప్పి "క్రీడి రధియై తా రహి కౌరవ సేనా –వారంబుల గవిసె "అనిలో ఉరు విజయం'' పొందాడు. పాండవులు తమ నిజస్వరూపాలు విరతునికి తెలియజేయటం అర్జునుని కోరికపై అతడు ఉత్తరను అభిమన్యునికిచ్చి వివాహం చేయటం. ఉపప్లావ్యం చేరి పాండవులు "తమపాలిమ్మని కురు పతిని "కోరటం. చివరగా శ్రీ కృష్ణ రాయబారం "తమ పైతృకమగు ఉర్వీ సామ్రాజ్యం పాండవులకిచ్చి. భువి వాసిగా మనుము "అని హితవు చెప్పటం. లేదంటే యుద్ధంలో జయించి వాళ్ళే రాజ్యం పొందుతారని హెచ్చరించటం. యుద్ధంలోనే తేలుద్దాం అని పెద్దరాజుకొడుకు అనటం. ఆదుష్టులు "నిండు సభ బట్ట నేనొక రుండన ?"'అంటూ విశ్వరూపం చూపటం. చెప్పారు.

"పోరున సారధి వగుమని –కోరుతట నిన్ను సవ్యసాచి గొనకొని నీవా -భారము బై నిడుకొన్నావు "అపార కృపా లీలతో. కురుపాండవ సంగ్రామం. వరుసగా కౌరవులంతా పాండవులచేతిలో హతమవ్వటం. 18అక్షౌహిణుల సైన్యంతో 18రోజులు జరిగిన యుద్ధంలో పాండవులు విజయం సాధించగా "శ్రీ మెరయ నంతధర్మజు –బ్రేమంబున హస్తిపురికి పృధ్వీ పతిగా –నేమించి. ఏలితీవు ప్రభామయ సాధువుల భక్త వత్సల కృష్ణా "111వ కందంలో పిసిపాటి సుబ్బయ నరసాంబ కుమారుడు సోమయకవి రాసిన భారత శతకం చదివిన విన్నవారు కృష్ణుని దయతో దీర్ఘాయుస్సు నిర్మలమనసు. సమస్తసంపదలు సత్సంతానం ఇహపర సౌఖ్యం తప్పక పొందుతారని ఫలశృతి చెప్పారు.

ఇందులో నేను విశ్లేషించి చెప్పాల్సిందేమీ లేదు ముస్దుమాతలలోనే మహా మహులు చెప్పే ఉన్నారు. ఈకవి రామాయణం కూడా శతకరామాయణ0గా రాసిన తర్వాత దీన్ని రాసి ఆటర్వార భాగావతాన్నికూడా శతక భాగవతంగా రాశారని నిన్న చెప్పుకొన్నాం. కొండను అద్దం చూపినట్లు మహా ఉద్గ్రందాలను శతకాలుగా మలచిన ఈ కవిని శతవిధాల కీర్తించాలి.

## 56 కంచివరద రాజ శతకం -- శ్రీ అల్లూరి రాజేశ్వర కవి

అల్లూరి రాజేశ్వర కవి ప్రణీతమైన కంచి వరద రాజ శతకం స్టేషన్ కొండపల్లి వాస్తవ్యులు కపిలవాయి పున్నయ్య గుప్తాగారి ద్రవ్య సహాయం చేత బెజవాడ చిత్తరంజన్ ప్రెస్ లో 1933లో ముద్రింపబడింది. వెల.రెండు అణాలు. పీఠికలో కవిగారు ఇదివరకు తాను రచించిన "గీతా గేయం 'ను త్రిపురనేని వీరరాఘవయ్య చౌదరిగారి ద్రవ్యసహాయం చేత ప్రచురించానని. ఇంకా చాలాపుస్తకాలు తాను రాసినవి ముద్రణ భాగ్యం పొందాల్సి ఉన్నాయని పరిటాల నుంచి తెలిపారు.


శ్రీ కంచివరదరాజ
శతకము
అల్లూరి రాజేశ్వర కవి ప్రణీతము
కొండపల్లి (స్టేషన్) వాస్తవ్యులగు
కపిలవాయి పున్నయ్య గుప్తగారి
ద్రవ్య సహాయమున
బెజవాడ, చిత్తరంజన్ ప్రెస్ లో
ముద్రితము.
1000 ప్రతులు.
కాపీరైటు రిజిష్టర్డు] 1933. [వెల రు. 0—2—0.

ఈ శతకమకుటం –"భాను కోటితేజ వరద రాజ "

"శ్రీశు గొలిచి కావ్య సిద్ధికి పలుకుల –వెలదిదలచి పొగడి విఘ్నరాజు

నమల చరిత శతక మారంభ మొనరింతు-భానుకోటి తేజ వరద రాజ "అంటూ మొదటిపద్యంలో ముగ్గురు దేవతల్ని సూటిగా సుత్తి లేకుండా స్తుతించి కవి శతకం ప్రారంభించాడు. లేతది అని దేన్నీ లెక్క చేయకపోతే లేతముదిరి ప్రాణఘాతమౌతుందని. నిమిషమైనా మనసు కుదురు లేకపోతె బ్రహ్మవిద్య సాధ్యంకాదనీ..

సుకృతం చేయకుండా మడి మైల అంటూ ప్రాకులాడితే ముక్తిరాదన్నాడు . గుడిసె. భవనం ఉంటాయికాని ''పాప పుణ్యములకు బట్టన మున్నె ?''మనసులోనే సకలం ఉంది అన్నాడు. కొత్తదేదీ లేదు అన్నీ జీవుడు అనుభవించి వదిలేసిందే. ''జన్మమేసకలార్తులకు కొంప-కష్టమైనా సుఖమైనా –''పారుడైన నేమి శ్వపచు డుగానేమి "?అని తత్వరహస్యం చెప్పాడు. వేదాలు వల్లించినా జ్ఞానికాకపోతే ముక్తిరాదుకనుక వేదపఠనం మాలమాదుగులకు



పీఠిక.

ఆర్యులారా!

ఇదివరలో నాచే రచింపఁబడిన పొత్తములలో గీతా [illegible] వీరరాఘవయ్య చౌదరిగారి సాహాయ్యమునను, వేదాద్రి నృసింహ శతకము నాస్వంత వ్యయము వల్లను ముద్రింపబడి యుండినవి. ఇంకా చాలా పుస్తకములు ప్రస్తుత స్థితిలో నాచే రచింపబడినను ముద్రణ కావలసియున్నవి. అట్టి స్థితిలో [illegible] పున్నయ్య గుప్తగారు తాము ధనవ్యయమును భరించి శ్రీవరదరాజస్వామి మీద [illegible] భక్తిచే నెంతయు సంతసించి వారిని ఆచంద్రార్కము వర్ధిల్ల జేయు గాక యని భగవంతుని ప్రార్థించుచున్నాడను.

పరిటాల,
8—5—1938.

ఇట్లు,
అల్లూరి రాజేశ్వర కవి.

ఎందుకు ?అని ప్రశ్నించాడు. ధర్మం వల్లనే ఉన్నతస్థితి కలుగుతుంది. పారులు స్వకులధర్మంవిసర్జిస్తుంటే బ్రాహ్మణవిధులపై మిగిలినవారికి ఆశ ఎందుకు ?''బొమ్మ యగునే మూల పురుషుడు –బొమ్మగూర్చి వెలికి బొమ్మటంచు''మాలను బాపడు తరమటం దేనికి అని భక్తనందనార్ లాంటి చరిత్ర గుర్తు చేశాడు –''సాగకపోతే సాధుపై నంతమాత్రాన కుటిలబుద్ధిపోతుందా "అన్నాడు . నాబట్టే లోకం అనుకోరాదు. తానూ పరుల క్షేమం కోరేవాడే అయినా "తనను జంపు దొంగ ధనము కోరి "అనిలోక రీతి చెప్పాడు. .దరిద్ర దేవత తలపై నర్తిస్తుంటే. చెడుమనసుతో ఇంకోర్ని దోచుకుంటే "వ్రాత పోసే ?గోచిపాతయే గతిగాక" ?అని జీవితరహస్యం చెప్పాడు.

28వ పద్యం లో "వెంకటాద్రి మీకు కైంకర్యమును జేసి –నట్టి భక్తుడతని యన్వయుండ''నేనుకొత్తకాదు దాసకోటిలోని వాడినే అని చిరునామా చెప్పుకొన్నాడు వరదయ్యకు. ''తండ్రివైతి వీవు తల్లి పేరుందేవి –తల్లిదండ్రి బాల్యదశ గతింప-నున్న దంతియే స్థితి విన్నవించిన దంతె''అని తేల్చేశాడు. వెంకటాద్రి పాద పంకేరుహమే నౌకగా పాపసాగరం దాటి-అద్వయ కనుగొందు నీ ద్వీపమున నిన్ను "అని తన అన్వేషణ చెప్పాడు. ''నాకు దొడ్డ కలిమికావాలి. మనుష్యుడు ఇవ్వగలడా ""అని ప్రశ్నిస్తాడు. ''విలవిల యన బట్టి పీకుకదిను –ప్రాణి బ్రాణి –సృజన పరచితేల –జీవ హింసయే విశేషమా ?''అని హింసా విధానం పై బాధపడ్డాడు.

"భాగవతుల చెలిమి లేకుండా ఈశ్వర జ్ఞానం కలుగదన్నాడు కవి. మగాళ్ళను అన్నదమ్ముల్లా. ఆడువారిని అక్క చెల్లెళ్ళు చూసే మంచి బుద్ధి ఇవ్వు. అదే పది వేలన్నాడు. స్థిరం కాని సృష్టి వైచిత్రికి భ్రమపడి చింతల్లోముంచి వినోదం చూస్తావు. ''ఎక్కడి నుంచి ఇక్కడికి వస్తాడో. ఇక్కడ పుట్టి ఎక్కడికి వెడతాడో జీవుడు

?అన్ని ప్రాణులకు అసలు ఆట పట్టేది ?""కరువు చేత డబ్బు కటువైన. బోగము –ముండలకడ.కల్లు కుండలకడ - నాటపట్టు దప్పదు అక్షయ లక్ష్మికి "అని నిష్టూరం వేశాడు. మందులు అనేకం అయ్యాయి కాని రోగం కుదిర్చే వాడు దొరకటం లేదు. కనుక "నీవుపూనుకొనుము నెమ్మదించును రుజ "అని భక్తవరదుని పైనే భిషగ్వర భారం వేశాడు వ్యంగ్యంగా కవి. నీకరుణ ఉంటె చాలు "దేవతల ఐరావతంకూడా ఎక్కను.నా వైద్యులు ఆశ్వినీదేవతలే ".అనంత బాహుడివి "నాతలపై పెట్టటానికి నాలుగు చేతులైనా లేవా సామీ ?పోనీ కనీసం ఒక్కచెయ్యి కూడా లేదా భగవాన్ అని చమత్కరించాడు.

"నన్ను గావురమ్మునా వినకుందువు - కరిని గావ నైతె పరగినావు?దాని సేవ నీ కృతార్థత కాబోలు "అని మేలమాడాడు. జ్ఞానికి చావుపుట్టుకలు నిద్రపోయి లేచినట్లే ఉంటాయి. మరణభీతి లేశ మాత్రం ఉండదు.

చివర్లో ఆంగీరసనామ సంవత్సరం విజయదశమినాడు వరద రాజస్వామికి అంకిత మిచ్చానని "అందుకొని నిలువుమా కల్పముందాక "అని సభక్తికంగా అంజలి ఘటించాడు.

106వ చివరిపద్యం లో –"అప్పగింప శతకమల్లి –యల్లూరిరా-జేశ్వరకవి. దీని శాశ్వతముగ-నిలుపు మంకితంబు నీకిడు గడు బ్రీతి –భాను సమాన తేజ వరద రాజ "అని శతకం ముగించాడు భక్తకవి. శతకం లో తనగురించి ఏమీ చెప్పుకోలేదు. ఆ ఒక్కటితప్ప మిగిలినవి ఏమేమి రాశాడో కూడాలేదు. వరదరాజస్వామి గురించీ లేదు. ఆస్వామికే ఎందుకు అంకిత మిచ్చాడో కూడా లేదు. ఈ శతకం గురించి ఈకవి గురించి మనవారెవరూ ఎక్కడా పేర్కొన్నట్లు లేదు. కవిని శతకాన్ని పరిచయం చేసే మహద్భాగ్యం నాకు దక్కింది. లలితపదజాలం సూటి కవిత్వం ఆత్మవిశ్వాసం. వరద రాజ పద భక్తీ ప్రతిపద్యంలో కనిపిస్తుంది.

## 57 సర్వేశ్వర శతకం -- శ్రీ చెముడుపాటి వెంకట కామేశ్వర కవి

శ్రీ చెముడుపాటి వెంకట కామేశ్వర కవి "సర్వేశ్వరశతకం "రచించి 1931లో పిఠాపురం లోని శ్రీ విద్వజ్జన మనోరంజని ముద్రాక్షర శాలలో ముద్రించారు. వెల-నాలుగణాలు.శ్రీ మండపాక పార్వతీశ్వరకవి గారు ముందు మాటరాస్తూ "ఈకవినా బాల్యమిత్రుడు ఉత్తరాదశలోనే కవితా శక్తి కలిగింది.ఒకసద్గురువు తత్వ రహస్యాలు బోధించారు. శ్రవణ మనన నిధి ధ్యాస లతో ఆరహస్యాలను సాధన చేసుకొన్నాడు. ఆ మహిమతో యీశతకం

రాసి. స్వానుభావాన్ని లోకానికి చాటాడు. బాల్యం నుంచి హూణ విద్య మాత్రమె నేర్చి. రాజకీయోద్యోగంలోనే జీవితం గడుపుచూ. సద్గురు కటాక్షం. సాధనా బలం వలన సత్కవిగా పరిణమించటం దైవ బలాన్ని సూచిస్తోంది "అని వెన్ను తట్టారు. శార్దూల. మత్తేభాలతో కూర్చిన ఈ శతక మకుటం –"సర్వేశ్వరా ".


సర్వేశ్వరశతకము

చెముడుపాటి వేంకట కామేశ్వరకవి

ప్రణీతము

మొదటికూర్పు 1000 ప్రతులు

పిఠాపురము

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల

1931.

వెల రు 0-4-0 అ.

మొదటి మత్తేభం-"చదువా లేదు. పురాణమన్న నెరుగన్. శాస్త్రం బదెట్లుండునో-పదమా తోచదు శయ్య వృత్తియెరుగన్పద్యంబు లల్లంగా గో

విదుడన్ గానిక. దప్పులన్ విడిచి తృప్తిన్ నాదుపద్యాళిలో –దుదిపాదంబున నొప్పు నామ సుధనెంతో గ్రోలి నాదండముల్ –పది పేల్ గైకొని భక్తులార తరియింపన్ మిము వేడెదన్ "అని ఆపద మొక్కులు మొక్కి దండం అంటే నమస్కారం దశ గుణం భజేత్ అన్నట్లు తనలో ఏమీ లేకున్నా ఓపికగా చదివి తరియించమని గడుసుగా చెప్పి. బోనస్ గా అయిదవ పంక్తి కూడా చేర్చాడు. తర్వాత శ్రీరామస్తుతి చేసి శివ శివాలకు మొక్కి –"ఆధారంబు పయిన్ షడక్షరయుత. ప్రాంచద్దళో పేతమై -బోధ బ్రాహ్మి సకామ బీజములచే బొల్పొంది తానిత్యమున్

సాధిష్టాన విదాతయై రుధిర రమ్యంబౌ నుపస్థాశ్రిత –స్వాధిష్టాన నివాస మొందుజననిన్ బ్రార్థింతు సర్వేశ్వరా "అని గహన వేదాంతాన్ని అమ్మవారి నివాసాన్నీతన వేదాంత పరిజ్ఞానం జోడించి రాశాడు. "శ్రీ కాంతా వల్లభ పాదుకాంచిత శిరున్ గాంభీర్యయుక్తున్ గపిన్. ఉపనిషత్సంపూర్ణ పాండినత్యు దీమంతున్మారుతి మత్కృతిన్ సతతంబు మన్నింపగా "స్వాంతంలో భజిస్తానన్నారు. .కపి అంటూనే ఆయనలో సర్వదిషణకు నీరాజనం పట్టారుకవి తర్వాత కవులందరికీ దండాలుపెట్టారు.

అందరు కవుల్లాగానే తన పాపాల చిట్టా విప్పారు. అందరూపొందే లోభమోహ మదమాత్సర్యాలు తననూ పీడించాయన్నారు. సద్గురరు దర్శనం తో తనజీవితం గాడినపడి శస్త్రాలు తత్వాలు చదివి జ్ఞానం పొందానన్నారు. తల్లీ తండ్రీ కొడుకు బంధువులు అన్నీ నేవే అనే ఎరుక నిలిచి ఉంచమని సర్వేశ్వరుని వేడారు.

"నామనము నందు దుఃఖము లంటనీక సన్మార్గంబు నందుంచు "అని వేడికోలు చేశారు. "కామాంధులు కాంతావాస మతిన్ "త్రికూట" ముపయిన్ గన్గొందు సదా "అని ఈసడించారు.

బిందు నాదాల సౌభాగ్యోన్నత ప్రభావమైన కళ.దీన్ని చూస్తూ ప్రజ్ఞానియై నిర్వృతి తో ఉంటేనే సన్యాసం లభించి ముక్తిమార్గం కనిపిస్తుంది. తర్వాత ఉదయ ప్రార్ధనం,జ్ఞాన ప్రభాతం. రాత్రిధ్యానం. మానసిక ధ్యానం. ఉదయ సాయం సమయాలలో చేసే మానసికపూజ షోడశోప చారాలతో పద్యాలలో చెప్పారు. చివరగా –"వరదా! నే శత వందనంబులిడి నా వైరాగ్య పాత్రంబునన్ –భరమౌ కర్మ చయంబనా బరగు కష్టంబున్ వెలిగింతు భా-స్వర నీవారజ శూక సూక్ష్మమగు ప్రజ్ఞాన దీప్తిన్ విభూ –స్థిరమై మంగళ హారతింగొనుచు దృష్టిం బొందు సర్వేశ్వరా "అని మంగళం పాడారు.



అవతారిక

ఈగ్రంథమును రచించిన బ్రహ్మశ్రీ చెముడుపాటి కామేశ్వరకవిగారు నాకు బాల్యమిత్రులు. వీరికి కవితాశక్తి పూర్వవయస్సున లేకుండెను. ఉత్తరవయస్సుననే కలిగినది. ఒకానొక సద్గురువు వీరికి తత్త్వరహస్యముల నుపదేశించెను. శ్రవణమనన నిదిధ్యాసములచే నారహస్యముల నీతఁడు సాధించుకొనుచుండఁగా దైవికముగా కవితాశక్తి యంకురించినది. దానిమహిమచే నీకవి యీశతకము రచించి, స్వానుభవమును లోకమున వెదచల్లెను. భక్తు లిందలివిజ్ఞానమును స్వానుభవమునఁ బరీక్షించి, సంతసింతురుగాక.

బాల్యమునుండియును వాణిజ్యవిద్యమాత్రమే యభ్యసించి, రాజకీయోద్యోగమునందే తనజీవితమును గడపుచున్న శ్రీకామేశ్వరకవిగారు సద్గురుకటాక్షమునను, సదుపాసనాబలమునను, సత్కవిగాఁ బరిణమించుట దైవబలమును సూచించుచున్నది.

మండపాక పార్వతీశ్వరశాస్త్రి.

విద్వన్నుత మండపాక కలశామ్భో రాశి చంద్రుడు. సత్కవి వర్యుడైన పార్వతీశ్వరుడు విద్వాంసుడు నా మిత్రుడు. నా కవిత్వంలో తప్పులు సవరించి. నన్ను వివేకిగా లోకం ముందు నిలబెట్టాడు ఆమహనీయుని ఔదార్యం తో "బ్రోవగా భవదీయాన్ఘ్రి సరోజముల్ గొలుతు నీ భక్తుండ సర్వేశ్వరా"అన్నారు.. వెంకటార్య అనే ఆయన కొడవంటి అప్పలశర్మ గారి ద్వితీయ పుత్రులు. రాజమండ్రి వీరభద్రపుర వాస్తవ్యులు. ప్రస్తుతం అంటే ఈ శతకం రాసే సమయం లో మహానంది పర్వతం పై తపస్సు చేస్తున్నారని మనకు తెలియని మరో విషయాన్ని తెలియజేశారు కవి.

తనకేమీ తెలీదు అంటూనే తత్వాన్ని కవిత్వంలో అందంగా బహుకమ్మగా బంధించి మనకు అందించారు. కవి. వారినీ వారి శతకాన్ని పరిచయం చేసే భాగ్యం ఆ "సర్వేశ్వరుడు" నాకు ప్రసాదించాడు.

58 శ్రీమత్పూనూరు వేణుగోపాల కృష్ణ శతకం -- శ్రీ దూపాటి నారాయణాచార్య

పూనూరు బోర్డ్ స్కూల్ ప్రధానోపాధ్యాయులు శ్రీమత్ దూపాటి నారాయణాచార్య ప్రణీత శ్రీమత్పూనూరు వేణుగోపాల కృష్ణ శతకం బాపట్ల విజయ ముద్రాక్షరశాలలో 1926లో ప్రచురితమైంది. వెల – ఇవ్వ బడ లెదు. దీనికి చేబ్రోలు వాస్తవ్యులు శ్రీ ఇలపావులూరి శ్రీరాములు తొలిపలుకులు పలుకుతూ "సీస పద్యాలలో ఈశతకం రాసిన కవి ఆచార్య నాకు నూతన పరిచితులే. నన్ను పీఠిక రాయమనటం సమంజసంగా లేదు. ఏలయన నేను అల్పజ్ఞుడిని. కుక్షింభరుడిని. వారు పండితులు. శబ్దవిదులు. .అట్టి వారి కవిత్వాన్ని నేను విమర్శించటం హాస్యాస్పదం. కానీ పద్యాలు మిగుల రసవత్తరంగా. భావగర్భితాలుగా. స్వాభావోక్తులుగా. శైలి మృదు మధురంగా. పండిత పామర రంజకంగా ఉందని చెబుతూ ఆ శ్రీ కృష్ణ పరమాత్మ ఈ కవివరునికి ఇంకా అనేక ఉద్గ్రంథ రచనకు తోడ్పడాలని,ఆశీర్వ దించాలనీ అనికోరుతున్నాను "అన్నారు.




తర్వాత కవిగారుచేసిన "విజ్ఞప్తి "లో "శతకరచన మిక్కిలి కష్టమని పెద్దలంటారు నేను అల్పమతిని సంస్కృతాంధ్రాలలో భాషాపరిచయం స్వల్పం. కవిత్వ రసానుభావమూ శూన్యమే. తొలి శతకరచన కనుక ఇందులో గుణాలు తక్కువ దోషాలు ఎక్కువగా ఉంటాయి "ఏకస్వాదు నమంభూ జీయాత్ "అన్న పెద్దలమాటలను బట్టి శ్రీ కృష్ణ పరమాత్మ నా హృదయం లో చేరి నాతొ రాయించి నా ఆనందాన్ని లోకానికీ పంచమన్నట్లు గా అడియాస. రెండేళ్లక్రితమే రచన పూర్తి అయినా. ఇరవై నెలలక్రితం అప్పటి బోర్డ్ స్కూల్ ప్రధానోపాధ్యాయులు శ్రీ ఆ. సుబ్బారావు గారిద్వారా శ్రీ ఇలపావులూరి శ్రీరాములుగారికి చేరింది(వీరు శ్రీ ఇలపావులూరి పాండురంగారావు గారి తండ్రి గారేమో ). ముద్రించేశక్తి నాకు లేకపోవటంతో "యోగక్షేమం వహామ్యహం "అని చెప్పిన వాడి మీదనేపెట్టి ఊరుకున్నాను.

ఇంతలో వేదాంత గ్రంథ విచార ప్రచారకులైన శ్రీ శ్రీరాములుగారి అమోఘ ఆశీర్ బలముతో. సహృదయులు శ్రీ సుబ్బారాగారి భక్తిభావ గరిమతో. ప్రియశిష్యులు శ్రీ పూనూరు భక్త సమాజం వారి ఆదరాతిశయాలతో. వేణుగోపాలుని నైసర్గిక వత్సలత్వ విలసనంతో. శతకము ముద్రణ పొందింది. స్థల పురాణం కూడా రాయమని

మిత్రులు కోరినా అందులో నిజానిజాలేమిటో తెలుసుకోవటం కష్టం కనుక దాని జోలికి పోలేదు. "ప్రార్ధయే స్సర్వ విదు షో,క్షంతు మంతు శతానిచ –యద్యాత్ర కుత్రచిద్దోషో,నిర్మలం కురుతాదరాత్ "అని బుధజన విధేయుడైన కవి కోరారు. "వరద పూనూరు వేణుగోపాల కృష్ణ "అనేది ఈ సీసపద్య శతకానికి మకుటం.

మొదటి పద్యం –"శ్రీ యాదవాన్వాయ క్షీర నీరధిపూర్ణ –చంద్ర చంచాత్కృపా సాంద్ర హృదయ -శౌర్య ధైర్య స్థైర్య చాతుర్యసద్గుణ –ధామ. నిర్జిత దుష్ట దైత్య సీమ

శిశుపాల చాణూర జీవ సమీర భు –జంగాయమాన,విహంగ యాన –కంసాది రాక్షస గర్వపర్వత పాక-శాసన ధర్మ సంస్థాపనాద్య

తే.గీ.-నీరజేక్షణ భక్త చకోర చంద్ర –గాత్రజితమేఘ బుధజనస్తోత్ర పాత్ర – భుక్తిముక్తిఫలప్రద –వరద పూనూరు వేణుగోపాల కృష్ణ "




అని ప్రారంభించారుకవి.నాల్గవ పద్యం లో పూర్వ సంస్కృత, తెలుగుకవులను స్తుతించి. తర్వాత తనగురువు మంగళగిరి దూపాటి వంశానికి చెందిన విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవరులు. మంత్రోపదేశి. వేంకటగురు వర్యుని స్తోత్రం చేసి. తర్వాత పోతన్నలాగా "అవిరలానంద సౌఖ్యములగూర్చు నీదు నామంబు స్మరియించు నాలుకనాలుక "అంటూ కరచరణాదులు మనసు ఆయనకు అర్పిస్తేనే అవిధన్యం అన్నాడు. శంతన సుతుడిలాగా మంతనం చేసే మనసులో బంధించలేను. విదురునిలాగా నీతి వాక్యాలు చెప్పలేను. పార్ధుడిలాగా చెట్టపట్టాలేసుకొని బందుత్వంతో తిరగలేను. గోపాలురులాగా నిన్ను పొందే భాగ్యం పొందలేదు. చంద్రునికి నూలుపోగుగా నా శక్తికొద్దీ నీ పరిచర్య చేస్తా. ప్రాపుగా ఉంటూ రక్షించు అన్నారు. భువనాలను బ్రోవజాలిన నీబలానికి. బ్రహ్మాండాల్ని రమణీయంగా చేసే నీ కౌశలానికి. బ్రహ్మమొదలు స్తంభ పర్యంతం జీవులలో సంచరించే నీఘనత. కోటి సూర్య ప్రకాశం మించే నీ తేజస్సు లకు ఎల్లలు లేవు అన్నారు

అంతర బాహ్య ఇంద్రియాలను అణచి నిశ్చలభక్తితో నీపూజ చేయని జీవితం వ్యర్ధం. పుణ్యనదులకు పాపాలను పోగొట్టే శక్తి. చంద్ర సూర్యాగ్నులకు దివ్యదీప్తి. సౌందర్య సౌరభ్య సౌకుమార్యాలను ప్రసవజాతికి. చెరుకులో తియ్యదనం. కవులవాక్కులకు అమృతం కూర్చిన "నీ వినోదంబులు అమితాద్భుతములు "అన్నారు. తర్వాత ముచుకుందు డు మొదలైన భక్తులకు మోక్షమిచ్చిన గాథలు ప్రస్తుతించారు. "దురితాటవులకు విస్ఫురదగ్నిహోత్రం,ఆపదద్రులకు వజ్రాయుధం. వివిధ మనో రోగ బిస తంతువులకు గంధ బంధుర మత్తగజం. అజ్ఞానరూప గాఢాంధకారానికి గొప్ప ప్రభాకర మండలోదయం. తీరని దారిద్ర్య వారివాహకులకు భూరిజవోపేత మారుతం. సకలపురుషార్ధ ఫలజయ సాధనం. భావ మహార్ణవ తరణం కృష్ణనామం పావనం అని మహా గొప్పగా పద్యం రాశారు

నారదుడు నీ భక్తిబీజాన్ని భువిలో నాటితే. ధ్రువుడు నిశ్చలభక్తితో పాదు చేస్తే. ప్రహ్లాదుడు నీరుపోస్తే. రుక్మాంగదుడు అంకురిం పిస్తే. భీష్ముడుచివురింప జేస్తే. ద్రౌపది పర్ణాళిప్రబలజేస్తే "విరుల నలరార జేససెనుకరి. శుకుండు –పక్వ ఫలములగాయించచె భక్తులీ-ఫలముల గడుమెక్కి "నీ పదాంబుజాలను చేరుకొంటున్నారని మరో అద్భుతపద్యం సెలవిచ్చారు ఆచార్యవర్యకవి. నీపాదాలు నిర్మలగంగాభవానీ సముద్భవ స్థానాలు. నీ అఘ్రులు నిగమాంత పుష్ప సంచార పారీణ పుష్పంధయాలు. నీపద్మాలు నిత్యపద్మాలయా ప్రియంభావుకాలు. నీ అడుగులు నిర్వాణసౌధాగ్ర సీమలకు అలంకారాలు. నీచరణపద్మాలు "నీరజాసనాది సుర సంచయమునకవ్యాజసౌఖ్య –సంపదల నెల్ల సమకూర్చు "అని మరో చిరస్మరణీయ పద్యం శాయించారు ఆచార్యశ్రీ. తనకేమీ రాదంటూనే వేదాన్తరహస్యాలన్నీ కరతలామలకం చేశారు భక్తిలో మునిగి,ముంచి తేల్చారు

"మాధరా ఉధృత భూధరా పింఛదా-మాధరా విష్టప నాద రార"అనిమరోరసగుళిక వదిలారు. "కుమ్మరపుర్వులాగున సంసరణమందు- దిరుగుచు నిన్ను నేమరసివాడు –భక్తి నిష్టాగరిష్ఠుడై వరలువాడు – సర్వమర్పించి నీసేవ సలుపువాడు-నీకు ప్రియతమ భక్తీ నిర్మలాత్మ "అని భక్తితత్పరుని దివ్యలక్షణాలు ఆవిష్కరించారు. "అవురయేమందు నీయంద మందు –విందు విందది వలపుల మందు "అని మహామహాకవులకేమీ తీసిపోనట్లు పద్యాలు అమృతరసప్రవాహంగా చిమ్మేశారు. "చిత్తమా భక్తితో శ్రీ వేణుగోపాలు –భక్తితో భజియించి ముక్తి బడయుమంటి "వక్త్రమా వ్రజసున్దరీ నాధుని కీర్తనలుపాడి సుఖంపొందు. ఘ్రాణమా కృష్ణ అంఘ్రి రాజీవ పరిమళతులసి గంధాలలో మెలుగు. పాణి యుగ్మమా కృష్ణ పాదారవిందంబు బు లర్చించి సంతోషించు అక్షియుగ్మమా శ్రీకృష్ణుని చూడు శ్రోత్రయుగామా హరికథల్ విను. మూర్ధమా ప్రీతితో

కన్నయ్యకు మొక్కుఅని శరీరభాగాలన్నిటినిస్వామి సేవలో తరించమని హితవుచెప్పారు ఇలాంటిపద్యం అరుదు అనిపించింది.

106వ పద్యంలో ప్రజలు సౌహార్ధభావంతో మెలిగేట్లు చేయమని. ధర్మమే జయం అన్నదాన్ని సార్ధకం చేయమని. భూమి ముక్కారుపంటలతో విలసిల్లెట్లుగా సామాజికధర్మంగా కోరి "ఆరనిభక్తితో ఆ గోపాలబాలుని అందరూ అర్చించే భక్తిభావన కల్పించమని. ప్రతికుటుంబం.పాడి పంటలతో తామరతంపరగా వెలయు నట్లు చేయమని. అందరికి తోడూ నీడగా ఉంటూ కాచి రక్షించమని వేణుగోపాలకృష్ణుని ప్రార్ధించారుకవి విశ్వ శ్రేయస్సును ఆకాంక్షిస్తూ. ఇలా రాసినవారరెవరైనా ఇంతకుముందున్నారా అని నాకు అనుమానం. తర్వాత సీసం లో మంగళం పాడారు . చివరి 108పద్యంలో –తండ్రి వెంకటాచార్యులు తల్లి పేరిందేవి. శ్రీనివాసాచార్య సోదరుడు. వంశం దూపాటివంశం.తనను నారాయణా అనిపిలుస్తారు. తన ఊరు చిన్ని యనమదల. ."కేవలజ్ఞుడ యుష్మత్గ్రుపా వశమున –త్వద్గుణార్ణవమున గొన్ని పద్య రత్న-ములను దేవితి గొని. నన్ను బ్రోవుమయ్య –వరద పూనూరు వేణుగోపాల కృష్ణ "అంటూ" ఆడియేన్ దాసోహం"గా కవి తన భక్తిని మనస్పూర్తిగా చాటుకున్నారు. రసప్రవాహ పద్యాలివి. జ్ఞానవైరాగ్య తత్వ ప్రధానాలు. ప్రదానాలుకూడా. దూపాటి వారి వంశం అంటే నే గోప్పకవిపండితులకు నిలయం. మనకవి అందులో ఎవరికీతక్కువకాదు అన్నిరకాల భావాలతో పద్యాలుపరిగెత్తాయి. అద్భుతం అనిపించింది. ఈ శతకాన్నీ. ఈ కవిగారిని పరిచయం చేసి నేను ధన్యుడిని అయ్యాను.

59 సుబుద్ధి శతకం -- శ్రీ ఖాసీం ఆలీషా

గుంటూరు తాలూకా గారపాడు వాసి ఖాసీం ఆలీషా కవి సుబుద్ధి శతకాన్ని రచించి గుంటూరు కన్యకా ముద్రాక్షరశాలలో 1924న ప్రచురించారు. ఈకవి మణిమంజరి నాటకం. కొండవీటి చరిత్ర మొదలైన రచనలు చేశారు.వేద విద్యాపరుడు. ప్రదిత సత్కీర్తి. సూనృత వ్రత గరిష్టుడు,అమలగుణ శాలి అయిన తన తండ్రి మౌలాలీ గారికి అంకితమిచ్చారు. ఈ కంద పద్య శతక మకుటం "సుబుద్ధీ ".



శ్రీగస్తు.

సుబుద్ధిశతకము.

ఇది

[illegible] నాటకము, కొండవీటి చరిత్ర

మొదలగు గ్రంథముల కర్తయగు,

ఖాసీం ఆలీషా చే

రచియింపఁబడి

గుంటూరు కన్యకా ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

కాపీరైట్] 1924 [వెల 4 అణాలు.

మొదటిపద్యంలో లక్ష్మీదేవిని –శ్రీ మహిలా మణిత్రిజ –ద్దామోదర ప్రథిత మణియునై-దైవ గణ పురం –ద్రీమణిదుగ్ధాబ్దికుమా –రీమణిరామనిన్ను గనికరించును సుబుద్ధీ"అని ధైర్యం చెప్పారు. భువి దివి సర్వగ్రహాలను. సూర్య మాతరిశ్వాదులను సృజించిన ఆ భూధవుని పరాత్పరుని. పరుని తలచారు. అక్షరుని సర్వ లోకాధ్యక్షుని దక్షుని స్తుతించమని చెప్పారు. తర్వాత గణనాధుని. సద్రస పేశల మాధురీ నిరంకుశ భాషా రసికత్వం లో కుశలత ఇవ్వటానికి భారతిని కొల్చారు అంటే కొలవమని చెప్పారని భావం.

"కందంబులు సుకవీశుల-కందంబు లమంద సుందరాబ్జాస్యలకున్ –గుందంబులు బుధ –కర్ణానందంబులు "కనుక కందంలో కదను తొక్కానని

అందంగా చిందులేస్తూ  చెప్పారు. తెలుగు కవిత్వం అల్లన కుమ్మరిమొల్లకు జోహార్లు చెప్పారు. పూర్వకవులకు కైమోడ్పులు పలికారు.



అంకితము

సీ॥ భక్తాగ్రగణ్యులు ప్రహ్లాదసన్నిభుం
డంచు నెవ్వాని నుతించుచుంద్రు
మహీ భిషఙ్మణిశిఖామణు లశ్వినీదేవుఁ
డంచు నెవ్వానిఁ గీర్తించుచుంద్రు
సకలభాషారసజ్ఞత రసజ్ఞులు బృహ
స్పతియంచు నెవ్వాని సన్నుతింత్రు
అఖిల తద్ధర్మవిద్యాసమంధిత ధ
ర్మజుడంచు నెవ్వాని మహిఁ భజింతు

తే॥ రట్టి చతురుండు, వేదవిద్యాపరుండు,
ప్రథితసత్కీర్తి, సూనృత వ్రతగరిష్ఠుఁ
డమలగుణశాలి, మాలాలియనెడు నాదు
తండ్రి కీకృతి నే సంకితం బొనర్తు॥

గారపాడు, 5-4.24.

ఇట్లు అనుంగుపుత్రుఁడు,
ఖాసీం ఆలీషా.

తర్వాత నీతులు బోధించటం ప్రారంభించి అత్తనుకులదేవతగా. మామను ఉర్వీన్ద్రునిగా. భక్తితో సేవించే సతిని సత్తరుణి అంటారని. భర్తను సేవించె భార్య సౌభాగ్యవతి అనీ. జనకజ కుముదవతి అనసూయ అరుంధతులమార్గం లో స్త్రీలు నడిస్తే ఉత్తమగతులు కలుగుతాయని చెప్పారు. తగిన మగడు ఇంట్లో ఉంటె. వాడిని దిగ ద్రొక్కి విటాళికోసం తెగతిరిగే వగలాడిని. చెడు బోటిని తెగనరికినా తప్పులేదన్నారు. మొగుడితో గుద్దులాడేది ఆడదికాదు గాడిద అన్నారు. కడుపెకైలాసంగా జీవించటం నీచం. రచ్చలకుఎక్కకు రచ్చలకుకాలుదువ్వకు. మెచ్చులకోసం అదరకు. యాత్రలకోసం గాత్రాన్ని ఇబ్బంది పెట్టక కించిత్ స్తోత్రం చేస్తేముక్తివస్తుంది. నడవడి చెడితే నీచునిగా లోకంచూస్తుంది. భిక్షం (బికిరం )ఎత్తేవారిని. వికలాంగుల్ని పరిహాసం చేయకు అది భగవత్ ప్రయత్నం వాళ్ళ తప్పుకాదని గ్రహించు.

లక్షణం లేనికవిత్వం శిక్షణ లేని స్త్రీ శీలం భిక్షాటన జీవితం అక్షయమైన నింద.లయ లేని సంగీతం ప్రియం తెలియని తిండి. వ్యయం తెలీని డంబం నియమం లేని నెలత రాణించవు. నీతి స్థిరురులైన పెద్దలమాటలు వేదవాక్యాలే. ”చెడి బ్రతుకుట కంటే లేదు చెరుపు “.శిలకు. శైలానికి. దోమకు ఏనుగుకు. ఎంత తేడానో కులకాంతకు వెలకాంతకు అంత తేడాఉంది. దేనిసైనా తనవారికంటే ముందు తింటే –”ఎనుబోతని. మనుబోతని. తినుబోతని లోకం ఈసడిస్తుంది. పరువంలో బుద్ధి త్వరత్వరగా పరిగెత్తుతుంది. దానితో పరిగెత్తగలమా ?”కరువలి (గాలి )కైనా. మురహరి గరుడునికైనా “ఇది తప్పదు.చీటికీ మాటికీ అత్తింట్లో అలిగి “బుట్టింటి కేగకెప్పుడు –మెట్టిన నట్టింట ఉండటం మేలు. ”చచ్చినమీదట పుచ్చిన వక్కైన నీతో రాదు. కోపం

ఘోర విపద్ధూపం దుర్భర దురంత దుష్కృత కూపం. శాంతం "విలసత్కార్యాశాంతం –చిరసౌఖ్యసద్యశః ప్రాంతం వేదాన్తోదంతం శాంతమే భోషాణం సారీ భూషణం. కవిగాయకులకు సతికి భోగినికి కళలే. "తొడవులు ".తన శుభ్రత గృహశుభ్రత ఘనం.

"బాలికలకు బాలురకును-దేలికగా దెలియ దేట తెనుగుపడంబుల్ –గ్రాలెడు పద్యంబులనే -జాలగ వ్రాసితిని దీని జదువుసుబుద్దీ "అని 102వ పద్యం రాసి చివరి 103వ కందంలో –"మతిమంతుల హృద్గతమై –క్షితి సాధ్వీతిలకములకు శ్రీకరమైశా –శ్వతమై మత్కృతమగు నీ –శతకము వర్ధి లును గాక సతతము సుబుద్ధీ "అని ఆశావహంగా ముగించారు ఆలీషా కవి. ధారాశుద్ధికల కవిత్వం అందరికి కావాల్సిన నీతులు పుష్కలంగా ఉన్నాయి. చిన్నాపెద్దాముసలీ ముతకా అందరూచదివి తీరాల్సిన శతకం. బుద్ధికి పదును పెట్టి సుబుద్ధిని చేసే శతకం. ఎక్కడాతడబాటులేదు. ధార కుంటూ పడటం లేదు. పరుగోపరుగు అన్నట్లు కందాలను హృదయంగమంగా రాసిన కవి ఖాసీం ఆలీషా మరో వేమన అనిస్తారు మరో సుమతీశతకం కుమారీశతకం మనముందున్నట్లు భావన కలుగుతుంది.

ఈకవినీ. ఈశతకాన్నీ పరిచయం చేసి నేను ధన్యుడను అయ్యాను.

60 శ్రీ శూన్య లింగ శతకం -- శ్రీ వోలేటి సుబ్బారావు

కాకినాడ ఎల్ ఎఫ్. సబ్ డివిజన్ ఆఫీస్ హెడ్ క్లార్క్ శ్రీ వోలేటి సుబ్బారావు గారు శ్రీ సీతారామాంజనేయ సంవాద సార సంగ్రహ రూప “శ్రీ శూన్య లింగ శతకం “ను రచించి. అమలాపురం శ్రీ మారుతి ముద్రానిలయం లో ముద్రించారు. వెల-ఒక అణామాత్రమె. సంవత్సరం తెలుపలేదు. ప్రార్ధన సీస పద్యం లో –”ననుసేల భయమేల నయశీల రావేల –చీటికిమాటికి మూల గ్రాలనేల “అంటూ నెపం తో మొదలెట్టి. గీతపద్యం లో –”పలుకవేల శ్రీలోల నన్ దలపవేల –సహజ యోగానంద జలధి లోల “అని, రెండవ సీసం లో –”శ్రీరామ యని నిన్ను బ్రేమగా బిల్చెదనన్న –నామ రూపములు నాస్తి కన్న-వైకుంఠ నిను గాంచి వర్ధిల్లెద నటన్న –లోకాళితో బొత్తునీకు సున్న”అని వ్యాజంతో అంటూ కానుకలిచ్చి ఘనత చెందుదామంటే కామాది వాసనలు కల్ల – భక్తితో ప్రణమిల్లుదామంటే ఒక్క చోటా నీకు కాలునిలువదాయే,పాహిమాం అందామంటే తలపులు కలలోని మాటలే –”సీతమ్మతో జెప్పి చెంత చేరెదనన్న –తలపదు నా మాట కలియనిన్ను “అని గీతం లో –”నీవు నన్నెట్లు గాచేదో నిర్వికార –నయన పథచార రాగాది భయవిదూర –త్రిపుర సంహార యో వీర ధీర ధీర –భౌమ శబ్దార్ధ సువిచార స్వా విహార “అని తన వేదాంత పరిజ్ఞానమంతా వలకబోసి, చెప్ప బోయేదానికి నాంది ప్రస్తావనగా చేశారు. అసలు శతకమంతా గీత పద్యాలలో కూర్చి “సుభగ పుష్ప భ్రుంగ శూన్యలింగ “అని మకుట కిరీటం పెట్టారు.




శతకాన్ని తారక యోగంతో ప్రారంభించి “భక్తికలుగు పూజ పరమపదమునిచ్చు “అంటూ. కర్మ చేస్తే ముక్తి రాదు జ్ఞానమార్గంతో సద్గురునివలన చిత్తశుద్ధికలుగుతుంది. మూర్తి ఆరాధనతో శివుడిని కొలిస్తే “మూర్తి విడిచి మూల మూర్తి తానౌను “అన్న ఎరుక చెప్పారు. అణోరణీయాన్ మహతో మహీయాన్ “అనే భావన చక్కని పద్యంలో కూర్చి “శ్రుతులు కూడా నిన్ను నుతియింప జాలవు “అన్నారు. చిత్త శుద్ధి లేనిది ఏదీ సాధ్యం కాదు అని మరీ మరీ చెప్పారు. చిత్ర చిత్ర కళలు చిత్ర విభ్రమాలు –”పండు వెన్నెల తుది నిండి యున్న రూపులేనికళను రూపించి చూడు “అన్నారు. ధీయోగి నాద సూత్రం తెలుసుకొని నాదలయం లో మోదించి నిలుస్తాడు”.అవ్యక్త

స్థితినే  బిందు అంటారు. బుద్ధిని దాటితే అంతా పూర్ణమే.యోని లింగైక్యం శివుని చేరుస్తుంది. స్త్రీపురుషులు ఒక్కరవటమే "పరగ నద్వైతము ""మరుని క్రతువుకన్నా మారులేదు ".”సతిని గూడ ముక్తి –సతిని వీడితెబంధం "హఠంలో అష్ట సిద్ధులు కల్గుతాయి. యోగం అభ్యసించి భోగం వదిలితే మనసు చిక్క బట్టితే అంతా ఆనుకూల్యమే.

శ్రీసద్గురుచరణారవిందాభ్యాంనమః

శ్రీ శూన్యలింగశతకము.

గీ॥ శ్రీరమావరయోగి ♦ శేష సుధామృత
పానరక్తుఁడగుచు ♦ మేనుమఱచు
చిత్స్వరూపమూర్తి ♦ శ్రీపతిశ్రీలిచ్చు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ। 1

తారకయోగము.

గీ॥ పూజలెన్నియైనఁ ♦ బాఁ జేయవచ్చును
భక్తిలేకయున్నఁ ♦ బత్రిచేటు
భక్తిగలుగుపూజ ♦ పరమపదమునిచ్చు
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ। 2

గీ॥ కర్మఁజేయువాఁడు ♦ గానఁడు ముక్తిని
గలుగుచిత్తశుద్ధి ♦ కర్మమునను
జ్ఞానమార్గపరణి ♦ సద్గురుఁగానశే
సుభగపుష్పభృంగ ♦ శూన్యలింగ। 3

తర్వాత సాంఖ్యయోగం వివరించారు –”సృష్టిజాడ సృష్టికర్తకేతెలుసు –శ్రుతులు భిన్నరూపంగా చెప్పాయి. ”లేనిదాని నెట్లు లెక్కింప భయం "దేనికి ?జగత్తు స్థూలం. తత్త్వం సూక్ష్మం.ఉన్నదానినుంచేఉత్పత్తికాని, శూన్యంలో సృష్టి జరుగుతుందా ?తలిదండ్రిలేక సంతానం ఉంటుందా ?”.కార్యజగము కాదు కారణాత్మ కాదు. చిత్రం ఏమిటో చెప్పలేము –”తెచ్చుకొన్న ముండ తిప్పలు పెట్టదా?”అని నీతి చెప్పారు. ”దేహ సాక్షి అంటే దేహం తానూ అవటమే "దృక్కు బ్రహ్మమౌను –దృశ్యంబు జగమౌను. ..సత్తు చిత్తూ సకలం తానె ""

తర్వత "అమనస్క యోగం "వివరించారు –”మానసంబు చేత గానవచ్చు జగము –మనసు గలియకున్న గనుట లేదు –మనసే చూడటానికి దృశ్యజాలం అవుతుంది. మనసును తెలుసుకొన్న వారెవరూ లేరు. అన్నిటికీ మనస్సాక్షి ముఖ్యం. దినదినం లో సుషుప్తి తేజరిల్లుతుంది. జన్మజన్మాల మధ్యా చావు ఉంటుంది. .సహజ రాజయోగ సారమే మనిషి . .జగం వేరే కాదు జగమంతా బ్రహ్మమే. జగత్తు బ్రహ్మంలో పుట్టి బ్రహ్మ లో కలిసిపోతుంది. దేహంలోనే ముక్తి దేహాంతంలో కూడా ముక్తి –కనుక నేలవిడిచి సాము వద్దు. .తనను తానటంచు దగగాంచ ముక్తుడౌ.”సార మెద్ది జ్ఞాన రూపం బెద్ది –యాదికాది కెద్ది యఖిల మెద్ది –యెద్దిబుద్ధి నడపునద్దియే బ్రహ్మంబు "అని అసలు సూక్షం ఆవిష్కరించారు "'తలప నీశు డౌను తత్పద వాచ్యంబు –తత్పరుండజుడు తత్పద లక్ష్యంబు "బ్రహ్మన్ని తెలిసినవాడు బ్రహ్మమే అవుతాడు –నువ్వు నేను లేని నిలకడ బ్రహ్మం "అని ఉపనిషత్ ఉపదేశం అందించారు

99వ పద్యంలో –"సకల నిగమ రూప సారసంగ్రహ మూర్తి –యంగలింగ రూప లింగమూర్తి –సకల హృదయ గమ్య చైతన్య సత్కీర్తి –సుభగ పుష్పభ్రుంగ శూన్యలింగ "100వ చివరి పద్యం –"ఆశ్రిత జన రక్షణానంద సుముఖాంగ -నిజ సులభ సుఖ జలనిధితరంగ –ద్వయ రహితసుభాంగ భావ వర్జిత సంగ –సుభగపుష్ప భ్రుంగశూన్య లింగ "అని పూర్తిచేశారు '.

చివరలో గద్యం రాసి "ఇది శ్రీ పరమేశ్వరీ పరమేశ్వరైక్య స్వరూప భూత. విద్యాదనుభవ సిద్ధ సహజామనస్క –రాజయోగ సారామృత నిరంతర పానానంద విరాజిత. నిముస కవి వంశ పారావార రాకాసుధాకర శ్రీ మల్లప రాజామాత్య శేఖర శ్రీ మత్సద్గురు చరణారవింద. కరుణా కటాక్ష లబ్ధజ్ఞాన. ఓలేటివంశ పవిత్ర శ్రీసూర్య నారాయణ మంత్రిపుత్ర శేషమాంబా శుక్తి ముక్తాఫల సుబ్బారాయ విరచిత శ్రీ సీతారామ సంవాద సార సంగ్రహ రూప శ్రీ శూన్యలింగ శతక రాజంబు సర్వంబు శ్రీ పరదేవతార్పణమస్తు –శ్రీ శ్రీశ్రీ.

అని తన ప్రవర తెలియ జేశారు కవి. హెడ్ క్లార్క్ ఇంతటి ఘనమైన తత్వాన్ని అరటి పండు వలిచి చేతిలో పెట్టినట్లు. ఆరుచిని తేనే మాధుర్య శైలిలో రంగరించి మనకు అందించారు. మనముందు అసలు "సీతారామాంజనేయ సంవాదం"దాన్ని ప్రతిపద్య మాధుర్య ఫలభరితంగారచించిన శ్రీ పరశురామ పంతుల లింగమూర్తి గురుమూర్తి దర్శన మిస్తారు. ఆగ్రంథాన్నీ ఆకర్తను మన ముందుంచారు ఈశతకం ద్వారా మనకవి శ్రీ ఓలేటి సుబ్బారావు గారు. ఓలేటి వారు అంటే సాహిత్య. కవనాలను "ఏలేటి వారు "అని వీరూ రుజువు చేసుకొన్నారు.

ఈ శతకం మన వాళ్ళ దృష్టిలో పడిన దాఖలా నాకు కనిపించలేదు. ఈ శతకకర్తనూ, శతకాన్నీ పరిచయం చేసి నేను అదృష్ట వంతుడినయ్యాను.

## 61 ఆదినారాయణ శతకం -- శ్రీ అబ్బరాజు శేషాచలామాత్య


ఆదినారాయణశతకము

ఇది

శేషాచలామాత్యమణి

పార్థసారథిగారి

ఆదినారాయణ శతకం శ్రీ మదాంధ్ర మాఘపురాణనిర్మాణధురీణ శ్రీ మన్నారాయణ చరణారవింద పారాయణ పారీణ అబ్బరాజు శేషాచలామాత్య మణి ప్రణీతం. తత్పుత్ర హనుమంతరాయ శర్మ పాకయాజి పరిశోదితం. శ్రీ దోనేపూడి పార్ధ సారధి సహాయంతో బెజవాడ ఆంధ్ర గ్రంథాలయంముద్రాలయం లో క.కోదండరామ శర్మగారిచే1934లో ముద్రితం. వెల-ఒక అణా.

విజ్ఞప్తిలో కుమారుడు –తనతండ్రిగారు 28ఏళ్ళకు పూర్వం ఈ శతకం రాశారని. భక్తిశతకాలలో దేనికీ తీసిపోదని తాను ముద్రించటానికి అనేక సార్లు ప్రయత్నించినా. ద్రవ్యాభావ. ఇతరకారణాల చేత చేయలేకపోయాననీ. దోనేపూడి వారు ఈ వ్రాతప్రతి చూసి వెంటనే ముద్రిద్దామని పూర్తిగా ద్రవ్య సాయం చేశారని చెప్పారు. శార్దూల. మత్తేభాలశతకమిది. ”ఆదినారాయణా “మకుటం.

మొదటిశార్దూల పద్యం –”శ్రీ వాణీశ భవాదిసన్నుత. రమా చిత్తేశ,మౌనీంద్ర సం –సేవాంఘ్రిద్వయ. భాస్కరేందు నయనా చిద్రూప,భక్తప్రియా  - భావాతీత సురేంద్ర వందిత. మహా బ్రహ్మాండ భాండోదరా –వేవేగం గరుణింప నా దెసకు రావే యాది నారాయణా “అని రాసి తర్వాత గణేశ త్రిమూర్తులను,వారి సతులను వ్యాసాది మౌనులను స్తుతించి కాకుత్స్థ అన్వయ పూర్ణశశి శ్రీరామ చంద్రునికి ఒకనూలుపోగేసి. తర్వాత తనబాధలు చెప్పుకోవటం ప్రారంభించారు కవి.


ఆదినారాయణశతకము.

ఇది

అబ్బరాజు శేషాచలామాత్యమణి

[వెల రు 0—1—0.

సప్తజలధులు ఏకార్ణవం అయిన వేళ,బ్రహ్మాండాన్ని గర్భంలో దాచి రక్షించావనీ. కరిరాజును బ్రోచావనీ. ఇల్లు. సంసారం జంజాటంలో మునిగి మనుషులు నిన్ను మర్చి. కాలుని చేత దండన పొందుతున్నారనీ.  నీ మంత్రాక్షర జపం ముక్తిమార్గమనీ. ”సిరియుం, బంట వెలందియు గెలకులన్ సేవింప. దిక్పాలకుల్-పరి వేష్టింప సనందనాది మునులున్ బ్రార్థింప. నీ మూర్తిని  ”. కుజన క్షోభం. సత్యాత్మక స్థిర తోషం “కలిగిస్తావు. అరవిందాలకంటే అందంగా స్వామి చరణాలుంటాయి.నారాయణ మంత్రరాజ మహాత్మ్యం తెలిసినవారికి కొంగుబంగారమే చివరకు మోక్షమే. కలి దోషం అనే బాధకు స్వామి కళ్యాణ చరిత్ర దివ్యౌషధం. అమరాదీశ్వరుడు ఒకసారి ప్రమదా వినోదంలో మునిగితేలుతూ “వాచస్పతి “ని గౌరవించక పోతె,స్వర్గంతో సహా అన్నీ నష్టపోయి “నీ నామ మార్గము దాల్పన్ సుర సేవ్యుడైనాడు.

తర్వాత సోమకాసురవధ పాలసముద్రమధనం,”త్రివి “రూపంలో హిరణ్యాక్ష నిధనం.  హేమకశిపుని నృసింహావతారం లో వధించి భక్త ప్రహ్లాదుని కాపాడి లోకాలకు హ్లాదం కలిగించటం. ముల్లోకాలఏలిక బలిని “బాకారి బంనంబులన్ దొలగం ద్రోసి. రమాఢ్యు చేయుటకున్నై. భూతాఘుడైనట్టి తద్బలిచే గొన్న పదత్రయావనిని –సర్వ వ్యాపిపై నాకమున్ బలిమిన్వజ్రికి”ఇచ్చావు. ఇలా దశావతార  వర్ణన చేశారు.

పురుహూతుడు అసురేంద్రునితో పోరాడితే ఆఇన్ద్రునికరిమ్రింగితె,వృత్రు గర్భంలో పుట్టి పేగంగాచించి "నారాయణ మంత్రం "తో బయటికి వచ్చాడని మంత్రమహిమను కీర్తించారు. బాలకృష్ణుని లీలలు మేనమామ కంస వధ. తృణావర్త వృత్తాంతం. తల్లియశోదకు "బ్రహ్మాండంబు నోర జూపగటం"కాళింగు బిగబట్టి. వానిపడగల్ కాళ్ళన్జెడన్, మట్టి-యా కాలిందీనది బాపి తజ్జలము "చక్కగా ప్రాణులకు ఉపయోగ పడేట్లు చేశావ్..మురళీగానంతో గోపసతులకు మొహమ్ కల్గించి. ఒక్కొక్కరికి ఒక్కొక్కడి పై రాసక్రీడ జగన్మోహనంగా ఆడావు. నరకుని తల్లి సత్యభామచేతనే నరికించావ్ యుద్ధంలో. ధర్మరాజు రాజసూయంలో అగ్రతాంబూలం అందుకున్నావ్. కురుక్షేత్ర యుద్ధంలో "పార్దునకు చేదోడుగా ఉంటూధరాభారం తగ్గించావ్. ఆపత్కాలం లోఎవరు నిన్ను ఆశ్రయిస్తారో వారికి "దాపై గాచెదవు ".

నహుష గర్వభంగం వర్ణించారు "ఒకదీపం లోఉన్న తేజం పేరొక్కొక్క దీపంబు నన్ బ్రకటంబై నట్లు బ్రహ్మాండం లో 'నీ ఒక్క రూపమే అనేక రూపాలుగా ఉత్పత్తి సంస్థితి వికలానికి కారణమవుతుంది. చివరగా –"శ్రీ కౌండిన్య మునీంద్ర గోత్రభవు డర్దిన్ దేవ భాషామాంధ్రభా-షాకావ్యామృతపానలాలసుడిలన్,శార్దూల. మత్తేభ వృ-త్తాకారోజ్వల సూనమాలికను నమ్మక్కాంబికా,నారసిం-హాకాంక్షోద్భవ శేషయాహ్వాయుడు. కొమ్మి యాదినారాయణా "అని చెప్పి

పరాభవ నామ సంవత్సరంలో ద్రోణపురంలో ఆర్యులు ప్రమోదం పలుకగఈ శతకమ్ రాశానని. ఆదినారాయణుడికి అన్కితమిచ్చాననీ ప్రకటించారు కవి. అన్ని విధాలా భక్తీ చిప్పిలింది. ముఖ్యంగా నారాయణ మంత్రం రాజ శ్రేష్టను గొప్పగా వర్ణించారు.మంచి భక్తిశతకమే వారబ్బాయి గారన్నట్లు. ఈ శతకాన్నీ, కవి గారిని పరిచయం చేసే అదృష్టం నాకు దక్కింది.

## 62 శ్రీ విశ్వేశ్వర శతకం-- శ్రీ వేమూరి వెంకటరామయ్య శర్మ



శ్రీ విశ్వేశ్వరశతకము

రచయిత

కవికోకిల, విద్వాన్.

వేమూరి వెంకటరామయ్యశర్మ.

పరిష్కర్తలు

శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు

శతావధానులు.

సర్వస్వామ్యములు గ్రంథకర్తవి.

మినర్వా ప్రెస్, బందరు.

కవికోకిల విద్వాన్ శ్రీ వేమూరి వెంకటరామయ్య శర్మ రచించిన శ్రీ విశ్వేశ్వరశతకం కు పరిష్కర్త శతావధాని శ్రీ కాటూరి వెంకటేశ్వరావు గారు. దీనికి తొలిపలుకులు కైకలూరు స్థానికోన్నత పాఠశాల ప్రధాన ఆంధ్రా ధ్యాపకులు విద్వాన్ నందుల సుబ్బరాయ శర్మగారు రాశారు. అందులో –కృష్ణా. ఉభయగోదావరి గుంటూరు నెల్లూరు మండల భక్తి ప్రచారకులు. అభినవ ప్రహ్లాద. భాగవతకులాంకార.,పరమ భాగావతాగ్రగణ్య. భక్త కులశేఖర. భక్తిమూర్తి. భక్త్యుపన్యాస కేసరి మున్నగు బిరుదాంకితులు. మధుర వాగ్విశారదులు బ్రహ్మశ్రీ ములుకుట్ల లక్ష్మీ నారాయణ శాస్త్రి గారు శ్రీ సనాతన భాగవత భక్తసమాజ స్థాపకులు. విష్ణు భక్తులే అయినా ఆయనకు శివ కేశవులు సమానులు. శ్రీరాముడు రామేశ్వరంలో శివ లింగ ప్రతిష్ట చేసినట్లు. శాస్త్రిగారు శివ ప్రతిష్ట చేయాలను కోగానే తక్షణమే సాఫల్యం జరిగి. సత్తెనపల్లి తాలూకా నుదురుబాడు నివాసిశ్రీపానకాలు రెడ్డి మహాశయులు. భారమంతా పైన వేసుకొని ఆలయ నిర్మాణం చేశారు. వారణాసి నుంచి శ్రీ విశ్వేశ్వరుడు పలనాటికి విచ్చేసే సందర్భం లో. మా శిష్యుడు కవికోకిల ఈ శతకం రాసి కృతి సమర్పణం చేయటం చరితార్ధకమైంది. మా శిష్యుని శ్రీ విశ్వేశ్వర శతకం దూర్జటి మహాకవి శ్రీకాళహస్తీశ్వర శతకానికి తుల్యం అని నా



శ్రీ విశ్వేశ్వర శతకము.

రచయిత

కవికోకిల, విద్వాన్

వేమూరి వెంకటరామయ్యశర్మ.

పరిష్కర్తలు

శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు

శతావధానులు.

భావన. "అన్నారు. శతకం బందరు మినర్వా ప్రెస్ లో ముద్రితం. సంవత్సరం. వెల తెలుపలేదు. "లక్ష్మీ నారాయణ శాస్త్రి హృత్కమల కాశీ వాస విశ్వేశ్వరా "అనేది శతకం మకుటం. శార్దూల పద్య శతకం.

మొదటిపద్యం –"శ్రీ నారాయణ నామ చింతన సుధా సేవారతిం దన్మయుం- డై నారాయణి కా విశేష రుచులింపై తోప. ఝుంకార ని-స్వానంబు బొనరించు. శ్వేత మధుపస్వామి న్నినుం గొల్తు ల –క్ష్మీ నారాయణ శాస్త్రి హృత్కమల కాశీ వాస విశ్వేశ్వరా "అని నివేదించి మనసులో శతకం రాయాలనుకోగానే శతశార్దూలాలు మదిలో మెలిగాయని. ఆయన కటాక్ష శ్రీ ఎక్కడ వాలుతుందో తెలీదని. లక్ష్మీ నారాయణ శాస్త్రిగారి మనోవాంఛితం నెరవేరి ఈ ఆలయంలో ప్రవేశించావనీ. శివభక్తుల చరిత్రతోపాటు లీలలూ ఇందులో వర్ణిస్తాననీ చెప్పుకొన్నారుకవి.

"దీనుం డైపోలలేమి బోయ శివరాత్రి న్ శ్రీ ఫలంబెక్కి తా-నే ఱమ్మున్ గురిసేయ దిత్తియుదకంబింతింత నీపైబడన్-వానినిమ్మక్తుని జేయ నర్బుద గిరిన్ వ్యాధేశ్వర స్వామి "గా వెలిశావు అన్నారు పాతకథ చెప్పి. సానిని సంతృప్తిచేసి మోక్షమిచ్చావు. తారకాసుర సంహారంకోసం దేవతలు ప్రార్ధిస్తే పార్వతిని చేబట్టి కుమారస్వామికి జన్మనిచ్చి సంహరింప జేశావు. "నీకల్యాణ సమయం లో ముల్లోకాలజనం రాగా భూమి కుంగితే. "దయా దీనత్వమునన్ కుంభజు బనిచి. యార్తిన్ ద్రోయగా లేదా "అన్నారు. మూడోకన్ను మంటతో మన్మధ సంహారం చేసి ఆతని భార్య వేడుకొనగా పతిని దానంగా సమర్పించిన కరుణా సముద్రుడివి. శిష్యుడైన వింధ్యపర్వతాన్ని తాను దక్షిణ దేశం నుంచి తిరిగివచ్చేదాకా అలాగే వంగి ఉండమన్న అగస్త్యుడుభక్తితో నిన్ను సేవించి తరించాడు. అలాగే వాతాపి ఇల్వల సంహారం నీదయతో అగస్త్యర్షి చేయగలిగాడు. మామగారు దక్షుడు శపిస్తే" ఏణాంకు ని "తలమీద దాల్చి గౌరవం కలిగించావు.

క్షీరసాగర మధనంలో విషం పుడితే సంకోచించకుండా తాగి లోకరక్షణ చేశావ్. దేవతలు ప్రార్ధిస్తే "మేష శీర్షంబుగంతానం జిత్రముగా ఘటించి అసుదానం "ఇచ్చావు నీ మామ దక్షుడికి. "శ్వానంబుంగపి పెంచి. వేశ్య మెడలం బంధింప నక్షంబు ల-ద్దానన్ వారి కమాత్యరాజ తనయత్వం "ఇచ్చి మోక్షం ఇచ్చావు. తర్వాత రుద్రాక్షమహిమ చెప్పిఎలా ఎవరెవరి ప్రాణాలు కాపాడాడో వర్ణించారు కవి "మౌని శ్రేష్టుడు వ్యాసుడచ్యుత డబ్రహ్మం బంచు జేయెత్తినిం-బొనాడన్"ఆ చేతులు అలాగే నిల్చిపోగా. గోవిందుడు కాపాడమని వేడితే కరుణతో కాపాడావు. పాలకోసం ఏడ్చే బీద పిల్లాడి ఆకలి తీర్చమని ఆతల్లి ప్రార్ధిస్తే "దుగ్ధాబ్ది "నే ఇచ్చిన కరుణామయుడివి. మృకండ సూతిని కాపాడి యముని కాలితోతన్ని పంపావ్. నీభక్తుడైన వైశ్యుడు అడవిలో తిరుగుతూ లింగం దొరక్క కుంచమే లింగంగా భావించి అర్చిస్తే "కుంచేశ్వరుడి గా వెలిశావు. చోళరాజు భక్తికి పరవశించావు . రాజుకోర్కెపై కావేరీనదికి ఆనకట్ట కట్టావ్. భైరవుడికి మామిడిఫలాలు ఇచ్చావు. వెయ్యికి ఒక్కపువ్వు తగ్గితే తలనరికి నీకుసమర్పించిన వాడికి ముక్తిప్రసాదించావు .

“ఈ నా ఈప్సితమిమ్ము నీవు బసవా యిష్టన్న సంతుష్టిగా –డా నీజాలినవాడ టంచసమ నేత్రం బీవు యాచింప న –ద్దానన్నీకను నీకే చూపడె యదార్ధం బేర్పడన్నాడు “అని మరొకథా ప్రసంగం చేశారు. .పాలుత్రాగకపోతే నామీద ఒట్టు అని ఒక బుడుతడు మారాం చేస్తే “ఆ కూనం గాచి కుంచెడు పయస్సు గ్రోలి “వాడికి సంతృప్తి కల్గించిన దయారాశివి. ”నీ చిత్తము దారువో శిలయో లోహమ్మో “మాకు అర్ధంకాదు. కిరాతవేషంలో అర్జునుని పౌరుషాన్ని పరీక్షించి పాశుపతాస్త్రం ప్రసాదించావ్. జంగమ దేవరలకు అభయప్రదాతవు. ”నీచ బౌద్ధ జైనాలను త్రుంచమని నిన్నుకోరుతూ రాళ్ళతో నీలింగాన్నికొట్టిన వాడికి వరాలిచ్చి ముక్తినిచ్చావ్. సౌరాష్ట్రం వెడుతూ కుష్టు వ్యాధితో బాధ భరించలేక “గౌరీనాథా “అని ఆర్తిగా పిలిస్తే ఆర్తిబాపిన దయాసింధువు నువ్వు. అప్పుడెప్పుడో గరళం మెక్కావు. ఇప్పుడు ఈ విషముష్టి పండు తిను చూద్దాం నీ దమ్ము ఏమిటో “అని భక్తుడు సవాలు విసిరి పెట్టిన దాన్ని తినేసిన కాల కంఠుడవు.

చివరి పద్యం –”నేనీ దివ్య కథామహత్వముల వర్ణింప నెట్టోర్తున-జ్ఞానిన్ వేమురి వాని చాపలయుతున్ సాకంగదే భక్త బం-ధూ,నన్ వేంకట రాము “విశ్వ పతయే తుభ్యం నమోస్తం టి “ల-కక్ష్మీ నారాయణశాస్త్రి హృత్కమల కాశీవాస విశ్వేశ్వరా “

నిజంగా నే భక్తదూర్జటి మహాకవి కవిత్వం స్ఫురణకు తెస్తుంది ఈ శతకం. కవిగారు విద్వాన్ అవటంతో పండితలక్షణాలు పుష్కలంగా ఉన్నాయి శతకం లో కవికోకిల కావటంతో హాయిగా పాడుకోటానికి వీలుగా ఉన్నాయి ఇంపైన పద్యాలు. విశ్వేశ్వరునికి నిజమైన నీరాజనం. ఇంపైన ఇష్టనైవేద్యం ఈశతకం. తమాషాగా పద్యం మొదలుపెట్టి ఆసక్తికరంగా ముగించటం ఈ కవి ప్రత్యేకత. ఈకవిగారినీ ఈశతకాన్ని పరిచయం చేసి నేను ధన్యుడనయ్యాను. నిత్య పఠనీయ శతకం ఇది.

## 63 శ్రీ మత్తుప్పగిరి చంద్రమౌళీశ్వర శతకం -- శ్రీ శంకరమంచి రామకృష్ణ శర్మ

శ్రీ మత్తుప్పగిరి చంద్ర మౌళీశ్వర శతకాన్ని కావ్య విశారద శ్రీ శంకరమంచి రామ కృష్ణ శర్మ రచించి,బ్రహ్మశ్రీ జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారికి చూపించి పరిష్కరింప జేసి. రెంటపాళ్ళ అగ్రహారం లో మకాం చేసి ఉన్న పుష్పగిరి పీఠాధిపతులకు చూపించి వారి అనుగ్రహం పొంది. ముద్రణకు ద్రవ్యమిచ్చి ప్రోత్సహించగా. ముద్రించి. శ్రీ పుష్పగిరి పీఠాదిపతులు జగద్గురు శంకరాచార్య స్వామి వారికి అంకితమిచ్చారు –”శ్రీ పుష్పగిరి పీఠస్థః శంకరాచార్య వేష ధృత్ – శ్రీకరశ్చంద్ర మౌళీశో-జీయాదాచంద్ర తారార్కం “అని శుభం పలికారు. శార్దూల.

మత్తేభ పద్యాల శతకం ఇది. "చంద్ర మౌళీశ్వరా "అనేది మకుటం. 1939 కృష్ణపక్ష తదియనాడు శతకం పూర్తి చేశారు కవి. కవి ఆపస్తంభ సూత్రుడు. ఆత్రేయస గోత్రీకుడు. నర్సరాట్పురం నివాసి . కావ్య రసజ్ఞుడు. వెల ఇవ్వలేదు.



ఇట్లు,
గ్రంథకర్త
"కావ్య విశారద"

మొదటి శార్దూలం లో –"శ్రీ రాజిల్ల సమస్త చేతనలకున్ స్వీయ ప్రసన్నావనో -దారత్వమెరింగించు టే విమల తత్వార్ధంబు బోధించు నా –చారంబంచు దలంచి పుష్పగిరి వాసటుండివెల్గొందునోం-కారాకార. నమస్కరించెద శుభాంగా "చంద్ర మౌళీశ్వరా "అని చెప్పి. సద్భక్తితోరాశానని. సాహిత్యం సున్నా. వృద్ధజన సాంగత్యం పూజ్యం. ధన సంపత్తి హుళక్కి. తెల్వినహి. శ్రద్ధాభక్తి శూన్యం. ఉక్తి నియుక్తులు "బండిగల్లు "అయినా కీర్తిస్తున్నా ఆదరించు అని లౌక్యంగా చెప్పారు"కావ్య విశారదులు. "తనకావ్యకుమారి మోహం కలిగించే సుందరికాదు నూతన చమత్కారాలు చూపే నేర్పరీకాదుఅయినా ఎలాస్వీకరిస్తానని సందేహించక నన్ను కృతార్ధుని చేసి కన్యాదానఫలితం ఇమ్మన్నారు. ఒకావిడ నెత్తికెక్కి కూర్చుంది ఇంకొఆవిడ అర్ధ శరీరం ఆక్రమించింది. మీఅమ్మాయికి ఇక నేను ఏమివ్వగలను అని అనుకోవద్దు. మాఅమ్మాయి వృధాకోరికలు కోరని కన్య అన్నారు. ."బోళాశంకరుడ వంచు భక్తతతి సంబోధించుతాన్ జేసి "నా మేలు నువ్వే చూస్తావనే ధైర్యంతో ఉన్నాను.

ధనగర్వంతో విర్రవీగే వారు నీపై దృష్టిపెట్టరు సంపదతో ఉబ్బి తబ్బిబ్బౌతారు. అలాంటి వారి తలపై తన్ని బుద్ధి చెప్పేవాడివి నువ్వే. "ఆరాధ్యుడవు. పుణ్య శీలుడవు. నిత్యానంద నిష్కామ. నిర్వైరాయత్తుడవు. ఆదిమూర్తివి. "గిరికన్యా హృదయాబ్జ రంజనం,సాక్షీభూత నిర్మోహ సుందరమైన రూపం నీది. జగత్సంజీ వనౌషధమ్ "నీ పంచాక్షరి ".వైరం ఎందుకు అన్నా,హెచ్చుఫలముల్ వంచించను అన్నా. నేరాలు భరించమన్నా. ఎప్పుడూ నీవాడినే అన్నా,సత్కార్యం చూపమన్నా. హితం చేకూర్చమన్నా. ఆధారం నువ్వే అన్నా. "నేర్పరిపై సర్వము

నామ భేదాలుఅదర్పం జుచే వాడవు మామ దక్షుడి యాగం ఆగం చేసి బుద్ధి చెప్పావ్. భూమికి "ప్రాజ్ఞుడు మూలం అసలైన మూర్తి నీవే. "శివ శంభో గిరిజాపతీ శుభద,దాక్షిణ్యైక భావాన్వితా. భవ.గంగాధరా. శూలపాణి హర సౌభాగ్యప్రదా హర ధవళాంగా "అంటూహర నామాలన్నీ చెప్పారుపద్యంలో.



శ్రీమత్పుష్పగి

చంద్రమౌళీశ్వరశతకము

పార్ధునిపై శశాంశాకు నిపై. భల్లాణుపై. సిరియాలునిపై ఉషాజనకునిపై శ్రీ గౌరిపై గంగపై పరమానందం,ఆదరం చూపించావు. ."నేను నీమొర ఆలించను "అంటావేమో. నీగుట్టు మట్టులన్నీ నాకు తెలుసు. బింకాలుపోకు. కాలుస్తావా సై.లేక నేనే నిన్ను గెలుస్తానో కాచుకో అన్న భక్తశిఖామణి కవి. ఆతర్వాత శివ భక్తిమహాత్మ్య కథలన్నీ వరసబెట్టి చెప్పారు. తన మొరను అరణ్య రోదనం చేయద్దని వేడుకొన్నారు. నీ వాహనం ఎద్దు మీ ఆవిడ వాహనం వ్యాఘ్రం. వీటిమధ్య ఉన్న క్రూరత్వాన్ని బాపటానికే సమయం చాలదంటావా. లేక నన్ను మర్చేపోయావా. ?ఘోరపాతకాలలో కూరుకుపోయి నేను నిన్ను "శివ శంభో గిరిజాపతీ హర శ్రీ పుష్పశైలేశ్వరా.భవ బంధా "అని పిలుస్తూనే ఉంటా. అన్నారు ఈపద్యం భీమఖండంలో శ్రీనాథుని "శంభున్ శివుణ్ శ్రీ కంఠు నిన్ "అనే పద్యాన్ని స్ఫురింపజేస్తుంది. తన్మయభక్తికి గొప్ప ఉదాహరణ. నరకం అనేది ఉందని ఇప్పుడే తెలిసి జంకు తున్నాను. చేసినపాపాల చిట్టా విప్పుతున్నాను –నీ పాదద్వయమే నాకుఏడుగడ రక్షా.

బాల్య యవ్వన కౌమార వార్ధక్యాలు మాయ చుట్టాలు. అవి పట్టుకొంటే నీ ధ్యానం చేయటం ఎవరి తరమూకాదు. "నిను బూజింప గా. నిన్ను జూడగను. నీ నిత్యప్రభావంబు వర్ణన చేయగను కేశవాదులకైనా అసాధ్యం "నాకు అనువౌనే కుజనుడను ఘోర దురితాహంకారుడిని. కాదనకయ్యా గిరీశా. నన్ను భరించటం నీకు తప్పదు.ఎందుకు ?నేను నీవాడిని కనుక. నాకవితా కుమారిని నీ చేతిలో పెడుతున్నా. ఇవ్వటానికి చేతిలో కానీ లేదు. రాద్ధాంతం చేయకుండా "పేయార్లట్టుల" ఎంచి. తృప్తి చెంది ఆదరించు అని కన్యాశుల్కం లో రామప్పపంతులు లౌక్యం చూపారు కవి. నీ చేతిలో ఉంచా. అంటూ అగ్నిహోత్రావధాన్లు "తామ్బూలాలిచ్చా

తన్నుకు చావండి “అన్నట్లుగా భారమంతా అల్లుడు చంద్రమౌళి పైనే పెట్టారు మామ కవీశ్వరుడు భక్తిగా. చివరి రెండుపద్యాలో భావం ముందే చెప్పేశాను. ఖచ్చితంగా 100పద్యాల శతకం ఇది.

భక్తీ ఆర్తి శరణాగతి. లౌక్యం లోకజ్ఞత. కథా సంవిధానం. పుష్కలంగా ఉన్న శతకం శైలి ద్రాక్షాపాకం. కవితాప్రవాహం పుష్పగిరి ప్రక్కన ప్రవహించే పెన్నా నదీ ప్రవాహమే. పుష్ప గిరిలోని పుష్ప సౌందర్యం. మాధుర్యం. పరిమళం ప్రతిపద్యం లోనూ దర్శన మిస్తుంది. ఈ శతకం. ఈకవి గురించి మనవారికెవరికీ పట్టినట్లు లేదు. నాకు ఈకవిగారినీ శతకాన్నీ పరిచయం చేసే మహద్భాగ్యం ఆ చంద్ర మౌళీశ్వరుని కృపాకటాక్షం వలన లభించింది. 2019లో ఒంటిమిట్ట తోపాటు పుష్పగిరి సందర్శనం మాకు లభించింది. అదిఇలా సార్ధకమయింది. శ్రీ చంద్ర మౌళీశ్వర లింగం ఆదిశంకరాచార్య ప్రతిష్టితం. విద్యారణ్యస్వామి శ్రీ చక్రం ప్రతిష్టించారు. శివ. కేశవ ఆలయాలు ఇక్కడ ఉండటం మరో విశేషం. దక్షిణ కాశిగా. రెండవ హంపిగా భావిస్తారు శైవులు మధ్య కైలాసంగా వైష్ణవులు మధ్య అహోబిలం గా పిలుస్తారు. గ్రామానికీ. క్షేత్రానికి మధ్య పెన్నానది ఉంది. దీనిలో పాపాఘ్ని కుముద్వతి,వల్కల. మాండవి నదులు కలుస్తాయి. ఆంధ్ర దేశం లో ఉన్న ఏకైక శంకరాచార్య పీఠం పుష్పగిరిలో నే ఉంది.

## 64 శ్రీ సంగమేశ్వర శతకం -- శ్రీ పరిమి కృష్ణయ్య

కృష్ణా –తుంగభద్రా సంగమం లో చామర్ల పూడి గ్రామం లో వేంచేసి ఉన్న శ్రీ సంగమేశ్వర స్వామిపై శ్రీ పరిమి వేంకటాచలకవి శతకం రాయగా. గుంటూరు వాసి శ్రీ పరిమి కృష్ణయ్య గారిచే బెజవాడ ఆంధ్ర గ్రంధాలయ ముద్రాక్షర శాలలో శ్రీ క.కోదండరామయ్య చే 1931లో ప్రచురింపబడింది. వెల.రెండు అణాలు.




విజ్ఞప్తిలో” ఈకవి ఆది శాఖీయబ్రాహ్మణుడుఅని,పేరు పరిమి వేంకటాచలం అని. హరితస గోత్రం. తండ్రి రఘునాయకుడు. తల్లి సూరమాంబ. ఈకవి నూట ఇరవై ఏళ్ళ క్రిందటివాడు అంటే సుమారు 1811 నాటివాడు. వీరి సంతానం గుంటూరు మండలం లో వ్యాపించి ఉంది. గుంటూరు పుర పారిశుధ్య సంఘ కార్యాలయ ఉద్యోగి పరిమి సూర్యనారాయణ. విజయవాడ ప్రభుత్వ ఔషధాలయ ఉద్యోగి పరిమి సీతారామయ్య ఈ కవి సంతతి లోని వారే. .సూర్యనారాయణ ఈకవికి అయిదవ తరం వాడు. సంస్కృత ఆంధ్రాలలో కవికి అసామాన్య పాండిత్యం ఉంది. శతకం సంస్కృత పద భూయిష్టం అయినా,మూలపదాలుకాని కటువైన పదాలుకానీ లేకుండా నిరర్గళ ధారాశుద్ధి. తో ద్రాక్షాపాకం తో,భక్తిరసం వెల్లి విరిసేట్లు. ఇప్పటిశతకాలకు ఏ మాత్రం తీసిపోకుండా సలక్షణంగా ఉంది “ అని కర్లేపాలెం కోదండ రామయ్యగారు శ్లాఘించారు. ఉత్పలమాలా శతకం ఇది. ”కూడలి సంగమేశ్వరా “అనేది శతకం మకుటం.

మొదటి పద్యం –”శ్రీ గిరిజా పయోధర పరిస్ఫుట చర్చిత సారగంధ గం –దధాగరు కుంకుమాంకిత. సమంచి దురస్కజగత్ప్రపాలనో –ద్యోగ మనస్క. శారద పయోద సమాన యశస్క. సంతతా –భోగ వయస్క. సర్వమునిపూజిత “కూడలి సంగమేశ్వరా “..రెండవ పద్యం లో”వృషాధి రాజ కంఖాణ,మురారిబాణ”అని విచిత్ర పద ప్రయోగం చేశారు కవి. తర్వాత “భాసిత మందహాస. పరిపాలిత దాస. వ్రతోగ్ర కల్మష త్రాస. పరాక్రమానల విదగ్ధ నిశాచర ఘాస. సంతతోల్లాస. శివా మనోహర విలాస. సురాద్రి శరాస. దివ్య కైలాస నివాస “అంటూ సకార ప్రయోగంతో కవితాప్రాకారం కట్టి కదను తొక్కించారు. తర్వాత టకార ప్రయోగంతో వృషాద్రిప ఘోట. హిమాద్రి మనోజ్ఞాట లసత్కిరీట. సుజనౌఘ భవాబ్ది కృపీట,జాహ్నవీ జూట. కరాగ్ర శోభిమృగ శూల విధాత్రుక కోట,వాజ్నిరాఘాట విపత్కవాట “అంటూ టకటక లాడించారు పద్యాన్ని.భాషపై ఎంతటి పట్టు ఉందొ ప్రకటించారు. ఆతర్వాత డకార. దంభ రంభ డింభ స్తంభ లతో మరి రెండు పద్యాలు ఢంకా మోగించి చెప్పారు. ఈశ వినాశ. దినేశ పాశ. కేశాలతో పద్యం జడ అల్లారు . ఇలా ప్రతిపద్యంలో సంగమేశుని కీర్తించి కవితా కృష్ణా తుంగ లను సంగమింప జేసి ఉత్పల మాలికలల్లి అర్చించారు.

ఆతర్వాత మాదిరాజు. పండితార్య బసవయ్య. కాటకోటయ్య. కేశిరాజు శిరియాళు,చోళ మహేశు. సిద్ధరామయ్య బాచి రాజు వరదయ్య లనే శివ భక్తులను కీర్తించారు. ”తల్లికి ఉండే దయ బిడ్డపై దాసికి ఉంటుందా “అంటూ నువ్వే దిక్కు అన్నారు. రారా చలమేరరా. వినరాఏలుకోరా. పలకరా మది నమ్మితిరా పదభక్తినియ్యరా “అని వేడుకున్నారు  చనువు మీరా. నీమిత్రుడు ధనదుడు ఇల్లు వెండికొండ. కాంచన గిరి చాపం. సర్వ విభూతులు కలిగికూడా  ”తనయుని పెండ్లి చేయని ఉదార గుణుడవు. అలాంటి నిన్ను వెంబడించే నన్ను అనాలికాని నిన్నని ప్రయోజనం ఏమిటి అని నర్మగర్భంగా పలికారుకవి.



విజ్ఞప్తి.

20—4—31.

రోకలి తోకోట్టినా. రాళ్ళు రువ్వినా. నంజుడు తిండిపెట్టినా. సహిధి మోక్షం ఇచ్చావు నన్నుమాత్రం వదిలేశావ్ అన్నారు. గళసీమలో మాణిక్యం ఉన్నా. గాజుపూస కోసం అర్రులు చాస్తారుమానవులు అతి దగ్గరలో నువ్వున్నా నిన్ను పట్టించుకోరు వెర్రిజనం. ఉదరం లో “పయోజ భవాండ శతాలు ఉంటె. ”నీకడుపు నిండేట్లు భోజనం పెట్టటం మాకుసాధ్యమా ? “ఎవ్వనిచే జగమ్ము జనియించు వసించు. నశించు అవ్యయుడు,ఎవ్వడు. కార్యకారణములలెవ్వడు. భూత సమాశ్రయుడు. చిత్కలా సహితుడు ఎవ్వరు “అలాంటి నీవే మాకు దిక్కు అంటూ పోతనగారి పద్యాన్ని అనుకరిస్తూ శివ పరంగా అల్లారు.

“మూడిటి రెండిటిన్ గెలిచి  మూటిని మూటిని రూపుమాపి. మున్మూడిటిమూసి. అయిదిటిని పొందుగా నేకము చేసి. మూడిటన్ మూడిటి దాటి. రెంటి నడుమన్ శివయోగి మూడిటన్ గూడిన చోటు మీరి నిను చేరతాడు “అని వేదాంతపరంగా అద్భుత పద్యం రాశారు కవి. ఆపద కలిగిన వేళ,భయారతునిగా మొరబెట్ట నా సంతాపం మాన్పకున్నావు ఆకలిగొన్నప్పుడు అన్నం పెట్టకపోవటం న్యాయమా  ఆది భిక్షూ అన్నారు.  తుంగ భద్రవద్ద అమరావతీనగరాన్ని పోలిన చామర్లపూడి లో సర్వ మంగళతో కొలువైన స్వామీ భక్తజనానికి అభయ ప్రదాతవు.

చివరిపద్యం –"మంగళమంబికా సహిత. మంగళ మార్య శుభ ప్రదాయకా –మంగళమాహవ ప్రకట. మంగళ మంబుజ నేత్ర,సాయకా –మంగళమిందుఖండ ధర. మంగళ ముగ్ర మహాఘ శోషణా-మంగళ మభ్ర కేశ గుణ మండన కూడలి సంగమేశ్వరా "అని శతకం ముగించారు.

చక్కని సంప్రదాయ బద్ధంగా శతకం సాగింది. భక్తి ఆర్తి ప్రపన్నత శరణాగతం తో భక్త చింతామణి గా శతకం రాశారు కవి.ధారాశుద్ధి అద్భుతం. భక్తి శతకాలలో తల మాణిక్యం గా ఉంది. ఈశతకం గురించి మనకవులు ఎవ్వరూ పేర్కొన్న దాఖలా కనిపించలేదు. ఈ కవినీ, ఈశతకాన్నీ పరిచయం చేసే మహద్భాగ్యం నాకు కలిగింది.

## 65 శ్రీ భీమేశ శతకం -- శ్రీ దేవరకొండ అనంతరావు




శ్రీ దేవరకొండ అనంతరావు శ్రీ భీమేశ కందశతకం రచించి. శ్రీకాకుళం శ్రీ రామ కృష్ణా ప్రింటింగ్ ప్రెస్ లో 1939 లో ముద్రించారు. వెల-పావలా. "భీమేశా "అనేది మకుటం. దీనికి తొలిపలుకు శ్రీకాకుళం మునిసిపల్ హై స్కూల్ ఖగోళ శాస్త్రజ్ఞుడు బి.ఎ. బిఎడ్. హెచ్.ఎం. డి. శ్రీ బొమ్మిడాల ఆది వెంకట నరసింగ రావు రాశారు. తన శిష్యుడైన అనంతరావు ఈ శతకాన్ని కంద పద్యాలలో రాశాడని. ఇది మొదటి ప్రయత్నం కనుక సాధ్యమైనంతవరకు తప్పులు సవరించాననీ. సారం గ్రహించి ప్రోత్సహించమనీ,సరళంగా శబ్దాలంకారాలతో కవి కూర్చాడనీ మెచ్చుతూ –"స్మరహరుపై శతకము బుధ వర-పరమాదరమునకు బాత్రముగాని – ద్ధర నొనరిచి నెగడిన దే-వరకొండ అనంతరావు వర్ధి లు గాతన్ "అని ఆశీర్వదించారు శిష్యుడిని. పీఠికలో కవి "శ్రీ భీమేశు ప్రేరణతో రాశాను భాషాజ్ఞానం గ్రంథ పరిచయం లేని వాడిని.

ముందుమాట రాసిన గురువుగారికి. ముద్రణకు ద్రవ్య సాయం చేసిన శ్రీ కిల్లాన రామన్నాయడు లకు కృతజ్ఞతలు తెలిపారు.



ఓమ్

భీమేశ శతకము

దేవరకొండ అనంతరాయ

విరచితము

శ్రీకాకుళం.

యస్. ఆర్. కె. పి. వర్మన్స్,
శ్రీకాకుళం.

1939

0—4—0

మొదటి పద్యం –”శ్రీకర యో సద్భక్త వ-శీకర. రిపుభీకర. సుర శేఖరహర మో-క్షాకర రజనీకరధర -శ్రీ కర కంఠాతలంతు భీమేశా”. అందాలకందాలనే మందార సుమాలు ఏరి మాలగా అత్యానందంగా కూర్చాను ఇందు ధరా దీన్ని తాల్చు అని కోరారు రెండవపద్యంలో. ఈశా గౌరీశా విశ్వేశా,రిపునాశా. మహేశా పోషా. ఆశాపాశ వినాశా. నాశ రహిత దయ చూపు అన్నారు శకార యమకం తో. ధరణి రథం. దానికి దినకర. శశి చక్రాలు మిన్ను గమి తురగాలు. ధరణీధరమే ధనువు. హరి శరం. అజుడు నీ సూతుడు అని తనకే పాండిత్యం లేదన్న కవి అద్భుతంగా కవిత అల్లారు. నందీశ భ్రున్గీశ. బృందారక బృందం అజుడు హరి రుషివరులు “నీ సుందర పదపద్మాలను అందముగా గొల్తురు “అన్నారు

“ఒక్కడవట రక్కసులను –టెక్కుడువట,భక్త తాటికి జిక్కుడువట నీ –దిక్కును కోరిన వారి కి దక్కుడదువట “అంటూ కకార ప్రాస లో కాలేకాలుడిని చమత్కారంగా భక్తసులభుడినిగా వర్ణించారు. మృత్యు నిత్యు సత్య లతో మరోఆణిముత్యం అందించారు. అకలంకా ఉమాంకా అంటూ కొడుకును భార్యను శివుడికి అర్పించిన భక్తుల గాథలు జ్ఞాపకం చేశారు. విల్లు కాంచనమేగా,ఆభరణాలు చేయటానికి విశ్వకర్మ నీ సన్నిధిలోలేడు అందుకే “”పాప” నగల దాల్చగల రూపం “మర్మం చెప్పమన్నారు. ఏ పేరుతొ పిలిస్తే పలుకుతావో తెలీదు. నీదయ లేక నేను జడుడు గా ఉన్నా. దయతో మన్నించు. ”నీపలుకులు సుధలొలుకుతాయి “అని పోతన్నగారి శైలి పద్యం రాశారు. నామొరలు వినబడలేదా దీన బంధో”అన్నారు ఆర్తిగా. కాలుని చేతికి చిక్కకముందే కాలాంతక నీలీలలు పొగుడుతున్నాను.

జడమతి నిడుముల దడబడి-కడుపడిసెడి నీ యడుగులకడ,బడ నీవీ –యెడ జేనిడ,నో మృడయే-డకేగుదు మగుడ దెల్పుమిక భీమేశా "పోతనగారికేమీ తీసిపోడు అనట్లుగా ఉందికదా పద్యం. కనికరపు గనివి. కరములు మోడ్చి వెడితే విని కరము గాచెదవని విబుధనికరము "నిన్ను పొగుడుతుంది అని కరము తో కమ్మని కందం వండి వడ్డించారు. "నిన్ను తెలుసుకోని చదువులు వ్యర్ధంకదా అని యదార్ధం చెప్పారు. పంచశర గర్వహర – పంచానన వరద భక్తవరా "అంటూ హరనామాల తో భక్తికవితా ప్రవాహం పారించారు. నీఇల్లు ధవళం. భూషలు జడ. నెత్తిన సుధాకరుడు,నీ శరీరం కూడా ధవళం అని ధవళవర్ణుని వర్ణించారు కవి.

పిలిచినా రావు నా నేరమా గ్రహచారమా గజచర్మధరా హరా "అంటూ పల్లవించారు.హరి హరులు ఒక్కటే. భేద బుద్ధి పాటించినవాడు "కరుణా మయ. కాలుని కడ కరుగుట తథ్యం. బలి ఇంటికి హరి కావలి కాస్తే. "నువ్వు బాణుని ఇలు గాచితివి "కనుక మీ ఇద్దరికీ భేదమే లేదు. ఇద్దరూ భక్తులకు కింకరులు వశంకరులే. నరు సఖుడా శ్రీహరి . అలాంటి నరునికి పాశుపతం ఇచ్చావు నువ్వు. మీ ఇద్దరికీ భేదమేమిటి ఉమామహేశా. రమేశా అన్నారు. నువ్వు ఎలాగూ నిత్య యాచకుడివే. ఆయనేమైనా పొడిచేశాడా ? బలిని మూడడుగులు యాచించాడు. యాచనలోనూ తేడాలేదు అని చమత్కారం. పన్నగాలు నీ భూషలు. పన్నగ శయనుడు ఆయన. ఇద్దరూ పాపవినాశులే.

"మురహరుడాతడు నీవో –పురహరుడవు సర్వ లోక పూజ్యా. భువిపై –హరియన. హరుడన భేదంబు లేదయా "అని అద్వైతం ఆవిష్కరించారు కవి. నువ్వు శ్రీ(విషం ) గళుడవు.ఆయన శ్రీ(లక్ష్మి ) గలవాడు. మీకు భేదం ఏమిటి మా అజ్ఞానం కాక అన్నారు. ఆయనకు తిరుపతి నీకు రజతగిరి ఉనికి పట్టు. ఇద్దరూ కొండల దేవుళ్లే.మాకోసం దిగొస్తారు. గట్టులరాయని (హిమవంతుడు )ముద్దులపట్టిని చేపట్టినట్టి పరమేశుడిని,పుట్టుట గిట్టుట లేని జెట్టిని భీమేశుని మోక్షంకోసం ప్రార్ధిస్తా. శివుడు "దినకర. శశి, శిఖి త్రినేత్రుడు. ఒకరాజు కలంకుడు వేరొకరాజుకు వేయికన్నులు. ఇంకోరాజు గ్రహబాధితుడు. కనుక రాజు అంటే నువ్వే అని చక్కని ఎనేక్డోట్స్ తో మంచి పద్యం రాశారు. "నా చిత్తం అనే అశ్వం ఇచ్చవచ్చిన చిత్తంతో పరిగెత్తుతోంది చిత్త హరా "నువ్వే వచ్చి ఆగుర్రాన్ని దారికి తేవాలి అంటూ ఆదిశంకరుల శివానందలహరి శ్లోకాన్ని జ్ఞాపకం చేశారు.

"శ్రీకరములు సుగుణాలికి-భీకరములు దైత్యతతికి వీనుల విన మో-క్షాకరములు భక్తులకు వశీకరములు నీ చరితలు ".శూలివి. గిరిజాసతికి అనుకూలివి. అసుర కుంజర తతినిర్మూలివి. కడు బలశాలివి –

పాలితలోకాళివరయ ప్రభు భీమేశా".తోలు ధరించి జలంధరు నేలకూల్చి. కాలుని గెల్చి. శిరియాళుని దయతో కాపాడావు. .

99వ పద్యం లో "శ్రీ విశ్వ కర్మ కులజుడ –దేవర కొండాన్వయుడను,ధీనుత చరితా – శ్రీ విశ్వభద్ర గోత్రుడ –బ్రోవుమనంతాఖ్యు నన్ను భువి భీమేశా "అని తన విషయాలు చెప్పుకొన్నారు. నూరవ పద్యంలో మంగళం పాడుతూ –"మంగళమిదె గొనుమా –మంగళకర యో శుభాంగ. మాధవహిత. నా –మంగళమిదె గైకొనుమో –యంగజ హర భ్రుంగి వినుత హర భీమేశా "'అంటూ శతకం సమాప్తం చేశారు కవి.

కవి విశ్వకర్మ కులజుడు కనుక బంగారాన్ని ఎంత సున్నితంగా ఆభరణాలుగా మలుస్తారో. అంతే సున్నితంగా ప్రతిపద్యాన్నీ శిల్పీకరించి ఆపరమశివుడే పరమాశ్చర్యం పొందేట్లు "శతకనక "శోభాయ మానంగా తయారు చేశారు. ప్రతిపద్యం ఒక ఉదాహరణమే. భక్తి శతకాలలో తలమానికమైన శతకం అని నేను భావిస్తాను. ప్రతి పద్య చమత్కృతి తో శతకం సహస్రగుణ శోభితం గా ఉంది. శతకకర్తకు కమోడ్పులు ఘటిస్తున్నాను. నిత్య పారాయణకు అద్భుతంగా పనికి వచ్చే శతకం ఇది. రసభరిత శతకం. కవితాధార నాగావళీ, వంశధారా సదృశ వేగంగా సాగింది. ప్రతిపద్య రమణీయం శతకం. బహుశా శ్రీ కాకుళం లోని ముఖ లింగేశ్వర స్వామిపై రాసి ఉండచ్చు. అక్కడ భీమేశ్వర దేవాలయం ఉన్నట్లు లేదు. గొప్ప భక్తిశతకాన్ని, తద్రచయితను పరిచయం చేసిన మహద్భాగ్యం నాకు దక్కింది.

## 66 శ్రీ కోటీశ్వర శతకం -- శ్రీ ఈశ్వర ప్రగడ నృసింహారావు

శ్రీ ఈశ్వర ప్రగడ నృసింహారావు కవి తెలంగాణాలో శ్రీ గిరికి ఈశాన్యం లో నల్లగొండ జిల్లాసూర్యాపేట తాలూకా బేతవోలు గ్రామం లో శ్రీ తడకమళ్ళ సీతారామ చంద్రరావు దేశముఖ్ దేశపాండ్య ముఖద్దార్ ధర్మ కర్తృత్వంలో వర్ష పర్వతాగ్ర స్థితుడైన శ్రీ కోటీశ్వర స్వామిపై శ్రీ కోటీశ్వర శతకం రచించి ఆస్వామికి అంకితం చేశారు. మత్తేభ, శార్దూల విరాజిత పద్య శతకం. "కొటీశ్వరా "శతక మకుటం.వెల. సంవత్సరం తెలుపలేదు.



శ్రీ

శ్రీ కోటీశ్వర శతకము.

మ॥ శ్రీమత్సర్వ జగత్స్వరూపవిబుధ శ్రేణీనుత ప్రాభవా
కామక్రోధ మదాద్యరిప్రకర శిక్షా దక్ష సద్రక్షకా
భూమానంద మరందసంభరిత హృత్ఫుల్లాబ్జ లోకేశ్వరా
శ్రీమద్వైతనవోలువాసహర గౌరీనాధ కోటీశ్వరా॥ 1

శా. నీ సేవల్ స్తుతుల్ నతుల్ గృతులు నిర్నిద్రప్రభావంబుచే
రాసన్ వర్ణన చేయబూనుటకు నామ్నాయంబులే క్రిందు మీ
దైసాధింపగ లేక యుండ నిక మాకా చెప్పబన్నేరసా
భ్యాసంబాట కకాక నేమయిన నీ భారంబె కోటీశ్వరా॥ 2

మ. కవితామాధురి మెచ్చి భూధవులు సత్కారంబులన్ జేయగా
దవనిన్ బండితు లీరసజ్ఞతకు వహ్వా యంచు శ్లాఘించి గౌ
రవమున్ గూర్పగ గాదికేమన ముఖ ప్రశ్నార్థనారంబు నీ
స్తవమున్ బద్యశతంబుగా సలుపనిచ్చ పుట్టె కోటీశ్వరా

మత్తేభం లో విఘ్నేశుని “గిరిజానందన యో గజానన మహా కీర్తి ప్రతాపోన్నతా “అంటూ.చంపకమాలలో సరస్వతి ని”మంజుల వాణివాణి సుర మాన్య శిరోమణిదేవి భారతీ “అనీ. స్తుతించారు.

శతకం లో మొదటి పద్యం మత్తేభం లో –శ్రీ మత్సర్వ జగత్స్వరూప విబుధ శ్రేణీ నుతప్రాభవా –కామక్రోధ మదాద్యరి ప్రకర శిక్షా దక్ష. సద్రక్షకా –భూమానంద మరంద సంభరిత హృత్ఫుల్లాబ్జలోకేశ్వరా –శ్రీ మద్వైతనవోలు వాస హర గౌరీనాథ కోటీశ్వరా “అని ప్రారంభించి రెండవపద్యం శార్దూలం లో “నీ సేవల్ స్తుతుల్ నతుల్ గృతులు నిర్నిద్ర ప్రభావంబుచే –రాసన్ వర్ణన చేయబూనుటకు నామ్నాయంబులే క్రింద మీదై”తే నా వలన సాధ్యమా అని ఒక బీదఅరుపు అరిచారు “దోషఘ్నుమౌ నీ స్తవ ప్రస్తుతిన్ దా,బరుసంబునన్ గలసి స్వర్ణం బైన లోహం “లాగా “పస గాంచున్ గటయకృతీంద్రము శుచిత్వం బంది”అని గొప్పగా చెప్పారు. జగత్తులో పద్మం పుట్టి నీ హృదయ కాసారం లో ఆ నిగమాలు నిగమాంతాలు విరిసి తేనెల్ వార తుమ్మెదలనే భక్త బృందం ఆ మధువును తాగి. నీనామ స్మరణతో ధన్యులౌతున్నారు.

కవులందరిలాగా తనదగ్గర రూకలు,విద్యా కౌశలం. తీర్థయాత్రా ఫలం లేవని. నిన్నేస్మరిస్తా మోక్షం ఇవ్వమని కోరారు. ఇక్కడో ఎక్కడో నువ్వు ఉండేది తెలీదు కానీ నీ సన్నిధిలో ఆనందం మాత్రం పుష్కలంగా దొరుకుతుంది. పాలసముద్రం త్రచ్చి విషం ఇవ్వలేను,పులి చర్మం ఇచ్చే ధైర్యం లేదు. ఆభరణాలు ఇవ్వాలంటే పాములంటేనే నాకు భయం కనుక ఒక నమస్కారం చేస్తా క్షమించు అని మస్కా కొట్టారు. అయ్యా అని ఎన్నోసార్లు పిలిచినా “కుయ్యాలింపవు –రావయ్యా మ్రొక్కెద గదయ్యా బ్రోవరావయ్యా “అంటూ అయ్యాపదంతో ఆర్తిగా అర్థించారు.

"వర గాంభీర్యమగడ్తయై ధృతియే వప్రవ్రాతమై సద్గుణో త్కరముల్ సైన్యములై –నిజేంద్రియములే ద్వారములై తావక స్మరణ జ్ఞానమే ద్రవ్యమై యలరు యస్మత్స్వాంత దుర్గంబునన్-గరుణం గాపుర ముండుము "అని మంచి పద్యం శంకరుల శివానందలహరి శ్లోకం తీరులో రాశారు. తన విశుద్ధ హృదయ క్షేత్రంలో దురితారణ్యంబాగా పెరిగి. భయంకరంగా ఉందని. దాన్ని ఫాలనేత్రాగ్నితో భస్మీటలం చేసి కాపాడమన్నారు . సృష్టికి ప్రతి సృష్టి చేసే ఎంతటిమొనగాడైనా నిను కొల్వకపోతే "కడు దుర్గతి పాలౌతాడు " .

తనువు డస్సింది నాడులు సడిలాయి.బలం తగ్గింది.దంతాలు దిగజారాయి,జరా. మాంద్యం ఆక్రమించి క్రుంగ దీశాయి. ఇక నిన్ను సేవించ లేను. ఒక్కనమస్కారం చేస్తా మోక్షం ఇవ్వు అన్నారు. "నీ విశుద్ధ భజనలే మాకు అండా,దండా ".నీకోటి సూర్య ప్రభా రూపంతో నా అవివేక అంధకారానికి వెలుగు ప్రసాదించు. ఒకసారి నుదిటిపై ఏదో రాస్తే దానికే కట్టుపడాలా. అదిమార్చి నాకు సద్గతికల్గించు సర్వేశా అన్నారు చమత్కారంగా. నిన్ను అర్చించక స్మరించక నుతించక ఉన్నవాడు పుట్ట గానే చావటం మంచిది.

"భూమీచక్రము స్యన్దనంబుగ,నభంబు న్నీ కపర్ధంబు-స్వామీ దిక్కులు కట్టు పుట్టములుగా వర్ధిల్లు నీ ఉన్నతా-వేమూలం గలదంచు సెంతునిక "నాకు ఈభావం చెప్పి ప్రేమతో దయచూడుకోటీశ్వరా " అన్నారు. ఆద్యం లేని సర్వాత్మ స్వరూపం చిద్యాగం చేసేవారికి స్వస్తి. మోక్షమిచ్చే సామర్ధ్యం నీదే.

చివరి నూరవ మత్తేభ పద్యం –"బలు పెక్కన్,సమరప్రధాన విజయ ప్రస్ఫూర్తి లేదింక,నా - సాలు దృగ్జాలము చిక్క జేసే నను దీక్ష్ణంబౌ తపో వృత్తి గే-వల మాసింపక. తల్లిదండ్రి గురు నాప్త శ్రేణినీవంచు మా-యలచే ద్రెళ్ళగ ముక్తి మార్గమిడి డాయం జేర్పు కోటీశ్వరా "అని శతకం ముగించారు.

కవి తనగురించి తన కుటుంబం గురించి ఏమీ చెప్పలేదు. మత్తేభ,శార్దూలాల పై సులభంగా భక్తి స్వారీ చేశారుకవి. కవిత్వం లో కుంటులేదు. గెంతులు లేవు. హృది నిండా కోటీశ్వర ధ్యానమగ్నత తో ఇంపుగా కూర్చిన శతకం. శతకం లో భావాలు సాధారణంగా అందరు భక్తకవులు రాసేవే. నాకే ఈశతకాన్ని ఇదివరకు ఒకసారి పరిచయం చేశానేమో అనే భ్రమ కలిగింది. కోటీశ్వర శతకాన్ని. శతకకర్త ఈశ్వర ప్రగడ నృసింహా రావు గారిని పరిచయం చేసి పరమేశ్వర దర్శన భాగ్యం పొందాను. కవి గారి ఇంటి పేరు లోనే ఈశ్వర శబ్దం ఉంది అందులో ప్రగ్గడ శబ్దం వారి కవితా ప్రతిభకూ నిదర్శనమే. కవి నృసింహుడు అంటే కవితలో నృసింహుడు. కానీ ఇందులో ఉగ్ర నరసింహుడు కాడు,ప్రహ్లాదవరదుడైన వాత్సల్య నారసింహుడు అనిపించారు.

## 67 శ్రీ లక్ష్మీ నారాయణ శతకం -- శ్రీ సందడి నాగయాభి



కృష్ణా జిల్లా నందిగామ తాలూకా వత్సవాయి దగ్గర దబ్బాకు పల్లి గ్రామం లో కొలుపై ఉన్న శ్రీ లక్ష్మీ నారాయణ స్వామిపై. ఆ గ్రామ కాపురస్తుడు "శ్రీ లక్ష్మీ నారాయణ చరణారవింద మరంద పానేందిందిరాయ మాన మానసుండు శ్రీ సందడి నాగయాభి ధానన భాక్తాగ్రేసరుని చే రచించబడిన శ్రీ లక్ష్మీ నారాయణ శతకం ను. ఆ గ్రామ కాపురస్తులు శ్రీ సందడి శ్రీరామదాసు గారి సంపాదకత్వం లో 1938లో విజయవాడ ఆంధ్ర గ్రంధాలయ ముద్రాక్షర శాలలో ముద్రింప బడింది. వెల తెలుప బడ లేదు. శతకానికి ముందుమాట రాసిన రామదాసు గారు –తన తండ్రిగారు శ్రీనాగదాస దేశికులు ఈ శతకాన్ని బాల్యం లోనే సీస పద్యాలుగా 1886లోనే రచించి ముద్రించారని., కానీ దాని ప్రతులు అలభ్యంగా ఉన్నందున ద్వితీయ ముద్రణ కోసం ప్రయత్నిస్తుంటే అందులో 8పద్యాలు పూర్తిగా శిదిలమైనట్లు గుర్తించి తనకు తెలిసిన మిత్రులు శిష్యులు. శతక పాఠకులను విచారించగా. వారెవ్వరికీ ఈ శిధిలపద్యాలు జ్ఞప్తిలో లేనందున. వేరెవరితోనైనా రాయించే ప్రయత్నం చేయగా ద్వితీయ ముద్రణకు తోడ్పడిన శ్రీమతి వినగంటి లక్ష్మాంబ గారు త్వర పెట్టటం వలన ఆప్రయత్నం విరమించి ఉన్న పద్యాలతోనే శతకాన్ని పునర్ముద్రించినట్లు తెలియజేశారు. శతకం మకుటం –"లక్ష్మీ నారాయణాబ్జాక్ష లలిత వక్ష ".


శ్రీ లక్ష్మీనారాయణ శతకము

సంపాదకులు :

సందడి శ్రీరామదాసుగారు

దబ్బాకుపల్లి

కృష్ణాజిల్లా

అన్త్యప్రాసాష్టకం తో మొదటి సీసపద్యం రాశారుకవి –"శ్రీకర దివ్య లక్ష్మీ వక్ష మురశిక్ష –దానవ గర్వ విదార దక్ష –మౌని రాడ్హృదయ దుర్మలమోక్ష నిటలాక్ష –గణన సద్గుణ సుధీ కల్ప వృక్ష

యధిక కిల్బిష గజహర్యక్ష నిరపేక్ష –సాత్విక భక్తపోషణ సుదీక్ష –యమర వందిత త్రిభువనాధ్యక్ష కనకాక్ష –మర్దన సర్ధర్మ మనుజ పక్ష

నుతకర యక్ష బాలిశ తతి పరోక్ష –యోగి హృత్ప్రేక్ష విదళితయుగ్ర కక్ష

నతజన సురక్ష ఘన కరుణా కటాక్ష –లక్ష్మీ నారాయణాబ్జాక్ష లలిత వక్ష ".

తర్వాత స్తోమ భీమ దామకామ సీమ లలామ. పరంధామ. భూమ రామ లతో చక్కని పద్యం అల్లారు. తర్వాత పాత్ర గాత్ర చారిత్ర మొదలైన పదాలతో స్వామికి కీర్తించారు. ఎనిమిదవ పద్యంలో గానవినోద సంగర రిపుమద –మహిత లోక విలాస మందహాస "అంటూ ప్రారంభించి –"అతుల రత్నకిరీట భణిత నిశాట-వందిత విధాత కవిజన పారిజాత –నత జన సురక్ష ఘన కరుణా కటాక్ష "అని ముగించారు. ఆతర్వాత అంత్య ద్విప్రాస సీసం కరిగించి పోతపోశారు. పిమ్మట నామ స్తోత్రత్రయం గా "వామనాదోక్షజ,వైకుంఠ మాధవ కేశవ-కేశవాచ్యుత హృషీకేశ శౌరి "అని ప్రారంభించి "విశ్వమూర్తి మహామూర్తి వినుతకీర్తి –దీప్తమూర్తి రమూర్తిమాన్ దివ్యమూర్తి –నతజన సురక్ష ఘన కరుణా కటాక్ష "అని పూర్తీ చేశారు. విష్ణు సహస్ర నామాలను పద్యాలలో పొందు పరచారు. ఆద్యంత ప్రాసిక సీసం కూర్చారు

పునః పునరుక్తి నామ స్తోత్రత్రయంగా –"పరిపూర్ణ పరమేశ. పరమ పరంధామ –పరమాత్మ మాధవ పరమ పురుష ---"ఆది మధ్యాంత శూన్య సర్వాంతరాత్మ –నతజన సురక్ష ఘన కరునాకటాక్ష "రాశారు ఆతర్వాత దశావ తార దశకం రాశారు. ఆతర్వాత ప్రార్ధనా అష్టదశపద్యాలు కూర్చారు. అన్నిట్లోనూ శ్రీహరినామాలు

మారుమోగించారు. నామ ప్రభావ ద్వయంగా రెండు పద్యాలు రచించారు. దృష్టాం తైక వింశతిలో –"తల్లిదండ్రులు పుత్రు దండించ దలచిన పరులు వలదని అడ్డగించరాదు"అని నీతులు బోధించి, మట్టిగణపతిని పూజించిన గాణాపత్యులకు ద్రవిణం కలిగిందని. పీరులను గొలిచిన పేద తురకలకు ధన సమృద్ధి కలిగిందని. శాంభవిని కొలిచే శాక్తేయులకు భోగభాగ్యాలు కలిగాయని. రాతిలింగాన్ని చేతిలో పట్టుకొని పూజించే శైవులు శాశ్వతంగా ఐశ్వర్య వంతులయ్యారనీ "ఎన్నివిధలుగా నిన్ను కొలిచే భక్తులే కదయ్యా దరిద్రంలో మగ్గుతున్నారు "అని ఒక చురక అంటించారు కవి. మరోపద్యంలో సుగుణ విహీనుడైన విద్వాంసుని కంటే "నిను భజించేడు బాలిశ జనుడు మేలు "అని ధైర్యం చెప్పారు.




తర్వాత చెప్పిన "వైరాగ్య త్రయో దశ "పద్యాలలో – సంసారాన్ని నమ్మి సంతోషిద్దాం అంటే భార్య పిల్లలు కలిసిరారు. డబ్బు సంపాదిద్దామంటే పూర్వజన్మ సుకకృతంకావాలి. శరీరం చూసి పొంగిపోదామంటే పుట్టేడురోగాలతో కునారిల్లి పోతున్నాను. ఎక్కడ చూసినా సుఖం లవ లేశం కూడా లేదు నారాయణ ప్రభో నువ్వే అన్నిటికీ దిక్కు అని దిక్కులు పిక్కటిల్లెట్లు మొరపెట్టుకొన్నారు. బాల్యంలో ఆటలపై లౌల్యం యవ్వనం లో మన్మధ బాణాలతో సతమతం. ముసలితనం లో చీకూ చింత తో సరిపోయింది "స్థిర చిత్తం తో ఒక్క నిమిషమైనా నీస్మరణ చేయలేకపోయాను ఇప్పుడు అన్నీ వదిలి నిన్నే శరణుకోర్తున్నాను. కాపాడు నృసింహా.

"నువ్వూ నేనూ వేరు అనే భేదాన్ని వదిలి "సమస్త కళేబరాలలో ఉన్నది ఒకే పరమాత్మ "అని గుర్తించాలి. నిన్ను సేవిస్తూ నువ్వే నేను అనే భావం పొందాలి

నీవెలుంగుదు గావున ♦ నిత్యవిమల
చిత్స్వరూపుఁడవీవు సి♦ రిప్రియనాథ
నతజనసురక్ష ఘన కరు♦ణా కటాక్ష
లక్ష్మినారాయణాబ్జాక్ష ♦ లలితవక్ష

ఇది వస్త్ర మిది ఛత్రి ♦ మిది మఠంబిది ఘటం
బిదియు శయ్యముగాఁ గ్రిందు ♦ మిదియటంచు
ఇదివనం బిదిఘనం ♦ బిది శైల మిది శైల
మితఁడు ప్రభాకరుం ♦ డివి గ్రహములు
ఇదిస్వాంత మిదిశాంత ♦ మిదిజ్ఞాన మిదిమాన
మిదియు శేముషీచిత్త ♦ మిదియటంచు
బాహ్యాంతర పదార్థ ♦ భానముల్వేర్వేఱ
సాధనంబును లేక ♦ సాక్షివగుచు

99 వ పద్యంలో భక్తాగ్రగాన్యులైన ప్రహ్లాద నారద పరాశర భీష్మ. గుహ విభీషణాదులను కీర్తించారు. 102వ పద్యంలో తారణ నామ సంవత్సరం మార్గశిర శుద్ధ తదియనాడు శతకాన్ని పూర్తీ చేశానని. లక్ష్మీ నారాయణస్వామికి అంకిత మిచ్చానని చెప్పారు కవి. .

సందడి నాగదాస కవి గొప్ప హరి భక్తులు. ప్రతిపద్యంలోనూ భక్తీ ప్రవాహం పొర్లి పొరలింది. పద్యాలు మహావేగంగా పరిగెత్తాయి. సర్వ వేదాంత రహస్యాలు చొప్పించారు. నీతులు బోధించారు. సర్వమత సహనం పాటించారు. శైలి అమోఘం. ద్రాక్షా పాకం తో శతకం మనల్ని భక్తి,ప్రపత్తులతో వోలలాడిస్తుంది.

సుమారు 136 ఏళ్ళ క్రిందటి భక్తి శతకం. మేలిమి బంగారం గా విలసిల్లిన శతకం. కవి ధన్యులు. నిలువెల్లా భక్తి తో నిండి పరమాత్మ కైంకర్యంగా రాసి సమర్పించిన సీస మాలిక ఇది.

నా అదృష్టం వలన ఈకవినీ శతకాన్ని పరిచయం చేసే భాగ్యం నాకు దక్కింది

మీ –గబ్బిట దుర్గాప్రసాద్ -22-12-22-ఉయ్యూరు

## 68 ఏక ప్రాస శ్రీ కృష్ణ శతకం -- శ్రీ ఏనుగు తమ్మిరాజు కవి



వెల-కేవలం" భక్తి "గా ఏక ప్రాస శ్రీ కృష్ణ శతకాన్ని,అంతకు ముందే శ్రీరామ శతకం రాసిన అనుభవంతో తూగోజి లోని "కాజాలకు,పూతరేకులకు "ప్రసిద్ధి చెందిన "తాపేశ్వరం" నివాసి శ్రీ ఏనుగు తమ్మిరాజు కవి రచించి. రాజమండ్రి శ్రీ రామముద్రాక్షర శాలలో 1924న ప్రచురించారు. ఇది కంద పద్య శతకం ".కృష్ణా"అనేది శతక మకుటం. " ర "కార ప్రాస తో రాసిన శతకం.

"శ్రీరామనామ తారక –మేరీతి నుతించె మున్ను నిష్టాప్తికి. నా –గౌరీ మనోజ్ఞా భాస్కరు –నారాధించెద ద్రిశుద్ధి ననిశము గృష్ణా "అని శతక ప్రారంభం చేశారుకవి. గౌరీశుని కొలిచి తర్వాత భారత వంశాన్ని ప్రస్తుతిస్తానని చెప్పారుకవి. భారతావనిలో పుడితే పాపాలుపోయి విష్ణు సేవా పరతంత్రులౌతారు,నానా ధర్మోద్ధరణతో వన్నె. వాసికెక్కుతారు. "సత్యం వద ధర్మం చర"నుబోదిస్తూ ఆచరిస్తారని. భారతపుత్రులు సద్గుణ రాసులు. సకల కార్య సాహసులు. యశోదీరులు. శూరులు. విమలాకారులు. కరుణాస్వరూప కలితులు అని హామీ యిచ్చారు. తర్వాత "భారతము చదువ కుండగ- నేరిచిన కవిత్వ మెల్ల నీరస మగుటన్ –భారతము జదివి పిమ్మట –ధీరులు చెప్పెదరు కవిత ధీ ధృతి కృష్ణా"అని భారత ప్రాశస్త్యాన్నిప్రస్తుతించారు. భారతం లోక పూజ్యమని కీర్తించి. భారత కవిత్రయానికి ప్రమాణాలు సమర్పించారు. జీవకోటికి రాజేతల్లీ తండ్రీ. రాజుమాట అందరికి ఆచరణీయం. నరపతి ధర్మం తప్పితే. నరులు అక్రమ భూషణులైతే. కరువుకాటకాలు తప్పక వస్తాయి.

శరణు అన్నవాడిని రక్షించకపోతే ఆపాపానికి రాజు మరణం పాలౌతాడు. భూరమణుడు క్రూర అమాత్యుల మాటలకు అధిక ప్రాధాన్యమిస్తే "కొంప కొల్లేరు "అవుతుందని రాజులకు హెచ్చరిక చేశారు. రాజు పాలించే రాజ్యం పాప భూయిష్టం అయితే అందులోని "శూరులు జీవచ్చవాలు. క్రూరులు మృతజీవులు అవుతారని చెప్పారుకవి. "రాజ్యాంతే నరకం ధృవం "అని పరమపావనులు వాక్రుచ్చారన్నారు. "నరజన్మ మెత్తినందుకు – కరుణారస మొందుహృదయకమలము నందున్ –గురితించి. జీవకోటిని బరికించుట భావ్యమండ్రు ప్రాజ్ఞులుకృష్ణా ".మరణ భయంతో నరులు దారీతెన్నూ కానక పరితపిస్తున్నారు –"మరణించటం జన్మించటం పరమాద్భుత ప్రకృతి చర్య "అని చక్కగా చెప్పారు. "మరణార్తి దీర్చి బ్రోవగ సరగున ప్రత్యక్ష మవటం నిజం నిజం.

శ్రీరామ తారకమంత్ర ప్రాశస్త్యం వర్ణిస్తూ –"శ్రీరామనామ తారక – సారామృతపానమత్త స్వాంతుడు "జననమరణ క్రూర రుజా ఘోరభీతి చెందడు అని అభయమిచ్చారు కవి. వీరులలో వీరుడివిగా,రాజులలో రారాజువుగా. శూరులలో శూరుడివి గా "పౌరుష కీర్తులు గడించి ప్రబలినావుకృష్ణా "అన్నారు. సద్గుణాలు ఎన్ని ఉన్నా. లోభం ఉంటె "చిరజీవి రీతి బ్రతికెడు –చరజీవి "అంటారు. నీకొడుకు మారుడు. పాంధలోక మారకుడు. దుర్వారుడు ఇలాంటి విచిత్రం ఎక్కడైనా ఉందా ?అని చిత్రంగా కడిగిపారేశారు. "నీకుమారుడు మారుడు క్రూరుడు. శుకపిక వారమైన సేనతో దుర్వారంగా ఉంటాడు "వాసంతిక భారము తాళజాలునే –నారీమణి రాధ జీవనమ్ములకృష్ణా "అని ప్రశ్నించారు.




క్రూరత్వంతో దుష్ట చతుష్టయం అభిమన్యకుమారుని చంపినా. "మారణము జేయ నెరిగియు –గారణ మెరిగింపని ఘనుదవునువ్వు "అని నర్మోక్తితో పలికారు. తర్వాత కృష్ణావతార గాధను కమ్మని పద్యాలలో పలికించారు. దేవకీ కొడుకు యశోదానంద వర్ధనుడవటం "ఏరికి గల్గని భాగ్యం –బీరీతి లభించే గొల్ల కేమందు భళీ !వారెట్టి పుణ్యమూర్తులో. వారెట్టి తపః ప్రభావ భవ్యులో ", అని యశోదానందుల అదృష్టాన్ని కొనియాడారు. వీరికి పుట్టిన బిడ్డగానే భావించి వ్రేపల్లె పల్లెపడుచులు ప్రొద్దున్నే వచ్చి మంగళహారతి పట్టారు శిశు బలరామ. కృష్ణమూర్తిలకు .

“హారతి గైకొనవేమొకో- మారా సుకుమార మారమా హ్యాచ్చారా –మారాకారా యని వె-మారాసుకుమారులు గూర్చి మగువలు కృష్ణా” అని సుకుమార పద్యరాజాన్ని అత్యంత సుందరంగా భావ గర్భితంగా రాశారుకవి తానూ మురిసిపోయి. మనలనూ మురిపించారు. ”ఆరేళ్ళ ప్రాయంలోనే మేనమామ కంస రాజును మారణం చేశావు “మాయురే కృష్ణా అని ఆశ్చర్యపోయారు. గోపవనితల విరహాలు తీర్చాడు. కేళి కారతిలో కరగించి. వలపు తెనేలలోవంశీ నాదంలో ఆనంద సాగరంలో ముంచి తేల్చావని పొగిడారు. భయం వద్దు “మై హూనా “అంటూ “మీరెలా చింత పొందెద-రీరేల నిరతంబు నిట విహరింపన్ –మీరతి సౌఖ్యము బొందగ-గోరికలీడేరు ననెదుకొంటెవు కృష్ణా “అని ద్వంద్వార్ధ ప్రయోగంతో అతిసౌఖ్యం, రతి సౌఖ్యం కలిగించి తృప్తి చెందిస్తానని కొంటె కృష్ణయ్య అన్నాడని బలే రంజుగా చెప్పరుకవి. ”ఏరీ భూతములైదును. -నుదారతస్సృష్టించు నట్టి దైవము మాకీ –తీరున బొడసూపుట మా –భూరి ప్రాభవము గాదె పుణ్యా కృష్ణా “అని తమ అదృష్టానికి గొల్లెతలు పొంగిపోయారట.

“శారద చంద్ర జ్యోత్స్నల -సారెకు సారెకు బిల్చి సారసముఖులన్ –గూరిమి రాసక్రీడలు “కోరతావట ఇది న్యాయంగా ఉందా కృష్ణా “అని నిలేశారు కవి. ఒక్కపెళ్ళాం తోనే వేగలేక మేము బెంబేలెత్తి పోతుంటే “ఎలా పెళ్ళాడావయ్యా పదియారువేల దండ్రీ కృష్ణా “అని బోల్డు ఆశ్చర్యపోయారు. నరనారాయణులు పరమ తపోధనులు ధర్మమార్గాన్వితులు భారతావనిలో జన్మించటం మన అదృష్టం అని పొంగిపోయారుకవి. కురుపాండవ యుద్ధం లోధర్మ మూర్తులైన పాండవులపక్షం లో ఉంటూ “పార్ధునికి సారధి వైతివి భళీ !నీ సారధ్యము చిత్రమే కాదు లోకపావనం గీతా మకరంద సారజన్యం “అంటారు. ఆయుక్షీణం,స్థిర చిత్త వినాశకం. ధీ మాంద్యం. మరణ ఆసన్నం “పరకాంతా విహరణం “అని గొప్ప సూక్తి పలికారు.

ఏమీ తెలియకపోయినా. విద్యలేవీ నేర్వకపోయినా అంతులేని నీ కృపారసం నాపై ప్రవహించగా –”శ్రీరమ కృష్ణ శతకము –లీరీతి రచించి నాడ నేక ప్రాసన్ మీరరసి వీని దోషము -లారూఢి,క్షమింపవలయు ననిశము కృష్ణా “అని అపరాధ శతం గా 123 వ పద్యం చెప్పారు కవి. 124చివరి కందం లో “ఏనుగు ఋచ్చిరాజు కుమారుడు- ”కవితా స్వారస్యామృత పాన వి-చార సదాచారనయుడు సాకుము కృష్ణా “అని తండ్రిపేరు చెప్పి సాకుము అని విన్నపాలు విన్నవించారు కవి. అత్యద్భుతకవితాదార ప్రతి కందంలో అందంగా కనిపిస్తుంది. కంద పిలకలు లాగా పద్యాలకుదురు మహదానందాన్ని కలిగిస్తుంది. ఒకరకంగా కందంలో కవితామరందాన్ని నింపి, ఆనంద అమృతాన్ని మనకు పంచిపెట్టారురుకవి. తాపేశ్వరం కాజాల. పూతరేకుల తీపితనం ప్రతిపద్యంలో నింపారు.

పూతరేకులు తయారు చేయటం గొప్ప విద్య. అందులో నాణ్యత ప్రధానం. ఆ నాణ్యతా ఆ తీయందనం ప్రతిపద్యంలో గోచరించింది. కాజా సౌందర్యం. ఊరే రసం పద్యాలలో తొణికిసలాడాయి . ఊరిపేరుకు ఈరకంగా శతకంతో గౌరవం చేకూర్చారు తాపేశ్వర కవీశ్వరులు తమ్మిరాజుకవిరాజు. ఆయన ధన్యులై. మనల్నీ ధన్యులని చేసి తరింప జేశారు. మహా భక్తకవి శ్రేణిలో నిలిచారు ఈ కవి వరెణ్యులు. కవిగారినీ శతకాన్ని పరిచయం చేసి, నేను ధన్యత చెందాను.

## 69 సీతా రామస్వామి శతకం -- శ్రీ భల్లం పాలన్ రాజు కవి

నరసింగు పాలెం వాస్తవ్యులు శ్రీ భల్లం పాలన్ రాజు కవి రామస్వామి శతకం రచించి. ఆగిరిపల్లి వాస్తవ్యులు శ్రీ పొన్నం చలమయ్య ధన సహాయం చేత బెజవాడ శ్రీ వాణీ ముద్రాక్షరశాలలో 1929లో ముద్రించారు. వెల-తెలుపలేదు. 'ఆగిరిపల్లి ధామ వర 'రామా. తారక బ్రహ్మమా "అనేది శతకం మకుటం. ఆగిరిపల్లి లోని సీతారామ స్వామి పై రచించిన భక్తి శతకం ఇది.


సీతారామస్వామిశతకము.

1929

సూటిగా ఉత్పలమాలలో చలంయ్యగారిని కీర్తించాడు కవి. చలమయ్య గారు స్వామి దయతో ఆగిరిపల్లిలో గుడికట్టి అందులో సీతా రామస్వామిని ప్రతిష్టించాను. ఆయనపై ఒక కృతి రాయమని కవిని కోరితే ఈశతకం రాశానని చెప్పాడు.తర్వాత చలమయ్య వంశ చరిత్ర 18పద్యాలలో రాశాడు.

మొదటి శార్దూల పద్యం లో –"శ్రీ రమ్యంబగు రూప సద్గుణములన్ చెల్వొందు భూజాత శ్రం –గారానంద మనప్రియుండ,బుధ సత్కారుణ్య సంధాన. బల్-ధీర స్వాంత,త్రిలోకపాలక మమున్ దేవా కృపన్ బ్రోవు వి-స్తారం బాగిరిపల్లి వాస వర సీతారామ సద్బ్రహ్మమా ".. తర్వాత శ్రీరామ జన్మకారణం,కౌశికు యాగ రక్షణం. ధరణీ జాత తో కల్యాణం. రావణ సంహారం. వాలి వధ చేసి సుగ్రీవునికి రాజ్యం ఇప్పించటం. గుహుడి అనన్య రామభక్తి. "స్వాంతోచ్ఛిష్టములైన పండ్లునిడిన "శబరికి మోక్షమివ్వటం., కాననం లో నారాయణ పుణ్య వార్తన కథలు వినటం. శూర్పణఖ చుప్పనాతి తనం. పొందిన పరాభవం. మారీచ మద గర్వం అణచటం. దుష్ట రావణుడు సీతాదేవిని అపహరించటం వాడితో యుద్ధం చేసి "మర్మ స్థానములన్ చలింప పుడమి పై చేర్చటం. రామునిపై సద్భక్తి తో "సమీరానందనుడు విద్యాద్విశ్వ రూపం చూపగా. శక్తినిచ్చి బంటుగా చేసుకోవటం. "వారాసిన్ గడు బాణ కోణ శిఖి చే వంచించి బిందోప మాకారం బందగ"చూపిన భుజపరాక్రమం. వారధి కట్టినప్పుడు ""ఉడుత విధ్యుక్త సత్కారమున్ కృపతో గన్గొని. మోక్షమిచ్చిన దయా గుణం. అన్నరావణుడికి నీతి చెప్పిన విభీషణుని చేరదీయటం. "ముని

సంఘంబు సురల్. నరుల్ మనమునన్ మోదంబు సంధిల్లుచున్ "రావణ వధ చేయటం. సీతను గౌరవంగా చేర్చుకొని అయోధ్యకు వచ్చి పట్టాభి షేకం జరుపు కోవటం అనే రామకథను వర్ణించాడు కవి.

"సుగ్రీవాంగదజాంబవంత హనుమచ్ఛూరుల్. సుశేషణాది శౌర్యాగ్రులను "మోదం చెందగా బ్రోచాడు రాముడు. "నీలాభ్రోపమ,సుందరాంగవిభవా. నీరేజ పత్రాంబకా –లాలిత్యంబగు పూర్ణ చంద్ర ముఖ దుర్వారాఘ విధ్వంసకా –భూలోకోన్నతిశౌర్యవర్తన మహాపుణ్య ప్రజానీక స-త్పాతాలాత్మాగిరి పల్లి ధామ వర సీతారామ సద్బ్రహ్మమా "అంటూ చక్కని ధారతో పద్యాలు రాశాడు కవి. "దుర్మానుష్య మదాంధకార రిపులున్. దోషాచరుల్. దుర్గుణుల్-మర్మాత్ముల్. దురిత ప్రవర్తన జడుల్.మాయాసుర ద్వేష దు- ష్కరుల"ను నాశనం చేసి ప్రజలనుకాపాడినవాడు రామప్రభువు.రామ పదాబ్జాలు మనసులో నిలుపుకొని "రామారామా "అంటూ నామోచ్చారం చేస్తే మోక్షమిస్తాడు. "శ్రీరామా యను మంత్ర రాజము మదిన్ శీతాద్రి సత్పుత్రి ప్రుత్సారంబొప్ప జపించి శాశ్వత మహా సౌఖ్యాలు "పొందింది. వాల్మీకి ధ్యానించి జపించి" రామాయణం రాసి సౌఖ్యపదం పొందాడు. "శ్రీరామార్పణమంటటంచు మది సంశీలంబు సద్భక్తి నింపార "గాదాన ధర్మాలు చేస్తే బ్రోచే టి సకల సద్గుణాభిరాముడు రాముడు. లోకోక్తిని చక్కగా పద్యంలో ఇమిడ్చి చెప్పాడు కవి.



సీతారామస్వామిశతకము.

దానధర్మాలు చేసినంత మాత్రాన మోక్షం రాదు రామనామ స్మరణ వల్లనే ముక్తి. "రామా రాఘవ. దాస పోషణ గుణా,రాజీవ నేత్రా. సురా-భీమ ప్రౌఢిధనుర్ధురీణ,భుజ భూభృద్వర్గ సంసేవ్య స-త్కౌమారాశ్రిత కల్ప భూజ వరదా కారుణ్య మౌనీ మనోద్ధామా "అంటూ కండగల పద్యాలు చెప్పగల నేర్పున్నకవి ఎక్కడా ధార కుంటు పడదు. రామబాణం లాగా సాగిపోతుంది మహావేగంగా పద్యం. "మీ బోటి బల్ సత్తామాత్రు నకంకితంబు నిడినన్ సారూప్య సాయుజ్య సంపత్తుల్ గూర్చి. యఖండ సౌఖ్య పదమున్ సత్కారం "చేస్తావు రామభద్రా అని మహదానందంగా చెప్పాడు.

చివరి శార్దూలం లో కూడా తనగురించి కవి ఏమీ చెప్పుకోకుండా –

"నీవే తల్లివి దండ్రివిన్. గురుడవున్. నీవే సబంధుండవున్ -నీవే దాతవు,నీతిబోధకుడవున్. నీవే మహా దైవమున్ –నీవే తప్ప నితః పరుల్ గలరె నే నిన్నున్ మదిన్ నమ్మితిన్ –దైవాగ్రాగిరిపల్లి ధామవర. సీతారామ సద్బ్రహ్మమా "

లోకం లోని భక్తీ శతకాలతో సరితూగేశతకం అనిపిస్తుంది ఈ శతకం. భక్తీ తాత్పర్యం రామనామ సంకీర్తనా మాధుర్యం అది అందించే మోక్షం. సద్గుణ లక్షణాలు కలిగి ఉండమనే ఉద్బోధ. దుర్మార్గం లో నడిచి పరందాముడికోపానికి లోని సద్గతి చేజార్చుకోవద్దనే హితవు అన్నీ గుది గుచ్చి రాసిన శతకం. కవి కృష్ణా జిల్లా వాడు కావటం ఆనందదాయకం. అందునా శ్రీ శోభనాచలేశ్వరస్వామి వెలసిన ఆగిరిపల్లిలోని సేతారామ స్వామిపై శతకం రాయటం మరీ సంతోషంగా ఉంది ఈ శతకాన్నీ కవినీ పరిచయం చేసిన అదృష్టం నాకు దక్కింది. భక్తీ శతకాలలో అగ్రశ్రేణి శతకాలలో ఒకటిగా నిలిచే శతకం ఇది.

కనుమ పండుగ శుభా కాంక్షలతో

70 చిద్విలాస శతకం -- శ్రీ రాప్తాడు సుబ్బదాసయోగి




ధర్మవరం కు చెందిన సురభి నాట్య కళా స్థాపనాచార్య,హరికథా ప్రవీణ శ్రీ రాప్తాడు సుబ్బదాసయోగి "చిద్విలాస శతకం "రాసి నిగమార్ధ చంద్రోదయ గ్రంథ మాల తరఫున,అనంత పురం విశ్వ నాథ్ ప్రెస్ లో 1948లో ముద్రించారు. తనను పుత్రునిలాగా సాకి పెంచిన. అతిదులపాలిటి కల్ప వృక్షమై రాజ రాజేశ్వరీ భక్తురాలైన అలవేలు మంగకు శతకాన్ని కవి అంకితమిచ్చారు. ఉదయం పూట. సాయంకాల సమయాలలో అందరూ చేయాల్సిన ప్రార్ధన పద్యాలు ముందు రాశారు కవి. ఇంతకు ముందే కవి

అభిజ్ఞాన జయదేవ నాటకం. పశు యజ్న ఖండన. మానస గీతావళి. స్త్రీలకోసం ఆత్మారామ గేయాలు. స్త్రీలకు పరమేశ్వర శతకం. విష్ణు నామావళి రాశారు.

పీఠిక లో "ఉత్తమాశ్రయమైన కావ్యం ఉత్తమోత్తమం. భగవంతుని విభూతి చిద్విలాసాలను గురించి అనుభవైక వేద్యంగా కవి శతకం రాశారు. వారి వేదాంత విజ్ఞానమంతా కుప్పబోశారు. సమస్త అనుభవ సంమేలంనం గా శతకం ఉంది. సమస్త సృష్టిజాలం లో ఈశ్వరుని దర్శించి ఆఆనుభావాన్ని మనకు కవితా ప్రసాదంగా అందించారు కవి. స్వతః గాన విశారదుడైన కవి. శాంతరసం అద్వితీయంగా పోషించారు. అద్భుత. కరుణలు అనుపానంగా ఉన్నాయి. చిన్న వాక్యం లో దొడ్డ భావాన్ని కల్పించారు. స్వభావోక్తి అలంకారం శతకానికి దివ్య శోభ కూర్చింది. సీసాలు శ్రీనాథుని సీసాలను తలపిస్తాయి "అని రాశారు ధర్మవరం బోర్డ్ ఉన్నత పాఠశాల సంస్కృత పండితులు శిరోమణి. విద్వాన్ కలచ వీడు శ్రీనివాసా చార్యులు PGL.


ఓమ్
చిద్విలాస శతకము
రాప్తాడు సుబ్బదాసయోగి
వెల 0-12-0

పండితాభిప్రాయాలు తెలిపినవారు -1-పేటపాలెం కు చెందిన శ్రీ ములుకుట్ల పున్నయ శాస్త్రి భాగవతార్ –"చెరుకు పానకం లో అద్దిన కలంతో పద్యాలు రాసినట్లు వినూత్న కళా విలాసంగా ఉన్నాయి. మోక్షగామికి ఎంతో ఉపయోగపడుతుంది. సుజ్ఞాన సాధనంగా. ముక్తి కోరేవారికి అమందానం దాన్ని ఇచ్చేదిగా. భక్తియోగాత్మకం గా ఉంది "అని రాశారు. 2-కడప జిల్లా రాచ వీడు కు చెందిన శ్రీ బిరుదరాట్ రంగరాయకవి –"శ్రీ మృదుల కవిత్వ రసామృత లహరీ జనీ ప్రచంగ బ్రాహ్మి ధా-మా మానవ సార్ధక నామా అని కవిని ప్రశంసించి. ప్రకృతి సౌందర్యం. సత్య ధర్మ ఐక్యత దీనజనావన పోషణ. జంతు సంతానైక్యం అన్నీ ఉన్న "నిన్ను ఎన్నుట ఎట్లు ?"శతక చిద్విలాసాన్ని చవులూరగా చదివాను. దీని సాటి శతకం లేదు "ఎందాక ఇన సుధాకర. ప్రపంచం ఉంటాయో అందాకా ఈ శతకం చిరంజీవిగా ఉంటుంది". 3-అనంతపురానికి చెందిన మహామహోపాధ్యాయ. కళాప్రపూర్ణ డాక్టర్ చిలుకూరి నారాయణ రావు గారు –"కవి నాకు సుపరిచితులు పరోపకార పారీణులు అనటానికి వారి శంకర మఠమే ప్రత్యక్ష నిదర్శనం. ఇప్పటికే ఎన్నో కావ్య నాటకాలు రాసిన అనుభవజ్ఞులు. శతకం ఉన్నత వేదాంత శోభా ప్రకాశం. ధారాళమైన

పద్య శైలి “4-బెజవాడ కు చెందిన అవధాని శ్రీ దోమా వెంకట స్వామి గుప్తా –”మనోహరంగా భక్తి నీతి వైరాగ్యాలను శతకం లో పొందుపరచారు. ధర్మవరం లోని వీరిఆశ్రమం దీన జనులపాలిటి కల్ప వృక్షం”అన్నారు 5-పెద్ద బల్లాపురం కు చెందిన సిద్ధాంత విశారద,సూపరిం టేండెంట్ శ్రీ యం.ఆర్యమూర్తి –”భారత పతివ్రతామతల్లులమహాత్మ్యం భ్రాతృ వాత్సల్యం. శమదమాదుల విశేషాలు మీ శతకం లో పొందుపరచి ఆబాల వృద్ధులకు మహోపకారం చేశారు. శతకం సరళ సుందరం “అన్నారు.

మున్నుడి లో దాసయోగి కవి –”1925లో సుప్రకాశ శతకం రాసి ప్రచురిస్తే వెంటనే అమ్ముడుపోయాయి. అందులోని కొన్ని పద్యాలు కలిపి చిద్విలాస శతకం రాశాను. హరికథా విశారదుడు నా రెండవ అన్నగారు. శ్రీ రాజరాజేశ్వరీ ప్రసాద లబ్ధ నా సోదరి. నా ఇద్దరు భార్యలు వెంటవెంటనే మృత్యు వాత బడగా. నిస్పృహతో వైరాగ్యం పొంది. హఠ యోగాశ్రమం స్థాపించి. 1926లో తీర్ధ యాత్రలు చేస్తూ. అక్కడి ఆశ్రమాలు సందర్శిస్తూ నేపాల్ కాశ్మీర్ లలోని ఆశ్రమ విశేషాలు గ్రహిస్తూ. ప్రకృతి సౌందర్యానికి పులకితుడనై రాసిన పద్యాలు ఇందులో చేర్చాను. హిమవత్పర్వత ప్రాంత శోభను ఒక్క సారి అయినా చూసి అనుభవించకపోతే జీవితం వ్యర్ధం అని తెలియ జేస్తున్నాను. తర్వాత వానప్రస్థాశ్రమం వదిలేసి సన్యాసాశ్రమం స్వీకరించి మళ్ళీ ఆయా ప్రదేశాలను సందర్శించాలను కొన్నాను. ఈ శతకానికి పీఠిక రాసినవారికి పండితాభిప్రాయాలు సెల విచ్చిన వారందరికీ కృతజ్ఞతలు “అన్నారు వినయంగా. ”చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస “అనేది శతకం మకుటం. సీస. గీత పద్య శతకం. ఎందఱో పండితకవులు విశ్లేషకులు కవి గారి గురించి శతకాన్ని గురించి చెప్పారు కనుక నాపని తేలికైంది.

మొదటి సీస పద్యం –”శ్రీ కరుణా రస సింధు వాత్సల్యైకపూర్ణుండ పైన నీ పూజ్య యశము –అణువణువాదిగా. నా బ్రహ్మ పర్యంతమావరించిన నీదు నమితమహిమ –నిఖిల జగజ్జాల నిర్మాణ మున గడు ప్రకటితం బైన నీ ప్రాభవంబు –నిఖిల లోకుల నిర్నిద్ర శక్తిని –గాను సన్న నడుపు నీ కౌశలంబు

తే.గీ. -గాంచి యుప్పొంగి. నీ తత్వ మెంచి పొగడి –భక్తి తొలుకాడ మృదుల భావములు పొదల –శతక మర్పింతు-గ్రహియింపు హిత మనీష –చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస “అని శతకాన్ని అంకితం పుచ్చుకోమని సర్వేశుని కోరారుకవి. తర్వాత “శ్రీదమై. ఖేదాపనోదమై. కలిత వినోదమై. సంతతామోదమై. భావ్యమై. సుజ్ఞాన సేవ్యమై. నిగమ వాస్తవ్యమై. సజ్జన స్తవ్యమై అందమై సచ్చిదానంద మై రుచిమూలమై

కళ్యాణ బృందమై. లలితమై మాధురీ కలితమై. ప్రాక్పుణ్య మిళితమై. పీయూష తులితమై. రుచిరమై. సాధుజన సభా ప్రచురమై వెలిసేఈ శతకం లో అమృత వృష్టి కురిపించు"అని అద్భుతావహమైన పద్యం రాశారు.

తర్వాత సంస్కృత ఆంధ్రాలు బోధించిన నల్లప గురువును. లక్షణ గ్రంధాలు నేర్పించిన సుబ్బా గురు ని. ఆయుర్వేదం నేర్పిన గొట్లూరు సుబ్బయార్యుని. అద్వైతం బోధించిన సింహగురుని స్తుతించారు. ఆతర్వాత ఆసేతు హిమాలయ వర్ణన. భగవత్ సృష్టి విచిత్రం. మనిషి జన్మ సార్ధకం అన్నారు. భూమి ఇసుక మట్టి. కొండ మలయమారుతం అన్నీ మందులే. నువ్వు భవ రోగ వైద్యుడివి. గడ్డిపోచను కూడా సృష్టి చేయలేని నిస్సహాయత మాది. పాండవుల కష్టాలు తీర్చి. సేతువుకట్టి. ఇంద్రుడు వృత్రాసురుని చంపటం అన్నీ నీ కరుణతోనే . అమల సుజ్ఞాని ఐన నిన్ను చూసి నీరరాశి నిశ్చలానంద సంపూర్ణం గా ఉంటుంది.

"తేనే సోనల జిల్కు తియ్యని కావ్యంబు వి రచింప తిక్కన ప్రగడ గాను –పూలచెండ్లగ జల్లు లీల పద్యంబుల విరచింప పోతన రాజు గాను –ముద్దు పల్కులుగ నుల్కూత లలెత్తిన రీతి –పన్నంగ ముక్కు తిమ్మన్న గాను –స్వాదు ద్రాక్షారసా స్వాదనమైనట్లు నుడువంగ పెద్దనార్యుడను గాను –అమృత రస గుళికలవలె నలర జెప్ప – ఆంధ్ర వాల్మీకిసుబ్బరాయుండ గాను –శక్తి హీనుడ గైకొమ్ము –శన్త రూప –చిత్సుఖానంద సర్వేశ చిద్విలాస "అంటూ మహా కవుల కవిత్వ సరళికి హారతులిస్తూఅలా రాయలేనని. ఆశక్తుడనని చేతు లేత్తేసి శతకం స్వీకరించమని లౌక్యంగా చెప్పటమే కాదు తన శతకం లో వారి వారి బాణీలన్నీ ఉన్నాయని చెప్పకనే చెప్పారు కవి గడుసుగా. చివరిపద్యంగా –"నిగమాలే నిన్ను పొగడ లేవు. ఇక నేను ఎలా పొగడనయ్యా సామీ. జల్లుమాటలు కొన్ని కూర్చి చేసిన శతకం. ప్రశస్తారూపంగా పద్య పుష్పాంజలిగా భక్తితో అర్పిస్తున్నాను. "దయ యుంచి భక్త బృందములోన కడపటి వానిగా నన్ను చూసి, నాకు చేత నైనంత రీతిగా రాసిన ఈ శతకాన్ని అంకితం పొంది నన్ను ధన్యుడను చేయి "అని విన్నపాలు విన్నవించారు కవి.

ఈకవి కావ్యం మన వారికెవరికీ అందినట్లు లేదు ఎవరూ ఉదాహరించిన దాఖలాలు లేవు. భక్తి,జ్ఞాన వైరాగ్య ఆధ్యాత్మిక శతకాలలో శిరో భూషణంగా ఉంది. నా పంట పండి ఈశతకాన్ని కవిని పరిచయం చేసే మహద్భాగ్యం కలిగింది.

## 71 సుప్రకాశ శతకం -- శ్రీ రాప్తాటి సుబ్బదాసు



అనంతపురం పినాకిని ప్రెస్ లో 1925లో బళ్ళారి హైకోర్ట్ వకీల్ శ్రీ ఎస్.ఆంజనేయులు గారి ద్రవ్య సాయంతో శ్రీ రాప్తాటి సుబ్బదాసు రచించిన "సుప్రకాశ శతకం ముద్రితం వెల-పావలా. విజ్ఞప్తిలో కవి తాను 12,13ఏళ్ళ వయసులోనే నాటక సమాజాలకు నాటకాలు రాసి అందించానని. వాటిని ప్రదర్శించిన సమాజాలు అద్భుతంగా ఉన్నాయని చెప్పటం చేత. తన ఇరవై వ ఏట కడప మండలం లో శ్రీ సురభి శ్రీ శారదా మనోవినోదినీ నాటక సమాజాన్ని శ్రీ సురభి చెన్నా రెడ్డి గారి ప్రోత్సాహంతో స్థాపించి. అభినవ చిత్రాంగి. విలాసం. సత్య హరిశ్చంద్ర. పాండువాజ్ఞాత వాసం. శాకుంతలం. స్త్రీ సాహసం ఏకాదశీ మహాత్మ్యం. ధ్రువ చరిత్ర. జయ దేవ చరిత్ర నాటకాలు ధరించి ముఖ్య పాత్రలు ధరించి. ఆసమాజానికి అధ్యక్షుడు గా ఉంటూ. వాటిని ముద్రిస్తే తమ రాబడి తగ్గి పోతుందని పై సమాజం వారు వేడుకోగా ముద్రించలేదని చెప్పారు. క్రమంగా నాటకాభి రుచి తగ్గి ఇహ పర సాధకమైన హరికథనేర్చి కథాగానాలు చేస్తూ కవిత్వాన్ని కొంతకాలం ప్రక్కన పెట్టి. రెండవ భార్య రోగం తో బాధ పడుతూ ఒక శతకం రాయమని కోరితే. "పరమేశ్వర. శతకం" పూర్తి చేశానని. అప్పటి నుంచి కవిత్వం పై పట్టుపెరిగి "సుప్రకాశశతకం "రాశానని. వెంట వెంటనేతన కుటుంబం లో మరణాలు సంభ వించటం కొత్త రోగాలు పెరగటం వలన. ప్రకృతి చికిత్స అమూల్యం అని గ్రహించి "హఠ యోగాశ్రమం "స్థాపించి ప్రకృతి చికిత్సా విధానం ప్రారంభించా ననీ. శతకొంతకాలం వ్యాపారమూ చేసినప్పుడు తనపై ఒకాయన బళ్ళారి కోర్టులో వ్యాజ్యం వేయగా తాను హాజరై తనతో ఆ శతకం తీసుకు వెళ్ళాననీ. అక్కడ తనకు అప్పుడు ఆస్తిక సేవా సక్తుడు శ్రీ శృంగిమల ఆంజనేయులు అనే ప్లీడర్ గారింట బస చేశాననీ., ప్రసంగ వశాత్తు పై శతక ప్రస్తావన రాగా ఆయన ధర్మ పత్ని శ్రీమతి రంగనాయకమ్మ గారు కొన్ని పద్యాలు చదివి. సంతోషించి శతకముద్రణకు తామే ధన సాయం చేస్తామని చెప్పి. ముద్రించటమేకాక తనపై వచ్చిన వ్యాజ్యాన్ని కొట్టి పారేసేట్లు లాయర్ గారు చేశారని కృతజ్ఞత తెలుపుకొన్నారు. కళ్యాణ దుర్గం బోర్డ్ మాధ్యమిక పాఠశాల ఆంధ్ర పండితుడు బ్రహ్మశ్రీ నాగసముద్రం టి.రంగా చార్యులుగారు., తన స్నేహితుడు. రైల్వే కోడూరు క్రైస్తవ పాఠశాల ఆంధ్ర పండితుడు బ్రహ్మశ్రీ కృష్ణ శర్మ. శతకంలోని తప్పొప్పులు సవరించగ. మతాలకు

అతీతంగా ఉండటానికి “సుప్రకాశ “శతకం అని పేరు పెట్టి ముద్రించి. పండితులకంటే పామరులకు అందుబాటులో ఉండేట్లు సరళంగా రాశానని చెప్పారు “రాప్తాది సుబ్బదాసు –దేశ దాసు సుకవి.


పండితాభిప్రాయములు

శ్రీ రా మ.

29—11—24

పండితాభిప్రాయాలు -1-ఆంధ్ర వాల్మీకి వాసు దాసు –”శతకం గజేంద్ర మోక్షం లాగా నిరాకార పరబ్రహ్మాను గూర్చి చెప్పబడింది “అనగా 2-పుల్లం పేట సబ్ రిజిష్ట్రార్ శ్రీ ఎం. వెంకటస్వామి నాయుడు –”అసమానమైన నీతులను అతి సులభంగా రాశారు. దైవ. మానవులకు అందని చూపు ను మహా నేర్పుగాఅం దించారు “అన్నారు 3-బడకాయ పల్లి వాస్తవ్యులు అభినవ భారత శిఖా మణి శ్రీ మాడ భూషణం వేంకట నృసింహా చార్య పద్యాలతో ఆశీరభి నందన తెలియజేస్తూ-”వర కవితా వితాన,వాగ్విభవ ప్రతిభా ప్రభావం తో సత్కవీన్ద్రులకు తోడ్పడే శుభ వాణి వాణి మనోహరంగా సుబ్బదాస కవికి తోడ్పదిందనీ. చక్కని శైలితో పదహారు వన్నెల దీప్తితో కవిత్వం ఉందని “నిర్మల జ్ఞాన వైరాగ్య నిష్ఠ భక్తి “ఇందులో పొంగి ప్రవహించాయని. మరిన్ని రచనలు చేయమని ఆశీర్వదించారు. 4- రైల్వే కోడూరుకు చెందిన శ్రీ వేదం వెంకట కృష్ణ శర్మ  గారు కూడా పద్యాలలో –”నీ వంటి అఖండ భక్తుడు. భారత పుత్రుడు లేడు.దేశ దురాచార నాశనం సదుపదేశం,వేదాన్తభావం. సువిచారం,పరమేశు సద్భక్తి. ప్రజలకు భద్రతా కలిగించావు “అన్నారు. 5-శ్రీ సోమ పాళ్యం గారు కూడా పద్యాలలో –”తత్వసారం అంతా  దట్టించావు,భక్తీ ముక్తి దారి చూపావు.  ఆయుర్వేదం. ప్రకృతి స్నానం నాటకాలు రాసి. దీనిలో వేదం వేదాన్తార్ధాలు సుప్రకాశం చేశావు. పద లాలిత్యం వాక్చతురత. హేలాగతిగా తత్వ శాస్త్రం  చొప్పించావు “అన్నారు 6-నిజాం లోని వనపర్తి సంస్థానం రాజానగరం వాసి శ్రీ కెవి నరసింహా చార్య –”పరమైన వస్తువు ఇందులో వర్ణి తమైంది. కవిత్వం సార్ధకత చెందింది “అన్నారు పద్యాలలో.

ఇది సీస పద్య శతకం. ”సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ “అనేది శతక మకుటం.

మొదటి పద్యం లో –”శ్రీ కరుణా రస సింధు వాత్సల్యైక-పూర్ణుండ వై న నీ పూజ్యయశము – అణువణు వాదిగా. నా బ్రహ్మా పర్యంతమావరించిన నీదు నమిత మహిమ –నిఖిల జగజ్జాల నిర్మాణమున గడు-ప్రకటితం బైన నీ

ప్రాభవంబు –నిఖిల లోకముల నిర్నిద్ర శక్తిని –గను సన్న నడుపు నీ కౌశలంబు –తే.గీ –గాంచి యుప్పొంగి నీ తత్వ మెంచి పొగడి –భక్తితొలుకాడ మృదుల భావములు పొంగ –శతకమర్పింతు గ్రహియింపు హితమనీష - ”సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ”అంటూ సీసం లో భక్తి బంగారాన్ని కరిగించి పోతపోశారు దాసుకవి. తర్వాత గురువులను ఆదికవులు మొదలైన వారిని స్తుతించి. శతక రచన ఎలా ఉండాలో ఇలా –”మాటిమాటికి భక్తీ ఉప్పొంగాలి వినేవారికి వీనుల విందు చేయాలి అర్ధం వాక్కులలో దూరిఉండాలి. భావం ఇంగితాన్ని బయట పెట్టాలి. రసం స్రవించి మానసిక జాడ్యం పోగొట్టాలి. ఒక్కోసారి హరికథలా ఉండాలి “అని గొప్ప పద్యమే చెప్పారు.

ఘోరాటవిలో దమయంతి తన్ను కామించిన బోయకు ఏ నీతి బోధించిందో. రక్కసిమూకల మధ్య బాధ పడే సీతమ్మ రావణుడికి ఏ నీతి విశదం చేసిందో. కీచకుని మొహాగ్ని చల్లార్చటానికి ద్రౌపది ఏమి బోధించిందో. పేరాశతో తన్నుకోరిన నహుషుడికి శచీ దేవి ఎలా బుద్ధి చెప్పిందో అలాంటి నీతుల విహారం భారత దేశం అన్నారు కవి. సురభినాటక కళా గురుడని దేశ సంచారం చేయటం. హరికథలతో మెప్పించటం. భైషదవృత్తితో పరమ పేదలకు సేవ చేయటం. అఖిల తత్వాలు తెలుసుకోవటానికి గురు సేవ చేయటం –”నీ ఆజ్ఞ..ఈ జన్మలోనే కాక.పూర్వ జన్మలలో కూడా ఎంతో పుణ్యం చేసుకొని వచ్చి ఉంటాను. కృపామయా నీ చెంత చేర్చుకో “అని శరణాగతి కోరారు

క్షమకంటే పేరే సౌఖ్యం లేదు. ఓర్పున్నవాడు ఆత్మా విదుడు ఔతాడు. నీ ధ్యాన నిర్మలదృష్టి ఉన్నవాడే ధన్యుడు కానీ శాస్త్ర పారంగతుడు ముక్తి పొందలేడు. షడ్వి కారాలతో ఉన్నది స్థూలం “పదియు నేడు ఇంద్రియ ప్రాపకమై లింగ దేహంబు సూక్షం దేహం. అజ్ఞానం ఈ రెండిటికి ఆధారం. మూడు అవస్తల చేత మూడు దేహాలు ముడి వేసుకొని ఉంటాయి. శుద్ధం ఏకం అద్వితీయం చిన్మాత్రమైన ఈశుని తెలియటం మోక్షం. ఆరు చక్రాలను చర్చించి పంచ ముద్రల భావం తెలిసి తారక శుద్ధితో ఆలోచన పరిశుద్ధం చేసుకొని శాస్త్రార్ధా సారం తెలిసి, పతంజలి సూత్రాలు. దండకాన్వయం ఎరిగి. అజప గాయత్రి రహస్యం అవగాహనం చేసుకొని. లంబికా యోగ లక్ష్యం గ్రహించి దివ్య మనస్కత ఉంటె సిద్ధికలిగి మోక్షం లభిస్తుంది. రాజయోగం అనే నదడి వీధిలో రధాన్ని వదిలేసి. సంసారం అగడ్తలో పడకుండా నిన్ను పొందటమే యోగి లక్ష్యం.

దేహాన్ని నాటక శాల చేసి. హృదయాన్ని రంగస్థలం చేసి వృత్తి,బుద్ధి లను పెద్ద నటులుగా జేసి. సంకల్పం ను తెరగా మార్చి. కూటస్తుని దీపం చేసి. కామాదులను మేళ తాల భాజంత్రీలుగా చేసి. ఇంద్రియాలను” వారి “గ

చేసి. కదథ ను దేవి మహిమగా చేసి. స్వప్నం లో ఆట చూపిస్తావు సూత్రదారిగాసాక్షిగా ఉంటూ. నువ్వు ఆడించినట్లు నేను ఆడుతూ ఉంటాను. "పగటిని. రేయిని కుంచె బట్టక చిత్రాలు గీసేవాడు బహురంగుల పుష్పాల తోటమాలి అయిన సృజనుడు ఎవరు. నిర్ఝర అడవులలో నీటి ధారలను కూర్చి దాహార్తి తీర్చే దాత ఎవరు. కొండ చిలువకు పుష్కల ఆహారాన్ని నోటికి అందించే వాడెవడు. నా హృదయంలో మృదు నాదంతో సుస్థితుడు ఎవడు. అలాంటి ప్రభువుచిత్ప్రకాశాన్ని ఆశ్రయిస్తాను అనే మరో అసాధారణ పద్యరాజం రచించారు. "బుద్ధి దీపం వెలిగించి మొనసి నాను –చిత్తమను పాన్పు నీకు సిద్ధమయ్యె –"వచ్చి విశ్రమించు అని నిండు మనసుతో కోరారు. కరుణశ్రీ గారి పద్యాలు కూడా ఈ ప్రేరణతో రాసినవే అనిపిస్తాయి. అందం ఆనందకరం. వంద్యం మోక్షకారకం దివ్యం జ్ఞానప్రకాశకం మునిజన సేవ్యం,సజ్జన స్తవ్యం. సారం. బుధులకు ఆధారం., చిద చిదాకారం నిత్యం. సంసారదూరం బ్రహ్మాండ కృత్యం. యోగీంద్ర నృత్యం. ఆధార సత్యం. పలుకులకు ఊహలకు అందని నిష్కళంక నిర్వికారం అయిన నీ రూపు మాకు ప్రాపు. నిగమాలే నిన్ను పొగడ లేక ఆగమాగమైతే నేనేమి పొగడగలను. ఏవో కొన్ని మాటలు కూర్చి శతక మాల తయారు చేసి నీకు అర్పిస్తున్నా. స్వీకరించి నన్ను నీ వాడిని చేసుకో అంటూ 106 వ సీసం తో శతకం పూర్తి చేశారు..

ప్రతిపద శుద్ధి, కమ్మని జాతీయాలు దివ్య ప్రవచనాలు. గహన వేదాంత విషయాలు కరతలామలకం చేసిన వైనం. భక్తిజ్ఞాన వైరాగ్య త్రివేణీ సంగమం తో సుబ్బదాసు కవి సుప్రకాశమానంగా ఈ సుప్రకాశ శతకం కూర్చి ఆస్తికజన వంద్యులయ్యారు. నాకు వారిని. శతకాన్ని పరిచయం చేసే మహద్భాగ్యం కల్పించారు.

## 72 తిరుమలాపుర రామ చంద్రప్రభు శతకం -- శ్రీ గోపాలుని పురుషోత్తమ పాకయాజి కవి

కేశవశతక. మార్కండేయ. గోపీచందు. సత్య హరిశ్చంద్ర. అభిజ్ఞాన శాకుంతల. కోటీశ్వర తారావళీ,దుర్గా స్తోత్ర దండకం మొదలైనవి రచించిన శ్రీ గోపాలుని పురుషోత్తమ పాకయాజి కవి "తిరుమలాపుర రామ చంద్రప్రభు శతకం" రచించారు. కవిగారు బెజవాడ లో సత్యనారాయణపురవాసి. ఈ శతకముపై బాలసరస్వతి. ఆశుకవీంద్ర సింహ. ఆశుకవి చక్రవర్తి. కుండిన కవిహంస. కవి రత్న. అవధాని పంచానన. కవి కేసరి. కల్పిత కథారచనా ధురీణ., కవి భూషణ. ప్రౌఢ భారతి. ఆశుకవి సమ్రాట్ బిరుదాంకితులు శతావధానులు శ్రీ కొప్పరపు



సోదర కవులు తమ అభిప్రాయాన్ని పద్యాలలో చెప్పారు. "శ్రీరామ చంద్ర శతక మె-వారుం బఠియింప.విన్న –శ్రీ రమ్య కీర్తి యుతులై –మీరెద రిష్టార్థ సిద్ధి మేకొన నెపుడున్ "- నీతియో భక్తియో తెల్పి –రాతల సువ్యాప్తి శతక రాజములొప్పున్- నేతకవి –ఖ్యాతిని మరి రెండొసగగా జాలవుగా "అని రెండు కందాలలోనూ. "కనుపర్త్యన్వయుడౌనృసింహ గుణికాంక్షందీర్వగన్ భక్తి-పెంపెనయన్ దిర్మల పూర్ణి కేతనునిపై. నిక్ష్వాకు సద్వంశ పా –వనుపై. భక్త జనావన వ్రతునిపై వ్రాసెన్. బుధేంద్రుల్ హి-తాత్మను వీనిం బురుషోత్తమార్యుని,గళోత్సాహుం బ్రశంసిం పరే"అని శార్దూలం లోనూ –"ఉత్పలమాలలో –"భక్తి ప్రధాన మీకృతికి భక్తు డితండు రచించె దీనినా –సక్తిని. దుర్విమర్శము సల్పక,నేర్పున నాలకించినం- రక్తి ఘటిల్లు గాదని రాటల వారికి గాక. గల్గదీ –వ్యక్తికి సుంత యేని భక్తుడు భగవంతుని పాల నుండడే" –"కందనిబైక మూర్తివని కందములన్ శతకంబు జేసి మున్నుం దనియించె వేంకయ యనూనమతిం దన దండ్రి యం-చు నీవెందు సువృత్త భూషి వగుటెంచి. సువృత్తములన్ –భజించె బెంపొందెడు భక్తి జూపి. పురుషోత్తమ యజ్వ యితండు రాఘవా "అంటూ రాఘువుడికి సిఫార్సు చేశారు సోదరకవులు. సాధారణంగా కొప్పరపు వారిపద్యాలు లభించటం అరుదు. అందుకే వారు రాసిన అన్నిపద్యాలు పేర్కొన్నాను. కవిగారి శతకం శార్దూల మత్తేభ విక్రీడితం. "రామ చంద్ర ప్రభూ "అనేది శతక మకుటం. శతకం 1936లో బెజవాడ కన్యకా ముద్రాక్షర శాలలో ముద్రించారు. వెలతెలుపలేదు. ఈ సీతారామ పురం ఏలూరులో ఉంది.

మొదటిపద్యం శార్దూలం –"శ్రీ వైకుంఠ మయోధ్య గాగ సిరియే సీతామహాదేవి-గా గైవల్య ప్రభు డీవ రాఘువుడు గాగన్. శంఖు చక్రం-బులే సేవాసక్తులు కైక సూనులుగ దచ్చేషుండు సౌ-మిత్రి గా నావిర్భూతులు గారె తిర్మలపురీంద్రా రామ చంద్ర ప్రభూ "అంటూ మొదటిపద్యంలోనే శ్రీరామాదుల జన్మ రహస్యం చెప్పారు. తర్వాత మీన వేషంతో సోమకాసుర వధ మత్తేభంలో పాల సముద్ర మధనం. కూర్మావతార విశేషం వేదాలనపహరించిన హేమాక్షుడిని వరాహ రూపంతో చంపి వేదోద్ధరణ చేయటం. మిగిలిన అవతా ల

పరమార్థం వరుసగా వర్ణించారు. రామావతారం తాటకి వధ మునియాగ సంరక్షణం. బలరామ రామా కృష్ణావతారం. ద్రౌపదీ మాన సంరక్షణం. చెప్పారు “శిబి ఏమిచ్చాడు ?అహల్య ఏమిచ్చింది. గజేంద్రుడు. పాంచాలీ ఏమిచ్చారు ?ఏమీ ఇవ్వకపోయినా నీవారిని కాపుకాస్తావు ప్రబల ప్రేమతో “అని కీర్తించారు రాముని. . .

శుక శంతన,ప్రభవ. పారాశర్య. కౌంతేయ. శౌనక దాల్భ్య. అమ్బుజగర్భ మహా భక్తులను కీర్తించి. ఒకే సూర్యుడు అనేక భాండాలలో కనిపించినట్లు. నువ్వు ఒక్కడివి అనేక రూపాలు పొంది కార్య విధులు తీరుస్తావు. ఒకటే మన్ను కుండలుగా బొమ్మలుగా మారినట్లు ఒకే బంగారం అనేక నగల రూపం పొందినట్లు. శరీరాలు ఎన్నైనా అందులో పరమాత్మ ఒక్కడే వెలుగొందుతాడు. రఘురామా ఇనవంశ సోమా. విలస ద్రాజకంఠీరవా. మఘు సంరక్షక. దుష్ట శిక్షణ. మునీంద్ర సంపోషణా,మఘువాద్యర్చిత పాద పద్మ యుగళా “అంటూ రామగుణగానం చేశారు. లోకారాధ్యుడవైనా. యాదవ బాలుడుగా పేరుపొంది లోక కంటకుడైన మేనమామను సంహరించి. నీ తలిదండ్రుల చర విడిపించావు.లేదు లేదు అన్న దైతునికి కొడుకు ప్రార్ధనతో స్తంభం లో కనిపించి ప్రహ్లాద వరదుడవయ్యావు. తులసి దళాలు యెంత పుణ్యం చేసుకోన్నాయో “నీ మెడలో పవిత్ర తోమాలగా విరాజిల్లుతున్నాయి. .కురువంశం నిర్మూలనం అపాండవం చేస్తానని అన్నం పెట్టిన రాజుకు వాగ్దానం చేసి. బ్రహ్మాస్త్రం గురుపుత్రుడు ప్రయోగిస్తే “ఉత్తరాతనయున్ గర్భస్తుడౌ వాని సేర్పరిపై కాచిన వాడివి. 107 వ చివరి పద్యంగా మత్తేభం పై విజ్రుమ్భించి -”త్రిదశాధీశ్వర మౌని రాజహిత వర్తీ. ఘోర దైతేయ భీ –ప్రదశౌర్యోజ్వల మూర్తి. సర్వ జగతీ రాజ్యేందిరా సమ్మదా –స్పద సర్వేశ్వర లాంఛనాయుతయుతా ద్వంద్వైక సత్కీర్తి పూ-ర్ణ దయా విశ్రుతమూర్తి. తిరమల పురీంద్రా. రామ చంద్ర ప్రభూ “అని శతకం ముగించారు.

తర్వాత శ్రీరామ చంద్ర స్తుతి ఋతుమాల రాశారు. అందులో రామాయణం ఆరుకాండలు వాటిలోని రామ చరిత్ర “సీసా”లలో నింపారు. సుందరం లో –”త్వన్నామ మంత్రంబు ధ్యానించి పవనుజుడబ్ధి”దాటాడని చెప్పారు. తర్వాత శ్రీ మదాన్జనేయ స్తుతి పద్య పంచ రత్నాలు సమర్పించారు హనుమకు. అందులో తన ను గురించి – కనుపర్తి వంశం లో పుట్టానని. లక్ష్మీ నరసింహుని కోర్కెన్ పంచరత్నాలు రాశానని. తనపేరు గోపాలుని పురుషోత్తమయజ్వ అని చెప్పుకొన్నారు. ఫలశ్రుతి కూడా కూర్చారు. శాలివాహన శకం దాత నామ సంవత్సర జ్యేష్ట కృష్ణ ఏకాదశి నాడు రామచంద్రశతకం పూర్తి చేశానని చెప్పారు. కనుపర్తి నర్సయ్య. లక్ష్మీ నర్సు దంపతులకు సుబ్బరాయ గుర్రాజులు కుమారులు. మహామతి వీరార్యకుమారుడు నరసింహం గారు కోరగా ఈశతకం రాశారు. ”షట్సహస్రాన్వయ జలజాత వన సూర్యుడు అయిన కనుపర్తి లక్ష్మీ నరసింహంగారు ఆంగీరస ఫాల్గుణ శుద్ధ నవమి ఆదివారం మృగా శీర్ష నక్షత్ర యుక్త మీనరాశి పుష్కరాంశం లో పగోజి ఏలూరులోని తిరుమలాపురం లో “అవనిజ. సౌమిత్రి. ఆంజనేయ. భోగ సుందర నామ విస్ఫురిత నాము డైన

శ్రీ రామ చంద్రుని ప్రతిష్టించి ఆలయం గోపురాదులు నిర్మించి. ధ్వజస్తంభం రధం. ప్రాకారాలు మండపం మొదలైన వాటితో సీతారామ పురం ఏర్పరచారు. ఈ ఊరు జంగారెడ్డి గూడెం కొవ్వూరు. బయ్యన గూడెం వెళ్ళే దారిలో సీతమ్మ పేట దగ్గర ఉంది.అని కవిగారు చెప్పారు.

## 73 సర్వేశ్వర శతకం -- శ్రీ యధావాక్కుల అన్నమయ్య




యధావాక్కుల అన్నమయ్య రచించిన "సర్వేశ్వర శతకం "ను తెనాలి సాధన గ్రంధ మండలి వారు మండలి వ్యవస్థాపకులు శ్రీ బులుసు సూర్య ప్రకాశ శాస్త్రి గారిచేవిపుల పీఠిక. లఘు టీకా వ్రాయించి. వట్టి చెరుకూరు వాస్తవ్యులు. వదాన్యులు శ్రీ రావి వెంకట సుబ్బయ్య శ్రీమతి సీతారామమ్మ పుణ్య దంపతుల ఆర్ధికసాయం తో తెనాలి వాణీ ఆర్ట్స్ ప్రింటర్స్ లో ముద్రించి. 1992 శ్రీ ఆంగీరస నామ సంవత్సర శ్రీ శంకర జయంతి నాడు ఆవిష్కరించి శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జునస్వామికి అంకితమిచ్చారు. వెల-నాలుగు రూపాయలు. "మండలి మాట"లో శ్రీ బులుసువారు – "హేతవే సర్వ సిద్ధీ నం కలికల్మష హేతవే –భవాబ్ధి సేతవే తుభ్యం నమోస్తు వృష కేతవే "-శివుడు ఆశుతోషుడు అంటే –ఆశు తుష్యతీతి –ఆశుతోషః"-త్వరగా ప్రసన్నుడయ్యే దేవుడు ".ఉత్తర భారతం లో శివుడిని "భోలే బాబా "అంటే అమాయక దేవుడు అనిపిలుస్తారు. ఐశ్వర్యం ఈశ్వరాధిచ్చేత్ "శివారాధన వల్లనే ఐశ్వర్యం కలుగుతుంది. రావణాదుల మహదైశ్వర్యం కు మూలం శివారాధానమే. అన్ని గ్రహదోషాలను శ్రీ రుద్ర పారాయణ పోగొడుతుంది. వైష్ణవులు కూడా శివారాధన చేస్తారు. అందుకే "శివం మహా భాగవతం స్మరామి "అని వారే చెప్పినమాట. "నమ్మితి నా మనంబున సనాతనులైన యుమామహేశులన్ "అని రుక్మిణి ప్రార్ధించి ఉమామహేశ్వర ఆరాధనం వలన శ్రీ కృష్ణుని భర్త గా పొందింది అని భాగవతం. శ్రీ కృష్ణుడు ఉపమన్యు శిష్యుడై "పాశుపత దీక్ష "పొంది శివారాధన చేసి ప్రద్యుమ్నుని పుత్రుడుగా పొందాడు అని భారతం అనుశాసన పర్వం లో ఉంది. శివ సహస్రనామం ను ఉపమన్యు కృష్ణుడికి అనుగ్రహిస్తే. ఆయన ధర్మరాజుకు తెలిపాడు. ఇలా అనాదిగా సర్వార్ధ సాధకమైన శివారాధనపై యధావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకం వేన వేల వెలుగులు ప్రసాదిస్తోంది. ప్రౌఢ గంభీరంగా ఉన్న ఈ శతకానికి విపులపీఠిక. లఘు టీకా రాసి సులభతరం చేశాం "అని చెప్పారు.



పీఠిక లో –"త్రైలోక్య సంపదాలేఖ్య. సముల్లెఖేన భిత్తయే – సచ్చిదానంద రూపాయ. శివాయ బ్రహ్మనే నమః "-గోడపై బొమ్మలు చిత్రిన్చినట్లు. ఈ ముల్లోకాలు ఎవని చె చిత్రింప బడినాయో, ఆ సచ్చిదానంద రూప శివ పరబ్రహ్మనికి నమస్కారం.. ఈశతకకర్త అన్నమయ్య ఆత్రేయస గోత్రీకుడు. ఆరాధ్య బ్రాహ్మణుడు వీర శైవుడు. గురువు దూది కొండ సోమేశ్వరారాధ్యుడు. 13 వ శతాబ్దిలో లో ఈ శతకం రాశాడు. పోలవరం దగ్గర శ్రీ వీరభద్రస్వామి వెలసిన పట్టిస గ్రామం లో పుట్టాడు. వీరభద్రుడు ఆరాధ్య దైవం. పట్టిసలోనే శివారాధన చేసి పరిణత స్థిత ప్రజ్నుడయ్యాడు.ఒక రోజు శ్రీ శైల మల్లికార్జున దర్శనం కోసం నడిచి అరణ్యమార్గాన చేరి. పాతాళగంగలో స్నానించి భ్రమరాంబా మల్లికార్జున దర్శనం చేసి. కొన్నాళ్ళు అక్కడే ఉంటూ నిత్య దర్శన పూజాదులతో పులకిన్చిపోయి. మళ్ళీ పట్టిస బయల్దేరాడు. శివనామ జపిస్తూ ప్రయాణం సాగిస్తూ "సత్ర సాల "గ్రామం చేరాడు. అక్కడి వాతావరణం కృష్ణానది. శ్రీ మల్లికేశ్వరస్వామి ఆయన్ను బాగా ఆకర్షించాయి. తపోభూమి అనిపించి నిత్య కృష్ణా స్నానం చేస్తూ. స్వామిని ఆరాధిస్తూ కొంతకాలం ఉన్నాడు. అప్పుడే సర్వేశ్వర శతకం రాయాలనిపించి మనసులో "తాటాకుపై పద్యం రాసి కృష్ణలో వేస్తా. శివుడికి నచ్చితే అది ప్రవాహం లో కొట్టుకు పోకుండా మళ్ళీ నా దగ్గరకే వస్తుంది ఏ పద్యమైనా తిరిగి నా దగ్గరకు రాకపోతే నా తల నరుక్కొని చనిపోతాను "" అనే నియమం పెట్టుకొని. కృష్ణా తీరంలో మెడకు గండ కత్తెర తగిలించుకొని. తాటాకులు. గంటం దగ్గర పెట్టుకొని. పరమ శివుని మనసారా ప్రార్ధించి శతక రచన ప్రారంభించాడు. రాసి నీటిలో వేసిన ఏ పద్యమూ కొట్టుకు పోకుండా ఆయన దగ్గరకే వచ్చి చేరేది. "తలిరుం బువ్వుల "అనే పద్యం రాసి పడేస్తే. అది తిరిగిరాకుండా. ప్రవాహ వేగానికి కొట్టుకుపోయింది. శివధ్యానం చేసి తల నరుక్కొనే ప్రయత్నం చేస్తుండగా ఒక పశులకాపరి వచ్చి "కృష్ణ నీటిలో ఒక తాటాకు కొట్టుకొని వచ్చి నాదగ్గరకు చేరింది దానిపై యేవో అక్షరాలున్నాయి "అని చేతికిచ్చాడు. దాన్ని పరిశీలించి చూడగా అది తాను రాసిన పద్యమే సర్వేశ్వరా అనే మకుటం కూడా ఉంది కాని తాను రాసిన పద్యం కంటే మహత్తర అర్ధ గాంభీర్యంగా ఉంది. శివుడు సంస్కరించి పంపాడన్నమాట. తలయెత్తి పైకి చూస్తె తెచ్చినవాడు కనిపించలేదు ఇది శివ లీల గా భావించి శతకం పూర్తీ చేశాడు. 142 పద్యాల ఈశతకం శివ పారమ్యాన్ని బోధిస్తూ. పరమ గంభీరంగా ఉంది.

అయన ఇంటిపేరు యథా వాక్కుల –"యథా వాచోస్య తదా సర్వం భవతి "ఎవరినోటి నుంచి వచ్చిన వాక్కు సత్యం అవుతుందో అని అర్థం సామాన్యుల వాక్కు అర్థాన్ని అనుసరించి వస్తే. మహాత్ముల వాక్కులను అర్థం అనుసరిస్తుంది –"ఋషీణాం పునరార్యా ణాం వాచ మర్థోను ధావతి "(భవభూతి ).కనుక కవి అన్నమయ్య మాటలు వాడిగా రాజ శాసనం లాగా ఉంటాయి. "భయ విభ్రాంతులు లేక ఈశతకము౦ బ్రఖ్యాతి సర్వేశ్వరా "అన్నాడు అందుకే. శివుడు సర్వ దేవతలకంటే అధికుడు అని అనేక మార్లు శతకం లో చెప్పాడు. జగదుత్పత్తి స్థితి లయాలు దేనిలో జరుగుతుందో అదే శివస్వరూపం. బ్రహ్మాండ భాండాలు దేని గర్భం లొబుడగాలాగా కనిపించి అణగారుతుందో అదే శివ లింగం.పరబ్రహ్మానికి అభిన్నమైన మాయాశక్తినే "ఆజ్ఞా శక్తి "అన్నాడు. శివభక్తులు జంగమ రూప శివులే. బ్రహ్మాదులకంటే శివభక్తుడు గొప్ప. శివుడు శాశ్వతుడు కనుక శివసామీప్యం సాలోక్యం పొందిన భక్తుడు అల్పాయుష్కుడు అయినా బ్రహ్మాదులకంటే గొప్ప వాడే కదా అంటాడు. శివ భక్తులనే కాదు శివ భక్తి నికూడా గొప్పగా కీర్తించాడు. శివ భక్తీ నైష్కర్మ్య సిద్ధి కలిగిస్తుంది. అన్నమయ్య కవితా శైలిని తర్వాత కవులు ఎందరో అనుసరించారు. సాధకులకు ఈశతకం చేయూతా కరదీపిక "అన్నారు బులుసు వారు. శతకం లోకి రేపు ప్రవేశిద్దాం.

సశేషం

మీ – గబ్బిట దుర్గా ప్రసాద్ -28-2-23-ఉయ్యూరు

యథా వాక్కుల అన్నమయ్య శార్దూల. మత్తేభాలతో కూర్చిన "సర్వేశ్వర శతకం "మకుటం –"సర్వేశ్వరా. మొదటిపద్యం –శ్రీ కంఠుం బరమేశు నవ్యయు నిజశ్రీ పాద దివ్యప్రభా –నీకోత్సారిత దేవతా నిటల దుర్నీత్యక్షర ద్వాతుజి-త్ప్రాకామ్యంబు నపాంగమాత్ర రచిత బ్రహ్మాండ సంఘాతుజం –ద్రాకల్పున్ బ్రణుతింతు నిన్ను. మది నాహ్లాదింతు సర్వేశ్వరా ".నీ నిజరూపం ఇది అని ఎవరూ చెప్పలేరు."ఇన విఘ్నేశ్వర మాతృకా ద్రుహిణ బ్రాహ్మీ స్కంద దుర్గా రమా వనితాదీశ్వర భైరవులు "నీ భృత్య పరివారం. పవన హిమదామ. అనలపానీయ. ఆత్మ రవి అంబరం. మహీతలం అష్టమూర్తులు. పుష్పాలు పద్యాలు గీత నృత్యాలు అమృతాహారం నీకు సమర్పించినా,నువ్వుకోరేది "చిత్తము సద్భక్తి మాత్రమే. " ఉన్మాద ఇంద్రియ ధ్వంత దుస్తర సంసార మద ప్రమత్తుడు –మహా సౌఖ్యోత్సవంబైన మీ చరణారాధనపై బుద్ధి నిల్పడు.

ఒక పుష్పాన్ని నీ పాద ద్వయంపై భక్తితో సమర్పిస్తే. పునర్జన్మ లేకుండా చేస్తావు. "తరులం బిందెలు పువ్వులై యొదవి తత్తజ్జాతి బండ్లగున్ –హర మీ పాద పయోజ పూజితములై యత్యద్భుతంబవ్విరుల్ –కరులౌ నశ్వములౌ. ననర్ఘ మణులౌ గర్పూరమౌ. హారమౌ –దరుణీ రత్నములౌ,బటీర తరులౌ దధ్యంబు సర్వేశ్వరా

"ఈ పద్యమే కవి దగ్గరకు తిరిగిరాకుండా ప్రవాహం లో కొట్టుకుపోయి. శివుడికి నచ్చి దాన్ని సంస్కరించి పశుకాపరి రూపంగా వచ్చి అన్నమయ్యకు అందజేసింది. అంతటి ధన్యత పొందిన పద్యం కవి శివభక్తి పారమ్యానికి గొప్ప ఉదాహరణ. నా చిత్తం పంచేంద్రియ మాయాజాలం లో పడి. ఈగకు కస్తూరి వాసనకంటే దుర్గంధం ఇష్టమైనట్లు "నీ పాదాబ్జ ధ్యానం చేయదు "అన్నాడు. యోగ సాధనలో ఈదులాడితే కొంత నిశ్చలత పొందుతుంది. లేకపోతె దానిష్టం వచ్చినట్లు తిరిగి, నన్ను అధోగతి పాలు చేస్తుంది.

"నీ అర్చనలో మొదటిపుష్పం సత్యం. రెండవపువ్వు దయాగుణం. నిష్టా సమోత్సవ సంపత్తి మూడవ పుష్పం. ఇవిలేకుండా నిన్ను పూజిస్తే "గైకోవు నీవు సర్వేశ్వరా "అని యదార్ధం చెప్పాడు యథావాక్కులకవి. నేను బక పేషిని కనుక దానిలాగా మనసు ఒక చోట నిలవదు. కులశైలాలు పెకలించినా. దిక్కులు కూలినా. సముద్రాలు చెలియలికట్ట దాటినా. సూర్య చంద్రులు గతితప్పినా "తలకందు ఉబ్బడు. చొప్పు దప్పడు భవద్భక్తుండు సర్వేశ్వరా "అని నిజమైన భక్తుని స్థిరభక్తి ప్రకటించాడు. సకలాదీశ్వర పట్టభద్రుడవు. భిక్షాగామివి. అత్యంత శాంత కళాత్ముడవు. రౌద్రమూర్తివి. సౌన్దర్యామ్బికా సంగామాధిక లోలుడవు. దివ్యయోగివి. శుద్ధ మనస్కులకు తప్ప నీ స్వరూప స్వభావాలు తెలియవు. తన చరిత్రాన్ని తత్వవేత్తలైన భక్తులు వర్ణించగా. తన చిత్తం నీ పద స్మరణతో నిన్ను మెప్పిమ్పగా. "అనుకూల స్ఫుట నిష్కలంక బహిరంగాభ్యంతరంగ స్థితి పొందిన తజ్ఞుడు ఈ జగత్తులో నీ మెచ్చు ".వేదాలు ఆగమాలు,మంత్రతంత్రాలు అనంతాలు. ఇవన్నీ నాకెందుకు స్వామీ. "నీవు మెరయం గా. నిన్ను సద్భక్తి యోగం తో కొల్చి జయింప జేయించు. ఏయే వేళలలో ఏయే వయస్సుల్లో మానవుడు ఏభూమిలో. ఏ ఊరిలో. ఏయే కర్మలు చేస్తాడో. ఆయావేలల్లో వయస్సులో ఆఊరిలో కర్మ ఫలం అనుభవిస్తాడు. ."నీపైన మహాత్ముడు అన్యాలకు లోనుకాడు. "

పిల్లవాడు మాట్లాడిన మాటల లో ఎన్ని దోషాలున్నా తలిదండ్రులు సంతోషంగా తీసుకొంటారు. అలాగే "అజ్ఞాన భావంతో నేను రాసిన ఈశతకాన్ని "నీకుం మహాలాలిత్య స్తుతికంటే గైకోనుగదా శ్లాఘ్యంబు సర్వేశ్వరా "అన్నాడు గడుసుగా చమత్కారంగా. "సంకీర్ణాకలితాక్షర త్రయము. భాస్వన్నాద బిందు క్రమాలంకార ద్వితయంబు తో గలిసి –లీలన్ దివ్య యోగీంద్ర ప్రుత్పంకో ద్భూతములందు గూఢమగుచున్ బంచాక్షరీ మంత్రము ఓంకారాత్మక మునిగణం బూహింప సర్వేశ్వరా "అని శైవతత్వాన్ని చెప్పాడు. చివరి 142వ పద్యం – "జయశక్తి రవి చంద్ర తారకముగా జల్పెన్. యథావాక్కులా –న్వయ సంజాతుడు. నన్నమార్యు డవని న్వర్ణించి నీ సత్కథా –క్రియ సంబోధన. నీదు భక్తిని మహా నిర్ణీత విశ్రాంతిగా –భయ విభ్రాంతులు లేక ఈశతకముం బ్రఖ్యాతి సర్వేశ్వరా "అని ముగించాడు యథావాక్కుల అన్నమయ్య కవి సర్వేశ్వర శతకాన్ని. ఈ శతకం ఆతర్వాతికాలం లో ఎందఱో శైవకవులకు ప్రేరణగా నిలిచి ఉంటుంది. లోకజ్ఞానం అనన్య శివ భక్తీ ప్రపత్తి. అంకితభావం లతో శతకం దేదీప్యమానంగా వెలిగింది ఈశతకం చదువుకొంటే చాలు మోక్షం కరతలామలకమే.

## 74 సకలేశ్వర శతకం -- శ్రీ నండూరి లక్ష్మీ నరసింహారావు



గుంటూరు జిల్లా నండూరు కు చెందిన శ్రీ నండూరి లక్ష్మీ నరసింహ్ రావు గారి చె రచింపబడిన "సకలేశ్వర శతకం "ను.పిఠాపురం లోని ఇస్సలాయాం ప్రెస్ లో 1924లో ముద్రించారు. వెల- ఆరు అణాలు. దీనికి ముందుమాట శ్రీ ఉమర్ ఆలీషా కవి రాశారు –అందులో –"భక్తి. ఆవేశం. ఆత్మ సమర్పణ. తన్మయత్వం జ్ఞాన సంపత్తి. మృదు మధుర పద సంపత్తి ఉన్నాయి. వ్యాకరణ దోషాలున్నాయి కొంతవరకు సరిచేశాను –"అపశబ్దంబులు గూడియున్. హరి చరిత్రాలాపముల్ సర్వపాప పరిత్యాగంబులు "అని భాగవతం లో ఉందికనుక బాధలేదు "అన్నారు. పండితాభిప్రాయాలు న్నాయి –శ్రీ రా రా. గారు "నండూరి గ్రామ ఈశ్వరునిపై కవి భక్తిగా చెప్పిన శతకం. కవితా సంప్రదాయం చక్కగా పాటించారు. పరమేశ్వరునిపై చేసిన రూపకల్పనలు బాగున్నాయి. భక్తుని వేదన ఉంది"అన్నారు ఇది సీస పద్య శతకం. "గిరిజ హృదయేశ నండూరు పురనివాస –స్ఫటిక సంకాశ సకలేశ భావ వినాశ "అనేది శతకం మకుటం.

మొదటిపద్యం –"శ్రీకంఠ సురవాస సేవిత శృంగార –భాక్తమందార సంభవ విదూర –గౌరీ మనశ్చోర –కారుణ్య విస్తార –దుష్ట సంహార నిర్దిష్ట శూర - గంగా జటాభార. కైలాస సంచార –సురుచిరాకార బంధుర విచార –వారాశి గంభీర వైరి వీర విదార –శుభాతార హీర సన్నిభ శరీర –

గీ –చోర దనుజాపహార త్రిశూల ధార – భయ విపద్ఘోర దావాగ్ని వర్ష ధార -"గిరిజ హృదయేశ నండూరు పురనివాస –స్ఫటిక సంకాశ సకలేశ భావ వినాశ "



రెండవ పద్యం లో పృధివి అంబు పావకం,సమీరం తోకూడిన పంచ భూతాత్మకుడవు నువ్వు. ఆదిత్యాది నవగ్రహ రూపుడవు. బ్రహ్మ విష్వక్సేన పశుపతులు బహిర్ముఖాలు. నిత్య శుద్ధ శ్రౌత,సత్య యజ్ఞాలు త్రిలోకాలు నీవే. సర్వమూర్తివి జీవుల్ని బొమ్మల్ని చేసి ఆడిస్తావు. బ్రహ్మజ్ఞానంతో నీ పదభక్తికలగటం మహా ప్రసాదం. సగర. మార్కండేయ. దేవతలు నిన్నర్చించి అబీష్ట సిద్ధిపొందారు.భక్తులకు "పెరటికల్ప వృక్షం నీవు ".బాణాసురుని ఇంటికావలి కాశావ్. మార్కండేయునికి శతాయుస్సునిచ్చావ్. గుహ్యకేశ్వరుని బ్రోచావ్. అర్జుడికి పాశుపతాస్త్రం ఇచ్చావ్. వీరందరికంటే భక్తుడను నన్ను ఉపెక్షిస్తున్నావ్. సూర్య చంద్రులు రధ చక్రాలుగా,భూమి రధం. వేదాలు ఆశ్వాలుగా. నభం విల్లు. మాధవుడు బాణం గా. హేరకాచలం బాణం ములికిగా,దేవతలే సేనగా భావాన్ని శక్తిరూపంగా ఉంటే దుష్ట త్రిపుర సంహారం చేసి లోకాలను కాపాడావు. కాలసర్పం చేతి కంకణం. హాలాహలం ఆహారం. సర్వభక్షకుడు పావకుడు నీ మూడవ కన్ను. శ్రీమహా విష్ణువే నీకు పెద్ద విల్లు. ఇన్ని ఉన్న వేల్పువు నువ్వుకాక ఇంకెవరు మోక్షమివ్వగలరు ?

ఏమీలేకపోయినా మోక్షం భక్తిగల పుణ్య పురుషుల సొమ్ము అంటారు..మరోపద్యంలో –సర్వజన పశుపతీమహేశ్వర ఇందుఖండ భూష. శంకర చంద్ర శేఖర. మృత్యుంజయ. శూలి సర్వేశ్వరా శితి కంఠ హరా అంటూ నామోచ్చారణ చేసి తరించారు కవి. కాటి రేడు అంటే పాపాలుకాల్చేస్తావు. గంగాధరాం అంటే పవిత్రుల్ని చేస్తావ్. భూతి రుద్రాక్ష ప్రపూతదారీ అంటే భూతినిస్తావ్. లోకస్వరూపం నువ్వే నాకొకసారి కనిపించకూడదా?-"ఇలపాదములుమహాబిలము. పొక్కిలి యునై. నలినాప్తుడు శశి నయనములుగా –దిక్కులు శ్రోత్రముల్. దివి శిరంబుగాగా. వహ్ని బిమ్బంబొప్పు వదనముగను. గాలిప్రాణములు దివౌకసాలు బాహువులు. నిశి దివానీకాలు నిముషాలుగా,అమ్బుజాసనుడు గుహ్యం. వర్షం వీర్యం. ప్రాచదువులు అంటే వేదాలు ఆసనం "గా ఒప్పే విశ్వ రూపుడవు విశ్వేశ్వరా "అంటూ మహా రుద్రరూపాన్ని వర్ణించారు కళ్ళకు కట్టినట్లుగా.

సనకాది ముని సంసేవితుడవు. రావణ గర్వాన్ని పాదంతో అణచావు. త్రిపురసంహారం చేసి లోకాలని కాపాడావు. ఆపదోద్దారకుడవు. లోక బంధవుడవు అని చంద్రమౌళి స్తవం చేశారు. భూ సంబంధమైన ఈ తిత్తి ప్రాణం పోతే మట్టిలో కలుస్తుంది. వాయు సంబంధమైన ఈ తిత్తి లోనుంచి గాలిపోతే గాలిలో కలుస్తుంది. నీటి సంబంధమైనది అంతా చావుకు ద్రవంలో చేరిపోతుంది. ఆకాశ.తేజస్సులు చివరికి గగనాగ్నిలో చేరిపోతాయి. కానీ ఆత్మ స్వరూపమైన నీ తేజస్సు ఎక్కడికీ పోదు. నీడగ్గరకే చేరుతుంది అని జీవి తత్వాన్ని చక్కగా

ఆవిష్కరించారు. "నీనామ జపం దుష్టరాక్షస సంహారం చేసే ఖడ్గం. నీసేవ దారిద్ర్యం రూపుమాపుతుంది. నీ సద్గోష్టి శత్రుజన నష్టంకల్గించి సుఖాన్నిస్తుంది. నీకై విచారం మంచిమార్గంలో నడిపించే గురువు. నీ అర్చనం రోగాదులను పోగొట్టే గొప్ప ఔషధం.

దర్పలోభామోహాదులే మొసళ్ళు. దారేషణ. పుత్రేషణాదు లు తరంగాలు. ధర్మం శుచి సత్యాదులు రత్నాలు. యజ్ఞస్వరూపి అఖిల గర్భస్థ సంచలితుదవైన నీవు గట్టు గా ఉండేదే సంసారమనే సముద్రం. దీనులపాలిటి దేవ దేవుడవు నువ్వు –పసలేని దీనమానవుడిని నేను –ధీరతగల నేతవునువ్వు –ప్రాపులేని వాడిని నేను. లోకాలను గర్భంలో నువ్వు దాచుకొంటే. దిక్కులేకుండా లోకం లో నేనున్నాను. మాయారూపంతో మాయ చేస్తావు. మాయలో మునిగినవాడిని నేను. నీకూ నాకు ఇలాంటి బాంధవ్యం ఉంది. నన్ను ప్రేమతో రక్షించటం నీ ధర్మం. కాసులు అడిగానా డబ్బు ఇమ్మన్నానా గుడ్డలు ఆహారం అడిగానా. భూములు భూషణాలు కావాలన్నానా. రమ్యహర్మ్యాలు అధికారాలు కోరానా. మోక్షం మాత్రం ఇమ్మని చిన్న కోరిక కోరాను అంతేగా అంతేగా అన్నారు కవి చాలాగడుసుగా ఆర్తిగా సభక్తికంగా. భక్త రామదాసులాగా.

కాళహస్తిలో పుడితే జన్మపాపాలు నశిస్తాయి. శ్రీశైల దర్శనం జన్మరాహిత్య మిస్తుంది.అరుణాచల దర్శనం మోక్షప్రదం,కాశీ విశ్వనాథ దర్శనం నీ సాన్నిధ్యమిస్తుంది. ఇది తెలిసినవాడే విబుధుడు. "నిన్ను ఎరిగిన వాడే నీతి ధనుడు "అంటారుకవి. .తర్వాత శరీరంలోని నాడీ చక్రాలను వర్ణించారు . గంగాది నదులలో స్నానం కంటే జ్ఞానపద తీర్ధం గొప్ప. కాశీ రామేశ్వరాది క్షేత్రదర్శనం కంటే సుజ్ఞాన దర్శనం గొప్ప..లక్ష దానధర్మాలు చేయటం కంటే ఒక జ్ఞాని కి ఆతిధ్యమివ్వటం చాలాగొప్ప. దేవాలయాలలో అర్చామూర్తుల సేవకంటే శ్రేష్టుడైన జ్ఞాని నికొలవటం శ్రేష్టం "జ్ఞాని పైన నిన్ను కొలవటమే అన్నిటికన్నా గొప్ప అంటూ మహాగొప్పగా సత్యాన్ని చెప్పారు.

నూరవ పద్యం లో. తన గురించి చెప్పుకోన్నారుకవి. తుంగభద్రా నదీ తీరంలోని నండూరి వాడను కౌశికగోత్రం భక్త గోవింద వంశం వాడు శివరామయ్య సుందరమ్మ దంపతులకు పుత్రుడు. సుబ్బారయకవికి మేనల్లుడు. లక్ష్మీ నరసింహం పేరు "నీకు శతకమన్ శతపత్ర మిచ్చినాను – తప్పులున్నను మన్నించి దయజూడు "అని వేడుకొన్నారుకవి. 101వ పద్యం లో మంగళగానం చేసి శతకం ముగించారు కవి. ఈ శతకం ఈ కవి గురించి మనవారు ఎవ్వరూ ఎక్కడా పేర్కొన్నట్లు కనిపించలేదు. సీసాలు హాయిగా సాగిపోయాయి భక్తీ వరదలైంది. భావం కట్టలు తెంచు కొన్నది. ప్రపత్తి మహా లోతుగా ఉంది. ధార. శైలి విశిష్టం. ఈశతకాన్ని, కవి నండూరి లక్ష్మీ నరసింహం గారిని పరిచయం చేసి నేను ధన్యుడిని అయ్యాను.

## 75 శ్రీమదాంజనేయ శతకం -- శ్రీ యడ్లపాటి వెంకట సుబ్బారావు

శ్రీ యడ్లపాటి వెంకట సుబ్బారావు,బిఏ బి ఎల్ గారు రచించిన 'శ్రీమదాంజనేయ శతకం శ్రీ బాలి ముఖచిత్రంతో 2006 నహైదరాబాద్ కు చెందిన శ్రీ వాహిని బుక్ ట్రస్ట్ వారు ప్రచురించారు. వెల-20రూపాయలు..ఈ శతకం యడ్లపాడు గ్రామం లో ద్వివిధ రూపాలతో విలసిల్లె శ్రీమదాంజ నేయ స్వామి పై కవి గారు రాసిన శతకం. "ముందుగా నాలుగు మాటలు " అంటూ కుమారుడు రచన మాసపత్రిక సంపాదకుడు శ్రీ యడ్లపాటి. వి ఎస్ ఆర్ శేష తల్ప శాయి రాసిన వాటిలో –తనకు జన్మ నిచ్చి,1954లో పరలోకం చేరిన తన తండ్రిగారి గురించిన వివరాలు అంతగా తెలియవనీ., తెలిసిన విషయాలుమాత్రం ఆయనకు సంబంధించిన కొన్ని పుస్తకాలు మాత్రమె నని –అందులో chembars డిక్షనరి. స్టూడెంట్స్ ప్రాక్టికల్ డిక్షనరి ఆఫ్ ది హిందీ లాంగ్వేజ్. జాన్ మిల్టన్ పైపుస్తకం. 1936 న్యుఎన్ సైక్లో పేడియా,మద్రాస్ వీక్లీ నోట్స్. ప్రిన్సిపుల్స్ ఆఫ్ మహామ్మడియన్ లాస్, శ్రీశొంఠి భద్రాద్రి రామశాస్త్రి గారిపీఠికతో వావిళ్ళ వారి వసు చరిత్ర. వసు చరిత్ర పుస్తకం లో ఆయన రాసుకొన్న పద్యం –""భారత భారతీ నిలయ భాసురరంతి,నితాన్తకాల త్రాప –స్ఫార చరిత్ర చాటు విశాల సమంచిత భద్ర పేటి వి-స్తారగుణ ప్రబోధిని నిగారససారమున దీని గల్గేడిన్-పాయదు యడ్లపాటి వర వంశపుజు వేంకట సుబ్బరాయాఖ్యునిన్ ". వీటితోపాటు ఆయన వద్ద. వేయిపడగలు రాఘవ పాండవీయం కుమార సంభవం. భీమేశ్వర పురాణం. అసిధార అనేచారిత్రక నాటకం వగైరాలున్నాయని శ్రీ మదాన్జనేయ శతకాన్ని 1936లో బాపట్ల లో ప్రచురించారని గుర్తు చేసుకొన్నారు. తన తండ్రి బాపట్ల మాయాబజార్ లో 1940లో స్వంత ఇల్లు నిర్మించుకోన్నారని. ఆ యింట్లోనే తానూ 1944లో పుట్టి పెరిగానని. తర్వాత అక్కడినుంచి మారిపోవాల్సి వచ్చిందని. యడ్లపాడులో తమ ఇంటికి ఎదురుగా గుడికట్ట వద్ద ఆంజనేయ దేవాలయం ఉండేదని. దానిలో తన తండ్రి గారిపేరు ధర్మకర్త గా లిఖింప బడిందని.శ్రీ మద్వీరాన్జనేయస్వామి భీకరం. సౌమ్యం రెండు రూపాలతో దర్శన మిస్తారని. ఆవిగ్రహ రూపకల్పన పై ఒక చాటువు ప్రచారం లో ఉందని ఆవివరాలు చెప్పారు.

యడ్లపాడు నివాసి ఒక శిల్పికి స్వామి కలలో కనిపించి తన రూపాన్ని పై విధంగా చెక్కమని ఆదేశించారని. తగిన రాయికోసం శిల్పి వెతుకుతూ ఆ వూరి కొండపై దొరకగా. చుట్టూ పరదాలు కట్టుకొని విగ్రహం చెక్కటానికి సిద్ధపడ్డాడు..శిల్పం పూర్తయ్యే దాకా ఎవరు లోపలి వచ్చి చూడవద్దు అని కోరాడు. రోజు భోజనం తెచ్చిచ్చే తల్లికి కూడా ప్రవేశం కల్పించలేదు. సంవత్సరం అయినా శిల్పం పూర్తికాలేదు. కొడుకును చూడ కుండా ఉండలేని తల్లి ఒక రోజు గుడారం కింది నుంచి లోపలి ప్రవేశించి స్వామివారి విశ్వరూపం చూసి భయంతో కెవ్వుమని అరచింది.

తలవైపు ఉలితో చెక్కుతున్న శిల్పి వెనక్కి తిరిగి చూడగా ఒక ముక్క శిల్పం నుంచి జారి పడింది. ఆ విరిగిన భాగం ఇప్పటికీ విగ్రహంలో స్పష్టంగా కనిపిస్తుంది. ఆతర్వాత ఆ శిల్పి జాడ ఎవరికీ తెలియలేదు. రెండు నిలువుల ఎత్తున్న ఆ భారీ విగ్రహం కొండరాయి నుంచి విడిపడలేదట. ఎలాగా అని గ్రామస్తులు మీమాంసలో పడ్డారు. ఒకరోజు అర్ధరాత్రి అనుకోకుండా స్వామి విగ్రహంకొండమీదనుంచి జారి,గ్రామం లో పడింది. స్వామికి ఎన్ని సార్లు గుడి కట్టే ప్రయత్నం చేసినా,నెరవేర లేదు. స్వామి గ్రామస్తులకు కలలో కనిపించి గుడి కట్టవద్దని ఆదేశించాడట. .తన తండ్రి గారు స్వామిపై శ్రీ మదాంజ నేయ శతకం "రచించి 1935లో బాపట్ల విజయముద్రాక్షర శాలలో ప్రచురించారు. దాని కాపి ఒకటి తన ఇంట్లో ఉందని. 64,98పద్యాలను స్వదస్తూరితో తండ్రి సవరణలు చేశారని. ఇప్పుడు యధాతధంగా ఆశతకాన్ని తాను ప్రచురించానని రచన శాయి తెలియ జేశారు.

కవి సుబ్బారావుగారు ఆంజనేయస్వామికి శతకాన్ని అంకితమిస్తూ –"అతిభక్తిన్ భవ దీయ వర్ణనము పద్య వ్రాతమున్ జేర్చియీ - శతకంబున్ రచియించి నాడ,మది నెంథ న్ లేదుసామర్ధ్య మం –కిత మిత్తున్,గయికొమ్ము దేవ వినుతిన్ గేల్మోడ్చి ప్రార్థిం చెదన్ -పతితోద్ధారక. యడ్లపాటి పుర సద్భక్తాంజనేయ ప్రభూ".అలాగే కవిగారు మనవిలో –"మా ఊరి వీరాంజనేయస్వామి భీకరాకారంతో రణ వీరాన్జనేయులుగా. సౌమ్యాకారంతో భక్తాంజనేయులుగా ప్రతిష్టితుడయ్యాడు. నిత్య ధూప నైవేద్యాదులు సక్రమంగా జరుగుతున్నాయి . మహా మహిమాన్వితుడై, దూర దేశస్తుల కోరికలను కూడా తీరుస్తూ భక్తులపాలిటి కల్ప వృక్షంగా విరాజిల్లుతున్నాడు. అంతటి మహనీయుని కీర్తించ టానికే ఈ శతకం రాశాను. "అని చెప్పుకొన్నారు యడ్లపాటికవి . ఇది సీస పద్య శతకం. "ఆంజనేయ ప్రభూ "అనేది శతక మకుటం. శతకం లోని వివరాలు రేపు తెలుసుకొందాం.

శ్రీ యడ్లపాటి వెంకట సుబ్బారావు కవిగారు తమ 'శ్రీమదాంజనేయ శతకం "లో మొదట శ్రీ రామ జనక పంచకం గా అయిదు సీసాలు రాసితర్వాత శతకం ప్రారంభించారు. ఇది శార్దూల పద్య శతకం. మొదటి శార్దూలం –శ్రీ రామాంఘ్రి సరోరుహంబుల సదా చింతించి దీర్ఘాయువున్-మీరన్ మీరగ గాంచి. భూమిపయి సందీప్త ప్రభావంబుతో –బారన్ ద్రోలుచు భూత సంఘముల. సద్భక్తాలి రక్షించు చున్ –వీరత్వ స్థితి నున్న వాడ విటసద్వీరాంజనేయ ప్రభూ "రెండోపద్యంలో హనుమ బాలక్రీడగా సూర్యుని మింగే ప్రయత్నం. దేవతలవరాలు తర్వాతసుగ్రీవ మంత్రిత్వం రామ లక్ష్మణ పరిచయం చెప్పి సీతమ్మ జాడ తెలుసుకొనే ప్రయత్నం లో సముద్ర లంఘనాన్ని –""హుంకార స్ఫుట భీకరాంగవిలసద్వ్యోమ ప్రచారోద్ధతిన్-ఘీమ్కారంబుల దిక్కుళ్లెల్ల నవియన్. గేళీ విలాసంబుగా –శంకాతంకములేక యర్ణవము నిచ్చా శక్తిలంఘించి ము –ద్రాంకంబున్. సతి సీత కిచ్చితివి కదా !ఆంజనేయ ప్రభూ "అంటూ ఆదృశ్యాన్ని కళ్ళ ముందు ఫోటో తీసి పెట్టారు.

వేదాంతార్థ విచక్షణుడు,బ్రహ్మచర్యోదాత్తప్రతిభాయుతుడు. యోగైకరూపుడు. వేదజ్ఞాన విశారదుడు. నిజాభీష్ట సంవేది,నాద బ్రహ్మ అని హనుమ స్తుతి చేశారు. సారాచార విచార భౌతిక దిదృక్షా దీక్ష సంకల్ప. సంచారోద్భూత వివేక విస్ఫురిత విజ్ఞాన ప్రకాశ,ధీరస్వాంత. సుస్థిరంగా ధాత్రిపై ఉండేవాడా అంటూ హనుమ గుణ గాన కీర్తన చేశారు లాయర్ కవి. "మా భాగ్యవశాన యడ్లపాడు సౌభాగ్యం దీపింపగా., శోభాముద్ర పరీత విగ్రహ. శుభ శ్లోకా. భీకర. తేజో స్వరూపునిగా మోక్ష దాయునిగా ఉన్నావు. "కష్టా ర్త్యాగ శిలీ ముఖ ప్రకర శుష్క ప్రాణ సంజీవనా – దుష్ట వ్రాతవనీ కుఠార. సుగుణ స్తోమైక రక్షేశ్వరా - -శిష్టాచార విశుద్ధ కార్యవిదిత స్వీకార నైవేద్య సం – తుష్ట వినోద గీతిక నిదానూ ఆంజనేయ ప్రభూ "అని కష్టమైన పద్యాన్ని అత్యంత సులభంగా రాసి స్వామి భక్తి చాటుకొన్నారు. హనుమ పేరు ఎత్తితే కవికి పులకరింపే, జలదరింపే. అందుకే ఇంపు గొలుకు పదభూయిష్టంగాశతకం అల్లారు-"దివ్యజ్ఞాన సమాధి రాగ హృదాయో ద్రిక్త ప్రభా శోభితా –భవ్యాకార,విసూక్ష్మ రూప ధర. విశ్వ వ్యాపి విశ్వేశ పుత్రా –వ్యోమార్గ చరాను వర్తీ. సుగుణ వ్యాపార పారీణ-రామ వ్యాపార జయాంక చిహ్న వరధామా "అంటూ ఉప్పొంగిపోయి హనుమలీలా వర్ణన చేశారు. మాటలు రాని వాడిగా స్తబ్ధతగా మా ఊళ్ళో ఎందుకున్నావు ?భూత ప్రేత పిశాచాలు నీకు "ఆమ్యామ్యా "ఏమైన సమర్పించాయా ?మాలోపాలు చూపి బాధలు పోగొట్టు స్వామీ అని చమత్కారంగా చెప్పారు.

నీకోసం గులాబి పువ్వు కోయబోతే ముళ్ళు గుచ్చుకొన్నది. మొగలి కోయబోతే బుస్సు బుస్సు అని పాపరేడు భయపెట్టాడు. కాపాడు తండ్రీ అని భక్తీ యుక్తి చాటుకొన్నారు. తన అనుభవాన్ని చెబుతూ –"కనుమూయన్ గనుగొందు దివ్యతరసుజ్ఞానప్రకాశంబు,వే –కనువిప్పన్ కనుగొందు మౌఢ్యతర మౌ కామాంధకారంబు. మా- యను జన్మంబును బొంది మాయవలలో వ్యాలోలమై పోవు –నీ తనువున్ గావు మటంచు వేడెదను సద్భక్తాంజనేయ ప్రభూ "అని మాయామోహ జగత్తు లీలా వర్ణన చేసి, అవలలో పడకుండా జారకుండా రక్షించమని ఎలుగెత్తి ప్రార్థించారు కవి. ధన ధాన్యాలు కోరలేదు. ఎందుకు పరి వేదనతో ఇబ్బంది పెడతావయ్యా. వాత్సల్యం చూపి మోక్షం ప్రసాదించు మహాప్రభో అన్నారు. లక్ష్మీ వంశ సంజాత ధర్మపత్ని అయిన నారాయణ స్వరూపి శ్రీరాముని సేవాభాగ్యం పుష్కలం గా ఉన్న వాడివి. నన్ను ఆదుకోకపోతే నీ వీరత్వానికి లోటు కదా అనిఫిట్టింగ్ పెట్టారు ఎంతైనా లాయర్ కవికదా.

99వ శార్దూలం లోతనతండ్రి నరసయ్య తల్లి సుబ్బమాంబ. అనీ. రామయ్య. రాజ్యమాంబలకు దత్తత వెళ్లి. యడ్లపాటి సుబ్బారావు పేరుతో శతకం రాశానని చెప్పారు. చివరి శత శార్దూలం లో "వసుధన్ నీదుమహత్వమెంతదనుకన్ వర్ధిల్లునో. రామ నామ నా –మ సహస్రంబులు నెంతకాలమవనిన్ భక్తాళికిన్ జ్యోతులో –వసురూపంబున నంతకాల మవనిన్ పద్యాళి వర్ధిల్లగన్ –వెస దీవించు మటంచు వేడెదను సద్వీరాంజనేయ ప్రభూ "అని ముగించారు. మంచి ధార, బిగుపైన శోభాయుత భావాలు భక్తీ దానికి తగిన

వివేకం,దానికి తగ్గ పాండిత్యం. ఊహా శబలత. విశిష్ట శైలి తో యడ్లపాటి లాయర్ కవి చక్కని శతకం కూర్చి తమ దైవం శ్రీ ఆంజనేయస్వామికి కానుకగా సమర్పించారు పద్యం నడక శార్దూలంలాగానే నడిచ శోభస్కరంగా ఉంది. 1935లో తండ్రిగారు రాసి ముద్రించిన శతకాన్ని మళ్ళీ 2006లో కుమారుడు" శ్రీ రచన శాయి" ముద్రించిలోకానికి అందించినందుకు అభినందనలు. ఈ శతకాన్ని, ఈ కవి గారిని పరిచయం చేసినందుకు మహదానందంగా ఉంది.

## 76 పాటగా శ్రీ రామ రామశతకం -- శ్రీ బోడేపూడి వెంకట సుబ్బయ్య

కవిగారు సీస పద్యం లో తానూ శతకం కూరిస్తే. తిరుపతి స్వామి వారి ద్రవ్యంతో ముద్రణ పొందిదని. కందార్ధాలలో తానూ చెప్పిన తత్వార్ధాలను పెద్దలు పిన్నలు పాటించమని వేడుకొన్నారు. ముద్రణ ఖర్చు శ్రీ బోడేపూడి వీరయ్య చౌదరి భరించారని. కావాల్సిన కాగితాలూ సమకూర్చారని చెప్పి "శ్రీ రఘురామ రామ యని –సారెకు మది దలచి నేను సన్నుతి జేసి శీ –శ్రీరామ రామ శతకము –శ్రీ రాముల కంకితము గా జెప్పేద వినుడీ –భక్తి రసములోన ఓలలాడుడీ "అని వరకవి శ్రీ బోడేపూడి వెంకట సుబ్బయ్య "కవి వేడుకొన్నారు.

"శ్రీ రా మ రామా మము బ్రోవు శృంగార సుగుణ ధామా –కోరి వేడు చుంటిమీ మమ్మేలు కొనుము శ్రీరామ రామ "

ఇలా శతకం మొదలు పెట్టారు. ఇష్ట దేవతలందర్నీ స్తుతించి శతకం చెబుతున్నానన్నారు. గణేశ శారదాంబాలకు భక్తిగా వందనం చేసి మాయా లోక వివరాలు మొదలు పెట్టి చెప్పారు. మానవ జన్మ శుక్ల శ్రోణి తాలతో కలుగు తుందని. కర్మాగా పిండమేర్పడి ఏ నెలలో ఎలా పెరుగు తుందో వివరిస్తూ. శిశు జన్మ కాగానే "మాయా మంత్ర సాని వనితలు బొడ్డుకోసి. నీళ్ళుపోసి జోలలు పాడతారనీ. ఇదంతా మాయే అనీ. ఆనందం వెనుక దుఖం ఉందని. ఈ నరజన్మ ఎన్ని రాశులలో పుట్టాక వచ్చిందో ఎవరికీ తెలీదని చెప్పారు. బాల్యం లో రామ భజన చేద్దామనుకొంటే. ఆటలపై ధ్యాస ఎక్కువై. ప్రాయంలో చేద్దామంటే కామం కళ్ళు కప్పుతుందని. తర్వాత పెళ్ళి జంజాటం పిల్లల ఆరాటం వారి పోషణలో గడిచిపోతుందని నిన్ను స్మరించటం అసాధ్యమని పిస్తుందని. పాడి పంటలు భోగ భాగ్యాలు ఆశిస్తూ వాటిపై తపిస్తూ దొరకగానే,పోషణ ఎట్లా అని దిగులుపడుతూనిన్ను దూరం చేసుకొంటాడు జీవి.

"నా నోరు చేసిన పాపమూ నీ స్మరణ జేయనివదయా –నానాటి లిల్బిషంబు నెడబాపి నన్నేలు రామా "చేతులు నీపూజను కళ్ళు నీరూపును. కళ్ళు నీ కథలు. శిరసు నీకు మొక్కటానికి సహకరించవు. కాలయముడు వచ్చి వేగంగా పాశం విసిరితే మరణం ఖాయం. .ఇల్లు ఇల్లాలు వాకిలి ధన ధాన్యాలు ఎవరి పాలౌతాయో తెలీదు. తెలిసికొన్ని తెలియకకొన్ని పాతకాలు చేశాను. వాటినుండి దూరం చేయిరామా . గురువులను మహాత్ములను అహంతో పరిహాసింఛాను. దేవుడు లేడని దుర్భాష లాడాను. పరులను దూషించాను. ఎవరు చెప్పినా వినక మందమతి గా ప్రవర్తించాను. పరమ పాపిష్టి నయిపోయాను నువ్వే దిక్కు.

"వర్ణింప నీ రూపునూ వ్యాస వాల్మీక మౌనిగాను –స్మరణ చేసేటి భక్తుడన్ –కోరికలు సమకూర్చు రామా శ్రీరామా "విభీషణుడిని ఆదరించావు నన్ను దూరం చేసుకొంటావా "అని భక్త రామదాసులాగా "భూములిమ్మంటినా. భూషణాలు అడిగానా.కామితార్ధాలిచ్చి కావు కావు అని కాకిలా అరుస్తున్నా. మాతల్లి సీతమ్మ కూడా నాబాధలు చెవిన వేయటం లేదా ?అని ఒక సన్నాయి నొక్కు నొక్కారు. పోనీ తమ్ముడు నిన్నంటి ఉండే లక్ష్మణుడు. పోనీ 24x7 నిన్నే కొలుస్తూ. నీతోనే ఉంటున్న హనుమకూడా చెప్పలేదా రామా ?పంతమదేల మాపయి బ్రోచుట భారమా ?అని నిందా స్తుతీ చేశారు కవి.

ఫలస్తుతి చెబుతూ "ధర నీదు శతకమెపుడు యా చంద్ర తారార్కమై జెలంగా – పరిపూర్ణ భావమూ తో భక్తులకు ఫలమొసగునూ రామా".హృదయ పూర్వకంగా శతకం రాసి నిండు మనసుతో అన్కితమిచ్చాను. .ఇంత కఠినుడవని నాకు ముందే తెలిస్తే –సుంతైనా నీనామము నుడువనూ సున్నా "అని పంగనామాలూ పెట్టారు. శరణా గతుడు అనే బిరుదు తగిలించుకొని నావైపు కన్నెత్తి చూడనే చూడవు. "గోరంత దీప మెలుగా చీకటీ కోనంత వెలుగాయే –పారిపోయెను పాపముల్ నీ పాద భక్తీ చే రామా ".ఈ శతకం లో భక్తిరసం. పిండోత్పత్తీ నేర్పుగా రాశాను. ఈశతకం చదివినా విన్నా –వాసిగా మోక్ష పదవీ సమకూరి వర్ధిల్లు ను "

108లో గుంటూరు జిల్లా వినుకొండ తాలూకా నడి గడ్డ గ్రామం లో జన్మించానని. గోత్రం వల్లుట్ల అనీ. తండ్రి బోడేపూడి వెంకయ్య అని మంగళం పాడి వచనంలో "శ్రీరామ చంద్ర కరుణా కటాక్ష వీక్షణా లబ్ధ సంపన్న. పదపద్య కవితా ధురీణ., సంగీత నిపుణ. వల్లుట్ల గోత్ర పవిత్ర బోడేపూడి వంశ పయః పారావార రాకాసుదాకర వెంకయాఖ్య ప్రియ సుత వెంకట సుకవి ప్రణీతంబైన శ్రీరామ రామ శతకం సంపూర్ణం "అని ముగించారు.

నరసరావు పేట రాజ్యరమా ప్రెస్ లో ఈ శతకం 1935లో ముద్రింపబడింది. వెల-కనపడ లేదు.

మీ -గబ్బిట దుర్గాప్రసాద్ -9-4-23-ఉయ్యూరు

## 77 సర్వ సర్వేశ్వర శతకం -- శ్రీ బులుసు వెంకటేశ్వర్లు




పండిత కవి శ్రీ బులుసు వెంకటేశ్వర్లు గారి "ఆత్మోపహారం "అనే సర్వ సర్వేశ్వర శతకం ".

ఈ శతకం 1955 డిసెంబర్ లో కాకినాడలోని బివి అండ్ సన్స్ వారి చే పునర్ముద్రణ పొందింది. అచ్చులో వెల 8 అణాలు ఉంటే పెన్ను తో దిద్ది 5 అణాలుగా మార్చారు. "ఒక్క మాట"అంటూ కవిగారు "ఆత్మోపహారం గా ఈ శతకం 1947 లో రాశాను . ప్రతులన్నీ వెంటనే చెల్లిపోయాయి. మిత్రులు చాలామంది కావాలని కోరితే. ఇప్పటిదాకా మళ్ళీ ముద్రించ లేక పోయాను. ఈ ముద్రణలో "శర్వా !సర్వా లోకేశ్వరా "అనే మకుటం చేర్చాను. గురు. శివా అభేదం అనే భావంతో రాశాను. భగవత్ భక్త సంబంధం రహస్యంగా ఉండాల్సిందే. గురు శిష్య సంబంధం వ్యక్తిగతం. పరిహాస రచనపై ప్రాణమున్న వారికి పరమార్ధ రచనపై కంటగింపు ఉండక తప్పదు. వారిని ఉద్దేశించి ఇది రాయలేదు "అని చెప్పుకొన్నారు.


ఒక్క మాట

శతకం ప్రారంభిస్తూ “శ్రీ శ్రీ శ్రీ గురు దేవ పాద జలజ శ్రీమత్సుధా వార్ధివి –శ్వ శ్రేయ సముపార్జనంబున. పరబ్రహ్మ ప్రమోదాప్తికై –స్వ శ్రేయస్కర బుద్ధి షట్పదము లుత్సాహించి క్రోలున్ మహ - త్వశ్రీ లౌ నమృతంపు బిందువులు శర్వా !సర్వ లోకేశ్వరా “అన్నారు. నీ కారుణ్యం తో మొదట రాసి సమర్పించాను “భక్తి భరితానంద ప్రపూర్ణాత్మ తో –ప్రాకామ్యమిచ్చావు. ఉమా రమా ధీశ్వరా భక్తిలో పట్టభద్రుడను. నన్ను పోలిన వారేవ్వరూలేరు ఇంద్రోపేంద్రులు కూడా బలాదూర్. ఆపరమానంద స్వరూపుడిని నేను. సర్వ తీర్ధాలు నీ పంచనే ఉంటూ నిన్నారాధిస్తాయి. నువ్వు రూపు దాల్చిన బ్రహ్మ జ్ఞానం. బ్రహ్మర్షి ప్రవరమైన గురుపే నీవు. ”నీ సేవా పరిపూర్ణ కాంక్ష నిర్వాణ సామ్రాజ్య లక్ష్మీ సింహాసన సుఖ ప్రతిష్టిత సుఖ శ్రీ ప్రాప్తి మూలం “.నా నీ సాంగత్యం జగన్నిర్మాణ శోభాదృక్షము నీనామం ఒక సారి నాల్కపై నిల్పితే. నీ నారాయణ రూపాన్ని ఆత్మలో ఒక సారి నిలిపితే నీ దివ్య చరిత్ర ఒక్క సారి వింటే. ”నర్తించు నరుండు నీ వయి “అంటూ అద్వైతానంద ప్రదర్శనం చేశారు కవి. నీ వర వాత్సల్య విశేషం పరమాద్భుతం.

క్షణిక మైన విశాల విశ్వం లో నీ సాంగత్య భాగ్యం ఆణువైనా. మేరు సమాన సత్ఫలితమిస్తుందని పొంగిపోయారు. ప్రణవం ఒక్కసారివింటే పాపాటవులన్నీ కాలిపోతాయి.నా నీచ జీవితాన్ని నీ కారుణ్య సంపత్తి తొ చాలా శోభాకరంగా మార్చావు. నీకారుణ్యం లేకపోతె నా బతుకు దుర్భరం. ఈ భూమి మీదే మాకోసం స్వర్గగతులు సృష్టించి అందించావు. నిత్యం శంకా గ్రంధి విచ్చేదనం చేస్తూ సర్వ గరిష్ట జ్ఞానం అందించావు. అణువులో అణువు గా. బ్రహ్మండాను భావునిగా. వెల్గు వెల్లువగా బ్రహ్మర్షిగా. గుణులలో గుణి గా ఉన్న నిన్ను అర్చించి సేవిస్తే మేమందు కోలేని మోక్ష సామ్రాజ్యాలున్నాయా స్వామీ !నీకు నిద్రాహారాలు లేవు –మహా నిర్నిద్ర సౌభాగ్య సంపద్రాజ్యంబున సుస్థిరుడవు”.జగ ద్భద్రాను సంధాయివి.క్షుద్రమైన ఇహలోక సౌఖ్యాలను అక్షుద్ర ప్రభావంతో త్యజించి మించిపోయిన భద్రాత్మకుడవు. అన్నారు ఈపద్యంలో శ్రీనాధుడు కనిపిస్తాడు. నీనామం పది వేలు చేసే సువర్ణం. రామాక్ష్మాపతికి నువ్వే సరి జోడు.

పరమేశ్వర రూపాన్ని ఎంత విస్పష్టంగా ఎంత జగన్మోహన కరంగా. ఎంత భక్తి భావ పరిపూర్ణంగా వర్నిస్తారో తెలియ జెప్పే పద్యం చూద్దాం –"ఆ కర్ణాంత విశాల నేత్రములునేత్రానందముం గూర్ప సు –శ్లోకంబౌ ముఖ పంకజంబు సిరిచే శోభింప విస్తీర్ణమై –లోకుల్ మెచ్చు లలాట మొప్పగ. మహా లోలత్వముం గూర్చు స- ర్వాకర్షంబగు మూర్తి దాల్చితివి శర్వా !సర్వ లోకేశ్వరా ! "అక్షర లక్షలు చేసే మహా అరుదైన పద్య రాజమిది. నీ కంఠారవ దివ్య దుదుభినాదం వజ్రమే. నిన్ను కొల్చే వారికి ఉత్కంఠ. అదే ఉత్కృష్ట శోభాకర ఆపత్కాల ఉద్ధరణం. గుదప్రక్షాళనం దగ్గర్నుంచి కూర్చోటం నిలబడటం. ఉచిత సంభాషణం సత్సంభావనా నైపుణ్యం మొదలైనవన్నీ నీ దగ్గరే జనాలు బతకటానికి నేర్వాలి "అనే కొత్త తమాషా పద్యం రాశారు. "నీవే నేనయి. నేనె నీవయి. నేనే సమస్తమునై. ఈ విశ్వం నా నిర్గతమై. నా ఇష్టానుసారంగా ప్రావిర్భావిస్తూ ప్రవర్తిస్తూ. వెడలిపోతూ,వర్తించి నర్తిస్తూ అంతా లీలగా భావిస్తాను "అన్న ది త్వమేవాహం కు పద్యాకృతి. కవిగారి పాండిత్యానికి అద్వైత దర్శనానికి పరాకాష్ట.

జీవ బ్రహ్మలు వేరుగా అనుకొంటే నిన్ని సేవకుడిగా సేవిస్తాను. జీవ బ్రహ్మలు అద్వయం అనుకొంటే నిను చింతించే వేళ మహానుభావుడను. సకలమూ నేనే అవుతాను "మరోఆణిముత్యమైన పద్యం.లీలకోసం పురుడు పుణ్యాలు ధనం దాంపత్యం సుఖభోగం. కర్మమర్మం సృష్టించి మమ్మల్ని ఆడిస్తున్నావు. నువ్వు ఉండగా నాకు ఈ భువన ప్రపంచ విలసన్నాట్యం ఎందుకు?నా చీకాకులు చెప్పి కావు మనటం సిగ్గుగా ఉంది అని చెప్పారు.ఈశా వ్యాస పరాశరాది వినుతా,దేవా మంగలమంగజాట నిధనా,శర్వా సర్వ దిగంతరాత్మ. భక్తాధీన మనోమ్బుజాత మొదలైన పద్యాలు కవిగారి పరా భక్తికి తార్కాణ. 110 వ చివరి పద్యంలో

. "జననంబందితి నేను శ్రీ బులుసు వంశంబందు నా యక్ష పా-దుని సద్గోత్రజుడన్. త్వదీయ పద భక్తుండన్ నినున్ నిత్యమున్

గని పూజింతును వేంక టేశ్వరుడ,నీ కారుణ్య మర్ధించుటే –పనిగా నుంటిని స్వీకరింపుమిక శర్వా !సర్వ లోకేశ్వరా “.

ఇపుడు కవిగారి సర్వ లోకజ్ఞత తెలుసుకొందాం –

శ్రీ బులుసు వెంకటేశ్వర్లు ప్రముఖ కవి. రచయిత, సాహితీ విమర్శకులు. ఆయన 1956 లో కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం పొందారు.[1]. కవివతంస బిరుదాంకితులు

జీవిత విశేషాలు

ఇతడు తూర్పు గోదావరి జిల్లా, పొడగట్లపల్లి శివారుప్రాంతమైన రామచంద్రాపురంలో 1906, ఏప్రిల్ 10న జన్మించారు. ఇతడు మొదట వేదవిద్య, తరువాత ఆంగ్ల విద్యను అభ్యసించారు. మద్రాసు విశ్వవిద్యాలయం నుండి వేదాంతంలో, తెలుగు సాహిత్యంలో రెండు ఎం.ఎ.పట్టాలు సంపాదించారు. తరువాత తెలుగు ఉపన్యాసకునిగా 30 సంవత్సరాలు పనిచేసి 1963లో పదవీ విరమణ చేశారు. గొప్ప వచన రచయితగా, వక్తగా రాణించారు.

రచనలు

- మన కవులు : 'రామరాజ భూషణుడు', 'ధూర్జటి', 'తెనాలిరామకృష్ణుడు' వంటి ప్రాచీన కవుల నుండి మొదలుకొని, 'విశ్వనాథ సత్యనారాయణ', 'నండూరి రామకృష్ణమాచార్య', 'గుంటూరు శేషేంద్ర శర్మ', 'వేముగంటి నరసింహాచార్యులు' వంటి దివంగత ఆధునిక కవులతోబాటు; 'అనుమాండ్ల భూమయ్య', 'దుగ్గిరాల రామారావు', ఇంకా 'ఆచార్య ఫణీంద్ర' వంటి సమకాలీన కవుల వరకు 50 మంది కవులు రచించిన అనేక విశిష్ట పద్యాలను హృద్యంగా విశ్లేషిస్తూ రచించిన చక్కని విమర్శన గ్రంథం.[2]

- “వావిళ్ల నిఘంటువు” (1949) : వేదం లక్ష్మీనారాయణ శాస్త్రి తో కలసి వ్రాసినది.[3]
- భారతీయ తత్వశాస్త్రము-పరిశీలన : (1956 సాహిత్య అకాడమీ అవార్డు)[4]
- యజ్ఞఫలము [5]- 1962
- Thousand Steps to God [6]- 1975
- శ్రీరామాష్టవ సుధాలహరి - 1967
- బులుసు వెంకటేశ్వర్లు జీవిత చరిత్ర[7] - 1977
- నిర్వచనాంధ్ర శ్రీమహాభాగవతము [8]
- శ్రీ శివప్రభుశతకం - 1978
- సర్వదుఃఖ నివారణోపాయము[9] - 1967
- Lives of ancient India Saints[10] - 1982
- అష్టావక్ర చరిత్రము[11]

## 78 శ్రీ రామచంద్ర శతకం -- బాల బ్రహ్మచారి శ్రీ వెలగల సుబ్బారెడ్డి

బాల బ్రహ్మ చారి. సహజ కవి శ్రీ వెలగల సుబ్బారెడ్డి గారి ”శ్రీ రామచంద్ర శతకం “రచించి శ్రీ వేణు గోపాల భక్త లీలా లహరీ గ్రంథనిలయం తరఫున షష్టమ పుష్పంగా సమర్పించారు. దీన్ని మగటూరు నివాసి శ్రీ జినపసేని వెంకటరామరాజు. ఈ సూర్యనారాయణ రాజు పరిష్కరించగా. ఆరవిల్లి గ్రామవాసిని కీశే వెలగల వీరేడ్డి గారి



ధర్మపత్ని శ్రీమతి వెలగల వెంకమ్మ గారి ద్రవ్య సాయంతో ప.గో.జి.నరసాపురం సీతారామా ముద్రాక్షర శాలలో 1930లో ప్రచురించారు. వెల-రెండు అణాలు.

కృతజ్ఞతలు అంటూ కవిగారు పద్యాలలో వెంకమ్మగారి దాన దయా దాత్రుత్వాలను ప్రశంసించారు. సూరమాంబ పెద్ద తటాకం త్రవ్విస్తే. బంగారు రథాన్ని ఏర్పాటు చేశారు రంగరాణి. భార్తపేరుమీద దేవాలయాలు కట్టించి. చిర యశస్సుపొందారు వెంకమ్మ గారు. చెల్లమాంబ బీదల పెళ్ళిళ్ళు చేయిస్తే. అసహాయులకు అన్నవస్త్రాలు అందించారు బంగారంబ. అలాటివంశంలోని వెంకమ్మగారు శ్రీ రామ చంద్ర శతక ముద్రణకు సాయం చేశారు. భర్త వీరేడ్డి దానదయాధర్మగుణాలను కాపాడారు. ఆమెకు రామ


శ్రీ రామచంద్ర శతకము.
వెలగల సుబ్బారెడ్డిగారు.
వెలగల వెంకమ్మగారి ద్రవ్యసహాయముచే
1930

చంద్రమూర్తి దీర్ఘాయురారోగ్యాలు ప్రసాదించాలని మార్టేరు పంచకం నుంచి కవి వెలగల సుబ్బారెడ్డి కృతజ్ఞతలు తెలిపారు. సీసపద్య శతకం. సుబ్బరాడ్వరదా హారీ సుర నుతేంద్ర -రమ్యగుణ సాంద్ర మార్టేరు రామ చంద్ర "అనేది శతకం మకుటం.

మొదటి సీసపద్యం –"శ్రీ రామావర సుర సేవితా సుర హర కరుణాలవాల శ్రీ –గానలోల సాకేతపురవాస. సత్య వాక్పరిపూర్ణ పురహరాసుర హర

పూర్ణ నిపుణ తాటకి సంహార. దానవాంతక మేటి సీతామనోహర –శ్రీ రమేశ అహల్యా రక్షణాయాశ్రిత పాలనా సద్గుణ జాల శ్రీ సారసాక్ష

గీ-తాపస స్తోత్ర ధరణీశ ధర్మ శీల-పుండరీకాక్ష రఘురామపూర్ణ చంద్ర –సుబ్బరాడ్వరదా హారీ సురనుతేంద్ర –రమ్య గుణ సాంద్ర మార్టేరు రామ చంద్ర "

రెండవ పద్యంలో తనకు యతి ప్రాసలు తెలీవని. సీసాలలో రాస్తున్నానని. నిఘంటు పరిచయం నాస్తి. పంచకావ్య,నీతిశాస్త్ర వాసనా లేదని. స్వామికృపతో మొదలుపెట్టానని. అన్నిటికీ ఆయనదే భారమనీ గడుసుగా

చెప్పారు. రామమహిమలు ఎవరూ వర్ణించలేరనీ. సర్వ రోగాలు హరించి సంసార బంధాలను తెగగోడుతుందని. దరిద్రం తొలగి శ్రేయ భద్రత రామనామ ఇస్తుందని మోక్షమార్గం చూపిస్తుందనీ చెప్పారు. రామ చంద్ర జపం అంటే అరచేతిలో మోక్షం ఉన్నట్లే. పాండవుల్ని వెన్నంటి కాపాడిన కృష్ణమూర్తివి ఉత్తర గర్భాన్ని రక్షించావు. ధ్రువుడికి ఉన్నతోన్నత పదం ప్రసాదించావు. ద్రౌపదిని నిండు సభలో కాపాడావు. రాక్షసుల ఆగడాలవలన యజ్ఞయాగాదులకు ఆపద కలిగి ప్రార్ధిస్తే రాముడివైపుట్టి దుష్ట రాక్షస సంహారం చేశావు. ఇంద్రుడు కోపంతో రాళ్లవర్షం కురిపిస్తే గో,గోపాలురను కాపాడిన దయా సముద్రుడవు. తండ్రి పెట్టిన అన్ని యమ నరక బాధల్ని తట్టుకోనేట్లు గా ప్రహ్లాదుని కాపాడి స్తంభంలో నృహరిగా అవతరించి హిరణ్యకశిపు ప్రాణాలు హరీ మనిపించావు. శరణు అన్నవాడిని కాపాడావు. పుంభావ మొహన రూపంతో రాముడిగా ఉన్నప్పుడు నీ పరిష్వంగ సుఖం కోరిన తాపసులు మొదలైనవారికి కృష్ణావతారంలో ఆకోర్కె తీర్చావు.

గొల్ల ఇళ్ళల్లో పాలువెన్న దొంగిలించి తిని,ఆగమాగం చేసి. ఏమీ తెలీని నంగనాచిలా అమ్మకూచిలా యశోదను నమ్మించి "బాపురే పదునాలుగు భాండాలు నోటిలో చూపించి ధన్య ను చేశావు. నిన్ను తప్ప ఎవర్నీ ఏదీ కోరలేదు నాపై ఉపేక్ష మాని ఆదుకొని కాపాడి మోక్షమివ్వు. "నారద తుంబుర నంది వాహనులను నువ్వు రక్షించటం నిజమైతే ద్రౌపది దంతీన్ద్రుడు అంటే గజేంద్రుడు లను కాపాడినవాడివైతే అర్జున అహల్య. అంబరీషాదులను రక్షించటమే నిజమైతే,ఉద్ధవ అక్రూరాది భక్త వరదుడవే నీవైతే వెంటనే వచ్చి నన్ను రక్షించు. ధర్మం నిల్పి అధర్మం బాపి అవతార పరమార్ధం చూపి. సక్కుబాయి మీరాబాయి వంటి భక్త శిఖా మణులను కాచినట్లు నన్ను కూడా కాపాడు నువ్వే నాకు దిక్కు ఏడుగడ,ప్రాపు అని నూరవ పద్యం చెప్పి. నూట ఒకటవ పద్యంలో పూర్తిగా భక్తిరంగరించి నైవేద్యం పెట్టారుకవి –

"శ్రీరామ జయరామ సీతామనోహరా-మారుతాత్మజ సేవ్య మంగళంబు –దశరదాత్మజ దుష్టదానవ సంహార మాత పిత్రులసేవ్య మంగళంబు

సాకేత పురవాస సాధు రక్షణ. దుష్ట మదనాశనా నీకు మంగళంబు –అహల్యా రక్షణా యాశ్రితపాలనా మాధవా నీ కిదే మంగళం

గీ.-మదన జనకుండ నీకిదే మంగళంబు –మహి సుజన పాల,నీ కతి మంగళంబు –

సుబ్బరాడ్వరదా హరీ సుర నుతేంద్ర –రమ్య గుణ సాంద్ర మార్టేరు రామ చంద్ర “అంటూ మంగళం తో ముగించారు.

చివరగా “సంసార సర్ప దష్టానాం  జంతూనామ వివెకి నాం –శ్రీరామ పాదాబ్జం –స్మరణం పర మౌషధం  -శ్రీ రామ చంద్ర శతకం సంపూర్ణం –శ్రీ వేణుగోపాల స్వామి పర బ్రాహ్మణా ర్పణమస్తు  ”“అని శ్లోకంతో పరి సమాప్తి చేశారు . మరోశ్లోకం లో –గుణ దోషౌబుధొ గృష్ణ   -నిందుక్ష్యేళావిషేశ్వరః –శిరసా శ్లాఘతే పూర్వం –పర కంఠే నియచ్చతి “అని స్వస్తి పలికారు.

ఈశతకాన్ని “1922-23 న్యాయ దీపిక. 1929-30 రెడ్డి రాణి పత్రికల నుంచి పునర్ముద్రితం అని పేర్కొన్నారు. అనుబంధంగా “కవి వైరాగ్యం”అనే సీసపద్య శతమాల ను జత చేశారు. శ్రీ వెలగల సుబ్బారెడ్డి కవిగారు –శ్రీ రంగనాధ నామ సంకీర్తనలు. ప్రహ్లాద చరిత్ర హరికధ. మదన గోపాల శతకం. ధ్రువ చరిత్ర హరికధ. కృష్ణలీలలు అనే దసరా పద్యాలు. ముకుంద శతకం,జయదేవ చరిత్ర హరికధ. సుబ్బరాడ్గాన రామాయణం. గజదొంగ వైరాగ్యం అనే ప్రహసనం. శ్రీ నమ్మాళ్వార్ చరిత్ర. ప్రచ్చన్న క్షత్రియ (కమ్మ రెడ్డి కాపు,వెలమ )కుల ప్రబోధం. పంచమ అనే ఆది ఆంధ్ర కుల ప్రబోధం. భారత మాత స్తవం,వైకుంఠ ఏకాదశి వ్రాత ప్రశంస. పరమార్ధ ప్రబోధం. పుష్య శుద్ధ ఏకాదశి మహాత్మ్యం. శార్దూల వృత్త వింశతి పద్యమాల. నాలుగు భాగాలుగా కీర్తనలు రచించారు. ఇవన్నీ వెలలేని గ్రంధాలే. భక్తి మకరందాలే. కవిగారి ఇంటిపేరును అంటే “వెలగల “ను రుజువు చేసేవే. చక్కని ధార,మంచి ఎత్తుగడ. భక్తీ జ్ఞాన వైరాగ్య త్రివేణీ సంగమంగా ఈ శతకాన్ని తీర్చి దిద్దారు. మహా మహా కవుల స్థాయికి తీసిపోని వైదుష్యం కనిపిస్తుంది. కానీ మన వాళ్ళు ఎవరూ ఎక్కడా ఈ కవి ఈశాటకం  గురించి ఉదాహరించిన దాఖలాలు లేవు. అఖండ గోదావరీ ప్రవాహ సదృశం గా కవిత్వం పరిగెత్తింది అందులో మునిగి తేలి తన్మయులమై శ్రీ రామ చంద్ర దర్శన సౌభాగ్యమే కాదు మొక్షాన్నీ పొందగలం. ఇలాంటి గొప్ప శతకాన్నీ. దాన్ని తీర్చి దిద్దిన కవిని పరి చయటం  నా మహాద్భాగ్యంగా  భావిస్తున్నాను.

## 79 వృషాధిప శతకం -- శ్రీ పెనుమత్స మహాదేవ కవి




తూగోజి రామ చంద్రపురం తాలూకా ఆలమూరు నివాసి శ్రీ పెనుమత్స మహాదేవ కవి చంపకమాలిక. ఉత్పలమాలికా పద్యాలతో వృషాధిపతి శతకం రాసి. అమలాపురం తాలూకా గెద్దనపల్లి నివాసి శ్రీ బుద్ధరాజు రంగరాజా వారి ద్రవ్య సాయంతో రామ చంద్రాపురం లో పళ్ళే సేతునారాయణ రావుగారి శ్రీ ఆనంద తీర్ధ ముద్రాశాల యందు 1939లో ప్రచురించారు. వెల-రెండు అణాలు. బుద్ధరాజు రంగరాజు వంశాన్ని చక్కని పద్యాలతో వర్ణించాడు కవి. "రాక్షస హరనంబు రామాయణం బన్న.బంధు హరణమన్న భారతంబు-పాప హరణ మన్న బసవ పురాణంబు –విశ్వదాభిరామ వినుర వేమ"అనే జనకవి వేమన పద్యాన్ని ఉదాహరించి. కేవల భ్రుంగీశ్వర అవతారం అయిన పాల్కురికి సోమనాధకవి ద్విపద కావ్యంగా రాసిన బసవ పురాణం లోని మహా భక్తుల చరిత్రనే తాను ఈ వృషాధిప శతకం గా కూర్చానని చెప్పాడు. ఈ శతకం పరమార్ధ దాయకం అన్నాడు. 'బసవా బసవా బసవా వృషాధిపా"అనేది శతక మకుటం.

శతకాన్ని ఉత్పలమాల పద్యంతో –"శ్రీ గిరిజాధవాయ ఘన. జిహ్మగచిత్ర విభూష ణాయ నా-నాగమ సేవితాయ,నయ. నాధికవి శ్రుత మూర్తయే నమ –స్తే గప వైరిణేపశుపతే ద్విప చర్మ భ్రుతేశివాయ శుభ్రాగ విభో యటంచు "బసవా బసవా బసవా వృషాధిపా " శివ ధ్యానం చేసి రెండవ చంపకమాల పద్యం లో మల్లికార్జునకవికి కైమోడ్పు లొసగి,తర్వాత పాల్కురికి సోమన ను భజించి. శతకం అంటే పాల్కురికి వారిదే శతకం అని భక్త్యంజలి ఘటించి. "అసమ విలోచనుడవు,మహామహిమాన్విత మూర్తివి. ఆర్తిచే మసలు సకల చరాచర మును మన్నన చేస్తూ అసదృశ సత యశస్కరుడవు "అని లింగని కీర్తించాడు. బిజ్జల మహా భక్తుని మహారాజును చేశావు. బసవ పురాణ శతకం చదివి పరవశంతో ఈ శతకం రాస్తున్నాను. జైన బౌద్ధ చార్వాకాలను శమించి శర్వుడే సర్వులకు దిక్కు అని చాటాడు సాంఖ్య తొండడు. అసమ విలోచనుడు. అసమ పురాన్తకుడు. అసమసుతేజ్వలుడు. అసమ మహావతారుడు శివుడు అని చక్కని పద్యం అసమానంగా

చెప్పాడు కవి. ;;ఓ త్రిపురాంతకా అంటే. ఓ యని వెంటనే పలికే భోళా శంకరుడివి. భక్తితో అన్నీ వండి పెట్టిన నిమ్మవ్వ  నీకు పరమ భక్తురాలు. కలలో తనను బౌద్ధుడు ఒకడు తాకాడని. పెనం కాల్చి హాటకేశ్వరుడు చూస్తుండగా. దానిపైన నిలుచున్న వీర శంకరుడు నీ వీర భక్తుడు.

 శివునికి నమస్కారం చేయ కుండా భోజనం చేయని నియమం ఉన్న సోమన అంధుడవటం వలన జైన ప్రతిమకు మొక్కింప చేస్తే. శివుడు జిన స్వరూపాన్ని చీల్చి నిజాకృతి తో ప్రత్యక్షమై మోక్షమిచ్చిన  కథ చెప్పాడు కవి. బిజ్జల మహారాజు నీకు భక్తితో పూజలు చేస్తే మాదమాంబా గర్భం లో నువ్వు జన్మించి సంతోషం కలిగించావు. వెంకటాఖ్యుడు. మడివాలు మాచయ ల ఉదంతాలను గుర్తుకు తెచ్చాడు. నూనె వత్తులు కొనే డబ్బులేక తన శిరోజాలనే వత్తిగా చేసి పూజించిన లింగామాది కి కైవల్యమిచ్చావు. కపిలేశ్వర పురంలో ఒక భక్తుడు శివునికి క్షీరాభి షేకం చేస్తుంటే. ఆపాలదారలో కాలుజారి పడిన  ఒక గొల్లపిల్ల" బసవా "అని ఆర్తిగా అంటే. ఆమెకు ఊతమిచ్చి నీ సన్నిధికి చేర్చుకొన్నావు. నందీశ్వరుని మూడేళ్ళు భక్తితో కొలిచిన మాదమామ్బకు సంగమేశుడు ఉపదేశమివ్వగా ప్రసన్నుడవై కాపాడి రక్షించావు.


వృషాధిప శతకము

పరమేశ్వర నామాలను గుదిగుచ్చి రాసిన పద్యరాజం చూడండి –"శ్రీ మహిత ప్రభావ. జిత చిత్తభవ. స్తవ సక్త భావ. దు-ష్కామఖ లాళి భైరవ ప్రశస్త. సుధీజిత జీవగాన –విద్యా మహిమానుభావ నుత. హైమవతీ ధవ. శైవ భావన -స్వామి వి నీవ దేవ దేవ బసవా బసవ బసవా వృషాధిపా "కోరి నిన్ను భజిస్తే కోటి జన్మల పుణ్యం లభిస్తుంది.ఇంకో విధంగా రాసే రాదు.  శివునికి నమస్కరింపక పోవటం వలన రంగడు అనే వాడికి రెండు కళ్ళూ పోతే. శివధ్యానం చేసి ఒకకన్ను పీకి రెండవది రాకపోతే శివ సముడైన పాల్కురికి. శిష్ట కులాగ్రణి సోముడిచ్చేసద్భవసంబు నిన్ను దలంచి "అని మరో శివగాధ చెప్పాడు కవి. కంచికి వచ్చి తాండవ వికారుడైన  శివుని చూసి,పక్షవాతం వచ్చిందేమో అనుకొని. డబ్బు అంతా ఖర్చు చేసి ప్రయోజనం కనిపించక. చచ్చిపోతాను అన్న భక్తుడి మాటకు నాట్యమాడి సంతోషంకలిగించావు పరమ భక్తాగ్రేసరుడవు నువ్వే అని కీర్తిన్నావు.

మరో అద్భుత పద్యం –"ఉపల జిన స్వరూపమున నుక్కును బోసియు. దాని ముంగ లన్ – ద్రిపుర హరుం జలింపకకయ. నిల్పు మనంగ. మహోగ్ర మూర్తియై –శపధము జేసే కట్టెదుట. శంకర దాసి నశింప జేసే నీ-కపర శివుండు అతడు ".103 వ ఉత్పలమాల పద్యంలో –"ఈతరి గూర్చితీ శతక మీశ్వర కార్తిక శుద్ధ పౌర్ణమిన్ – ఖ్యాతిగ శాలివాహన శతాబ్దము లెన్నగ రత్న బాణ ది-గ్ర్వాత మృగాంక 1859 సంఖ్య యయి. రాజిల నాహిమధామ భార్యమై –పాతక తూల వహ్ని బసవాబసవా బసవా వృషాధిపా".105 చివరి చంపక మాల లో –"బసవ కులుండనే బసవ. భక్తుడనే. బసవ ప్రియుండనే-బసవ సుతుండనే. బసవ పాలితుడన్. బసవాప్త బంధుడన్ –బసవ సమాఖ్యుడన్. బసవ పాద రజః కలితోత్తమాంగుడన్ –బసవ నినున్ స్మరియించి బసవా బసవా బసవా వృషాధిపా"అని అంతా బసవమయంగా శతకం పూర్తి చేశాడు కవి. వీర శైవ వాఙ్మయం లో మహామహ కవులకు దీటైన కవిగా ఈ శతక కర్త పెనుమత్స మహాదేవ కవి అనిపిస్తాడు. కవిత్వం ధారగా భక్తీ గా ప్రవహించింది. ప్రతి భక్తుని కథను ఆసక్తికరంగా వర్ణించాడు. మంచి శతకాన్నీ మహా భక్త శిఖామణి అయిన కవినీ పరిచయం చేసే మహద్భాగ్యం నాకు కలిగింది ధన్యుడిని.

## 80 భక్త త్రాణ పరాయణ శతకం --శ్రీ లింగం జగన్నాధ కవిరాయలు


శ్రీరస్తు.
భక్తత్రాణపరాయణ
శతకము

ఆంధ్ర గీర్వాణ కవిత్వ కావ్య నాటకా లంకార సాహిత్య పండిత సార్వ భౌమ. అద్వైత సార వేద. శ్రీ కోదండ రామ చరణార వింద ధ్యాన పరాయణ శ్రీ లింగం జగన్నాధ కవిరాయలు “భక్త త్రాణ పరాయణ శతకం “రచించగా. పౌత్రుడు శ్రీ మాధవ. లక్ష్మీ నారయణాది శతకకర్త. భక్త జన చరణ రేణువు. పీఠికాపుర వాసి. రిటైర్డ్ డిప్యూటీ తాసిల్దార్ శ్రీ లింగం లక్ష్మీ జగన్నాధ రావు చే ఆంధ్రీకరింపబడి. కిం కవీంద్ర ఘంటా పంచానన మొదలైన బిరుదాంకితులు శతావధాని శ్రీ చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రి గారి చే సరిచూడ బడి. 1941లో పిఠాపురం శ్రీ విద్వజ్జన మనోరంజని ముద్రాక్షర శాలయందు ప్రచురింప బడింది. వెల తెలుపలేదు కనుక అమూల్యం అని భావించ వచ్చు నేమో ?తాతగారి సంస్కృత శ్లోకం. మనుమడి గారి తెలుగు అనువాద పద్యం కలిపి ఉండి”టు ఇన్ వన్”గా వున్న శతక రాజమిది. సంస్కృతంలో “భక్త త్రాణ పరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు “అని తాత గారు మకుటం పెడితే. మనవడు “భక్త రక్షణ పరత్వంబున్ ప్రదర్శింపుమా “అని మార్చారు. తాత శార్దూలంపైఊరేగిస్తే. తెలుగులో శార్దూల,మత్తేభాలపై పౌత్రకవి ఆత్రత్రాణుడిని ఊరేగించారు. తాతా, మనవల కవిత్వ సౌభాగ్యం దర్శిద్దాం.


భక్తత్రాణపరాయణ
శతకము

మొదటి శ్లోకం –శ్రీ కారుణ్య పయోనిధే., రఘుపతే. కోదండ రామార్తి హన్ –త్వత్పాదాబ్జే నిషేవయా త కవితా గీర్వాణ వాణ్యా శతం –శ్లోకానాం నిజభక్త సూచన పరం శార్దూల నామాంకితం –దాస్యే హం విరచయ్య తుభ్యమమలం సంగృహ్యతా మాదరం”

తెలుగు –"శ్రీ కారుణ్య పయోనిధీ !రఘుపతీ!శ్రీ రామ చంద్ర ప్రభూ !నీ కారుణ్యమునన్ జెలంగు కవితన్ గీర్వాణ భాషన్ మద-స్తోకంబై తగు భక్తి గన్బరచు శార్దూలంబు లౌ నూరును –శ్లోకంబులు ల్ రచయించి యిచ్చితి దయన్ జూపించి గైకొ గదే "అంటూ మక్కీకి మక్కీ దింపేశారు పౌత్రులు. మూడవ పద్యం లో తన దేశికుడైన సోమనకు నతులొనర్చారు. గురు దేవునికి ఆత్మ ను తప్ప ఏమివ్వగలను అన్నారు తాతామనవలు. లక్కవరం అనే పల్లెలో పుష్పగిరిలో ఉన్న రఘునాధా వేగమే కాపాడమన్నారు.దేహం ఉన్నంతకాలం అహర్నిశం నా హృదయంలో ఉండు.నా ఆశ్రయం సర్వమూ నువ్వే. "త్వత్కార్యం నిజ సంసితార్ధి హరణం ముఖ్యం త్వమే వోక్తవాన్ –త్వద్భక్తాస్తు ఖలైహ్కిలార్దితతమా స్సీదంత నన్యాశ్రయాః"అని తాత అంటే "సిత సంత్రాణము ముఖ్యకార్యమని కూర్మిన్నీవు వాక్రుచ్చవే ?గతి లేకిప్పుడు నీదు భక్తులు ఖలుల్ గారింప దుఖింత్రు"అని మనవడు వాక్రుచ్చాడు.

70 వ శార్దూల పద్యంలో "జగముల్ సృష్టి యొనర్చు నీకిదే నమస్కారంబు జ్యోతిర్మయా !జగముం జొచ్చి ప్రపూర్ణుడౌచు నిజ చిచ్చక్తిన్ సమస్తంబు నొం-దంగ జైతన్యము నిర్వికారుడగు నీ తత్వంబు కన్పట్టేగా "అంటూ తాతగారి హృదయాన్ని ఆవిష్కరిచారు మనవడుకవి. 80లో ధ్రువ చరిత్ర గానం చేశారిద్దరూ. ఆతర్వాత దశావతార వర్ణన క్రమంగా వర్ణించారు. ."ఓంకారాది సమస్త వేద నివహం హృత్వాంబుధే రంతరం –ప్రాప్తం సోమకనామ ఘోర దనుజం హత్వా తదన్తర్గతం "అని పెద్దాయన మొదలుపెడితే చిన్నాయన "సోమకాఖ్య దనుజన్ ఖండించి వేదంబులన్ –మిగులన్ బ్రేమను వేధ కిచ్చిన భవన్మీనాకృతిన్ గొల్తు "అని ముగించారు. క్షీరసాగర మాధనాన్ని అద్బుతంగా యువకవి వర్ణించిన వైనం –"కలశాంబోనిధి యందు మంధర గిరిన్ గవ్వంబుగా నుంచి. వాసుకి ని త్రాడు చేసి,దేవారాతులు దేవతలు చిలుకగా. కుంగిన కొండ నెత్తి"అంటే తాతగారు –"త్వం మకరో స్త్వత్కూర్మ రూపం భజే "అని జేజేలు పలికారు. "దంతాగ్రేణ భువం దధాణ మనఘం త్వద్ఘ్రోణి రూపం భజే "అంటే –పిల్లకవి –"అవనిన్ బట్టి రసాతలాన్తర్గాతుం డౌ నా హిరణ్యాక్షు చంపి. వెసన్ స్థావర జంగమ ప్రకరముల మేలంద శృంగంబు నందు –అవలీలన్ ధర దాల్చు నీదగు వరాహాకారమున్ గొల్చెదన్ "అని ఫినిషింగ్ టచ్ ఇచ్చారు. అలాగే 'అమరార్యర్భకు భక్తవర్యు గుణి బ్రహ్లాదుని"రక్షించి "సర్వ వ్యాప్తి నిదర్శకం నరహరే త్వన్మిశ్రరూపం భజే "అన్నారు నృసింహ వరదుని తాతగారు. "మూడు పదముల్ భిక్షించి ముల్లోకముల్ గలయ బ్రాకిన ఆ త్రివిక్ర పరబ్రహ్మాన్ని "త్రివిక్ర మాహ్వాయ జుషోతద్రూపిణం త్వం భజే "అన్నారు తాత కవి. . సరసీజాత భవుండు కోరగా రఘు వంశం లో పుట్టి. సచ్చరిత్ర. పితృ వాక్యపాలనతో

ధన్యత్వంపొంది రావణ సంహారం చేసిన శ్రీరాముని"హత్వా ఖిలా నత్యయే స్వస్థానం గమితో సి భక్త నివహం మర్త్యాది కీటాంతకమ్ "అని స్తుతించారు తాత. ఇలా దశావతార వర్ణన అయ్యాక –"పాతాళం నీ పదం జాను,జన్ఘువులు సుతలం. తొడలు వితలం. భూమి కటి. ఆకాశం నీ నాభి ముఖం మహాజ్జగం. శీర్షం సత్యం అని మునులు కీర్తిస్తారు అన్నారు. నిన్ను పరమాణువు అని. ప్రజ్ఞానం అనీ. సర్వ సాక్షి చైతన్యం అని ఎవరికీ తోచినట్లు వారు భావిస్తారు.

111 లో –"యోవా స్తోత్ర మిదం పఠేదహరహార్ భక్తాగ్రణీ స్స స్వయం –త్యక్త్వా ఘోర దురంత నైజ కలుషం శుద్ధాత్మనా వస్తుతః "అని తాత కవి రాస్తే. పౌత్రకవి –ఈ శతకం చదివితే ఆగడాలన్నీ పోయి "ఇష్టా వాప్తి చేకూరి శ్రీయుతుడై., దేహము బాసి శ్రీ శుక రుణోద్యోగంబు నన్ పొందు –ఉన్నత సాలోక్య ముఖాత్మమోక్షము "అని భరోసా ఇచ్చారు. 112లో తాతమనవలు ఏకవాక్యంగా –లోహిత గోత్రజుడు విబుదాశీస్తోత్ర సత్ప్రాప్యుడు. ఉద్దమ నరసింహ సూరి తనయుడు. ధన్యుడు. అవిశ్రాంత శ్రీ మన్మాధవ పాదారవింద సేవకుడు శ్రీ జగన్నాధామాత్య కవి ఈ శతకాన్ని పండితులకు ఆహ్లాదం కలిగేట్లు రాశారు అని పూర్తి చేశారు –"శ్రీ నారాయణ పాద సేవ రతినా. భవ్యాత్మనా. శ్రీ జగన్నాధా ఖ్యేన సమర్పితం స్తుతి శతం విద్వద్ముదే కల్పతాం".

నిజంగానే ఇది భక్త త్రాణ పరాయణ శతకం. భక్తులకు కొంగు బంగారం. చక్కని సంస్కృతం సుసంపన్నమైన తెనుగు సేత కలిసి శతకానికి వన్నె. సౌందర్యం మాధుర్యం చేకూర్చాయి. తాతా,మనవలైన ఆకవి పుంగవులకు మనం ఎన్ని రకాల ధన్యవాదాలు చెప్పినా తనివి తీరదు. చదివి ఆనందామృతాన్ని గ్రోలి మోక్షం పొందాలి మనమందరం.ఈ కవులను శతకాన్ని పరిచయం చేసే మహద్భాగ్యం నా పుణ్య వశాన కలిగింది. ధన్యోహం.

81 శ్రీ కోదండ రామ శతకం -- శ్రీ ఎ.కే.వరప్రసాద


శ్రీ
కోదండరామ శతకము.

రచయిత:
విద్వాన్ ఏ. కె. వరప్రసాదరాయకవి

విద్వాన్ ఎ.కే.వరప్రసాద కవి స్వతంత్ర నెల్లూరుకు చెందినవారు. శ్రీ కోదండ రామ శతకం లఘు టీకా సహితంగా రచించి. 1940 లో ప్రచురించారు. వెల-రెండున్నర అణాలు. విన్నపం లో కవి గారు తాను నెల్లూరు జిల్లా సూళ్ళూరు పేట నుంచి బుచ్చి రెడ్డి పాలెం కు ఉన్నత పాఠ శాల ఆంధ్ర పండితునిగా బదిలీ అయి పని చేయటానికి వస్తుంటే వర్షాకాలం కనుక పెన్నానది వరదలు వచ్చి తన శకటం తలక్రిందులై. తన వద్ద ఉన్న అనేక అమూల్య గ్రంధాలు. తన రచనలు వరద పాలైనాయని. కొత్త ఇంట్లో చేరాక దొంగలవలన కొన్ని నష్టమయ్యాయని. కాని ఇక్కడి అంబర చుంబిత గోపురంతో విరాజిల్లుతున్న శ్రీ కోదండరామ స్వామి దేవాలయం, స్వామి తనకు మానసిక ప్రశాంతి కల్పించాయని.


శ్రీ కోదండ రామ శతకము

కనుక వెంటనే శుభ ప్రాప్తికోసం. నూట ఎనిమిది కంద పద్యాలతో 1940 లో ఈ శతకం రాసి. ఆలయం నిర్మించిన శ్రీ దొడ్ల వారి ద్రవ్యసాయంతో ముద్రించానని. తనను" అజ్ఞాత కవి"గా పరిచయం చేసిన శ్రీ ఎన్.సత్య ప్రకాశ రాయ లకు నమస్కారాలు అన్నారు. ఆట వెలది పద్యం లో –"పొడము నార్తి వలన మూలను బడి యున్న –చిలుము బట్టినట్టి కలము బట్టి –రామనామ శిలకు వ్రాసితి. మెరుగెక్కి-తురగలించు కైత గరుదు జూప"అని చక్కగా చెప్పారు. చన్నపురికి చెందిన శ్రీ ఎస్ సత్యప్రకాశ రావు కవిగారిని "అజ్ఞాత కవి "గా గద్య పద్యాలతో పరిచయం చేశారు. అందులోని ముఖ్యవిషయాలు –పదహారు వయసులో కలం పట్టి శతకం రాశారు. కవితో నాకు మద్రాస్ లోని ఎస్ప్లనేడ్ లో ఉన్న హోటల్ లో మొదటి పరిచయం. ఇక్కడే కవి రెండేళ్లు హోటల్ కూడు తిన్నారు. అప్పటికి మద్రాస్ పచ్చయప్ప కాలేజి హై స్కూల్ లో తాత్కాలిక తెలుగు పండిట్. మొదట్లో ఇతడిని

కాలేజి స్టూడెంట్ అనుకొన్నాను. ట్రాం బండిలో ప్రయాణం. యూనివర్సిటి లైబ్రరీ లో తరచూ కనిపించేవాడు అప్పుడు వయసు సుమారు 20.అప్పుడు అతనిపై బాగా అభిమానం ఉన్నవారు దివాన్ బహాద్దర్ చీమ వాగు పల్లి రంగా రెడ్డి గారు. ఈయన కర్నూల్ జిల్లా బోర్డ్ అధ్యక్షులు తర్వాత.మద్రాస్ ఎండో మెంట్ బోర్డ్ ప్రెసిడెంట్. 1930లో చనిపోయారు. రంగారెడ్డి గారి మరణం తర్వాత విరక్తితో కవిగారు నెల్లూరు మండలం లో బామ్మర్ది ఇంట్లో కొంతకాలం గడిపి. నెల్లూరు జిల్లాబోర్డ్ అధ్యక్షులు శ్రీ బెజవాడ రామ చంద్రారెడ్డి గారి ఔదార్యం తొ 1930జులై లో తెలుగు పండిత పదవి పొందారు. రెడ్డి గారి ఋణం ఎలా తీర్చుకోవాలో అని నాతొ చాలా సార్లు అన్నారు. ప్రస్తుతం నెల్లూరు మండలం లో నెలకు యాభై రూపాయల వేతనం తొ పండితుడుగా పని చేస్తున్నారు 1922నుంచి రచనలు చేస్తూ వివాహం చేసుకొని. మళ్ళీ నాకు 1930 లో కన్పించారు. దరిద్రం ప్రోత్సాహం లేకపోవటం ప్రక్కవారి అసూయాదు లతో కవిత్వ రచన స్తంభించి పోయింది. ఇవాల్టికీ కవి అజ్ఞాతుడే. చాలారచనలే చేశారు అందులో ఎక్కువ బాల్య కృతులే. .19 వ ఏటనే రాసిన ఈ శతకం పై మహామహులు శ్రీ దోమా వెంకటస్వామి గుప్తా. ఉమర్ ఆలీషా. శతావధాని శ్రీ కొమ్మూరి సంగమేశ్వర కవి. కవిరాజు మల్లాది విశ్వనాధ శర్మ. ఆశుకవి శిరోమణి శ్రీ పోకల నరసింహం మొదలైన వారు ప్రశంసించిన అభినందన పద్యాలే వందకు పైగా ఉన్నాయి. శతకం మాత్రం 240 కందాలలో ఉంది.ఈ కవి బాలచంద్రిక అనే మూడు వందలపద్యాల కృతి రచించారు. వెంకటేశ్వర శతకం. ప్రకీర్ణ శతకం, ద్వయి. చంద్రహాస,-అభిమన్యు వధ ఏకాంకిక లు. చాలా చాటువులు. ఖండకావ్యాలు. లేఖలు. వ్యాసావలి రాసిన ఘనుడు ఈకవి. 1935లో నాటకాలు రాసి బాలబాలికల చేత ప్రదర్శింప జేశారు. కడపలోనూ ప్రదర్శించి పేరు ప్రఖ్యాతులు పొందారు. సర్ యదునాధ సర్కార్ రాసిన శివాజీ చరిత్రను వచనం లో బృహత్తర గ్రంధంగా రాసి చరిత్ర సృష్టించారు. ''అభినవ ఆంధ్ర కవీంద్రుల జీవితములు "రచించిన సాహసి. శ్రీ సురవరం ప్రతాప రెడ్డిగారి ప్రోత్సాహం పొందిన శేముషీ ఈ కవిది. తోడికవులు పత్రికలూ ఈసడించి నిరుత్సాహ పరచారు. కవిగారిది అతి స్వతంత్రమైన జీవితం. వ్యసనాలు. అహంకారం లేని పండిత ప్రకాండు డైన సత్కవి. ఒక్కమాటలో చెప్పాలంటే ఇరవై వ శతాబ్దపు కవిరాజులలో ఈ కవి ఒకడు. ''అని కవిగారి కవిత్వ మనో వృత్తులను చక్కగా వివరించారు పెద్దాయన. ఈ శతకం కంద పద్య శతకం. ''రామా కోదండ రామ రవి శత ధామా "అనేది శతక మకుటం.

సశేషం

మీ –గబ్బిట దుర్గాప్రసాద్ -29-5-23 –ఉయ్యూరు

శ్రీ ఎ వికే ప్రసాద రాయ కవి రాసిన శ్రీ కోదండరామ కంద శతకం లో మొదటి ఖండం మొదటిపద్యం –"శ్రీ మద్దివ్య పదాంబుజ –ధామాంతర నటన శీల ధన్యతర రమా-రామా రాజిత ధామా –రామా కోదండ రామ రవి శత ధామా". దామాంతర అంటే మధ్య ఇంట్లో. రమారామా అంటే లక్ష్మీ దేవి అనే స్త్రీ చేత అని టీక చెప్పాడు కవి. "మామక కవితా కామన-కామన కాంతి ప్రహసిత కామా కామ-స్తోమ సురాగా రామా –"–నా కవిత్వం అంటే ఇష్టమున్నవాడా –గొప్పకాంతి చే ప్రకాశించే వాడా. కల్ప వృక్ష తోట కలవాడా. సౌమిత్రిని భూ పుత్రుని ప్రేమించావు నన్ను ఎందుకు దూరం పెట్టావ్ అని ఇంకో పద్యం."అంకుడ శంకాంత కుండ-సంకట పధ నటన శీల కలం కుడ,మొహాంకుడ. మంకుడ "అని తనను తానె తిట్టుకొని కాపాడమన్నాడు. ఇందులో చివర –ఉన్న మదంచిత శిరమున –సన్నుత మార్గంబున. సుఖ సంఘాంతర మం –దెన్నడు సంచరించ గలనో ?"అని విచారించాడు.

ద్వితీయ ఖండం లో –"శృతి భూషణ నామా విశ్రు –తగుణ కలనాభి రామ. క్షోణి తనయా –స్తుత వల్యాశ్రయ సదృశ "అని స్తుతించాడు. పాపాన్ని ప్రతి షేధించు,సుఖాన్ని ప్రతిపాదించు. భక్తీ ప్రసాదించు అని ఆర్తిగా కోరాడు. పతి వనీ పిత వనిగతి వని అతి కరుణా రతి వని జలజాయత నా సంగత మతి వని"అని ధూపం బాగానే వేశాడు. మూడవ ఖండం లో –దండ మజాండా ధీశా –దండ మనంత మహిమాస్పద కళా వేశా-దండము కరుణా వేశా"అంటూ మనసారా దండాలు పెట్టాడు భక్త కవి.నుతితో నతితో అతి వేడుకతో నిన్ను కొలిస్తే హర్షాశ్రువులు తతగతి రాల్తాయి అని పరవశంతో చెప్పాడు

భద్ర చరిత్రాత్మక య-ముద్రిత కృతులిన్ని నాళ్ళు మూలను నుండన్ –నిద్రం గూరితివా ని-ర్నిద్రా కోదండరామ ప్రియ తమ రామా "అని రాముడే ఆలశ్యం చేశాడు పుస్తకం ముద్రణ పొందటానికి అని భలేగా నెపం తాను నమ్మినదైవం మీదనే నెట్టిన నెరజాణ భక్తుడు ఈ కవి. చివరి 36 వ పద్యం –"ఏమో వ్రాసితి నిన్నే –మో యడిగితిని తండ్రి. హితమెటు లటులన్ -గామిత మిడి గావుము శ్రీ –రామా కోదండ రామ రవిశత ధామా "

మంచి కవిత్వం ధారాపాత పదప్రయోగం. భక్తి కలకండ పానకం గా ప్రవహించిన గొప్ప శతకం. మన మహాకవుల. పండితుల విద్వద్వరేణ్యుల మెప్పు పొందిన శతకాన్ని పరిచయం చేయటం నా అదృష్టం.

## 82 శ్రీ రంగ శతకం -- శ్రీ తిరు మండ్యందిగవింటి నారాయణ దాసు


శ్రీ ర స్తు.

శ్రీరంగశతకము.

ఇది

శ్రీ బ్రాహ్మణపట్టు గ్రామనివాసులగు

శ్రీ బ్రహ్మవిద్యాపరిపూర్ణ శ్రీమత్కుంబుమూరు

శ్రీగోపాలాచార్య వర్య యతీంద్ర

చంద్రగురుశేఖర ప్రియశిష్యులైన

తిరుమండ్యం దిగవింటి

నారాయణదాసుచే విరచితంబై

అనంతపురం కాలేజీ తెలుగుపండితులగు

ప్రయాగ వేంకటరామశాస్త్రిగారిచే

పరిశోధింపబడి

తిరుపతి

గోల్డన్ పవర్ ప్రెస్

ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినది.

ప్రథమముద్రణము.

కాపీరైట్ రిజర్వుడు 1934 వెల 2 అణాలు.

శ్రీ తిరు మండ్యందిగవింటి నారాయణ దాసు గారు ”శ్రీ రంగ శతకం “రచించి. అనంతపురం కాలేజి తెలుగు పండితులు శ్రీ ప్రయాగ వేంకట రామ శాస్త్రి గారి చే పరిష్కరిమ్పజేసి. 1934లో తిరుపతి లోని గోల్డెన్ పవర్ ప్రెస్ లో ముద్రింపించారు. వెల-రెండు అణాలు. కవిగారు బ్రాహ్మణ పట్టు గ్రామ నివాసి. బ్రహ్మ విద్యా పరిపూర్ణ శ్రీ మత్కుమ్బుమూరు శ్రీ గోపాలాచార్యవార్య యతీంద్ర చంద్ర గురు శేఖర ప్రియ శిష్యులు. పీఠికలో “నేను పంచ కావ్యాలు చదవలేదు. ఛందస్సు తెలియదు. శాస్త్రీయ గ్రంధాల ను చూడలేదు. భక్త శరణ్యు డైన ఇందిరా రమణుడైన శ్రీ రంగనాధస్వామి పై అపరిమిత భక్తీ ఉన్నవాడిని. స్వామి ప్రేరణతో కీర్తనలు. పద్యాలు గిలకడం అలవాటైంది. అందుకే ఈ శతకం రాస్తున్నాను. నేను తిరు మండ్య గ్రామం లో పుట్టాను. వన్నియ కుల సంజనితులైన శ్రీ మద్దిగ వింటి శ్రీ చెంగా రెడ్డి మునియామ్బ ల రెండవ కుమారుడిని. నా గురువులు అనురుణ సరోవరం అనే అప్పలాయ గుంట నివాసి శ్రీ కనమలూరు వెంకట సుబ్బయ్య. వడవాల గ్రామ వాసి శ్రీ సర్వేపల్లి సుబ్రహ్మణ్య గార్లు. గురు కృపా కటాక్షం చేత శ్రీ రంగం చేరాను. నాపై సంపూర్ణ అనుగ్రహం ప్రసాదించిన వారు శ్రీ కుమ్బుమూరు గోపాలాచార్య యతీశ్వరులు. గురు. దైవాలకు సభక్తికంగా నమస్కరించి ఈ”శ్రీ రంగ శతకం “రాశాను “అని అత్యంత వినయంగా కవి చెప్పుకొన్నారు ఇది కంద పద్య శతకం. ”రంగా “అనేది శతక మకుటం.

మొదటి పద్యం –"శ్రీమన్నారాయణ హరి –సామజ పరిపాల వరద సజ్జన లోలా –నేమముతో నిను దలచెద- కామితముల నొసగి నన్ను గావుము రంగా "తర్వాత పద్యం లో "దనుజ గణ వన కుఠారా –మునిమానస నళిన మిత్ర మురళీ లోలా "అని స్తోత్రం చేశారు. తర్వాత గజేంద్ర మోక్షం. గుర్తు చేసి. "గంగాధర వందిత "అనీ మెచ్చారు. మారశతకోటి రూపా. తారేశ దినేశ నయనా. తారకనామా "అని నుతించార. లాలి పాడారు. జోజో లోక శరణ్యా –జోజో శతపత్ర నయన –జోజో నృహరీ –జోజో నిలింప రక్షక "అని జోలకూడా పాడారు. తర్వాత హెచ్చరికలు చేశారు భక్తీ ఆర్తి కలిపి. నూట పదకొండవ కందంలో "ఈ రంగ శతక మెవ్వరు-కోరి పఠించినను వినిన కోరిన వరముల్ –నారాయణ యిమ్మని నిను –కోరి భజించితిని శరణు గురువర రంగా "అంటూ ఫలశ్రుతి తొ ముగించారు.

## 83 ఇక్కుర్తి శ్రీ హరిహర పశుపతీశ్వర శతకం -- శ్రీ మైనముపాటి శివ నారాయణ


శ్రీ హరిహర

పశుపతీశ్వర శతకము

గ్రంథకర్త.

మైనముపాటి శివనారాయణ మూర్తి.

నరసరావుపేట రామకృష్ణ ముద్రాక్షరశాల యందు

ముద్రింపబడినది.

1940

శ్రీ మైనముపాటి శివ నారాయణ మూర్తి ఇక్కుర్తి శ్రీ హరిహర పశుపతీశ్వర శతకం రచించి. నరసరావుపేట రామ కృష్ణ ముద్రాక్షర శాలలో 1940లో ముద్రించారు. విజ్ఞప్తి లో కవిగారు –”ప్రమాది నామ సంవత్సర మార్గశిర త్రయోదశి 7-1-1940 న తమ గురుఆశ్రమాన్ని సందర్శించే ఉత్సాహంతో ఇక్కుర్తి గిరికి వెళ్లి శ్రీ రామ లింగేశ్వరస్వామిని సేవించి., ఆ రాత్రి అక్కడే ఉండిమర్నాడు సోమవారం ఉదయం స్వామి దర్శనం చేయటానికి వెడితే మనసులో ఈశతకం రాయాలనే సంకల్పం కలిగి,శక్తికొలది రాశారు. తర్వాత నరసరావు పేటలో గురువుగారు శ్రీ ముప్పాళ్ళ శ్రీనివాసరావు., గడ్డం కోటయ్య గార్లు ఏదో రాస్తున్నట్లున్నావు అని ప్రశ్నిస్తే చదివి వినిపించగా బాగుంది అని ముద్రించమని చెప్పగగా అచ్చువేయించారు. శతకరచనలో తోడ్పడిన శ్రీ సోమరాజు రామ చంద్రయ్య గారికి కృతజ్ఞతలు చెప్పారు. ఇది సీస పద్య శతకం.”భవ వినాశక హరి హర పశుపతీశ “అనేది శతక మకుటం. మకుటం తమాషాగా ఉంది.పుస్తకం వెల ఎంతో తెలుపలేదు.

ప్రారంభ పద్యం –”శ్రీ గణనాధుని స్థిరభక్తి సేవించి., భారతీ దేవిని ప్రస్తుతించి –వ్యాస పరాశర వాల్మీకి శుక భారద్వాజుడాదిగా రుషి వరుల గొల్చి - భాస్కరు నన్నయభట్టు పోతన కాళిదాసాది కవుల ప్రార్ధన మొనర్చి - వసుదాస్తలంబునవరలు సత్కవులకు వందన శతములు వాంఛ చేసి

గీ.-నాదు గురుడైన నిమ్మరాట్ నరసయోగి –పాదములు గొల్చి భక్తిని ప్రణతి జేసి –చిత్తు సత్తుల నిన్నెంచి చెప్పువాడ –భవ వినాశక హరిహర పశుపతీశ "అంటూ" ఆల్ ఇన్ వన్ "గా అందరికి కైమోడ్పు లర్పించారు. తర్వాత అందరుకవులు లాగానే తనకేమీ రాదనీ పశుపతి దయతో శతకం రాస్తున్నానని తప్పులు మన్నించి ఆదరించమని కోరారు. జాతి మత్సరంతోకులాలు వచ్చాయి. ధర్మాలు చెప్పటమేకాని అనుసరించే వారే లేరు. చండాలుడని దూరం చేస్తే వాళ్లకు పుట్టగతులు ఉండవు. జనని బ్రాహ్మణ జాతి. జనకుడు ఎలాంటి వాడో. కొడుకు కులమేదో తెలీదు. తల్లీ తండ్రి ధర్మాన్ని తప్పితే జాతి మనుగడ ఉండదు. బ్రాహ్మణ కులంలో పుడితే మాత్రం మంచి బుద్ధులు వస్తాయా. విధి విధాన కర్మలు చేస్తేనే సద్గతి. "మౌనంతో మనసు ఇంద్రియ ప్రాణ మారుతంబుల లో మగ్నం చేసి. జిహ్వాగ్రాన్ని తిప్పి. చిన్ననాలుకను గూటి లో చేర్చి. చిన్ముద్రతో నిమీలిత నేత్రాలతో తనను మరచిపోయి నిన్ను దర్శించినవాడికి మళ్ళీ జన్మ ఉండదు. ద్వంద్వాలకులతీతుడవైన నీ రూపు ఎన్నతరమే కాదు. నాదబిందు కాలాతీత. భేదరహిత వైరాగ్య గుణ రహితుడవు. అంటూ తనకు ఏమీ తెలీదని అంటూనే అన్నీ తెలిసిన జ్ఞానవేత్తగా చక్కగా వర్ణించారు.



విజ్ఞప్తి.

—:o:—

మహాశయులారా! భారతీయ సోదరులారా !!

ఈ ప్రమాదినామ సంవత్సర మార్గశిర బ ౧౩ లు ఆదివారం (7—1—1940) న మద్గురు ఆశీస్సులను దర్శించు ఉత్సాహమున శ్రీశైలగిరికి బయలుదేరి [illegible] శిఖరమున వేంచేసియున్న శ్రీ రామలింగేశ్వర స్వామివారిని సేవించి ఆరాత్రియు మరికొంత ఆ పరమేశ్వరుని సన్నిధానమున నివసించితిని. సోమవారం తెల్లవారుఝామున నాలో నాకు యీ చిన్న శతకము వ్రాయు సంకల్పము కలిగి ప్రారంభించి నా శక్తి కొలది వ్రాసితిని.

దరిమిలా నరసరావుపేటలో మద్గురుభక్తులగు మా॥ రా॥ శ్రీ ముప్పాళ్ళ శ్రీనివాసరావు, గడ్డం కోటయ్యగార్లు మీరు యేమి వ్రాయుచున్నారని ప్రశ్నించ చదివి వినిపించితిని. వారానందమొంది అచ్చు వేయించవలసినదిగా కోరిన వారలకోర్కె నెరవేర్చ వెంటనే అచ్చు వేయించితిని. [illegible] బహులోపములుండవచ్చును. చదువరు లందరును ఆ లోపములను [illegible] అర్థమును గ్రహించి [illegible] ప్రార్థించెద. మరియు నాయందనుగ్రహముంచి తమకు తోచిన లోపములు నాకు తెలియ చేసిన ద్వితీయ ముద్రణమున సవరించుకొనియెద.

ఈ శతకము వ్రాయుటలో నాకు యెక్కువ సలహానిచ్చి తోడ్పడిన బ్ర॥ శ్రీ॥ సోమరాజు రామచంద్రయ్య గారికి అనేక వందనము లర్పించుచున్నాను.

ఇట్లు సర్వజన విధేయుడు,
మైనంపాటి శివనారాయణ మూర్తి.

శుద్ధ సత్వ ప్రధానమై సూక్షం ఉంటుంది వెలుగు వెలుగుల వెలిగిస్తుంది. అన్నిటా వెలసి ఉంటావు. విను వీధిలో వేయిదళాల మండపం లో అష్టదళ పద్మం మధ్య సూర్యచంద్రులపైన. మంచి మాణిక్య వర్ణంతో. మణిగణ దీప్తంగా శుద్ధాంత తేజం తో. వెయ్యి హంసలతో వేదాన్తవేద్యమై మిరుమిట్లు గొలుపుతూ దర్శనమిస్తావు. దీనినే శివుడు పార్వతికి. రాముడు సీతకు చెప్పారు . రాముడు శివుడిని పూజిస్తాడు శివుడు రాముడే ఆదిమూలం అని అర్చిస్తాడు. కోరికలు లేని మనసు సాధించాలి. మనసు మహిమ తెలిసిన మనిషి లేనే లేడు..తర్వాత రుక్మాంగద అంబరీష ధ్రువ ప్రహ్లాద భక్తులకు దర్శనమిచ్చి ఇప్పుడు నాలాంటి వారు ప్రార్ధిస్తూనే కనిపించనే కనిపించవు అప్పుడు ఉండి,ఇప్పుడు లేవా ?అంటారు. మేము పాపాలు చేసి ఉండవచ్చు మమ్మల్ని దారికి తేవటం నీపని కాదా అలా వదిలేస్తావా /అని సూటి గా ప్రశ్నించారు. కాళ్ళ బేరానికి వచ్చి "కాపాడ వేమిరా

కళ్యాణ విగ్రహ్. పాపల లో నున్న పరమ పురుష –మనసు నిలిపి మర్మం విప్పు అని "ధూపం" వేశారు. విద్యలో అవిద్యలో ఉంటావు. సాక్షిగా ద్వంద్వరహితుడుగా ఉంటావు. సావయవ నిరవయుడవు. నిన్ను తెలుసుకోవటం ఆబ్రహ్మకు కూడా అసాధ్యం. తర్వాత సృష్టియేర్పడిన విధానం వివరించారు. అగ్ని,భూమికలిసి అహంకారమయ్యాయి. అగ్నిజాలాలు కలిసి చిత్తం పుట్టింది. శిఖి ఆత్మకలిసి బుద్ధి పుట్టింది. ఆత్మ వాయువుకలిసి మనసు అయింది. ఆత్మ అంతరిక్షాలు ఏకమై జ్ఞాత అయ్యాడు అంటూ గహన వేదాంత విషయాలను అరటిపండు ఒలిచినట్లు చెప్పారు. తర్వాత నాద బిందు రహస్యం వివరించారు. ఓంకారమే రామ తారకం. లక్ష్మణుడు ఆకారం. శత్రుఘ్నుడు ఉకారం. భరతుడు మకారం సీత బిందువు అర్ధమాత్రుడు రామ భద్రుడు అని రహస్యం విప్పారు. చివరలో "నువ్వు గుణ హితుడవు నేను గుణ రహితుడను. నువ్వు దేవుడు నేను దేహి. నువ్వు సకలాత్ముడు నేను వికలాత్ముడను సత్తు చిత్తూ నువ్వు నేను చచ్చేవాడిని. నువ్వు మాయాతీతుడవు నేను మాయకు లొంగినవాడిని. నీకు చావు పుట్టుకలు లేవు నేను పుడుతూ చస్తూంటాను. నీకన్నీ తెలుసు. నాకు నేనే తెలియని అజ్ఞానిని. ధీరమతి నువ్వు. నేను దీనుడిని. సేవలు అందు కొంటావు నేను సేవిస్తాను. నువ్వు ముక్తి ఇస్తే నేను యుక్తితో బతుకుతా. "అయితే పశుపతీ! నీదయ ఉంటే నేనే నువ్వు అవుతా. "అని అద్వైత బోధ చేశారు.

తర్వాత మంగళం చెప్పారుకవి. 109వ చివరి సీసపద్యం లో –"వంగోలు సీమలో మైనం పాటి పురస్తుడను. బ్రహ్మజాతివాడిని. మైనం పాటి వంశం వాడిని. తండ్రి మాల కొండ్రాయుడు. తల్లి సీతమ్మ. అన్న రామ మూర్తి. అసలు యేకులం వాడినో నాకు తెలీదు. "సీసములతోడ నొకమాల జేసి –మెడనువైచితి. దాల్చి యిది మేటి యనగ-నిల్పు జగతిని,నీ యందె నిల్పు నన్ను-భవ వినాశ హరి హర పశుపతీశ"అని ముగించారు.

ఈశతకం భక్తీ జ్ఞాన వైరాగ్య శతకం. కవి ప్రతిభ జ్ఞాన విజ్ఞానాలు. పాండిత్యం తత్వ చింతన ప్రతి పద్యంలో ద్యోతకమైంది. అరుదైన అద్భుతమైన తరచుగా ఉదాహరించాల్సిన శతకం. రచన గంగా ప్రవాహం అందులో మునిగి,ముంచి తెలుస్తారు కవి. అన్నీ మూసుకొని ఆయన వెంట పడటమే ముక్తికి సోపానం. తానూ తరించి మనల్ని తరింప జేశారు. మహా మంచి శతకాన్ని, సాకల గుణ స్వరూపుడైన కవి గారిని పరిచయం చేసే అదృష్టం నాకు దక్కింది. శతకం చదివితే భక్తీ ముక్తీ. ఇది ఇక్కుర్తి శతకం కక్కుర్తి శతకం కాదు. ఇష్టపూర్తిగా మనస్పూర్తిగా కూర్చిన శతకం.

## 84 మూడు పాయల కవితా కృష్ణ -- శ్రీ పబ్బిశెట్టి వెంకటేశ్వర్లు

శ్రీ పబ్బిశెట్టి వెంకటేశ్వర్లు గారితో నాకు ముఖ పరిచయం లేదు. నాలుగు రోజులక్రితం వారు రాసిన మూడు విలువైన పుస్తకాలు పంపగా అందాయి. వెంటనే వారికి ఫోన్ చేసి అందాయని చెప్పాను. గొంతు కొంచెం వణుకుతున్నట్లు అనిపించింది.ఇవాళ పుస్తకాలు చదివాక వారు నాకంటే కేవలం ఒక నెల చిన్న వారు అని తెలిసింది. ఇద్దరం "యైటీ ఫోర్"వాళ్ళమే అవటం సంతోషంగా ఉంది. వీరు పంపిన పుస్తకాలు –1-పసిడి పలుకులు -2012,2-వసుధ శతకం -2022,3-వనగోపాలుడు -2023.కవి గారి గురించి వివరాలు. ప్రకాశం జిల్లా మార్కాపురం మండలం గజ్జలకొండ గ్రామం లో 1-7-1940న శ్రీ దత్తయ్య గాలెమ్మ దంపతులకు జన్మించారు. హిందీ లో ఎం. ఎ. –అంటే సాహిత్యరత్న. కన్నడ భాషలో డిప్లమో పొందారు. త్రిపురాంతకం లో హిందీ ఉపాధ్యాయులుగా చేసి నాలాగానే 30-6-1998 న రిటైరయ్యారు. .తర్వాత అక్కడే ప్రభుత్వజూనియర్ కాలేజి లో హిందీ లెక్చరర్ గా చేసి రిటైరయ్యారు. పైన చెప్పిన మూడు పుస్తకాలుకాకుండా. మానసబోధ రాశారు. వీరి అముద్రిత రచనలు –గడియారం ఆత్మకథ –కన్నడ తెలుగు. మబ్బన్న తమ్ముడు –బాలగేయవాటిక ఉన్నాయి. 7-5-1966 ప్రయాగలో హిందీ యూనివర్సిటి వారు ఏర్పాటు చేసిన స్నాతకోత్సవంలో ఆనాటి కేంద్ర ఆర్ధికమంత్రి శ్రీ మొరార్జీ దేశాయ్ గారి చేతులమీదుగా "సాహిత్య రత్న"పురస్కారం అందుకొన్న అరుదైన అదృష్టవంతులు. '. మార్కాపురం ఆకాశ వాణి ద్వారా చాలా ప్రసంగాలు చేశారు ఏకపాత్రాభినయం. పద్యపఠనం తో మెప్పించారు.వీర పాండ్య కట్టబ్రహ్మన గా వీరి ఏకపాత్రాభినయం ప్రసిద్ధమైంది. వితంతు వివాహం చేసి సన్మానం పొందిన ఆదర్శమూర్తి. ప్రస్తుతం ఒంగోలులో స్థిరపడ్డారు.

కవిగారు జన్మించిన మార్కాపురం మండలానికి ఒక విశిష్టత ఉంది "కృతయుగే గజారణ్యే, త్రేతాయాం మాధవీపురీ ద్వాపరే స్వర్గసోపానం, కలౌ మారికాపురీ" అంటే ప్రస్తుత కలియుగంలో మార్కాపురంగా పిలువబడుతున్న ఊరు, కృతయుగంలో గజారణ్యంగా, త్రేతాయుగంలో మాధవీపురంగా, ద్వాపరయుగంలో స్వర్గసోపానంగా పిలుచేవారని అర్థం. మార్కాపురం చెన్నకేశవస్వామివారు అవతరించిన పుణ్యస్థలం. స్వామి

వారు కృతయుగంలోనే ఇక్కడ స్వయంభువుగా వెలసినట్లు మార్కండేయ మహర్షి రచించిన 'గజారణ్య సంహిత' ద్వారా మనకు తెలుస్తోంది.

కలియుగంలో మారిక అనే యాదవ స్త్రీ, నిత్యం స్వామివారికి పాలాభిషేకం చేస్తుండేదట. ఆమె భక్తికి మెచ్చిన స్వామి ప్రత్యక్షమై, తనకొక ఆలయాన్ని నిర్మించమని కోరగా, తన భర్త మారికయ్య, బంధువులతో చెప్పి, ఆమె స్వామికి ఆలయాన్ని కట్టించినట్లు చెబుతారు. అందుకే ఆ స్త్రీ పేరు మీదుగా ఈ ప్రాంతానికి 'మారికాపురం' అనే పేరు ఏర్పడిందనీ, కాలక్రమేన అదే 'మార్కాపురంగా' మారిందని చెబుతుంటారు. అలాగే మార్కపురానికి పక్కనున్న 'చెన్నరాయుడుపల్లె'కు ఆమె కుమారుడైన చెన్నరాయుడి పేరు స్థిరపడిందని పెద్దలు చెబుతుంటారు.[2] ధాన్యకటకాన్ని జయించిన శ్రీకృష్ణదేవరాయలు వరదరాజమ్మను పరిణయమాడి తిరిగివస్తూ ఇక్కడ బసచేశాడు. ఇక్కడ శ్రీ చెన్నకేశవస్వామి దేవాలయం దగ్గర విజయసూచిక నిర్మించాడు..

అలాగే ఉద్యోగించిన త్రిపురాంతకం మహా పుణ్య క్షేత్రం. శివుడు త్రిపురాసురులను సంహరించిన దివ్య ప్రదేశం. ఇక్కడి. శ్రీ బాలా త్రిపురాసుందరి ఆలయం జగత్ప్రసిద్ధం. త్రిపురాంతకం దాటితే శ్రీశైలమే. శ్రీ భ్రమరాంబా మల్లికార్జునస్వామి వారల ఆవాస క్షేత్రం పవిత్ర కృష్ణానది ఇక్కడ పాతాళ గంగ గా ప్రసిద్ధం. ఇంతటి నేపధ్యం ఉన్న కవిగారు కమ్మని పద్యాలు రాసి అందర్నీ మెప్పించారు.

1- కవిగారి పసిడిపలుకులు –మంచి వారి చెలిమి మంగళకరం. సంకటం లో ఉన్న వారికి సాయపడుట మేలు. మంచి చెడులు తెలిసి మసలవలె జగతిలో. సాగర జలమెపుడు సాగుకు కూడదు. నీదు దోషములను నిజమిత్రుడెరిగించు,గ్యాసు పొదుపు చేయు ధ్యాస ఉండవలయు. వాహనంబా వందనంబు. ఈ పసిడి పలుకులశతకానికి మకుటం –"పబ్బి శెట్టిపలుకు పసిడి పలుకు".

2-వసుధ శతకం – ఆట వెలదులతో ఆడుకొంటూ ముసలి వయసులో ఈ శతకం రాశారు కవి. "వాస్త వమ్ము నిదియె –వసుధ లోన "అనేది శతకమకుటం.ఇందులోనూ చక్కని నీతులు బోధించారు. తెలుగు తీపిదనము –తెలుగు కమ్మదనము –మరువకెప్పుడు నీవు మనసులోన. అమ్మకన్నమిన్న అవనిలేదు. మానవుడుగా పుట్టి మంచి చేయాలి. మందుకొట్టి అలసుగా చూడబడకు. మంచివారిని మరువరాదు. కలతలన్ని మరచి –కలిమి కాంక్షను వీడి –సమతమమత తోడసంతసమున –పరుల హితముకోరి-బ్రతుకుటే ఘనమౌను –వాస్తవమ్ము నిదియే –వసుధ లోన "

3-వనగోపాలుడు –బాలల నాటిక –గురు భక్తిని. శ్రీకృష్ణుని ప్రేమ కృపా వాత్సల్యాన్ని తెలియజెప్పే నాటిక. గోపాలుడు పేదతల్లి కొడుకు. రోజూ వాడిని బడికి పంపుతూ కృష్ణుని తలచుకొంటూ దారిలో వాడికి భయం లేకుండా చేయమని కోరుకొంటుంది. చదువు పూర్తయ్యాక గురువుగారికి అందరూ విలువైన కానుకలు సమర్పిస్తే గోపాలుడు తల్లి ఇచ్చిపంపిన పెరుగు ముంత మాత్రమె ఇవ్వగలిగాడు. దానినే అక్కడి వారందరికి

వడ్డిస్తూఉంటే. ఎంత తీసినా పెరుగు తరగక పోవటం అందరికి ఆశ్చర్యం కలిగిస్తుంది. ఇది వనమాలి అక్షయ కటాక్షం అని అతడి తల్లి భక్తికి మెచ్చిన కృష్ణుడు చూపిన కృపఅని అందరు అర్ధం చేసుకొంటారు.

పద్య రచనలో కవిగారి ప్రతిభ బాగా కనిపిస్తుంది ధారాళంగా సాగుతుంది పద్యం.నీతులు సుద్దులు మురిపెంగా ఉన్నాయి. తేట తెలుగు తీయదనం నిండిన మూడు రంగుల జండా లా పవిత్రం. గుండ్లకమ్మ వాహినిలా. కృష్ణమ్మ లోతూ ప్రవాహంగా కవిత్వం ప్రవహించింది. కవిగారికి మనఃపూర్వక అభినందనలు. చక్కటి ముద్రణ, అర్ధవంతమైన ముఖ చిత్రాలు తో ఈపుస్తకాలు కరతల కమలాలుగా ఉన్నాయి.

## 85 ముకుంద శతకం -- శ్రీమాన్ నల్లంతి ఘళ్ చక్రవర్తుల ఠంయాల లక్ష్మీ నృసింహా చార్య

ఆంధ్ర కవితా విశారద. కవిజన తిలక శ్రీమాన్ నల్లంతి ఘళ్ చక్రవర్తుల ఠంయాల లక్ష్మీ నృసింహా చార్య కవినాధుని –ముకుంద శతకం. దీనిని వరంగల్ శ్రీ వేంకటేశ్వర భక్తసమాజం ద్రవ్యసాయంతో శ్రీమాన్ ప్రతాపం రామానుజా చార్యుల వారి శ్రీ వేంకటేశ్వర ముద్రాక్షర శాలలో 1928లో ముద్రించారు. వెల –రెండు అణాలు.


శ్రీముకుందశతకము:

విజ్ఞాపనలో అల్పజ్ఞులకోసం కవి గారు ఈశతకం రాశారని ఇది కాక కొన్ని ప్రబంధాలుకూడా రాశారని.ఈ శతకం లో శ్రీకృష్ణాష్టోత్తర నామాలు పొందు పరచటం విశేషమని చెప్పారు. కవి గారిఇతర రచనలు-శుద్ధాంధ్ర నిర్గావ్య నిర్యోష్ట్య కేకయ రాజ నందన చరిత్ర. అచ్చ తెనుగు కృష్ణాకుబ్జా విలాసం. నిర్యోష్ట్య కౌంతేయ చరిత్ర. నిర్వచన శుభాన్గీకల్యాణం.. యోగ భూషణోపాఖ్యానం మొదలైనవి అని విద్వాన్ ఇర్కమేటి ఆఫ్ శ్రీ వైష్ణవ శ్రీ ప్రతాప రంగాచార్యులు తెలియజేశారు. ఈ కంద శతకమకుటం – ''వేల్పు గొండ ముకుందా ''


శ్రీ

శ్రీ ముకుంద శతకము

మొదటిపద్యం –''శ్రీ కమలాకుచయుగబా-ష్ఠీకా గురు చందనాది లిప్త రుచిర.వ-క్షాకలిత లోకనాయక –(శ్రీ కృష్ణా )వేల్పు గొండ సీమ ముకుందా ''.తర్వాత ''న్యగ్రోధ పత్రశయన స-మగ్ర కుశల గుణ సమూహమధితారి మహా-విగ్రహ లీలామానుష –శ్రీ వేల్పుగొండ వేశ్మ ముకుందా. అలాగే ''గ్లౌ బింబ సమముఖ విలాసా. నాగాధిరాజ శయనా. నాగాశన వాహ,చంద్రాతప వజ్రశరా,హత రిపు గుల్మా. భాస్కర సమ జాజ్వల్యా. హర్యక్ష శౌర్య సురగిరి ధైర్య. మా స్త్రీ మణి హృద్ధర. ఉద్ధవ బోధనాచార్య. విఘ్నాధిప నుతపాదా,వ్రజజన పాలక. వృష్ట(సూర్య )కర తేజా,విశుష్మ భుజారిహ. శ్రియాముష్మక కారణ,పంచ జన పంచ వదనా (నారసింహ ),ప్రీహవ్యవాహ తేజా. అంటూ ముకుంద నామాలు చక్కగా. కొన్ని కొత్తగా కందాల్లో అందం గా పలికారు భక్తకవి ఆచార్యశ్రీ. చివరి నూటపదకొండవ మత్తేభ పద్యం లో ''జలజాక్షి ద్విరదాబ్జ సంఖ్య గత శాలివాహప్లవంగ ల సన్మాధవ శుద్ధ షష్టి నాడు ''కవి స్వామికి అంకిత మిచ్చానని చెప్పుకొన్నారు.

ఇంతకు ముందు విననిపేరు కవిగారిది. కొత్తగా ఉంది-నల్లంతి ఘళ్ చక్రవర్తుల రంయాల లక్ష్మీ నృసింహా చార్య. ఆయన రాసిన రచనలు మహాపండితుడని తెలియ జేస్తున్నాయి. కొంచెం కృతకంగాఉందని పించింది కవిత్వం. ఏమైనా ఒకకొత్తకవిని కొత్తశతకాన్ని పరిచయం చేసే అదృష్టం నాకు దక్కింది.

## 86 సత్యవ్రతి శతకం -- శ్రీ భాగవతుల లక్ష్మీ నారాయణ శాస్త్రి



శ్రీ భాగవతుల లక్ష్మీ నారాయణ శాస్త్రి రచించిన "సత్యవ్రతి శతకం "విజయ నగరం శ్రీరామానుజ ముద్రాక్షార శాలలో 1929లో ముద్రించబడింది. దీనికి పీఠిక రాసిన శ్రీ భాగవతుల లింగమూర్తి –విజయనగర సంస్థానాధిపతి శ్రీ ఆనంద గజపతిరాజు ఒక రోజున "సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్ "అనే సమస్యనిచ్చి దీనిపై శతకం రాయమని సభలోని కవులను పండితులకు కోరాడు. దానికి తాత్పర్య కూడా జతచేయాలని కోరాడు.. మహారాజ కాలేజిలో సంస్కృతపండితులు శ్రీ భాగవతుల లక్ష్మీ నారాయణ శాస్త్రిగారుకూడాశతకం రాశారు. కానీ అది రాజాస్థానం చేరలేదు. కాలవశంలో అది విస్మృతమైనది. కవిగారు మరణించారు. తర్వాత నలభై ఏళ్లకు తాము ముద్రించినట్లు చెప్పారు. ఈగురుమూర్తిగారే "యాంబిషన్ " పేరుతొ ఇంగ్లీష్ లో రాసిన దానిలో కవిగారు సంక్షిప్త రామచరితం. శ్రీరామ విజయం మొదలైన సంస్కృతకావ్యాలు ఈ శతకం తోపాటు రాశారని శ్రీ బాబూ రావుసహాయంతో దీన్ని ముద్రిస్తున్నామని 28-8—1929 న ఛత్రపూర్ నుంచి తెలియజేశారు. పుస్తకం వెల-అముద్రితం.




ఇది కంద పద్య శతకం. మకుటం -'సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్"

కవిగారు కందం లో –"శ్రిత జన రక్షణ నిత్య –వ్రతదీక్షా తత్పరులగు వారాహీశ్రీ-పతి,వాణీ పతుల కృపన్ - 'సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్"అని మొదలుపెట్టి తర్వాత కాండం లో –గణపతి చరణంబులకున్ –బ్రణమిల్లుచు సత్యశతక ఫణితికి నై టి-ప్పణమొనరించెదను సుధీ –మణులార వినుండు దీని మన్నించి కృపన్ "అన్నారు టిప్పణి రాస్తూ.ఆశ్రిత రక్షకుడైన గౌరీపతి. లక్ష్మీ పతి సరస్వతీపతుల కరుణతోసత్యవ్రతునికి సంతోషం ఉప్పొంగుగాక అని భావం చెప్పారు

తర్వాత "రుతి పరుషమయి సరళముగా –నుతభావముగనినప్రాసను నిడి సమస్యా –గతిని సరసులని రెటులన "–శబ్ద స్వభావం చేత పరుషమైనా సరళమైనా రుజుభావంగా శ్లాఘనీయ ప్రాసాక్షరాలు ఉంచి రసికులను మెప్పించాలి. అలాగే సస్య ధన సంపత్తితో రాజుకు చక్రవర్తికి శ్రోత్రియమునికి సత్యవ్రతునికి ఆనందం కూర్చాలి. త్రిపుటీ శూన్యమైన పరిపూర్ణ బ్రహ్మజ్ఞానం జీవన్ముక్తునికి సత్యవ్రతునికి సంతోషం కలిగిస్తుంది. "రిత దిమి క ఝొందింధిమి –తతకుందరి ఝణు తకిట దాం ధణత కిణాం-ధిత దింధిమి యనియాడగ "- నిరర్ధకాలైనా తాల కాల బోధకాలైన సార్ధకాలైన రితధిమి శబ్దాలు ఉచ్చరిస్తూదేవతలు ఆడుతూ సత్యవ్రతునికి సంతోషం కలిగిస్తారు. మరోపద్యంలో సత్యవాక్కుతో మనసుతో క్రియచేత సత్యవ్రతునికి సంతోషం కలిగించాలన్నారు

మరోవిశేష మైన పద్యంలో –"కుతపానతిపాతవరీ- వృతదిజ్యా వైశ్వ దేవ,వేదాధ్యయన –ప్రతిభటసూనృత మహిమన్ "-కుతపకాలం దాటకుండా చేసే వైశ్వ దేవాదులకు సమానమైన సత్యమహిమ చేత సత్యవ్రతుడికి సంతోషం కలుగుతుంది. గుడులు తటాకాలు తోటలు మొదలైన వాటికి సమానమైన సత్యమహిమ సత్యవ్రతుడికి సంతోష దాయకం. ఇతిహాస పురాణాల చేత అనుకూలంగాసత్యం అనే జల్లెడ చేత శుద్ధిచేయబడిన గుణాలతో పూజ్యుడికి సంతోషం కలుగుతుంది.

అతిరాత్ర. మహారాత్ర క్రతువులు అతి భక్తితో చేస్తే సత్యవ్రతుడు సంతోషిస్తాడు. పరస్త్రీలపై వ్యామోహం లేకుండా ఉండేఅతి ధైర్యవంతుడు. కపి వీరులను బ్రతికించటానికి సంజీవి తెచ్చిన ఆంజనేయుడు. సత్యం శాంతి ఉన్నవారు మొహరహితులు,సన్యాసులవలన గీతాసారాన్ని గ్రహించినవాడు. నిత్యానిత్య వస్తు వివేచనం చేసేవాడు సత్యవ్రతునికి సంతోషం కలిగిస్తాడు. .”ఋతమును దప్పక యుండిన –అత డెంతయు నాకలోక హర్మ్యాంతర భూ –గ్గతుడై సుఖించును “.దానయోగాభ్యాసాలు సత్యానికి సాటిరావు. ”సత్యవతీ సుతుని –నిగమ సదృశ మహిత సూక్తుల నత్యా-యత సూక్ష్మ దృష్టి నెరిగిన వారు “సత్యవ్రతునికి ప్రీతి కల్గిస్తారు. అంతే వేద వ్యాసుని పురాణ ఉక్తులు గ్రహిస్తే పరమపదం. అతిదేశం అపవాదం అతి నైపుణ్యంతో తెలిసికొంటే. వాటిని కాలోచితం గా అవలంబిస్తే సత్యవ్రతికి సంతోషం. సత్యం ధర్మ జనకం కనుక ధర్మ విరోధం లేకుండా సత్యాన్నే పలకాలి. ప్రతి వస్తువులో అమృతం విషం ఉంటాయి. బుద్ధిబలంతో తెలుసుకొని ప్రవర్తించాలి. వెర్రికుక్కను పెంచితే అది పెంచిన వారినికూడా తెగ కొరికి బాధించి నట్లు దుర్జనులను దూరం పెట్టకపోతే మొదటికే మోసం.

ఏకాక్షర కందంగా –”రుత తిత ఊత్తు త్తీతా-తతేతి తాతేత తాత తత్తై తత్తా-తత తుత్తాతతిత్తుత్తిన్”అంతే పదార్ధ పరిశోధన కలిగిన జ్ఞానం చేత. ఈశ్వరానుగ్రహంతో సంసార దుఃఖాలను తొలగించుకోవాలి దానికి సత్యమే మూలం. తర్వాత షోడశ దళ పద్మ కందం రాశారు-”రుతపూత పూతజాతవి-తతోత గీత శ్రుత స్రుతరతప్రూత –వ్రతజిత కృత కేతరతన్ ”-అంటే –సత్యం చేత పవిత్రంగా పట్టుకొన్న కర్మేంద్రియ,జ్ఞానేన్ద్రియజ్ఞానాల యదార్ధం చేత సంతోషం కలుగుతుంది. 96వ కందంలో –మనోహరమైన సంస్కృత ఆంధ్ర భాషాద్వయం చేత ప్రబంధాలలో ఉండే రసాన్ని తెలిసిన శ్రీ ఆనంద గజపతి ప్రభువుకావ్యలింగాలంకారంలో ఇచ్చిన సమస్యను తాను ధ్వనిప్రధానంగా శతకంగా రాశానని కవి చెప్పారు. 101వ పద్యం లో –”శ్రుత లక్ష్మీ నారాయణ –కృత సత్యవ్రతిశతక సుకృతికా –నంద క్షితి పాలాగ్రణికిన్మది –సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్ “అంటూ టిప్పణితో సహా శతకం ముగించారు కవి. కవిగారి పాండిత్య గరిమ ప్రతి పద్యంలో ద్యోతకమైంది. ఆయనకున్న అపార ఆధ్యాత్మిక జ్ఞానం అచ్చెరువు కలిగిస్తోంది. శబ్దప్రయోగం పరమాద్భుతం. కవితాధార కూడా నాగావళీ ప్రవాహం గా ఉంది.ఛందస్సుపై సాధికారమున్నవారు కవి. ఆనందగజపతి మహారాజు ఇచ్చిన సమస్యను మనకవి శ్రీ భాగవతుల లక్ష్మీ నారాయణ శాస్త్రి గారు సకాలం లో పూర్తి చేసి అందివ్వక పోవటం ఆయన

దురదృష్టం. దాన్ని వెతికి వారి వారు నలభై ఏళ్ళ తర్వాతనైనా ప్రచురించటం మన అదృష్టం. మంచి గొప్ప శతకం మనం చూడగలిగాం. అందరూ అభినందనీయులే.

## 87 శ్రీ భగీరథీ శతకం -- శ్రీ కొవ్వలి వెంకట సూర్య నారాయణ



10

భగీరథీ శతకనిర్మాణ కారణము.

శ్రీ కొవ్వలి వెంకట సూర్య నారాయణ గారు రచించిన "శ్రీ భగీరధీ శతకం "లో" మంచి శైలి ఉంది,స్వానుభవ పద్యాలున్నాయి. కవిత్వ ప్రవాహం భాగీరథీ ప్రవాహమే. భక్తిలో నీతి. రక్తి ముక్తి రంగరించి రాసిన శతకం. కవికున్న సంగీతరసానుభావమూ వ్యక్తమౌతుంది "అంటూ పీఠిక లో పిఠాపురం కొత్తపల్లికి చెందినసంగీత సాహిత్య విద్వాన్ శ్రీ సత్యవోలు రాధామాధవరావు15-8-1932 చెప్పారు.కనుక ఈ శతకం 1932లో ప్రచురణ పొందింది. మిగిలిన విషయాలేమీ లేవు. సీసము. తేటగీతి కందం లలో శతకముద్రణకు సాయం చేసిన శ్రీ అప్పల నరసింహ శ్రేష్టి గారి గురించి వారి వంశం గురించి వివరించారు. గీతా వలి లో శ్రేష్టిగారు కవిచే శతకం చదివి వినిపించుకోని. సంతోషంతో ముద్రించారు. కవిగారి తండ్రిపేరు కొవ్వలి వెంకటరత్నం మంత్రి. తర్వాత శతక నిర్మాణానికి కారణాలు చెప్పారుకవి పద్యాలలోనే. స్వప్నంలో భగీరధి కన్పించింది. మేలుకొని ఆమెకు ఆనందం కలిగేట్లు ఈ శతకం రాశారు. చంపక ఉత్పల మాలా శతకం ఇది. "భగీరధీ "అనేది శతక మకుటం.

మొదటి చంపకం లో –"సిరి నవలావిలోలుడు కృశించి నుతించిన యేన్గుగాచెనీ-ధరణిని రాయియైన ముని తల్లజుపత్ని నహల్య బ్రోచె,దు-ర్భరమగు మానహీనతను బాపి సురక్షిత జేసే ద్రౌపదిన్ –బరమ దయాళు నా భువన వంద్యు దలంతు హరిన్ భగీరధీ ".అని శ్రీరాముని స్తుతించి తర్వాత గణేశ. సరస్వతి నిస్తుతించారు. తర్వాత సుద్దులు బోధించారు. ఆపిమ్మట భక్తి గరిమను వివరించారు. జ్ఞానం గురించి చెబుతూ "కలిగినవాడు మైమరచి కామ సుఖాబ్ధి మునింగి తేలియ –క్కలి మి హుళక్కి యైన తరి గాలుల జాచు విధమ్ముగా మహీ –స్థలి కుజనుండు జీవుడనిశమ్ముహృదంతర ముండినప్డువి-హ్వలత విమోహ మగ్నుడయి. యారడి చేసి చెడున్ భగీరధీ ".


భగీరథీశతకము.

వైరాగ్యం బోధిస్తూ –"ఎండలో నడిచిన వాడు మృగ తృష్ణ ను చూసిమోసపోయినట్లు స్త్రీ మోహంలో పడి చెడిపోతాడు మానవుడు. కోవిడుడైనా. పుష్పశరుడైనా. బంగారు ఊయలలో ఊగే సిరిగలవాడైనా. బలవంతుడైనా చావును అతిక్రమించలేడు.తల్లి గర్భం లోనుంచి ఒక్కడే వస్తాడు చచ్చిపోయేప్పుడు ఒక్కడే వెళ్ళిపోతాడు. మధ్య అంతా తోలుబొమ్మలాట. తర్వాత కర్మ గురించి వివరించారు –"చక్కని చుక్క యైన గుణశాలిని కిందగు భర్త రాడుపెం-పెక్కిన వంశజుండును రతీశు డనన్ దగు వన్నె కానికి –దక్కదు భార్య. భాగ్యుని నిధానము చేరును,పేదవానికిన్ –బెక్కురు పిల్లలుదురుఅవివేక పు సృష్టిగదే"అన్నారు. ఇతర విషయాలు చాలా వివరించారు. తియ్యగాలేని నీరు కళ తేల్పనికూటమి. మంచిమాట రాని నోరు,మంచి ఇల్లాలు లేనిఇల్లు. జబ్బు తగ్గించని మందు. లక్ష్యం లేని జపం. బాగా పండని దానిమ్మ పండు వృధా.

తర్వాత నవ ఖండయోగం. ప్రాణాయామం. లంబికా యోగం లను వివరించి. తపస్సులో దివ్య దృష్టి. యుగధర్మం. జీవుని రాకపోకలు. శివ దర్శనం మనోబలం వాక్పటుత్వం. విద్యలలో నేర్పు సాధించినవాడే తాపసి. శాంతం. డాంతం లతో ఉన్న వాడు రాజర్షి. పదార్ధజ్ఞానమూ చెప్పారు. జన్మ సార్ధకం చేసుకోమని హితవుపల్కారు. ఆశ నిరాశనం కావాలి. బిడియాన్ని పోగొట్టి. యే చత్తనైనా తినిపించి. ఏదీ తోచనియ్యకుండా. నిద్ర లేకుండా. యదార్ధం చెప్పనీయకుండా చేస్తుంది దారిద్ర్యం. తర్వాత మత్సరాత్ములు. చెలిమి చెప్పి తారకమంత్ర రహస్యం బోధించారు. మత్తేభ భామాలికా రాశారు. చివరికి సీసం లో –తమది కాశ్యప గోత్రమని. కొవ్వలి వారి బిడ్డ అని. వెంకటరత్న మంత్రి. బాపమాంబ దంపతుల కు అనుంగు సుతుడనని.తనపేరు వెంకటసూర్యనారాయణ అని చెప్పి శతకం ముగించారు కవి.

ఏ పద్యం తీసుకొన్నా చక్కని కవితాధార గా రచించారు. ఏది బోధించినా అరటిపండు వొలిచి చేతికి అందించినట్లు వివరించారు. సుద్దులు నేర్పారు. హద్దులు చెప్పారు. లోకనీతిసారం తాగించారు. మహాత్ముల మనసు వివరించారు. అన్నీ భగీరధికి నివేదించి శాంతిపొందారుకవి. ఈ శతకం. కవి గురించి మనవాళ్ళు ఎక్కడా చెప్పిన దాఖలాలేదు. నాకు పరిచయ భాగ్యం అబ్బింది.

## 88 శ్రీ భవానీ శంకరార్థాష్టోత్తర శతకం -- బాలకవి శ్రీ కూరపాటి వెంకటరత్నం



శ్రీ బాలకవి కూరపాటి వెంకటరత్నం రచించిన శ్రీ భవానీ శంకరార్థాష్టోత్తర శతకం శ్రీ యార్లగెడ్డ కొండయ్య చౌదరి చేత కాకినాడ పట్టమట్ట వెంకటరంగారావు గారి రంగా అండ్ కొ ముద్రాక్షర శాలలో 1930 లో ముద్రితం. స్వర్గీయ యార్లగెడ్డ మాణిక్యాంబ కు అంకితం. వేళంగి కి చెందిన యార్లగెడ్డ కొండయ్య చౌదరి "పీఠిక "లో కవి తనకు బాల్యమిత్రుడని. తానూ వయో వృద్ధు డనని కవి యువకుడని వారి స్నేహం అందరికీ ఆశ్చర్యంగా ఉండేదని. కవిగారి కవితా నైపుణ్యమే తమ ఇద్దరినీ కలిపిందని. తన భార్య కవిగారిని ఈ శతకం రాయమని కోరగా కర్ణ రసోపేయంగా రచించి తెచ్చారని. తన ధర్మపత్ని అకస్మాత్తుగా మరణించటం చేత ఆమెకు అంకితంగా తాను ఈ శతకం ముద్రణ చేస్తున్నాననీ "చెప్పారు. కవిగారు చౌదరి దంపతుల అన్యోన్యం వారి వితరణ. ఆకుటుంబ విశేషాలు ముందుగా సీసపద్యాలలో తెలియ జేశారు. ఇది ఉత్పల మాల శతకం. "భవాని శంకరా "శతక మకుటం. వెల తెలుపలేదు కనుక అమూల్యం కావచ్చు.

మొదటి పద్యం –"శ్రీమదగాత్మ జాత్యమల చిత్త సరోజ దివా కలత్రి ల-క్ష్మీమహిళా తనూభవ విజ్రంభిత గర్వ వనాగ్ని హోత్ర. సు-త్రామ సరీ నృపాధిప మరాళరధాద్యమరేశపూజ్య గో-త్రామర వంశ చందన మహా వనపాల భవాని శంకరా ".అని చక్కగా మొదలు పెట్టాడు బాలకవి. తర్వాత గంగకు మౌళి నిచ్చి. భుజగాలకు భుజం ఇచ్చి. మత్తమాతంగ కులేంద్ర చారు ముఖధారికి అంకము ఇచ్చి. గౌరికి అర్ధాంగమిచ్చి. భ్రున్గికి పదాబ్జాలిచ్చి. వేలంగి పురంలో ఉంటున్నాడు శివుడు. ఈ నగరికి ముందున్న తుల్యానదిలో దేవతలంతా మునిగారు. ఇందులో మునిగి అందరూ కోరికలు తీర్చుకొన్నారు. నిన్ను కోరిన కాత్యాయని ఇక్కడి జనుల అభీష్టాలను నెరవేరుస్తోంది. అమ్మవారు అయ్యవారి కల్యాణానికి మిత్రుడు ఆహ్వానించి నాచేత పద్యాలు రాయించి మెచ్చి నాడు. అప్పుడు నాకు పందోనిమిదేళ్ళు. అందరితోపాటు నాకూ ఆశ్చర్యమే ఇది నీ కృపా కటాక్షమే.


1930.

తర్వాత ఈశ నగాత్మజేశ. భువనేశ. మహేశ. ఖకేశ. అంటూ మనస్సునిండా ధ్యానిస్తే సర్వపాపహరం. ప్రపంచం ఒక నాటకరంగం. జీవులు పాత్రధారులు. "మాధవుడంచు వైష్ణవు లుమాధవుడంచుపురారి భక్తులు "ఆరాధిస్తారు. "హరియే హరుండు నీహరుడే యా హరి "అన్నాడు.ఇలాంటి సద్గుణాకరుడైన ఈశ్వర పాదాలు పట్టుకొని భజించి ఈశతకం రాశానన్నాడు. తనను పుణ్య చరిత్రుని చేయమన్నాడు.

చివరి ఉత్పలమాలలో –"ఇమ్ముగ నీ మహత్వమెదనెంచి. యఘాంతమైన నీదు నా- మమ్మున నే రచియించితిసుమా. యిటు లేబది నాల్గుపద్దెముల్ –నమ్మగదయ్య నా మనము నన్గలనిశ్చల భక్తి నాదుపా –పమ్మెడ బాపు మయ్య భవ బంధ విముక్త భవాని శంకరా ".

బాలకవి శరణ్యం లా కవిత జాల్వారింది. వేలంగి దగ్గరున్నతుల్యా నదీ వేగంతో అతులిత భక్తి భావ రస భంజకంగా ఈ శంకరార్ధా స్తోత్తర శతకం బాలకవి శ్రీ కూరపాటి వెంకట రత్న కవి రచించి అటు అర్ధనారీశ్వర శివునికి ముదం చేకూర్చి, ఇటు బాల్య స్నేహితుని కోర్కె తీర్చి ఆయన అర్ధాంగి కి అంకితమిచ్చి మన హృదయాలనూ పావనం భక్తి రసభావనం చేసి బిరుదును సార్ధకం చేసుకొన్నాడు.

## 89 శ్రీ శ్రీనివాస శతకం -- శ్రీ నారాయణం రామానుజా చార్యులు




శ్రీ నారాయణం రామానుజా చార్యులు శ్రీ శ్రీనివాస శతకం ను రేపల్లె విక్టరి ప్రెస్ లో 1946లో ముద్రించారు. వెల పన్నెండు అణాలు. కవిగారు శృంగార రస రంజితం గా,విచిత్ర ఇతి వృత్తంతో “సుచంద్ర “వీర రసాలంకారంగా”వీర బభ్రువాహన “నాటకాలు. క్షీరాబ్ది కుమారీ శతకం రాశారు. కవిగారిది రేపల్లెదగ్గర ఉల్లిపాలెం . గ్రంథ ముద్రణకు కవిగారి బాల్యమిత్రులు శ్రీ పాలపర్తి రామయ్య. శ్రీ సబ్బినేని చిన వీరయ్య. శ్రీ వల్లభనేని పరంధామయ్య గార్లు ద్రవ్య సాయం చేశారు. పండితాభిప్రాయం గా



విన్నపము

పొన్నూరు సంస్కృత దేవస్థానం కలాశాలపండితులు శతావధాని చతుర్విధ కవితా ధురీణ. శ్రీ రామ దాసాది దివ్యాంధ్ర ప్రబంధ నిర్మాత బ్రహ్మశ్రీ చల్లా పిచ్చయ్య శాస్త్రిగారు –”శతకంలో శైలీ రమ్యత. వృత్తి కల్పనా. శయ్య, వ్యుత్పత్తి శక్తి. మహోదయభావం. అలంకార పాక ఔచిత్యం రసపారవశ్యం కలిగి “ఈ కైత పదపూజనీరేజ లక్ష్మియై. నుద్యానవనమున దూగు టూయలయి. గళమున హారమై., కయి దల్కు టద్దమై. కందామర బచ్చ గప్పురమై శ్రీనివాస శతకం రంజిల్ల జేసింది “అన్నారు. రేపల్లె వాసి,విద్వాన్ ప్రౌఢకవి. మధురకవి బిరుదాంకిత. అఖండ మహా లక్ష్మీ సంపన్నులు, ఉత్తర వల్లూరు రాజావారి ఆస్థాన పండితులు. అష్టావధాని. శ్రీ కృష్ణ తులాభారం వంటి ప్రబంధ నిర్మాత. ఉభయ వేదాంత ప్రవర్తకులు శ్రీమాన్ పంచాంగం వేంకట రామానుజా చార్యులు –”గంభీర వాగ్గుంభనమ్ గా. నిందాస్తవంలాగా. పొలయల్కలకు కొత్తపొలుపుతో. ”పసధ రాకామినీ కిలికించితంగా. వలపులొలయ సరస మాధుర్య ప్రసాదతా రీతులతో ”ఉన్నదన్నారు. పిఠాపురం మహారాజాస్థాన పండితులు తర్క వేదాంత విద్వాన్ బ్రహ్మశ్రీ పసుమర్తి సుబ్రహ్మణ్య శాస్త్రి గారు –‘కవిత్వం పోతన

ధూర్జటి స్థాయిలో భావోద్రిక్తతతో. ద్రాక్షాపాక విలసితంగా. ధారావాహిని "గా ఉందన్నారు.అసలు కవిత్వం లోకి రేపు ప్రవేసిద్దాం.

సీసపద్యమయమైన శ్రీనివాస శతకం మకుటం –"మధు మదన నిరాస కోటి మన్మధ విలాస -శ్రిత మనోవాస జయజయ శ్రీనివాస" "

మొదటి సీసం –"శ్రీ వనజాలయా. సేవితాన్ఘ్రి సరోజ –కలిసాధ్వసా క్రాంత కల్ప భూజ –మార్తాండ శతకోటి మహిత దీప్తి కలాప –నవ నవోన్మీల నానద రూప – శంఖ చక్రగదాసి శాంగ్య కీలిత హస్త –ఘనరిపు ధ్వస్త లోక ప్రశస్త –నిఖిల వేదాంతైక నిలయాంతర విహార –రమణీయ కౌస్తుభ రత్నహార

తే.గీ –రవి సుధాకర నయన క్షీరాబ్ధి శయన – ప్రధిత ముని గేయ మామక భాగధేయ –మధు మదన నిరాస కోటి మన్మధ విలాస –శ్రిత మనో వాస జయజయ శ్రీనివాస"అని మొదలుపెట్టి "జక్కవలతీరు. గబ్బి గుబ్బల సౌరు. పచ్చవిల్తుని వాలు మచ్చరంబున దోలు"పై ఆశతో జీవితం వ్యర్ధం చేసుకొంటారు కొందరు. మనుజ సింహమై పోరి కనక కశిపుని ద్రుంచావు,వామన మూర్తిపై బలిని వంచించి ఆర్తి బాపావు. నిన్ను విడిచి మేము ఎక్కడికీ పోము. పార్ధు నితో మైత్రి చేసి నిఖిలలోక పాలన చేశావు. కలి యుగాంతం లో శబలాఖ్యపురం లో బ్రాహ్మణ కులం లో హరివ్రతుడు. దేవ ప్రభకు జన్మించి దేవతాగణం చేత నీరాజనాలు అందు కొంటావు. యాముని. విప్రనారాయణ. పరాశర విష్ణు చిత్త కూరేశ లను కృపతో చూసినట్లు నన్నూ చూడు. నా "భవ భవాంతరాఘౌఘు మారణాయ –క్రూరతాం హర ద్రాగ్బుధ పారణాయ "అని 117లో చెప్పి చివరి 118వ సీసం లో మంగళం పాడి. తర్వాతపద్యం లో ఈ శతకాన్ని అంకితం పొందమని ప్రార్ధించారు కవి. చివరి 120 వ సీసం లో –తమది భరద్వాజ గోత్రమని. శ్రీరామ దేశికునికి లక్ష్మీ నరసమాంబకు పుత్రుడు అయిన రామానుజుడనని భక్తి తొ సమర్పించే ఈ శతకాన్ని తప్పులెన్నకుండా స్వీకరించి తరింప జేయమని "ఆడియెన్ దానోహం "అన్నారు ఆచార్య కవి.

## 90 'నారాయణ శతకం' -- భక్తకవి పోతన

భక్తకవి పోతనామాత్యుని "నారాయణ శతకం". ఈ శతకాన్ని 1919 లో పిఠాపురం కు చెందిన ఆంధ్ర పరిశోధక మహా మండలి తరఫున శ్రీ వంగూరి సుబ్బారావు గారు ముద్రించారు. పీఠిక లో వంగూరి వారు- "ఈ శతకం పోతనామాత్యుడు రచించాడు. శైలి భాగవతంతో సరిపోతోంది. పెద్దాపురం నుంచి ఒక తాళపత్ర గ్రంధాన్ని వేరొక చోటు నుంచి కాగితపు ప్రతి రాజమండ్రి వారు సంపాదించారు. మరోప్రతిని ఈ పరిషత్ వారు సంపాదించారు. నేనుమాత్రం రాజమండ్రి వారి ప్రతిని ఆధారంగా ఒక్క రోజులో ఈ నారాయణ శతకం ముద్రించాను. ఆరోగ్యం బాగు లేకపోవటం వలన, భక్తపోతన పై ఉన్న గౌరవం వలన అంత తొందరగా ప్రచురించాను. పరిశీలననికి వాసు కవి అదే శ్రీ వడ్డాది సుబ్బారాయ కవిగారు నాకు చాలా తోడ్పడ్డారు. చిన్నతనం లోనే పోతన్నగారు మంచి ధారతో. గొప్ప కవితా శక్తితో. శ్రుత పాండిత్యంతో ఈ శతకం రాసి. క్రమంగా మహా పండితుడై వేదవ్యాస మహర్షి సంస్కృత భాగవతాన్ని తెలుగు లోకి మందార మకరంద తుల్యంగా అనువదించారు. పద్యాల నడక. భావాలు బాగానే ఉన్నా. భాషా దోషాలు శతకం లో ఎక్కువగా ఉన్నాయి. యధా మాతృకంగా నారాయణ శతకం ను ముద్రించాను "అనిచెప్పారు . శార్దూల మత్తేభాలపై స్వారి చేసిన పోతనగారి భక్తి శతకం ఇది. వెల తెలుపలేదు. శతక మకుటం –"నారాయణా ".

మొదటి శార్దూల పద్యం –"శ్రీ రామా మణి పాణి పంకజ మృదు శ్రీ తాజ్ఞ పాదాబ్జ శ్రుం –గారాకార శరీర. చారు కరుణా గంభీర సద్భక్త మం-దారాం భోరుహ పత్ర లోచన. కళాధారోరు సంపత్సుధా-పారావార విహార. నా

దురితముల్ భంజింపు నారాయణా “.అన్నారు. తర్వాత నేను నీ దాసుడ నీవు నాపతివిఅని. ఎన్నో చదివినా మనసులో నిన్ను తలచలేకపోయాను మన్నించు అని. తర్వాత కలశ పాధోదధిమధనం వివరించి. దశావ తారాలు వర్ణించి “పద్మ భవాండ భాండ చయం “కుక్షిలో కాపాడుతున్నావని. ”సర్వంబు వసియించు నీ తనువునన్ సర్వంబు నదు దగన్ నువ్వే ఉంటావు “అని. నీనామం పరమంబై,పరతత్వమై సకల సంపత్సారమై. భవ్యమైనది అంటూ. నీది శ్రీకి మందిరమైన వక్షం అని ధూపం వేసి. వ్రేపల్లెలో గోగోపగోపీ జనాలతో విహరించే నల్లనయ్యను వర్ణించి. ”వేణు రంధ్రాలిన్ రాగ రసంబు నిండ,విలసద్రాగంబు సంధించి గోపాల వ్రాతము గండు కోయిలలుగా “వర్ణించారు పోతన అన్నగారు. ”మా పాలన్ గడు క్రొవ్వి. మాపాలంబలే వచ్చి. మాపాలలో ఉండు. మీమా పాలైన సుఖాత్మ అని గొల్లలు “మాపాలం గల వేల్పు “నువ్వే అని భావిస్తారు అంటూ “”పాలా”భి షేకం చేశారు.

పూతకి ప్రాణాలను పాలిండ్ల నుంచి వెళ్ళగొట్టావు, దుగ్ధాబ్ధి తరంగ డోలికల్లో వైకుంఠంలో, అయోధ్యలో మధుర వ్రేపల్లెలలో. ద్వారకలో ఆడిన విధంగా నా మనసులో ఆడు విహరించు నన్ను తరింపచేయి. శరీరంలో జీవుడు ఏకమైన తర్వాత. ధర్మక్రియలతో. ఎప్పుడూ తనను ఎరుగకుండా మాయలో పడి. తనుతత్వాదులు వియోగమైన తర్వాత నసే నీ దర్శనం పొందుతాడు. కులగోత్రాలతో పనే లెదు. నిన్ను శుద్ధాత్మతో ధ్యానిస్తే ముక్తినిస్తావు. ఎన్ని చదివినా నీ నామస్మరణ ధ్యానం లేకపోతె మోక్షం లెదు. ”నీలగ్రీవుడు చేతిలోని పుర్రెను మీ భార్య పెట్టిన భోజనంతో తృప్తిపడి వదిలేశాడు. నీ నామ జపంతో తరించాడు. నువ్వే తల్లీ తండ్రీ. నువ్వే జగన్నాథుడవు. నువ్వే నిశ్చల బంధవుడవు నువ్వే శంకర మూలమంత్రం నువ్వే జగత్కర్తవు. 99వ మత్తేభం లో –”నరసింహాచ్యుత వాసుదేవ వికసన్నాలీక పత్రేక్షణ భూధర గోవింద ముకుంద కేశవ జగత్రాతా. అంబుజోదర. దామోదర. తార్క్ష్య వాహన., మహాదైత్యారి వైకుంఠ మురారీ “అని నారాయణ నామ స్మరణ చేశారు. వందవ చివరి మత్తేభం లో –”కడకంటం గనలేని సంపద లోగిం గావింపు లక్ష్మీశ. పా-ల్కడలిన్ బన్నగ శాయివై భువనముల్ గల్పించు సత్పుత్రునిన్ –బోడమం జేసిన నాభి పంకజ. జగత్పుణ్యాత్మ భాగీరథీ –పడతి గన్న పదారవింద,మిము నే భావింతు నారాయణ “అని ముగించారు.

తర్వాత గద్యంలో –ఇది శ్రీ పరమేశ్వర కరుణా కలిత. కవితా విచిత్ర కేసన మంత్రి పుత్ర. సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన నారాయణ శతకంబు సర్వంబును సంపూర్ణము “అని మంగళం పాడారు భక్తకవిపోతన. పద్యాలు ధారా బాగానే ఉన్నా సం థింగ్ మిస్సింగ్ అని పిస్తుంది. అదే మందార మకరందం.

జుంటి తేనే. ద్రాక్షారసం లేవే అని బాధ కలుగుతుంది. ఇది స్టేప్పింగ్ స్టోన్ శతకం కనుక అవి లేకపోయి ఉండవచ్చు లేకపోయినా భక్తికి. అంకితభావానికి తక్కువేమీ లెదు. జనం మర్చిపోయిన సహజ కవి పోతనామాత్యుని నారాయణ శతకం పరిచయం చేసే మహాదదృష్టం నాకు కలిగిందని పరమ సంతోషంగా ఉంది.

## 91 హరి ముకుంద శతకం -- శ్రీ కోట్రెడ్డి నాగిరెడ్డి




శ్రీ కోట్రెడ్డి నాగిరెడ్డి హరి ముకుంద శతకం రాసి. శ్రీ ఖాద్రి నరసింహ సోదరులచే పరిష్కరిమ్పజేసి. అనంతపురం సాధన ముద్రాణాలయం లో 1932లో ముద్రించారు. కవిగారిది కదిరి తాలూకా పందుల గుంట గ్రామం. అక్కడి ముకుంద స్వామికే అంకితమిచ్చారు. ఇది సీస పద్య శతకం. మకుటం –"భువిని పందులకుంట సత్పుర నివాస –అరసి నన్నేలు గోవింద హరి ముకుంద "శతకం వెల తెలియబర్చలేదు.

మొదటి సీసం –"శ్రీ రావికులజు నాశ్రిత జన మందారు –నజు నచ్యుతుని గూర్చి నతులోనర్తు-కోటి భాస్కరుకాంతిగోటమీటు కిరీట-ములును దాల్చువాని నింపొదవ గొల్తు –కౌస్తుభ మణిహార కంకణ కేయూర –ధారికిని భక్తీ ని దండమిడుదు-సిరి యురంబున గల్గు సరసిజోదరు గృష్ణు –హరికి బరేశుజోహారోనర్తు–"భువిని పందులకుంట సత్పుర నివాస –అరసి నన్నేలు గోవింద హరి ముకుంద '

. గీ-భవవినుత నాది దేవునిం బ్రణతు జేసి –సీస పద్యంబు లోసగితి చిత్తగింపు -'భువిని పందులకుంట సత్పుర నివాస –అరసి నన్నేలు గోవింద హరి ముకుంద ".తర్వాత అష్టదిక్పాలకులను స్తుతించి వ్యాసవాల్మీకాదులకు మొక్కి. తెలుగుకవులన్దర్నీ పలకరించి భక్తితప్ప తనకు ఏమీలేదని చెప్పారు. తర్వాతపద్యంలో దండాలు పెట్టారు. ఆతర్వాత శరణు శరణు అని కాళ్ళపై పడ్డారు. పిమ్మట రామక్రిష్ణావతార స్తుతి చేసి. గోకుల బాలకిట్టయ్య చిలిపి చేష్టలు చెప్పి. భక్తులను కాపాడే దైవమని ధూపం వేసి. మీన కూర్మాది రూప వైభవం వర్ణించి.

మాతృగర్భం లో అందరూ  అనుభవించే బాధలు వివరించి ఖాండవదహనం బామ్మర్ది అర్జునుని చె చేయించిన విధానం చెప్పి. ”ధాతను గన్నట్టి తమ్మి పొక్కిలి వాడివి తొగలను మించే కనుదోయి,శతృలను కూల్చే చక్రంతో లోక పాలన చేస్తావు. అన్నిటా నీ మూర్తి సంచరిస్తుంది అని రహస్యం చెప్పారు. నరకాసుర చెరలోఉన్న రాకన్యల మానం,ద్రోవది మానం నిండుకొల్వులో  కాపాడాడు. పిడికెడు అటుకులు తిని మిత్రుడు కుచేలునికి అఖిలార్ధాలు ఇచ్చావు నన్ను కాపాడి మోక్షం ఇవ్వు చాలు. ఇకపుట్టటం గిట్టటం నావల్ల కాదు –”నీదు సామీప్యమిచ్చి నన్నేలు “.


హరిముకుంద శతకము

మరోపద్యంలో రామనామమే ముక్తి రక్షా శుభం బుధ విజయం. ”నాలాంటి మూర్ఖునికి ఏమి తెలుస్తున్దయ్యా అన్నీ నువ్వే అనినమ్మే నన్ను కృపతోకాపాడి కైవల్యం అనుగ్రహించు “’వారాసులేకమై వర్తిల్లునప్పుడు –మర్రియాకుననున్న కుర్ర – పాలమున్నీట పవళించిన పన్నగశాయి,చరాచర సృష్టికి తమ్మిచూలినిగన్న తండ్రి. బ్రహ్మాండమంతా భస్మమైపోగా ఒక్కడేఉండే వటువు నువ్వే. నువ్వులేక నేను అనాధ. అన్ని మోహాలు తెన్చేసుకొన్నా. నీనామ భక్తితో అనుదినం ఆర్తిగా సేవిస్తున్నా. మరోపద్యంలో “రామ భానుకులాబ్దిసోమ. ఇందీవరశ్యా మ. రాక్షసభీమ. విష్ణు సామ్యప్రదీప. జిష్ణులోకప్రతాప. శక్రమిత్ర మురారి ఆదితేయ సుపోష. యాదవాన్వయభూష మౌని బృంద విహార “శరణుశరణు అన్నారు. తర్వాత రామ  కృష్ణులకు దివ్యమంగళాలు పలికారు. 107వ సీసం లో-అనంతపురం జిల్లా ఖాద్రి ప్రాంతం లో పందులకుంట గ్రామ వాసినని. కోటి రెడ్డి గోత్రీకుడనని తనపేరు నాగిరెడ్డి అని “హరిభక్తి సుధ అనుదినంబును గ్రోలి “ఈ శతకం చెప్పానని చెప్పి చివరి 108వ సీసం లో ఫలశ్రుతికూడా పేర్కొన్నారు భక్తకవి నాగిరెడ్డి.

శతకం భద్రాద్రి రామదాసు శతకం లా అత్యంత సుందర రచనలో సాగింది భక్తీ. శరణు. ఖాద్రి  కుంకుమ అంత పవిత్రంగా. అక్కడ విరివిగా లభించే మల్లెపూల కనకాంబరాల సొగసు సువాసనలతో శతకం పరిమళించింది.

ఖాద్రి దర్గా అంతటి పవిత్రత కలిగించింది. అక్కడి లక్ష్మీ నృసింహస్వామి అంతటి అనుగ్రహం కలిగించింది. ధన్యులు కవిగారు చదివి విన్న మనమూ అంతటి ధన్యులమే.

## 92 వరద రాజ శతకం -- శ్రీమతి వల్లిపేడు కాదాటి గుండ్ల పల్లి నరసమ్మ

శ్రీమతి వల్లిపేడు కాదాటి గుండ్ల పల్లి నరసమ్మ గారిచే రచింపబడిన "వరద రాజ శతకం కు శ్రీకట్టమంచి రామ లింగారెడ్డి పీఠిక రాశారు. చిత్తూరు విక్టోరియా జూబిలీ ముద్రాక్షర శాలలో 1931లోప్రచురితం. పీఠిక లో రెడ్డిగారు –"కవయిత్రి చిత్తూరు దగ్గర గుండ్లపల్లె గ్రామస్తురాలని. తనకు అక్క వరుస అని. వారి వంశంలో అంతటి రూప వతి గుణవతి పుట్టి ఉండలేదని. భర్త వళ్లి వీడుకు చెందిన అప్పాసామి రెడ్డి పెండ్లి అయిన కొద్దికాలానికే మరణించి. కష్టాలు పడినా ఆమె భర్త తమ్ముడు మరది నరసింహారెడ్డి చిత్తూరు జిల్లాలో అగ్రగణ్యుడని. "ధని. దాని "అనీ మహాప్రసిద్ధు డని. రెడ్డి జన సంఘానికి 25వేల రూపాయలు సమర్పించిన వదాన్యుడని, "నరసమ్మ తల్లి" పరమపవిత్రురాలని ఆమెను చూస్తె పూజించ మనసు పుడుతుందని. తన చిన్నప్పుడు ప్రతియేటా అరగుండ వావిల్ తోట. దామల్ చెరువు(ప్రఖ్యాత కధకులు మధురాంతకం రాజారాం గారి స్వగ్రామం )ఎల్లంపల్లె. వల్లిపేడు. గుండ్లపల్లె ఒక రౌండ్ తిరిగి వచ్చేవారమని,వెళ్ళినప్పుడల్లా తనకు



పట్టంచు పంచెలు ఒక్క రూపాయి సంభావన గా ఇచ్చేవారని. ఇక కోళ్ళు పొట్టేళ్ళుగడ్డపెరుగు ఇంటకాచిన కమ్మని నెయ్యి ఆప్యాయంగా అందించేవారని. గుండ్ల పల్లే ప్రయాణం అంటే అదొక తీర్ధ యాత్రగా ఉండేదని. "అమ్మాయమ్మ "అనే ముద్దుపేరుతో పిలువబడే నరసమ్మగారు. షడ్రసో పెత భోజనం పెట్టటమేకాక. ఆమె మనసు నడత లతో తమల్ని వికసింప జేసేవారని ఇదే అత్యుత్తమ విందుగా అనిపించేదని. "ఊకుడు కథలు "చెప్పటంలో ఆమె మహా నేర్పరి అని. రాత్రిళ్ళు ఆమె కథలువింటూ అఆక్కయ్యవద్దే పడుకొనే వాడినని. అప్పుడు తనవయస్సు సుమారు పది అనీ ఆమెకు కనీసం వందకు పైగా కథలు వచ్చునని. తనను అందరూ "నూరుకథల వాడు "అని అనేవారనిచెప్పారు. వదినగారి వైధవ్య బాధ తగ్గించటానికి మరిది నరసింహారెడ్డి

ఆమెకు కొంచెం చదువు చెప్పించాడు, చీట్లాట నేర్పించాడు. ఆమెది సహజ పాండిత్యం. కట్టమంచి వారి తండ్రి సుబ్రహ్మణ్య రెడ్డిగారు కొడుకుకు భారత భాగవతాలు అర్ధా లతో సహా నేర్పగానేర్చి. గుండ్ల పల్లే వెళ్ళినప్పుడల్లా అమ్మాయమ్మగారు తనతో వాటిని చదివించుకొని విని ఆనందించేవారని. అర్ధతాత్పర్యాలు అడుగుతూ అనుమానాలోస్తే ప్రశ్నించి సమాధానం పొందుతూ ఉండేవారని అలా తనను బాగా ప్రోత్సహించేవారని అన్నారు. ఆమె వినికిడి వల్లనే అన్నీ నేర్చారని ఛందస్సు అలంకారశాస్త్రం చదవకపోయినా కమ్మని కవిత్వం కట్టే వారని చెప్పారు. ఆకవిత్వంలో ముగ్ధ భక్తీ ప్రవహించేదని. పెళ్ళిళ్ళలో "తలుపులు తీసే'పాటలు. ప్రణయకలహాలు ఈ శతకం లో వర్ణించారని నీతి,సాంఘిక ధర్మాలు గుప్పించారని ఆడజన్మ పొందేబాధలు ఏకరువు పెట్టారని. రెడ్ల కులంలో పుట్టినందుకు వేమన గారి గాలి కొంచెమైనా సోకటం సహజమని. జ్ఞానానికి శాస్త్ర పఠనానికి సంబంధం లేదని. తెలుగు సామెతలు ప్రవాహంగా చొప్పించారని. "వనితకాభరణంబుపతి భక్తీ వెలయుట – ఇంటి కాభరణంబు లెనయ సుతులు "వంటి వేమన అనుకరణాలు కూడా ఉన్నాయని. స్త్రీల ప్రకృతి చెడ్డది అని ఆమె అనటం తనను బాధించిందని. గుణాలను గ్రహించమని కోరారు శ్రీమాన్ కట్టమంచి. తన తమ్ముని భార్య తిరుమలమ్మ "గురు బోధామృతం"గ్రంధం రాసి. తమ వంశానికి కీర్తి తెచ్చిందని,తెలుగు భాష అక్షయంగా నిలవాలని కోరు కొంటున్నానని సుదీర్ఘంగా 12 పేజీల పీఠిక రాసి మనకు తెలియని విషయాలు చాలా చెప్పారు. తర్వాత కవయిత్రి తనమాటలుగా ఏం చెప్పారో, శతక విశేషాలేమిటో రేపు తెలుసుకొందాం.


వరదరాజశతకము.

నరసమ్మగారిచే

1931

పాఠకమహాశయులకు విజ్ఞప్తి –అంటూ కవయిత్రి నరసమ్మ గారు "పన్నెండవ ఏట భర్త. పదమూడవ ఏట తండ్రి మరణం సంభవించింది. మాతాపిత భత్రు సేవలు చేసి తరించే అవకాశం పూర్తిగా లభించలేదు. పైత్రుక కార్యాలు దైవధ్యానం టో కాలం గడిపాను. పెద్దలవలన సద్గ్రంథ పఠనం అబ్బింది. జన్మ సంస్కారంతో భాషాజ్ఞానం అలవడింది. భర్తృరూప దైవం పేర ఒక శతకం. భక్తిరూప హరికీర్తనలు రాశాను. ముందుమాట రాసిన మాతమ్ముడు వంటి కట్టమంచి రామ లింగారెడ్డికి.. తప్పొప్పులు సవరించి ముద్రణకు సహకారం ఇచ్చిన శ్రీ పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగారికి కృతజ్ఞతలు. మామరది చి నరసింహారెడ్డి తీసుకొన్న జాగ్రత్త వర్ణింప నలవి కానిది. దైవ రూపమైన నా భర్తగారికి ఈ శతకం నిండుమనసుతో అంకితమిస్తున్నాను "అని కృతజ్ఞతాపూర్వకంగా చెప్పారు. ఇది సీస పద్య శతకం. మకుటం –"పుడమి శ్రీ వల్లిపేడు సత్పురనివాస –వనిత నరసాంబ బ్రోవుమా వరద రాజ ".

వాసుదేవుడినికానీ వర్ణించ నట్లుగా వాణి తనకు వాక్కు నివ్వాలని. ఇందిరాధిపుగాని యితరంబు జెందక హరుడ నాకొసగవే యాత్మబుద్ధి. పద్మ లోచను గానిపరియింపనట్లుగా బరమేష్టి బెట్టవే పాఠములను. హరిపాదములనుగాని యన్యంబు నొల్లక లక్ష్మి నేర్పింపవే లక్ష్యములను "అని అందర్నీ కొత్తతరహాలో కోరారు నరసమ్మగారు. తర్వాత పతితపావన. కరుణాసాగర దీనపోషక అంటూ నామ జపం చేసి. సిద్ధవరులను కాపాడటానికి శిలాపురం లో ఉన్నావు. ఆతర్వాత శ్రీరాముని ఆదర గుణాలు వర్ణించి. కొన్నినీతులు –కోపం పాపం. పాత్రమెరిగి దానం చేయాలి. అల్పులకు చేసినమేలు అడవిగాచిన వెన్నెలే. మదగజాలెన్నిఉన్నా ఒక కొదమ సింహం చాలు. సారంగాలపై శార్దూలం చాలు. మార్జాలలపై సారమేయం ఒకటి చాలు అలాగే అసహాయ శూరునికి ఎవరి సాయం అక్కర్లేదు. వానరాలకు వజ్రకిరీటం. చెవిటికి సంగీతం. గార్ధభానికి కళ్ళెం. సంగతమతికి మోక్షసుఖం,అంధునికి నొగసు. ఖలుడికి సద్ధర్మం. మార్జాలానికి మాఘపురాణం శుద్ధ దండగ అని చెప్పారు.

ఆపిమ్మట వివిధ రాగాలలో దేవ దేవీ కీర్తనలు రాశారు. కంచి శ్రీరంగం కుంభ కోణం., రామేశ్వరం ఎక్కడ చూసినా నీ దివ్యరూపమే ముచ్చట గోల్పుతుంది. నీకు రత్నహారాలు పట్టు పీతాంబరాలు సమర్పించలేను తులసి దళం మాత్రమె అర్పించగలను. తర్వాత మరాకతాది సురత్న మణి కిరీటదారికి. శాఖు చక్ర ధారికి శ్రీ కౌస్తుభ హారికి జగాలు రక్షించేజాహ్నవి కన్నతండ్రికి మంగళం సమర్పించారు. ఆతర్వాత "లాలిత మన్మధరూప. లాలిత సత్కుల దీప. లాలి వివాహ వినీలదేహ లాలిలోకాధార లాలి శుభాకార. లాలి దయాశాలి అంటూ లాలిపాడారు. 107వ చివరి సీసంలో –"యతి గణప్రాసలు తెలియకుండా భక్తితో సమకూర్చిన ఈ సీస మాలికను ప్రేమతో ఆలకించి ఆదరించి. ఆయురారోగ్య వంశసౌభాగ్యాభి వృద్ధి నివ్వమని ఆర్తిగా కోరుకొన్నారు కవయిత్రి నరసమ్మాజీ.

ఈశతకం. ఈ కవయిత్రి గురించి మనకెవ్వరికి తెలీదు. పరిచయం చేసిన అదృష్టం నాకు దక్కింది.

## 93 ఆంజనేయ శతకం -- శ్రీ పరాశరం నరసింహా చార్యులు




పుష్పగిరి సంస్థాన పాఠశాల సాహిత్య విద్యార్థిగుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా అందుకూరు కు చెందిన పరాశరం నరసింహా చార్యులు రాసిన ఆఞ్జనేయశతకం 1934లో గుంటూరు ఆర్యవైశ్య ముద్రాక్షరశాలలో ముద్రింప బడింది. మనవి మాటలు లో కవి"తాను పదహారేళ్ళ వయసులో "శృంగార నక్షత్రమాల "పుస్తకం రాశానని. అది శృంగారం కనుక ప్రచురించలేదని తర్వాత శ్రీ శంకరాచార్యుల చే స్థాపింప బడిన గీర్వాణ విద్యాలయం లో చదువుతూ ఈ శతకం రాశానని "చెప్పాడు. పరిశీలనకర్త కేసనపల్లి లక్ష్మణకవి పద్యాలలోనే – "సరళంగా మృదు శబ్ద భరితంగా. నవరస ప్రాగాల్భ్యంగా కవి ఈశతకం రాశాడని. లేబ్రాయం లోనే కడు ప్రౌఢ కవిత్వ సంపద అలవడిందని. రఘురాముడు ఈకవిని అన్నిరకాలుగా

ఆదుకోవాలి "అని కోరారు. మత్తేభ విక్రీడితమైన ఈ శతకం మకుటం –"అందుకూరిపురవాసా ఆంజనేయప్రభో ".పుస్తకం వెల ప్రకటించలేదు.

మొదటి పద్యంలో –"శ్రీ కంజాప్తకులుండురాముపదముల్ సేవ్యంబు తానంచున-స్తోకోత్ఫుల్ల కరాబ్జయుగ్మమున ద్ధోశాలి క్షేమాంఘ్రులన్ -వీకన్ జేరిచి సేవజేయు నిను నేప్రీతిన్ దగన్ గొల్చెదన్ –సాకల్యంబుగ నందుకూరి పురవాసా యాంజ నేయప్రభో ".రెండవ పద్యంలో క్లిష్ట ప్రబంధ రచనలో మేధాశాలి. పౌరాణిక విస్తరణ వాణీ శుక సామ్యు లక్ష్మణ కవి స్తవనీ యుడని,ఆంజనేయుడే అనాదిమూర్తి అనీ. సృష్టి స్థితిలయకారకుడని. యజ్ఞాదికర్మలను పోషించే సత్కర్త అనీ. రామ క్లేశ విదారకుడని. దైత్యరాజ సంహర్త అనీ. వినయాకార సద్భక్తి చిత్తుడు అనీ. "జలధిన్ దాటి సురారి పట్టణాన్ని సప్తార్చిషున్ చేశాడని. నిగమాగమాలు ఆయన వద్ద వర్తిల్లుతాయని. దురితాబ్ధి లో ఈదేవారికి ఏడుగడ ఆయనే అనీ,చెప్పాడు


ఆంజనేయ శతకము

ఇది
పుష్పగిరిసంస్థాన పాఠశాలయందలి
సాహిత్యవిద్యార్థియైన
పరాశరం నరసింహాచార్యులచే
రచియింపబడినది.

అందుకూరు.

1934

తర్వాత తనఇంటి పేరు పరాశర తనపేరు నరసింహ వచ్చేట్లు పద్యం ప్రారంభాక్షరాలను ఉంచి పద్యాలు ఆశువుగా అందంగా రాశాడు. దాస్యాది సమస్త కష్ట దశలలో స్వామి నామకీర్తనమే శరన్యమన్నాడు. తనకు లే ప్రాయంలో కవిత్వం శాస్త్రపరిజ్ఞానం అబ్బటం స్వామి కృపమాత్రమే అనీ,పద్నాలుగవ ఏట పౌరాణిక విద్వుత ధైర్యం ఇచ్చాడని. "న మాతుః పర దైవతం "అనీ. స్వామి నామ రసైకపానంతో మత్తిల్లిన భక్తితో రాసిన శతకమని. శత మత్తేభాలతో కూర్చిన ఈ శతకాన్ని ఆదరించమని కోరాడు. తండ్రి శేషాచార్యుడు తల్లి లక్ష్మాంబ.వందవ మత్తేభం లో –"అల యుష్మత్కృతమయ్యు నొప్పు శతకం బా చంద్ర తారా-ర్క మై యలరున్ గావుత. భూమినంచు నిరతంబా శీస్సు –లందిమ్ము నాకిల. నీ కబ్బము "పే "పఠించు వినునో ఏ మాన-వుల్ ప్రేమ వారల శ్రీతో కుల జేయుచుండు బుధపాలా యాంజనేయ ప్రభో ".అని ముగించి తర్వాత ఆంజనేయ దండకం రాశాడు.

ధారాశుద్ధి భక్తీ కవితా ప్రావీణ్యం నిండుగా ఉన్న యువకవి రాసిన ఈ శతకం మెచ్చదగినదే.

## 94 శ్రీ ఆత్మబోధ సిద్దేశ్వర శతకం -- శ్రీ కె.రామస్వామి

కలమళ్ళ హిందూ బోర్డ్ స్కూల్ ప్రధానోపాధ్యాయుడు శ్రీ కె.రామస్వామి శ్రీ ఆత్మబోధ సిద్దేశ్వర శతకం రచించి. ప్రొద్దుటూరు శ్రీ జానకీ ముద్రాక్షర శాలలో 1930లో ముద్రించారు. వెల –కేవలం –నాలుగు అణాలు. కవిగారు పండితాభిప్రాయం సేకరించి పొందు పరచారు. శ్రీమద్రామాయణ., బ్రహ్మాండపురాణ,బ్రహ్మపురాణాది బహు గ్రంధ కర్తలు. కావ్య స్మృతి తీర్ధ బిరుదాంకితులు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రి శర్మ (కడప )-"ఇది వేదాంత బోధక శతకం. పద్యాలు మధురాతి మధురం. "అన్నారు. శతావధాని. పంచానన కవి సింహ శ్రీ గడియారం వెంకట శేష శాస్త్రి గారు

–"మానవునికి ప్రకృతి వివేచనతోపాటు పారమార్ధిక జిజ్ఞాసకూడా అవసరం. జనసామాన్యానికి అందుబాటులో ఈ శతకం రాసి వేదాంతం బోధించారుకవి "అన్నారు. విద్వాన్ కావ్యపురాణ తీర్ధ శ్రీ జనమంచి వేంకట సుబ్రహ్మణ్య శర్మగారు –"లలిత పదజాలం తోపద్యాలున్నాయి. మోక్షమార్గానికి చక్కని రాజమార్గం. "అన్నారు.ఉపోద్ఘాతం లో -శతావధాని పంచానన. కవిసింహ శ్రీ దుర్భాక రాజ శేఖర శతావధాని –"తరుణ వయసులో గహన వేదాంత రహస్యాలను మంచి ఉపమానాలతో సుబోధకంగా రచించి సేహబాస్ అని పించాడు కవి. ఆశీస్సులు "అన్నారు. ఇది సీస పద్య శతకం –"భవ్య సిద్ధేశకలమళ్ళ భవ వినాశ"అనేది శతకం మకుటం. ప్రారంభంలో నారాయణ. నలువ వశిష్ట శక్తి పరాశర వ్యాస శుకులను. గౌడపాద గోవింద శంకర పద్మపాద హస్తామలక తోటకాచార్య మొదలైన బ్రహ్మ విద్యా ధురీణులను సీసం లో స్తుతించి. ఒకరోజు ప్రశాంత వాతావరణంలో కూర్చుని ఉండగా నరునితో ఉన్న నారాయణులా నారాయణ గురువు తనవద్దకు వచ్చి "త్రయ్యంత విద్యా విధాన భేదాలు బోధించగా. ఆధ్యాత్మ విద్యా రహస్యాలు తెలిసి "సిద్ధేశ శతకం "రాయాలనే కోరిక జనించి పెడకంటి మైసూరు రెడ్డి రమా మూర్తి నాగమాంబల కుమారుడు ఎర్రగుంట్ల పురంలో ఉన్న వితరణ శీలి సూరా రెడ్డి ఈ శతకాన్ని అచ్చు వేయిస్తానని ముందుకు వచ్చి వేయించాడని. ఇదంతా ఆది దేవుని ఘటన "అన్నారు.




శతకం మొదటి సీస పద్యం లో కవి –"శ్రీకరంబమల రత్నాకరం బానంద –శేఖరం బతుల సుశ్రేయ మగుచు –అద్వితీయాత్మకం బాద్యంతవిద్య యౌ-పేదాంత సార సంవేద్యమగుచు –ధీసాక్షి విదితమై. ధ్యేయ స్వరూపమై –సచ్చిదానంద విచారమగుచు –అందమై శ్రుతి లతాకందమై యలరారు –పరతత్వ రూపమై బ్రహ్మమగుచు-

తే.గీ- బుధజన వ్రాత సంప్రాప్త బోధ మగుచు-సంగరహితుల విమలాంతరంగమందు –భూరి యశమున విలసిల్లు భుజగభూష-భవ సిద్ధేశ కలమళ్ళభవ వినాశ "– అంటూ మాహా దూకుడుగా పద్యం దూకించారు ఊపిరి సలపనీయకుండా .

రుద్రుడు లయకారుడు రుద్రబీజం చిన్ముద్ర. శంకరుడు ఆనంద రూపుడు. చిర శుభాకార మంగళుడు. శుద్ధ జీవుడు దేహ బద్ధ జడుడు. జ్ఞానాప్తితో జడత పోతుంది. బ్రహ్మమొక్కడే దృక్కు.కంటితో రూపం చూద్దాము అనుకొంటే మనసు కంటికి అదృశ్యం. మనసుతో చూద్దామంటే బుద్ధికి దృశ్యమై బద్ధమౌతుంది. బుద్ధి దృష్టితో తెలుసుకొందామంటే ధీ వృత్తికి దృశ్యమౌతుంది. దృశ్య సృష్టికి సాక్షి దృక్కు. .బ్రహ్మ సత్యం జగం మిధ్య. బుద్ధి నిర్మలమైతే ఈశ్వర విభూతి కలుగుతుంది. శివ. జీవ సృష్టులతో జగత్తు వ్యష్టి సమష్టి అవుతుంది.బుద్ధికల్పితమే ఈ జగం.నువ్వు సూత్రాత్మకుడవైతే తే అన్నీ కనిపిస్తాయి.



విక్షేప శక్తి ప్రత్యక్షమై లింగమాది జన్మ జగత్సంగమైంది. అవ్యక్తాత్మలో మాయబ్రహ్మం ఉంటాడు. దేహం అసత్తు. జడం. క్లేశ వర్ధితం. పూర్వ జన్మ పుణ్యంతో పుణ్య పాపాలు సంక్రమిస్తాయి . సృష్టికి పూర్వం బ్రహ్మం అఖండం మాయారహితం. ప్రాగభావం ప్రధ్వంసమౌతుంది. ఇంద్రియ ప్రాణ బుద్ధులు నువ్వు కాదు. ఆత్మకు అనాత్మలేదు. అవతల అయస్కాంత సన్నిధితో భ్రాన్తమైనట్లు. జపాపుష్పకాంతులు స్ఫటికం లో ప్రతిఫలించి నట్లు ఉంటుంది.వడ్ల గింజకు పొట్టు ఉన్నట్లు. ఒరలోని ఖడ్గం లాగా ఆత్మ భిన్నంగా ఉంటుంది.

శుద్ధ పరమాత్మ శ్రుతులకు అందడు. సుఖమే ఆత్మగా దృక్కుగా ఉంటాడు. వస్తువు ఉంది, లేదు.చిత్తానుభవంతో సర్వజీవ జగాలు కనిపిస్తాయి అవినిజంగాలేవు. సూక్ష్మగా స్తూలంగా ఉంటాయి. ఈశ్వరానుభవం కలిగితే ముక్తి లభిస్తుంది. బ్రహ్మ వస్తువు. తానూ బ్రహ్మమే అవుతాడు. జ్ఞానాన్ని దాచి అజ్ఞానాన్ని కనిపింప చేసేది భ్రమ. భావాద్వైతం క్రియాద్వైతం అని రెండున్నాయి. చిద్విశేష విలాస చిహ్నామైనది భావాద్వైతం శ్రేష్టమైనది. పూర్ణ యోగాభ్యాసంలో క్రియా ద్వైతం సహకరిస్తుంది. రేచకం లో విశ్వం అనశ్వరం పూరకం లో బ్రహ్మమే. నూట రెండవ పద్యంలో –"రత్నా కరంబున క్షారజలంబు నిలిచి శుద్ధాంబువుల్ రవిరశ్మి నాకసమున –వరలి మేఘాకృతివర్షించు కరణి బో-ధానంద సాగరంబదు వెలయు –పరమ రసామృత వర్షధారల దొప్ప –దోగుచు బ్రహ్మ సాధుత్వ మెరిగి –పద్యపద్యంబున పరమ సిద్దేశుండు –మకుటమందున నొప్పుమహిమ గాంచి

తేగీ.-బ్రహ్మవిత్పాజ పంకజ భక్తుడైన –కొట్ట మన్వయ వారాసి కుముద హితుడు-రమ్య గుణుండు రామస్వామి రచన జేసె –గ్రంథమియ్యది సిద్దేశు కరుణ వలన "అని ముగించారు.

పద్యాలన్నీ పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తి గారి "సీతారామాంజనేయ సంవాదం "లోని రసధారతో అవ్యక్తానంద శోభాయమానంగా. సుబోధకంగా. మనసుకు హత్తుకోనేట్లు అవ్యాజాను భూతి నిచ్చేట్లు శతక రచన సాగి చరిత్రలో వన్నె కెక్కిన శతకరాజమైంది. ఈ శతకానికి ముందుమాటలు రాసి ఆశీస్సు లందించిన

వారంతా కవి దిగ్గజాలు. అవధాన సరస్వతులు. బహు కావ్య నిర్మాణ చాతురీ మతులు. వారి సంసర్గం లభించటం గొప్ప వారి ఆశీస్సులు అందుకోవటం మరీ గొప్ప. ఇలాంటి శతకాన్నీ, ఈకవీశ్వరుని పరిచయం చేసే మహద్భాగ్యం నాకు లభించటం నా అదృష్టం.

## 95 శ్రీ సోమేశ్వర శతకం -- శ్రీ గనముక్కల నాగయ్య

శ్రీ సోమేశ్వర శతకం ను మహారాజ రాజశ్రీ సోము పాళ్యం కనుకొండ కోటిరెడ్డి. మదనపల్లి బోర్డ్ హైస్కూల్ తెలుగు పండితులు బ్రహ్మశ్రీ వెంకటరామ శాస్త్రి గార్లచే పరిష్కరింపబడి మదనపల్లె బ్రిటానియా ముద్రాక్షర శాలలో 1926లో ప్రచురింపబడింది. వెల –అణన్నర.తండ్రిగారికి ఈ శతకం అంకితమిచ్చారు కవి. ఈ సీసపద్య శతకం  మకుటం అంతా గీతపద్యం నాలుగు పాదాలు ఉండటం విశేషం – "కన్నె మడుగు పురీవాస. కర్ణసాలె –కులజు లిలువేలుపువని పేరుగొన్న దేవ -శీలుడగు గనముక్కల శిద్దయార్య –చిత్త సుమవాస సోమేశ చిద్విలాస ".



 మొదటి సీసం లో –"శ్రీ గిరిజా వర శ్రితజన మందార-సోమజటాధర శూలధార –కాయజ సంహార కారుణ్య సాగర –వాతాశిధార మిన్వాకధార –హస్తి చర్మాంబర యాగమనోగోచర పాప సంహార కపాల ధార-బలగర్వ రిపుహర ప్రణుతి శుభాకర –ఫాలలోచన ధారభయవిదార


శ్రీశారదాయైనమః.

శ్రీసోమేశ్వర శతకము.

ఇది

గనముక్కల నాగులయ్యచే రచియింపబడి

మహారాజరాజశ్రీ పోతుపాళ్యం

కమకొండ కోటిరెడ్డి గారిచేతను,

మదనపల్లె బోర్డు హైస్కూల్ తెలుగు

పండితులగు బ్రహ్మశ్రీ

వెంకటరామ శాస్త్రుల వారిచేతను

పరిష్కరింపబడి

మదనపల్లె

శ్రీటానియా ముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె

1929.

Price 0—1—6] [వెల 0—1—6.

గీ-కన్నె మడుగు పురీవాస. కర్న సాలె –కులజు లిలుపేలుపువని పెరుగొన్న దేవ –శీలుడగు గనుముక్కల శిద్దయార్య –చిత్త సుమవాస సోమేశ చిద్విలాస “.అని భక్తిపూర్వకంగా సంనుతిచారుకవి. సోమ దేవ మంత్రం నిత్యం ఉచ్చరిస్తే రోగాలురావు. పాదపద్మాలు సేవిస్తే పాపాలు దూరం. చరిత్ర స్మరిస్తే దుఖాలు పోతాయి. ప్రాపు చేరితే శ్రీకైవల్యమే. నిన్ను హరుడు అందునా దిగంబరుడు అందునా. భవ. శివ, ఉమాధవ, అజ, వృషధ్వజ, భీమ, బలోద్దామా అనాలా అర్ధం కావటం లేదు అని శివనామాలు పల్కారు. నీపద సేవ చేయని చేయి కొయ్యగరిట,కీర్తించని నోరు నీటికోర. కధలు వినని చెవులు పెద్దకవులు. సాష్టాంగం చేయని దేహం పోలాల లోని దిష్టిబొమ్మ . కరులున్నా నౌకరులున్నా నీ స్మరణ లేకపోతె వ్యర్ధం. ధనమున్నా సందనమున్నా నీపూజలేకపోతే. ఆలున్నా నేల మైడాలున్నా. నీపాలన లేకపోతె. సుతులున్నా స్నేహితులున్నా నీకధలు వినకపోతే అవి వ్యర్ధం అని చక్కని నుడికారంతో చెప్పారు.

సదానంద. సకలాఘుత బృంద. దూరీకృతైక పదారవింద. వామ దేవ అమరవందిత. విశ్వేశ శ్యామలామల చిత్త. సకలలోకాధార,మకరాంక మదహర ప్రకటిత బలశూర. భయవిదార. నిశిత శూలాయుధ నీరజా సననుత భాసిత సంమోదిత. భవ్యచరిత అంటూ శివనామాలు పలికారు కొత్తతరహాలో. తల్లీతండ్రీ గురువు దైవం నీవే నీనామ మంత్రం నీచ తాపత్రయ భంజనం. భక్తులకు కర్ణాభరణం. నిగమ భూషణ కలాపూరణం మహాపాప విదారణం. నిఖిల పిశాచ బాధకం. సాధు సాధకం. చింతామణి. కల్పవృక్షం. కామధేనువు లకంటే నీనామం శ్రేష్టం. నీదయ ఉంటే జలధి లంఘించవచ్చు,పర్వతాన్ని ఎత్తవచ్చు. అగ్నిలో దూకవచ్చు, “మిసిమివోలె విషంబు మ్రింగవచ్చు “నాతప్పులు మన్నించి నన్ను కాచి నీలో కలుపుకోసోమేశ.

నాగురించిపార్వతి గణపతి కుమారస్వామి నీకు చెప్పలేదా అని ఫిటింగ్ పెట్టారు . ప్రణవ స్వరూపుడవైన నిన్ను. భావించి మనసులో పదిలపరచి. నీరూపు చిత్తం లో నిలిపి పంచ పూజలతో తృప్తి పరచి భక్తి చందనం. రక్తి అక్షతలు శాంతి సుమాలు క్షాన్తిపూజ చేస్తాను. చివరి వందవ సీసం లో –"మంగళంబురగేంద్ర మండన భవదీయ-పావన చరణరాజీవములకు – నిత్యమంగళము నీ నిర్మల కరునైక వీక్షిత నేత్రారవిన్దములకు –శుభమంగళము సర్వ శుభములొస గెడి –నీనామ మంత్ర నిధానమునకు – జయమంగలంబెల్లజగములు నిత్యంబు –పూజించు నీ దివ్య తేజమునకు"అని శుభమంగళం తో శతక సమాప్తి చేశారు.

ధారాశుద్ధి భావ పరిశుద్ధి భక్తిపరిపాకం ఉన్న సోమేశ్వర శతకం రాశారు కవి గనముక్కల నాగులయ్య.గణాలకోసం ప్రాకులాట లేదు. నాగాభరణునిపై నిశ్చల భక్తీ. సోమేశ్వరునిపై అచంచల ఆరాధన తప్ప నాగులయ్యకు. మంచి శతకం. ఒక రకంగా కవి ఆత్మనివేదన ఈ శతకం.

## 96 శ్రీ పన్నగాచల నాయక శతకం –శ్రీ పులహరి పీలోజి దేశికేంద్రులు

శ్రీ సచ్చిదానదస్వరూప పులహరి పీలోజి దేశికేంద్రులు రచించిన శ్రీ పన్నగాచల నాయక శతకం శ్రీకోల్లిపర సూరేశ్వర లింగం దేవర ద్రవ్య సహాయంతో శ్రీ పులహరి పీరోజి బాబు చే 1924లో ప్రచురితం. వెల –పావలా. విజ్ఞప్తిలో బాబు –"తనతాతగారు పీరోజి దేశికేంద్రులు అనేక గ్రంథాలు రాశారని అవి ముద్రితం కాకుండానే శివైక్యం చెందారని. తన తండ్రి లక్ష్మోజి ఆ శిధిలా తాళపత్ర గ్రంథాలలోని "పరమానంద సుధాలహరి "మాత్రం కాగితంపై కాపీరాసి ముద్రించారని. తాతగారి శిష్యులు శ్రీ పాటిబండ్ల వీరయ్యాచార్యుల ప్రోత్సహించగా తానూ ప్రయత్నించే లోపే ఆయనా మృతి చెందారని. అప్పికట్ల నివాసి అని,చినపరిమి అగ్రహార వాస్రవ్యులు. వీరమహేశ్వర స్వరూపులు శ్రీకొల్లిపర చన్నమల్లయ్య గారి ధనసాయంతోశతకం ముద్రించానని సత్తెనపల్లి నుంచి తెలియజేశారు. ఉపోద్ఘాతంలో –కవిగారు ఫిరోజి బాబు గారు 1929-30మధ్యలో జన్మించి. చిన్నతనంలోనే అనేక మహిమలు చూపుతూ ఆశ్చర్యపరచేవారని. బడిలో చేరి అందరికన్నా బాగా చదివి పేరు తెచ్చుకోన్నారని. ఒకసారి బడి నుండి ఇంటికి వస్తుంటే ఒక సిద్ధుడు కనపడగా భవబందాలనుంచి విముక్తి ప్రసాదించమనికోరగా తారకం ఉపదేశించి అదృశ్యమయ్యారని. తర్వాత పదిహేనవ ఏట శ్రీ జమిలి శేషయాచార్యులవద్ద పరతత్వ రహస్యాలు గ్రహించారని. శివ పంచాక్షరి ద్వాదశాక్షరి జపం నిర్విఘ్నంగా చేస్తూ. జనులకు జ్ఞానబోధ చేస్తూ 9-7-1889న శివైక్యం చెందారని. ఈ శతకంతో పాటు పరమానంద సుధాలహరి. తత్వ సంగ్రహం. స్వప్రకాశమానం. రామ శతకం మొదలైనవి రచించారని జిల్లెపల్లి వాస్తవ్యులు శ్రీ బోడేపూడి వెంకటరావు గారు తెలియజేశారు. తర్వాత గురు పీఠిక సంతరించి తన గురుపరంపరను ధ్యానిచారుపీరోజికవి. శతకం అంతా మత్తకోకిల పద్యాలలో రాశారు. "పన్నగాచల నాయకా "అనేది శతక మకుటం.



మత్తకోకిలస్వరంతో మొదటిపద్యం పలికించారు –" శ్రీ రమామణి మనోహరా చిన్మయాత్మక పాండుర-స్మేరశోభిత రాజమండల స్నిగ్ధ సద్వదనంబుజా-వారిజాసన సోమశేఖర వందితాంఘ్రి సరోరుహా –పారమోక్ష శుభ ప్రదాయక "పన్నగాచల నాయకా ".తర్వాత వెంకటేశ్వర అలివేలు మంగలను స్తుతించి. గోపభూపయ,శోదబాలక గోపికాతి మనోహరా. మయూర పించ వికాసా కామరూప అంటూ పరవశించారు. ద్వేష భీషణ వేష సాత్యవతేయ హృత్పరిపోషకా.రామ కోమలమూర్తి నిత్యవ,నిరామయాత్మక. సామజరాజ కష్ట విదార అని కొన్ని విషయాలు గుర్తు చేశారు. రేఖ మేఘ రుచిప్రకాశరీరతిర్మణిరేఖ. చిద్రేఖ శేఖర అంటూ వినూత్న పదబంధాలు సృష్టించి స్వామి కీర్తన చేశారు. రాజమండల సన్నిభాసన,రాజరాజ వతంస. భూరాజమండల ముఖ్యపూజిత రాగయోగి మనోజ్వలా "అన్నారు. సర్వతోముఖ సర్వ రూపక సర్వదీపకలాప సర్వపాలన సర్వ ఖేలన అని స్వామి సర్వాంతర్యత్వాన్ని ఆవిష్కరించారు. నీవే సర్వ చరాచరం సర్వజగాలు. నిన్నే భావన చేసి బతుకుతున్నాను. చలమేల కరుణించరా. ఏకమై పరిపూర్ణమై సకలేంద్రియ ప్రకరాన్తమస్తోకమై నిరవద్యమైన నువ్వు సూక్ష్మమే కాదు స్థూలం కూడా.




ఆరింటిని వధించి పదహారును పరిమార్చి. ఆరు చేర్చి ఆరు కూర్చి. ఆరిటిని పోకార్చి. ఆరుపువ్వులమీదుగా. పదహారు కాంతుల పూర్ణమైనది ఇమ్మారుగా ఉంటుంది అని వేదాంత బోధ చేశారు. 99 వ మత్తకోకిల లో – "మత్తకోకిల పద్య సుమాలతో మాలచేసి నీకు సమర్పించాను వెంకటేశ్వరా. స్వీకరించి అందరికి సకలార్ధాలు సమకూర్చు. వందవ పద్యంలో –"పులారి కులం లొ శేషయార్య సేవాపరుడను.సత్యభామాపుర నివాసిని. ఫీరు దాసు పేరు. నాకృతిని వ్యాప్తి చేసి అందరికి శుభం కల్గించ మనికోరారు.

దాసకవి లోక హితైషి. వెంకటరమణ పాదార్చకులు. మదినిండా స్వామిని నింపుకొని ఇంపు మీరగా మత్తకోకిలస్వనం తో భక్తీ మత్తు ఎక్కిన్చేట్లు శతకం రాసి తరించారు. చదివి మనమూ తరిద్దాము.

## 97 శ్రీ సిద్ధేశ్వర శతకం -- శ్రీ కోటయాఖ్య కవి

గుంటూరుజిల్లా పల్నాడు తాలూకా రాయవరం వాసి శ్రీచిదంబర గురుస్వామి శిష్యుడు శ్రీ కోటయాఖ్య కవి శ్రీ సిద్దేశ్వర శతకం రచించి. గుంటూరు అనసూయ ముద్రాక్షర శాలాలో 1933లొ ముద్రించారు. వెల తెలుపలేదు. ఇది కంద శతకం. "సిద్ధేశ్వరా అనేది శతక మకుటం.


శ్రీ సిద్ధేశ్వర శతకము.
కోటయాఖ్య కవిచే
1933.

శార్దూలం లొ "శ్రీ వైకుం ఠనీవాన దేవా విలసచ్చిన్మాత్ర తత్వంబవై "అంటూ స్వామి విభూతిని ప్రశంసించి. గురు చిదంబరస్వామిని సన్నుతించి. తర్వాత "శంకరతనయా గజముఖ "అంటూ వినాయకుని. "పారావారము దాటి లంక కెలమిన్ బల వేగమొప్పారగా "దాటిన ఆంజనేయస్వామిని. సరస్వతిని చిత్తం లొ నిల్పి. "ఏ దేవతా శక్తి వేద శాస్త్రములకు తల్లియై తనరుచుండు "అని "దేవీ స్తోత్యం "చేసి. వాల్మీకాది కవి స్తుతి చేశారు కవి. సీసమాలికలో తన వంశావళి వివరించారు –తండ్రి వెంకయ్య రమ్యమూర్తి. తల్లి అచ్చమాంబ. మేనమామఅల్లయ్య. తమ్ముడు కృష్ణయ్య. భార్య రామ లక్ష్మమ్మ. వీరికోడుకులు హనుమయ్య వెంకయ్య కోటయ్య. వారిభార్యాలు కోటమ్మ వేంకట రామమ్మ లచ్చమ్మ. కుమార్తెలు కాత్యాయని. అంతమ్మ బాలకోటమ్మ,అచ్చమ్మ. వీరయ్య మొదటికుమారుడు హనుమయ్యకు వెంకట రాములు. రెండవకుమారుడు శ్రీరాములు. మూడవకొడుకు కోటయ్యకు పుట్టిన కూతురు రామ లక్ష్మ. ఈమెకు వీరయ్యకు పుట్టినవాడు మనకవి కోటయ్య.

తర్వాత శతకం అంతా శివ స్తుతే –"శ్రీ రజతాచల వాసునికోరి భజించెదను నాదుకోర్కులు మీరన్నేరుపుతో నీ సత్కృతి భారకుడవు నీవే యంచు భజింతు శివా "అని మొదలుపెట్టి "రజతగిరివాసా. పరమేశ సింధు గంభీర ఈశా. మారసంహార శశిధరా"కృపతో చూడు అన్నారు. అండపిండాలు నీలో నిండి ఉంటాయి. మార్కండేయుని బ్రోచినట్లు కాపాడు. ఎంతపిల్చినా పలకవు అని. కోటిసూర్యప్రకాశంతో కైలాసంలో ఉంటావు. గిరిజ వామాఙ్కంలో ఉంటుంది. మూలం లేని జగతి నిర్మూలనమౌతుంది. ఆదిమునులు నిన్ను సర్వేశ్వరుడు అని కొలిచారు. గరళం మింగి లోకాలు కాపాడావు. ఆపదోద్ధారకుడవు. నిన్ను వర్ణించటానికి "ఫణివిభుడు కూడా చాలడు.కోటి మంత్రాలు శివమంత్రం ముందు నిలవవు.



శ్రీ
శ్రీగురవేనమః

శ్రీ సిద్ధేశ్వర శతకము.

గురుస్తుతి.

సర్వభూతాలకు నువ్వే సాక్షి " . "పంచ శిరాలలో శ్రీ గంగ కుదురుగా కూర్చుని ఉంటుంది. కైలాసంలో నీ గణాలు పరివేష్టించి నిన్ను కోలుస్తుంటే వామభాగంలో ఉమాదేవితో చిన్మయానందం అనుభవిస్తూ భక్తులకు వరదాయిగా ఉంటావు. గౌరికి శ్రీరామనామ మహత్మ్యం బోధించి నిత్యం స్తుతి చేసేట్లు చేశావు. అనమస్కము నిరాకార సాంఖ్యము బోధించావు. ఆరు అక్షరాలతో హరుడుగా వెలుగుతున్నావు. మణులహారంలో ఆధారంగా జగాలన్నీ అణగి ఉంటాయి. సిద్దేశ్వరంలో క్రవ్యాదుడు నీమహిమ బోధించాడు. నీపాదాల పూజించే వరమిమ్ము. తేరాల వాసుడవు కృపా సింధుడవు. భావంలోనే కనిపించే భవ్యుడవు.సిద్దేశ్వర క్షేత్రంలో శివరూప కళలతో శిద్ధీశుడు అనే పేరుతొ తేరాలలో ఉన్నావు. అని 146కందాలు అందంగా చెక్కారుకోటయ్యకవి. చివర మంగళమూ పాడారు. "సిద్దే శ్వర ఈ

శతకము శుద్ధంబుగసంస్మరింప శుభ సౌఖ్యంబుల్ – సిద్ధించు జదివి,వ్రాసిన శిద్ధులకు గల్గు మోక్ష సిరులీ భువిలో "అని గ్యారంటీ ఇస్తూ ముగించారు.

సరళపద సపద తో ఆడంబర హడావిడి లేకుండా మనసులోని భావధారను ప్రవహింప జేసి సిద్ధే శ్వర శివునికి అంకితమిచ్చి ధన్యమయ్యారు కవి

## 98 అఘ వినాశ శతకం-- శ్రీ దాసరి అంజదాసు


శ్రీగురుభ్యోనమః.
అఘవినాశశతకము.
కృష్ణాజిల్లా బేతవోలు గ్రామకాపురస్థులగు
శ్రీమాన్ శ్రీపతి సుదర్శనాచార్యులవారి
ప్రియశిష్యుండగు
దాసరి అంజదాసు
విరచితము.
ఆదిపూడి ( బాపట్ల తాలూకా )

కృష్ణాజిల్లా బేతవోలు గ్రామస్తులు శ్రీమాన్ శ్రీపతి సుదర్శనాచార్యుల ప్రియ శిష్యుడు శ్రీ దాసరి అంజదాసు రాసిన "అఘవినాశ శతకం"బాపట్ల తాలూకా ఆదిపూడి నుంచి1932లో ప్రచురితం. పరిచయకర్త శ్రీ అబ్బరాజు వెంకటరంగారావు గారు –"భక్తితో పామరకవిరాసిన శతకం అని. కవిత్వం లీలామాధుర్యం గా. రసపుష్టిగా వేమన శతకం లా ఉన్న శతకం" అన్నారు.ఇది ఆట వెలది శతకం. "అంజ దాస పోష అఘవినాశ "మకుటం.

"శ్రీయేజనులకు రత్నము – శ్రీయే బహు సంపదలనుజేకూర్చదగున్-శ్రీయే భక్తికి మూలము –శ్రీయే రక్షించు జనుల శ్రీరఘురామా "అని మొదటి పద్యం చెప్పి. "గొప్పబొజ్జ వాడిని ' వాక్కులో నివసించేతల్లిని,వేమనాదికవులను. రామచంద్రుని స్తుతించి శతకపద్యం

కానుకగా సమర్పించాడు కవి. దేహభ్రాన్తితో దేవుని చూడలేకపోతున్నానని. జీవ హింస దైవ హింసతో సమానమని. పప్పు అన్నాలు పరమేశ్వరుని రూపు అని. ఉప్పు పులుసు నెయ్యి హృదయ గుణాలని గొప్పకూరలన్నీ గోవిందు భూతములనీ చెప్పాడు. త్రిపుటి మధ్యలొ ఉన్న దేవుణ్ణి కనుగొంటే యోగి అవుతారు. ఆలికంటే ఆత్మ బంధువు. కాలికంటేగట్టి బంటు లేరు. ధనం లేకపోతె దైవమె దిక్కు. దాశరధిని సతతం తలచే వారికి దోషం లేని దారి దొరుకుతుంది.

## అభిప్రాయము.

రాముఁడె దైవముఁ సఖుఁడు రాముఁడెనాకు పరాత్పరుండు శ్రీ రాముఁడె నాకు భ్రాత యఖిలాఘములన్ నెగడిమ్చి సాధులన్ భామలపాలు సేయక శుభంబులొసంగి తరింపఁజేయు త న్నామమె నాజపంబు భువనంబున సన్యములేదు నాకిఁకన్॥

అని తొల్లి త్రేతాయుగంబున భక్తశిఖామణియగు ఆఅంజదాసు వాక్రుచ్చె. అట్టులే నీగ్రంథకర్త నామంబును; భావంబును తెలియవలెనన్న యీ "అఘవినాశ శతకమె" సాక్షి.

మఱియు వీరెల్లప్పుడును రామపాదారవిందంబుల డెందంబుననుంచి భక్తిని పుణ్యములచే జేయుభజనవల్ల ఫుల కాంకిత శరీరుఁడై రామప్రసాదంబుగా నీగ్రంథమును బడయ గల్గి పామరుల పాపపంకిలంబు వాఁద్రోలుటకోయన నీగ్రంథము మనకరంబుల నందజేసె.

గాన, సోదర సోదరీమణులెల్లరు "చెఱుకునకు వంక గలదేని చెడునె తీపి" యన్నట్లు గ్రంథమునందుండు తప్పులనే గడయుచు భక్తిభావముతో గ్రంథకర్తకు జేయూత నొసంగుదురని ప్రార్థన.

ఆదిపూడి వెంకట రాఘవయ్య.

---

నీటిలో, పాటలో, బోటిలో, పొందులో మంచి తెలుసుకోవాలి. భూషణం, వేషం. భాష ఉంటేనే ఎక్కడైనా గౌరవం. రోషం లో. రోగంలో,మాటకటువులో. నీటులో గొప్పగా ఉంటే ఆశ అడుగంటిపోతుంది. ధర్మ, మర్మ, నిర్మలాలు ఉంటే మంచి గతి మోక్షం. ”ఆడవారి మంచి. అందలంబులమంచి –కోడెత్రాచు మంచి. కోతిమంచి-గూఢచారి మంచి గుర్తించటం కష్టం. యోగభక్తిలేకపోతే ముక్తి హుళక్కే. ”తోలుతిత్తిలోని దొడ్డ వానెరుగక –కాలమెల్ల రిత్త గడుపుచుండ్రు –నీళ్ళులేని చేప నిర్మలమౌ “ అని మంచి సూక్తి చెప్పాడు. స్త్రీలకన్నా చిత్త చోరులులేరు. మహ ఇంద్ర జాలంతో మోసగిస్తారు. రంకు చేసే భార్య భర్తపై కోపం చూపుతూ అన్నిపనులు తానె చేసుకొంటుంది.

అంటీ అంటకుండా ఆకాశం ఉంది.రెంటి మధ్య రేయిపవలున్నాయి. దాన్ని చూస్తేఆనందం. రెంటిమధ్య రేచించి చూస్తె ఒంటి స్థంభం మేడ కనిపిస్తుంది. అందులో హాయిగాశయనించు అని తత్వ బోధ చేశాడు. సబ్బుబిళ్ళ రుద్ది సరసుని దరి చేరుతుంది వన్నెలాడి. ”నేను “అనేదాన్ని ఎన్న గలిగితే వాడేధన్యుడు.చివరలోకవి –

"రామపాదుకలు శిరస్సుపై ధరించి ముక్తికోసం మోస్తున్నాను. ఇవ్వటానికి నాదగ్గర చిల్లిగవ్వ లేదు.అందుకే ఈ అఘ వినాశ శతకం అనే పుష్పాలు సమర్పిస్తున్నాను. కామితార్ధా లిచ్చి కాపాడు రామ చంద్రా అని ముగించాడు.

చక్కని సూక్తులు మహా వేదాత భావనలు,సరళమైన పదాలు తో చిత్తరంజనంగా కవిత్వం పరిమళించింది. చదివితే. అమలుపరిస్తే. అఘ వినాశనమే.

## 99 జనార్దన శతకం-- శ్రీ బులుసు వేంకటరామమూర్తి

విజయనగర అష్టావధాని శ్రీ బులుసు వేంకటరామమూర్తి గారు రాసిన శ్రీ జనార్దన శతకం ఏలూరు శ్రీ ఆంజనేయ పవర్ ప్రెస్ లో 1957లో ముద్రించారు. వెల-అర్ధరూపాయి.తొలిపలుకు లలో కవి –"బాలుడిని కవితా ప్రతిభలేకపోయినా.శ్రీశారదాంబ వర ప్రసాదంతో ఈశతక రచన చేశాను. కవి శేఖర పండిత పంతుల లక్ష్మీ నారాయణ శాస్త్రి శ్రీ చింతలపూడి సన్యాసి రావు. శ్రీ ఆకుండి వెంకటశాస్త్రి మున్నగు పెద్దలు చేసిన ధనసాయం. ఏలూరు లొ వెంకటరామా అండ్ కో అధినేత. రసజ్ఞులు శ్రీఈదర వెంకటరామయ్య గారు ముద్రణా వ్యయం భరించి శతక ముద్రణ చేశారు. ఏలూరులో సాహితీ పెద్దలను పరిచయం చేసిన సాహిత్యమండలి అధ్యక్షులు డా.శంకర రామారావు గారికి. ముద్రణలోపాలు సరిచేసిన కవిమిత్రులు శ్రీ అద్దేపల్లి


ఓం
శ్రీజనార్దన శతకము
గ్రంథకర్త
బులుసు వేంకటరామమూర్తి,
...ష్టావధాని
...యనగరం.
1957
హక్కులు గ్రంథకర్తవి
[వెల రు. 0-8-0
(50 నయాపైసలు)

కుటుంబరావు గారికి కృతజ్ఞతలు "అన్నారు. పరిచయ వాక్యాలు పలికిన కవితాభూషణ విద్వాన్ శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు –"కవి ఆశువుగా చెప్పినా, కవిత్వం ఆలోచనాత్మకంగా,లలితపద మంజులం గా ఉంది"అనగా విశ్రాంత కళాశాల ఆంధ్ర పండితులు విద్వత్కవి శ్రీ ఆకుండి వెంకట శాస్త్రి పద్యాలలో ఆశీస్సులు పలుకుతూ –" కవి అమితప్రజ్ఞ చూపాడు. మృదుపాకం రుచిగా ఉంది బాలకవికి ఆశీస్సులు "అనగా. మహారాజ సంస్కృత కళాశాల ఆంధ్ర పండితులు సాహిత్య విద్యాప్రవీణ. ఉభయ భాషా ప్రవీణ కవిశేఖర శ్రీ పంతుల లక్ష్మీ నారాయణ శాస్త్రి పద్య ఆశీర్వాణి లో "జనుల నర్దించుటను జనార్దన శతకం అయింది. గుణభావ రసప్రసక్తి తో రాశాడు"అన్నారు.




మహారాజ ఆంగ్ల కళాశాల విశ్రాంత పండితులు కవిశేఖర శ్రీ అడిదం రామారావు పంతులుగారు "బాలకవి త్వరలో ప్రౌఢకవి ఆయె లక్షణాలున్నాయి. కవిసార్వభౌమ శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రిగారి ఆశీస్సులు పుష్కలంగా అందుకొన్న బాలకవి ఇతడు. కౌముదీ పరిషత్ కార్యదర్శి కవితాకోవిద శ్రీ చింతలపూడి సన్యాసిరావు "మనోజ్ఞ భావనా కలిత కవిత్వ మాధురి ఉన్న శతకం "అన్నారు పద్యాలలో. పార్వతీపురం బోర్డ్ హై స్కూల్ బిఎడ్ ఉపాధ్యాయలు సాహిత్యకోవిద శ్రీ క్రొవ్విడి రామం –"వర్ధమానకవి ప్రసాద గుణ భరితంగా రాసిన శతకం. విజయనగరం B.P.M.M.హైస్కూల్ సంస్కృత పండితులు కవిభూషణ., పౌరాణిక కోకిల. కాలక్షేప కంఠీరవ భాషాప్రవీణ. శిరోమణి శ్రీమాన్ అద్దంకి వేంకట రంగాచార్యులు –జాతిరత్నాలలాంటి చంపకాదులతో. బహుళార్ధ పటిమతో. భక్తి ఘనతతో కూర్చిన శతకం. మందారమకరంద నవ్య కవిత్వ ధార ప్రవహించింది"అని పద్యాశీస్సు పలికారు. భీముని పట్నవాసి హరిదాస భూషణ శ్రీ మరింగంటి లక్ష్మనాచార్య భాగవతార్ –"ప్రతిపద్యం రసస్థానం పొందింది. కవితాధార దివ్య గంగాతరంగాలతో చెలిమి చేసింది. వీరి అవధానం ఆంధ్రలో విజయధ్వజం ఎత్తింది. శబ్దాడంబరం కంటే అర్థాడంబరం ఎక్కువ "అన్నారు. ముంగండ వాసి విద్వత్కవి సార్వభౌమ. అభినవ పండితరాజ విద్యావాచస్పతిమొదలైన "దశ "బిరుదాంకితులు శ్రీ పుల్య ఉమా మహేశ్వర శాస్త్రి –"భక్తిరస కెరటాలలో తడిపెశారు. హృదయాకర్షంగా ఉంది "అన్నారు. బిలాస్పూర్ నుంచి మధురకవి

శ్రీమూలా పేరన్నగారు –”  ఈ కవిపుంగవుని  ఉజ్వలతర భావ సంపదలు. కలిత మృదూక్తులు మనోజ్ఞ వాగ్వధూ గళానికి కర హారం చేశారు “అన్నారు. ఇందరు మహామహుల ఆశీర్వాదాలు పొందిన బాలకవి శేఖరుని ప్రతిభ శతకం లోఎలా ప్రతిఫలించిందో తర్వాత తెలుసుకొందాం.


కృతిసమర్పణము

పదములు తొట్రుపాటుఁబడు
ప్రాయము చిన్నది లేవలంకృతుల్
ముదమగు మాటతీఱు రస
ముండగు భావమెఱుంగ దింత నీ
పదమొకశరణ్య మంచు నెద
భావనసేయు భవత్కృపా సుసం
పదనెటు పెద్ద జేసెదవొ
మత్కృతి కన్యక నోజనార్దనా.

జనార్దన శతకకర్త శ్రీ బులుసు వెంకటరామమూర్తి శతకలో తనజన్మభూమి “వీరబొబ్బిలి “గురించి ఘనమైన సీసపద్యం రాసి. తర్వాత తేట గీతిలో తన వంశం గురించి చెబుతూ “తమదియాగాలు చేసి సోమయాజి లైన  బులుసు వంశమని,తను కవిగాయక విబుధనిలయమైన విజయనగర వాస్తవ్యుడనని,చెప్పి చంపలమాలలో శారదా,విఘ్నేశ్వర స్తుతి చేసి. గురు ప్రణామం చేసి. కాళిదాసాది కవులప్రస్తుతి చేసి. శతకం ముద్రించిన ఈదర వెంకటరావుగారికి కృతజ్ఞత చెప్పి రంగంలోకి దిగారు.

మొదటి చంపకం లొ-”శ్రీ రమణీ మణీ విమల చిత్త నివాస. వికర్మ దుష్క్రియా –వార నివాస. సద్విషయ వర్గ విలాస. మణీవికాస –వి-స్ఫార కృపాభి రక్షితనిజస్మరణ స్థితి దాస భవ్య శృం –గార  గుణాభిలాష నను గావు ననంత కృపన్ జనార్దనా ‘అని మొక్కుకొన్నారు. తరణం పీడా సంహరణం ఆశ్రిత భరణం అయిన నీ స్మరణం భవ బంధ హరణం అన్నారు. కుచేలుని గజేంద్రుని కాచిన వేల్పు అని. కురుక్షేత్రయుద్ధంలో పార్ధుని రధసారదిపై ధర్మ రక్షణ చేశావు. ద్రౌపదీ మాన సంరక్షణ చేసి సురవందితుడవయ్యావు. లలితకలావిలాస బహుకోమలకోమల కీర్తిశాలి వి. నీ విలాసమే సకల జగత్తు. ”గంగను తెచ్చి నీ పదపంకజమూలన్ కడగంగా కల్మష హీనమై వెలుగొంది. పాలంగడుగంగ నిరంతర వాసం పాల సంద్రంలో ఉంటున్నావు.

పదాలు తొట్రిలుతున్నాయి ప్రాయం చిన్నది. రవిరాహువులు సప్తమంలో శుక్రుడు ఉచ్చలో ధనుస్సులో శనిబుధ గురులు అష్టమం లో. తొమ్మిదిలో చంద్రుడు నీచం లొ ఉన్నప్పుడుతులాలగ్నం లొ పుట్టాను.అని తన జ్యోతిష పాండిత్యాన్ని ప్రకటించారు వందనమార్యసననుత శుభస్థితి దాయక తార్క్ష్య వాహనా వందనం అని శరణు చెప్పారు నూరవ పద్యం లొ తనది గౌతమ గోత్రమని తప్పో ఒప్పో చంపక మాల శతకం కూర్చి నీకు సమర్పించాను గ్రహించి ముక్తినివ్వు. చివరి 101 పద్యం లొ"మంగళమార్త రక్షక. రమాధవ సజ్జనలోక సన్నుతా-మంగళమబ్జనాభ. గుణ మండన., చారు కటాక్ష యుక్తి చే –మంగళ సౌఖ్య సంపదలమాకొనర్చి. కృపాబ్ధినేలు మా-మంగళరీతి నభ్యుదయమార్గము జూపి కృపన్ జనార్దనా "అని ముగించి గద్యంలో "గౌతమస గోత్ర పవిత్ర బులుసు బుచ్చన్న పౌత్ర. నరసింహశాస్త్రిపుత్ర. లక్ష్మీ నరసాంబా గర్భ ముక్తాఫల అష్టావధానాశుకవితావిలాస వేంకట రామమూర్తి శర్మకృత జనార్దన శతకం "అన్నారు.

దారాశుద్ధికల కవిత్వం. పండిత విరాజితం. ఔచిత్య పోషణం. సకల రసాను సంధానంగా జనార్ధన శతకం పండించారు అష్టావధాని శ్రీ బులుసు వేంకట రామమూర్తికవి. కవిత్వాన్ని గూర్చి మహామహులు చెప్పిన మాటలన్నీ తెలియజేశాను కనుక అంతకంటే ఎక్కువ చెప్పక్కరలేదు.

## 100 శ్రీ వట్టి మాయ శతకం-- శ్రీ గంగుల నారాయణ రెడ్డి

గుంటూరు జిల్లా సంతగుడిపాటి పురవాసి శ్రీ గంగుల నారాయణ రెడ్డి గారు రచించి. శ్రీ గోపాలుని హనుమంతరాయ శాస్త్రి గారిచే పరిష్కరిమ్పజేసిన" శ్రీ వట్టి మాయ శతకం" కీశే శ్రీ గంగుల మల్లికార్జున రెడ్డి సతీమణి శ్రీమతి రామ లక్ష్మమ్మ గారి ద్రవ్య సహాయంతో నరసరావు పేట రాజ్యరమా ముద్రాక్షర శాలలో 1932లొ ముద్రింపబడింది. కవి గారి గురించి పీఠికలోవినుకొండతాలూకా ముప్పాళ్ళ గ్రామవాసి హనుమంతరాయ శాస్త్రిగారు –"ఇది తత్వ శతకం. సంస్కృతంలో నిష్ణాతులైన వారికే రాయటం సాధ్యం. శాస్త్రవాసన కవితా వాసన లేని రెడ్డిగారు ధైర్యంతో రాసిన శతకం నన్ను పరిష్కరించమని కోరగా ఆపని చేశాను. ఆదరించండి "అన్నారు.

సంతగుడిపాడు కు చెందిన శ్రీ తోక చిచ్చు వెంకట అప్పలరాజు "ఇందులో ప్రాస పద్యాలుకీర్తనలుగా మంగళహారతులుగా చదువుకోవటానికి వీలుగా ఉన్నాయిఅని కితాబిచ్చారు. అన్నవరం కు చెందిన శ్రీ వాలిచర్ల హనుమయ్య పద్యాలలో –"వట్టి మాయ శతకం కన్నా విన్నా కర్మజాలం వదలి మోక్షం కలుగుతుంది "అని అభయమిచ్చారు. ఇది సీస పద్య శతకం. "బట్టబయలొక్కటే తప్ప వట్టి మాయ "అనేది శతక మకుటం.పుస్తకం వెల చెప్పలేదు బహుశా అమూల్యమేమో!


ఓమ్.

శ్రీ

వట్టిమాయశతకము.

1932

మొదటి సీసంలో "పలుకు పలికున తప్పు పట్టవద్దని. అర్ధాన్ని మాత్రమె తెలుసుకోమని కోరారుకవి. తరువాత అంతా వేదాంతం నీతి నింపారు. జగతికి ఆధారం సత్యం జ్ఞానమే ధనం దయ చాలాఅవసరం. ఓర్మి ఉత్తమ గుణం అన్నారు. శివుడు గొప్ప అని ఒకరంటే విష్ణుపే గొప్ప అని వేరొకరం టారు. శక్తియే చిచ్చక్తి అంటారు కొందరు. దేవుడు ఎక్కాడా లేడు నీలోనే ఉన్నాడు. అన్నిమతాలు" సమ్మతి మంచిది" అన్నాయి. సత్తు నుంచి సృష్టి సాగింది అంటుంది ఒక ఉపనిషత్తు. అదికానిది వేరేదీ లేదు అంది మరొకఉపనిషత్తు. సృష్టికి మూలం సృష్టి అన్నది మరొకటి. చివరికి భగవంతుడు ఒక్కడే అన్నారు.

ఆధార చక్రమైన గుదం లో గణపతి ఉంటాడు స్వాధిష్టానంలో బ్రహ్మ. మణిపూరకం లొ నారాయణుడు హృదయస్థానమైన అనాహతంలో ఈశ్వరుడు ఉంటారు. ఖేచరిని చూస్తె కేశవుడు కనిపిస్తాడు. భూచరిని చూస్తె హరి. శాంభవిని చూస్తేశంభుడు షణ్ముఖి చూస్తె ముక్తిదారి కనిపిస్తాయి. కంటిలో ఎర్రగా కనిపించేదే బ్రహ్మ. నల్లగ్రుడ్డు చుట్టూ విష్ణువు. వర్ణాలన్నీ ఉమా నాధుడే ఎక్కడికో పోయి వెతకక్కర్లేదు. ఆకాశానికి వాయువు దానికి అగ్ని దానికి జలం. దానికి భూమి. దానికి కర్మేంద్రియాలు. ఆదిలో జలాలకు కర్మేంద్రియాలు.అగ్నికి జ్ఞానేంద్రియాలుఉద్భవించాయి అని అద్భుత వేదాన్తరహస్యం బట్టబయలు చేశారు చక్కని తేటతెలుగు మాటలలో.


ఓం.

వట్టిమాయ శతకము.

తర్వాత ఆడవారు మగవారు ఎలా మసలుకోవాలో చెప్పి చేయెత్తి దానం చేసినవారిదే బ్రతుకు సర్వం తానె అనే సమ బుద్ధి ఉన్నవాడిదే బ్రతుకు. కామాదులకు దూరంగా ఉన్నవాడిదే,సాదు సాంగత్యం ఉన్నవాడిదే. పాపాలు చేయనివాడిదే బ్రతుకులని బ్రతుకు సార్ధకత తెలియజేశారు. కనకం ఘనమైనది అనుకొంటే తప్పులో కాలేసినట్లే. కనపడిన రాయి దేవుడేకాదు.తర్వాత పిండం ఏర్పడటం వృద్ధి చెందటం వివరించారు. పుట్టటం ఏమిటి అనే మతి లేకుండా సంచరిస్తున్నారుజనం. భర్తయే దేవుడుఅనుకొంటే ఆనందం. ఆకాశ గంగను భూమికి దింపిన భగీరధుడు. పాకశత్రువు వచ్చి ప్రార్ధిస్తే ఆశ్వాన్నిచ్చిన దిలీపుడు. ఉదయాద్రి అస్తాద్రి ఒక్కగట్టున ఉంచిన మాంధాత. కొడుకు యవ్వనం తీసుకొన్న యయాతి. ఏకాదశి వ్రతాన్ని పాటించిన మహానుభావుడు అంబరీషుడు కలకాలం బ్రతికి ఉన్నారా ?బతుకు శాశ్వతం కాదు. బతుకు సార్ధకం చేసుకోవాలి. వాడి సూది మొనపై ఉంచటం అసాధ్యం. నాది నీది అనే విషయం కానే కాదు. చివర 101వ సీసంలో –"కోట్లు సంపాదించి కొంప పెద్దగ జేసి మరలబోయేదడి దొర మంగళంబు – మాటమాటకు నోకమాట ను గల్పించు మారాజ నీకిదే మంగళంబు –పెంటి. పోతువు గాక బెంటి పోతువునై మహిమ నేలేడిప్రభూ మంగళంబు –కోటలగోటల గోనంకి వెలసిన మాయయ్య నీ కిదే మంగళంబు –

మంచి సుఖ మిడు నీశ్వరా మంగళంబు –మదిని దయజూడు పరమేశ మంగళంబు –మరచిపోజాల నినున్ స్వామి మంగళంబు-బట్టబయలొక్క తప్ప వట్టి మాట "అని శతకం ముగించారు.

వట్టి మాటల శతకం కాదు ఇది చాలా విలువైన గట్టిమాటల పునాదిపై నిర్మించబడిన శతకం. వీనుల విందుగా. హృదయానికి పరమానందంగా బుద్ధికి జీవనంగా సాగిన శతకం. సార్ధక శతకం. మనమేమిటో మనకు ఎరుక కలిగించిన జ్ఞాన శతకం. కవి నారాయణ రెడ్డి గారికి శతాధిక అభినందన మందారాలు. "శత శతకంగా" దీన్ని పరిచయం చేయటం నా భాగ్యం.

## 101–రాఘవేశ్వర శతకం – శ్రీ సామవేదుల వేంకట శాస్త్రి

బాలకవి. తగరంపూడి వాసి సామవేదుల వేంకట శాస్త్రి రచించిన రాఘవేశ్వర శతకం ఖాసీం కోటకు చెందినఉభయభాషాప్రవీణ అష్టావధాని శ్రీ వడ్డాది సీతారామాంజనేయులు పరిశోధించగా. అనకాపల్లి బలరామ కృష్ణా ముద్రణాలయం లొ 1937లొ ముద్రితం వెల –రెండు అణాలు. అనకాపల్లి కి చెందిన సత్యావాణి సంపాదకులు శ్రీ గ్రంధి వెంకటరమణయ్య తొలిపలుకులు పలుకుతూ "ఉత్సాహం ఉన్నవిద్యార్ధి ఈ బాలకవి తెలుగుపై మక్కువతో రాసిన శతకం. శైలి సులభం. అర్ధం మాత్రం గాంభీర్యం "అని మెచ్చారు. ఇది ఉత్పల. చంకలాలతో కూర్చిన శతకం."రాఘవేశ్వరా "అనేది శతక మకుటం.

రాఘవేశ్వరశతకము.



సామవేదుల వేంకటశాస్త్రి.

మొదటి ఉత్పలమాలలో –"శ్రీ జనకాత్మజా హృదయ సింధు సుధాకర రామచంద్ర. ని-ర్వ్యాజ కృపా కటాక్ష పరిపాలిత సంశ్రితలోలక వి-భ్రాజిత రావణాద్యసుర వారవినాశక మౌనిమానసాం-భోజనివాస వాసవ విభిత్వ సముజ్జ్వల "రాఘవేశ్వరా "అని నమస్సులు పలికి. పూర్వం వాల్మీకి మహర్షి నీ దివ్యగాధ గానం చేశాడు. పోతరాజు మధుమదురంగా నీ లీలలు వర్ణించాడు. తురుష్కకవి కబీరు "వీడు నా వాడు "అని కీర్తించాడు. గోపయ్య కబీరు చే రామ మంత్రోపదేశం పొంది భక్తరామదాసయ్యాడు,హనుమాన్ నీనామ గానం చేసి పరవశం కలిగించాడు. తులసీదాసు పురాణంగా నిన్ను గురించి రాసి పునీతుడయ్యాడు . కాకరపర్తి వాసి వేదుల రామ శాస్త్రి భక్తితో రచనలు చేశాడు. వేద సంతలు వ్యాకరణ పాండిత్యం తర్కచర్చలతో ఫలితంలేదు నిన్నువర్ణించి నీ గురించి చదివి వినకపోతే.

శ్రీ రఘురామ అని చిత్తం లొ తలపోస్తే యముడు భయపడుతాడు. యోగి హృదయాలలో నిరంతర వాసం చేస్తావు. "నీనామము అన్ని వేళల అడ్డూ ఆపులేకుండా భక్తజనం పలుకుతూ ఆనందాన్ని పొందాలి. లోకంలో ధర్మ సంస్థాపనకోసం రాఘువుడ పై జన్మించావు. కౌసల్యకు వీరమాత అనే యశస్సుకల్పించావు.గాధి సుతుడు చేసే యజ్ఞాన్ని రాక్షస విఘ్నం లేకుండా కాపాడి ప్రియ శిష్యుడవై అన్ని శస్త్రాస్త్రాలు పొందిన భాగ్యశాలివి. "భీముని విల్లు త్రుంచి భూసుత మెడలో తాళిలికట్టావు. భరద్వాజ విందు పొంది శుభం చేకూర్చావు. జటాయువుకు మోక్షప్రాప్తి కల్గిచావు. "గబా గబచిన్ని రాఘువు లెకాయకి నన్ గనగా వచ్చు చుండి రంట"అంటూ పట్టపగ్గాలులేని పరమభక్తితో ముసలి శబరి "దబదబ తీపిపండ్లను ఏరి తెచ్చి సమర్పించి జన్మసార్ధకం చేసుకొన్నది.



శ్రీ రాఘవేశ్వర శతకము.

రామాయణ ఘట్టాలన్నీ సుందర కవితా బంధురంగా శతకం లొ పొందుపరచాడు మన బాలకవి అలనాటి లవకుశుల్లాగా. చివరలో తాను వేదులపార్వతీశం వెంకట రత్నంల పెద్ద కుమారుడనని. నీసేవ నిత్యం చేసే వెంకట శాస్త్రి ని అని ప్రవర చెప్పుకొన్నాడు "జయజయ జానకీ హృదయ సారస పూషణ సాధుపోషణా"అంటూ చంపకలో. చివరగా ఉత్పలమాలలో "మంగళమయ్య నీకు శుభ మంగళమయ్య మహీ తనూజకున్ "అని మంగళం పాడి సమాప్తి చేశారు.

## 102- బలరామ శతకం శ్రీ  సాతులూరి సుభద్రాచార్య


శ్రీ బలరామశతకము.

పూర్వకవి
సాతులూరి సుభద్రాచార్యవిరచితము.

ప్రకాశకులు,
సాతులూరి వేంకటనరసింహాచార్యులు,
ప్రధానోపాధ్యాయుడు,
బోర్డుప్రాథమిక పాఠశాల, తణుకు.

తణుకులో డి. వి. శ్యామలరావు గారి
శ్యామలా ఆర్ట్సు ప్రెస్సునందు
ముద్రింపబడియె
1931

రిజిష్టర్డు కాపీరైటు 0—2—0

పూర్వకవి శ్రీ  సాతులూరి సుభద్రాచార్య విరచిత బలరామ శతకంను తణుకు బోర్డు ప్రాధమిక పాఠశాల ప్రధానోపాధ్యాయుడు శ్రీ సాతులూరి వేంకట నరసింహ్ చార్యులుగారు తణుకులో డివి శ్యామలరావు గారి శ్యామలా ఆర్ట్ ప్రేస్ లో1931లో ముద్రించారు. వెల-రెండు అణాలు. విజ్ఞప్తిలో నరసింహ్ చార్యులు గారు- “ మా ప్రపితామహులు 1779లో జన్మించి పోలవరం జమీందార్ శ్రీ కొచ్చెర్లకోట జగన్నాధరావు గారి ఆస్థానం లో పండితులుగా ఉండి”రమణక్క పేట “అగ్రహారాన్ని గౌరవార్ధంగా పొందారు. వారు గారుడా శైలశతకం నృసిమ్హశతకం వైజంతీ స్తవం (సంస్కృతం ),ఎనుబది రెండు వార్తలుఅ నే పదహారు సీసపద్యాలు  రచించారు.ఈ సీసపద్యాలు నేను ముద్రించి ధన్యుడనయ్యాను. ఈ శతకాన్ని ముద్రించటానికి జమీందారుగారు, తణుకు తాలూకాబోర్డ్ ప్రెసిడెంట్ సారస్వతలోలురు శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజు చౌదరిగార్లు ఆర్ధిక సాయం  అందించారు. అని కృతజ్ఞతలు ప్రకటించారు. కపిల మల్లెశ్వరానికి చెందిన శ్రీ వ. రాధా మనోహర శర్మ –”కవిగారు భక్తిరస ప్రాధాన్యంగా శయ్యాచాతుర్యంగా నిందాగర్భిత స్తవంగా అసమాన సాహిత్యగారిమగా. పారవశ్యంగా రచించిన శతకం ఇది “అని గొప్పగా చెప్పారు. ఇది సీస పద్య శతకం –”రేవతీకామ బలరామ రిపు విరామ “శతకం మకుటం.

మొదటి సీసం –”శ్రీకోరుకొండ నృసింహు ల సేవించి-భద్రాద్రిరాముల బ్రస్తుతించి –శ్రీరంగనాయక శ్రీపాదములకు మొక్కి –కంచి వరద రాజ కద దలంచి –రామానుజాచార్య రమ్యాం ఘ్రులను బట్టి-భక్తి నడాధూరు వరదుగొలిచి- సకల భగవాంఘ్రిసలిలంబు జేకొని –శ్రీ రామపాదాబ్జ సేవ జేసి

గీ-వీర శృంగార రసదధునీ విషాద సీస –పద్య శతకంబు నీపాద పద్మ మందు –జేర్చి పూజింతునన్ను రక్షిమ్పుమయ్య –రేవతీ కామ బలరామ రిపు విరామ "అంటూ సకల విశ్వ క్షేత్ర దర్శనం చేయించారు. గౌతమ. కయ్యట జైమిని కపిల మహర్షులను స్మరించి. ప్రతివాది భీకర రాఘవ గురునికి మొక్కి. ఆ గురు దేవుని వలననే తర్కవేదాన్తాది సర్వశాస్త్ర నిష్ణాతుడనయ్యానని. గీర్వాణకవితా మనోహరత్వం అబ్బిన భారద్వాజ గోత్రీకుడను క్షేమ సుభద్రాచార్య నామ ధేయుడిని. ఉత్ప్రేక్షాది అలంకారాలతో సీస పద్యశతకం కూరుస్తున్నాను అన్నారు. కామిన్యలంక్రియా కాలసుందర. నిజముఖపద్మ దర్శనంగా ఉండే నీ మోము చూచినకొద్దీ మనోహరం. "మారు నల్లని గల్వకతారులంగా నొగలొ నీ కన్గవనొగసు చూసి గోపకాంతలు నిన్ను గూడాలని చేరారు.

స్వామి శరీరంలోని ప్రతి అంగాన్ని మహా కవిత్వ సౌందర్యంతో తనివి తీర వర్ణించి శతక ప్రబంధమా అని పించారు కవీశ్వరులు. ధగధగాద్ధగిత దేహ ఛాయ గంగాప్రవాహమే. తళతళలాడే తరుణ వలులు విలసత్తరంగాలి. ఘర్మబిందువులు ముత్యాల సొంపు. నాభి గంగాయమునా సంగమమే. రమణీయ పీతాంబరం తమ్ముడికిచ్చి నువ్వుమాత్రం నీలామ్బరాలు కట్టావు. రధాలు తమ్ముడికిచ్చి నువ్వు నాగలిపట్టావు. ఖడ్గం తమ్ముడికిచ్చి రోకలి చేతబట్టావు. గోపికా బృందాన్ని తమ్మయ్యకిచ్చి నువ్వు ఏకపత్నీ వ్రతం దాల్చావు. దొరతనం భోగభాగ్యాలు కన్నయ్యకిచ్చి నువ్వు దేశాటనంతో తృప్తి పొందావు.

శ్రీ బలరామ శతకము.

సీ. శ్రీకోరుకొండ నృ ♦ సింహుల సేవించి
భద్రాద్రి రాములఁ ♦ బ్రస్తుతించి
శ్రీరంగనాయక ♦ శ్రీపాదముల మ్రొక్కి
కంచి వరదరాజ ♦ కథ దలంచి
రామానుజాచార్య ♦ రమ్యాంఘ్రులనుబట్టి
భక్తి నడాధూరు ♦ వరదుఁ గొలిచి
సకలభాగవతాంఘ్రి ♦ సలిలంబుఁ జేకొని
శ్రీరమాపాదాబ్జ ♦ సేవఁ జేసి
గీ. వీరశృంగారరసధునీ ♦ విశద సీస
పద్యశతకంబు నీపాద ♦ పద్మమందు
జేర్చి పూజింతు నన్ను ర ♦ క్షింపుమయ్య
రేవతీకామ! బలరామ! ♦ రిపువిరామ!

౧

కుబ్జ తమ్ముడి ఆధరం కోరిందికాని బలభద్రుని జోలికిరాలేదు. రేవతి ఎన్ని నోములు నోచి తపస్సు చేసిందో నిన్నుపెళ్ళాడటానికి. తమ్ముడు మాయలోడు. నువ్వు ముక్కు సూటి మనిషి పొగడ్తల అగడ్తలో పడి పోతావు కొంప కొల్లేరు అవుతే తమ్ముడే వచ్చి కాపాడాలి. ముష్టి కాసుర సంహారం నీ వల్లనే జరిగింది . రోహిణికి పుట్టి జరాసంధుని మదం అణగించి. రణరంగ కౌశలంతో దిక్కులు జయించావు. చివరి పద్యంలో గజేంద్ర మోక్షం కథ వివరించి ముగించారు.

మనసుకు హృదయానికి బుద్ధికి విందు చేసే శతకరాజం ఇది. ఆచార్యుల వారి సర్వతోముఖ పాండిత్యానికి అశేష శాస్త్ర

పరిచయానికి నిలువెత్తు దర్పణం. వారి కవితా మహత్తు తెలియజేయాలంటే ప్రతి పద్యమూ ఉదాహరించాల్సిందే. అద్భుతమైన ప్రబంధ సమానమైన పద్య శతకం. కవి శ్రీ సుభద్రా చార్యుల గారికి మనస్ఫూర్తిగా వందన శతం అందజేస్తున్నాను. ఈ శతక పరిచయం నా అదృష్టం.

## 103 రాజయోగి శతకం -- శ్రీ కంతేటి వీరయ్య కవి

కృష్ణా జిల్లా నూజివీడుకు చెందినశ్రీ కంతేటి వీరయ్యకవి ఈ రాజ యోగ శతకం రాశారు. రాజయోగులనుస్మరిస్తూ ఆట వెలదులలో రాసిన శతకం. దీనికి ముందు ఈ కవి ఆంజనేయ తారావళి. హరినామ సుధాలహరి. శ్రీమద్వయదోశషరహిత కన్దార్ధములు అనే నిజగురు పూజావిధానం. మహాలక్ష్మమ్మ దండకం. గజేంద్ర మోక్షరగడ రాసినట్లు. ముద్రణలో నలోపాఖ్యాన రగడ. మహాద్వైత భ్రమ నిరసనం ఉన్నట్లు చెప్పుకొన్నారు. "రమ్యముగ దెల్పెదను విను రాజయోగి "అనేది మకుటం.



ప్రకటన.

మొదటి పద్యం –"శ్రీకరంబగు విజ్ఞాన సిద్ధికొరకు – సద్గురుస్వామి చరణాంబుజముల దలచి –హరిహర హిరణ్యగర్భుల కాత్మ మ్రొక్కి –రమ్యముగ జెప్పెదను విను రాజయోగి ".తర్వాత గురువే హరి బ్రహ్మ రుద్రుడు పరమాత్మ అని. పరము పొందాలంటే గురు చరణాలు శరణ్యా లు అని చెప్పారు తర్వాత అంతా నీతులే బోధించారు. పిండమెరిగిన యోగి సద్విమలయోగి అండమెరిగిన యోగి శివుడే అన్నారు. పవనాన్ని అభ్యాసం చేస్తే మనసు నిర్మలమౌతుంది. జీవ శివులను కూరిస్తే ముక్తి. అస్టమదాలు భ్రష్టుల్ని చేస్తాయి. సాధన లేకపోతే

తత్వార్ధ చింతన సాగదుడ. ఎరుకతో లోకాలన్నీ దర్శించవచ్చు. తత్వమసి మొదలైన మహా వాక్యాలు తరచి ప్రజ్ఞతో పరమపదం తెలుసుకోవాలి. పాలలో నీరుపోస్తే పాలు అవుతాయికాని పాలు మాత్రం నీరుకానేకాదు .



శ్రీరస్తు.

శ్రీ రాజయోగి శతకము.

పరం అందుకోవటానికి రాజయోగం రాజమార్గం. దైవభావనకు హీనజన్మకు కర్మ కారణం. మాయతెలిస్తే అదే మాయమైపోతుంది. 108 వా పద్యంలో "మేటి తిరుమణి శెట్టి శ్రీ కోటయార్యు –కరుణ కంతేటి వీరయాఖ్య కవి సూరి –జనులకానంద సుధలొల్కగను రచించె – రమ్యముగ దెల్పెదను విను రాజయోగి "అని ముగించారు. గద్యంలో –ఇదిశ్రీసీతారామ చంద్ర ప్రసాద లబ్ధ కవితా ధురీణ బాలకాన్వాయ సంజాత కంటేత్యుపనాయక లక్ష్మణాఖ్య పౌత్ర లక్ష్మీదేవి రామయాభిదాన గర్భ పయః పారావార రాకాసుధాకర సకల సుకవి సాధు జన విధేయ వీరయాభి ధేయ ప్రణీతంబైన శ్రీ రాజయోగి శతకం సర్వముసంపూర్ణము. శ్రీ కోటేశ్వరార్పణ మస్తు అని పూర్తి చేశారు. తతేలికపదాలతో గర్భితమైన రాజయోగాన్ని అందంగా ఆటవెలదులతో ఆడుకొంటూ కూర్చిన శతకం.

## 104 శ్రీ రామచంద్రప్రభు శతకం-- శ్రీ కోన రాఘవయ్యకవి

శ్రీ రామచంద్రప్రభు శతకం ను పెంటపాడు కు చెందిన శ్రీ కోన రాఘవయ్యకవి గారు రచించగా,పాలకొల్లు కు చెందిన శ్రీ కోన వనమహారాజు. అక్కడి రాజరత్న ముద్రాక్షర శాలలో 1935 లొ ముద్రించారు. వెల తెలుపలేదు. ఇది శార్దూల మత్తేభ శతకం. "శ్రీమద్ రామచంద్ర ప్రభూ "అనేది మకుటం.



మొదటి శార్దూలం –"శ్రీ రామాయ నమో రఘూద్వహా విభో సీతామనో వల్లభ – స్స్మరామేయ వికాస వక్త్ర జలజ శ్రీ భక్త చింతా మణే-శౌరే త్వాం ప్రణతోస్మి నిత్య మనుచున్ సద్భక్తి సేవించు సం –సారాత్ముల్ సఫలీ కృతార్ధులిల" శ్రీమద్రామ చంద్ర ప్రభూ " అనిరెండవ పద్యం లొ "మాయామానుషరూపా "అంటూ. నీపాదద్వయాలే మోక్షద్వారాలని చెప్పి. రసనాగ్రం పై నీనామం నిరంతరం నర్తించే వారికి ముక్తినిస్తావు అని. సలక్ష్మణ సీత దేవి సమేత రామ భద్ర స్మరణ చేసి. హనుమతో సోదరులతో జానకితో కూడిన స్వామినీ నుతించి. సంసార జలధిలో మునిగి కొట్టు మిట్టాడే నన్ను కాపాడు అన్నారుకవి. తనలో ఉన్న ప్రాణమే ఇతర భూత రాశిలలో ఉన్నట్లు చూసే వారికి భేదాలు. హింస అహంకారం ఉండవు. ఆశాపాశాలను వదిలి నీ చేయి పట్టుకొంటే నిశ్చింత. సకలాధారు. లోక రక్షకు మోక్షశ్రీనివాసు డవు. ఎన్నో యోనుల్లో పుట్టి ఇప్పుడు ఈనరజన్మలో ఉన్న నాకు "నీ సాక్షాత్కార సన్మానము "అనుగ్రహించు 'అని వేడారు

తర్వాత సాకేత సార్వభౌముని నిజదర్శనం కన్నులారా వర్ణించారు. పులిగోళ్ళు నుదుట తిలకం మౌళిలో పుష్పం. దిసమొల లేనవ్వు వాల్చూపుల బల రామ దర్శనం చేయించారు. బహుశా ఇలా ఎవరూ రాసినట్లు లేదు.కాళ్ళకు గజ్జలు. కరపల్లవాలలో గజ్జంబులు మ్రోల వజ్జ తో ముద్దుగులుకు నీ మూర్తి మజ్జారే "అన్నారు. శ్రీరామా రామా అనే రామ చిలుకకు తత్వ బోధ చేశావు. ఎంగిలిపళ్ళు తినిపించిన శబరికి మోక్షమిచ్చావు. కుదురులేని మర్కట సేనతో వారధి కట్టించి లంకప్రవేశించి రావణాది రాక్షససంహారం చేశావ్. "బాబూ ! ఏలినవారి కాళి దుమ్ము పై బడ్డ రాయిపూబోడి అయింది "కనుక నీ కాళ్ళు కడగకుండా నాపడవలో కూర్చోనివ్వను అన్న బోయ గుహుని ఆత్మీయుడ్ని చేశావు. భార్గవరామ గర్వం అణచి. కాక దైత్యుని కృపతో మన్నించి. మహర్షి అగస్త్యుని దర్శించి. కామ శూర్పణఖ ను వధించి "ఆగామి కర్మాఖ్యులైన ఖరాదులను సంహరించి. దుర్మతి ప్రదర్శించిన మారీచుని త్రున్చావు. లంకకు విభీషణుడిని రాజు చేశావ్.


శ్రీమద్రామచంద్ర ప్రభు శతకము.

భద్రుని మూర్ధం పై కొలువై ఉన్న భద్రాద్రి రామ ప్రభూ. దనుజ ధ్వాంత దివాకరా శుభకరా అని పరవశించి గానం చేశారు. చివరి 167వ చివరి మత్తేభం లొ "ధర శాకాబ్దముల ద్రివేద గజ చంద్ర వ్రాతమౌ సంఖ్యలన్-వరలన్ గ్రోధన చైత్ర శుద్ధనవమిన్ బాటిల్లు పర్వంబునన్-గురు వారంబున దాటు శాస్త్ర హరిణాంకుల్ బొల్చు పద్యావలిన్ –స్మరణం జేసి వచించి నీ కృతిని శ్రీరామ చంద్ర ప్రభూ "అని ముగించారు. చివర ఓం తత్సత్ సీతారామ చంద్ర పరబ్రహ్మార్పణ మస్తు "అని అంకితం చేశారు.

శ్లోకం –"దోషోపి గుణతాం యాతి –పండితానామ నుగ్రహాత్ –ఆయుస్సువర్ణతా మేతి సంస్పర్శాత్ స్పర్శ వేదినః " అని ఫలశ్రుతి చెప్పారు.

కోనకవి శ్రీ రఘురామయ్య రామాయణ సారాన్ని ఈ శతకం లొ నింపి ఇంపుగా మధురంగా రామనామ తారకంగా గానం చేసి తరించారు.

## 105 భక్త సంరక్షక శతకం-- శ్రీ గోపాలుని హనుమంతరాయ శాస్త్రి

ముప్పాళ్ళ పురవాసి శ్రీగోపాలునిహనుమంతరాయ శాస్త్రి గారు రచించిన భక్త సంరక్షక శతకం గుంటూరు కన్యకాముద్రాక్షార శాలలో శ్రీ పెండేల చక్రపాణి సోదరుల చే 1924 లొ ముద్రితం. వెల –నాలుగు అణాలు అంటే పావలా. ఉపోద్ఘాతం లొ కవి గారు –"ఈ శతకాన్ని శ్రీమాన్ దూపాటి తిరుమల వేంకట రమణా చార్యుల వారిచే సవరింప జేసుకోన్నాను. "అన్నారు. శతావధానులు శ్రీ శేషాద్రి రమణ కవులు కంద పద్యం లొ-"అలరారు తేసే మాటలలొ పులకండపు మూటలోఅమోఘు పదంబున్ –దిలకిమ్పజేయు బాటలో తెలియవు హనుమంతరాయ తీయని మాటల ల్"అని ఆశీరభినందనలు అందించారు. ఇది శార్దూల.మత్తేభ శతకం. "భక్త సంరక్షకా "అనేది శతక మకుటం.




మొదటిపద్యం –"శ్రీమద్వాస శుకాదిమౌని జన హృత్సీమాంతరాళోల్లస-ద్ధామానిస్తుల నిర్వికార పరమాత్మా సచ్చిదానంద రూ-పా మార్తాండ సహస్ర భాస. తిజగద్వంద్యా పరాధీన ఈ-శామాయావ్యతిరేక భావ యుత దీక్షా "భక్త సంరక్షకా "అంటూ భక్తీ తత్పర ప్రవాహం తో మొదలుపెట్టి. రెండవ పద్యంలో తన తండ్రి గురువు శ్రీ గోపాలుని శ్రీ రామాచార్యులను తలచి. తనలో కవితాభిజ్ఞత కలిగించిన మహాకవులకు మోకరిల్లి శతకం రాస్తున్నాను అన్నారు. నేనే బ్రహ్మం అని తెలుసుకొంటే చాలు మోక్షమే. రామ కృష్ణ సూర్య చంద్ర పేరులన్నీ పరంధాముడపైన నీవే. మత్తేభంలో –"ధరణీ వ్యోమ తలాంతర ప్రకట నిత్య స్తుత్య తేజస్వి. సుం-దర మాయా


ఓం.

భక్తసంరక్షకశతకము.

1924

వరణా ను భాసి విపులా నందో బ్రహ్మ యన్ –స్థిర వాక్యాలకు “ఆటపట్టు నీవే. సత్పద మహాద్వైతం సత్యం. శూన్యాభాసిపైనా అవతారాలు పెక్కు దాల్చావు. ఎవరు ఎక్కడ ఎప్పుడు ఏపని చేసినా చూసి దానికి తగిన ఫలితమిస్తావు. సత్కులం లోపుట్టిన రాజైనా విప్రుడైనా గుణ స్తోముడుకాకపోతే “గుణ పంచముడు “అనాలి. శరీరాలు శూన్యాలు అని చెప్పే గురుని వెతుక్కోవాలి

అణువులోనూ. బ్రహ్మాండంలోనూ నిత్య సత్య నితాంత ఆశ్రయుడవు. ద్వంద్వాలకు అతీతుడైన వాడే తండ్రి తల్లి గురువు దైవం. గురు వాక్యం అనే నావ ఎక్కి అహమనే అగడ్త దాటి. సోహం అనే సుధ గ్రోలి. సంతోష. ప్రమత్తతేజంతో శాంతి అనే శస్త్రాస్త్రాలతో జయించి మోక్షరమను పెండ్లాడాలి. ఆధారాలకు ఆధారం “సదధ్యారో పవాదాస్పద ప్రాధాన్యం. విరాట్స్వారాట్పర సుసంబంధంబు. యోగాది విద్యా ధౌరేయం సర్వ దేవ నిచయ వ్యామోహ సర్వేశ్వరా. నీతులు చెప్పటం కాదు ఆచరించాలి. అహింస కంటే ధర్మం లేదు.అన్యాయంగా హింస ఎవరికీ చేయరాదు. చివరలో ఫలస్తుతి చెప్పి తన గురించి గోపాలుని రామశాస్త్రి కుమారుడిని “రసా దేవ కులుండ బండిత జనానందాన సంధాను. తత్పరతా సక్తుడను మోక్షసాధన వచో ధన్యుడను హనుమంతరావు అనే భక్తుడను అని చెప్పుకొన్నారు.


ఓం శ్రీరామ.

శ్రీ

భక్తసంరక్షకశతకము.

గద్యంలో –వినుకొండ తాలూకా ముప్పాళ్ళ గ్రామ వాసి. ఆరువేల నియోగి సంస్కృత ఆంధ్ర పండితుడు మౌద్గల్య గోత్ర సంభవుడు గోపాలుని శ్రీరామమూర్తి తనూజుడు హనుమంత రాయ శాస్త్రి రాసిన భక్త రక్షక శతకం అనే పేరున్న “సుమనోల్లాసం “సర్వం సంపూర్ణం అన్నారు.

కవిగారు మహా పండితులు బహు శాస్త్రవేది. అల్మకార శాస్త్రం లోతు తరచినవారు. తత్వశాస్త్రం పుక్కిలించి. వ్యాకరణం మధించి ”అహం బ్రహ్మాస్మి “ అర్ధం చేసుకొని రాసి తాను తరించి మనల్నీ తరింప జేశారు. ప్రతి పద్యం రస బందురమే. శైలి గంగా ప్రవాహమే. భావాలు అమృతోపమానమే. మంచి కవిని గొప్ప శతకాన్ని పరిచయం చేసి ధన్యత చెందాను.

మనవి –శతాధిక శతకాలను పరిచయం చేసే అదృష్టం నాకు కలిగింది. ఈ 105 వ శతకం తో ప్రస్తుతానికి” కామా “మాత్రమె పెడుతున్నాను. మళ్లీ మంచి శతకాలు లభ్యం అయితే పరిచయం చేసే ప్రయత్నం చేస్తాను. అంతవరకూ స్వల్ప విరామం.

ఈ శతక పరిచయాన్ని 18.98.2023 వినాయక చవితి సందర్భంగా ఆన్ లైన్లో ఆది దేవుడు శ్రీ విఘ్నేశ్వర స్వామికి అంకిత మిస్తోంది సరస భారతి.

## ఇంకొన్ని..

### 01, "మధ్యాక్కరలు ' --' డా. వెంకటేశ్వర

చెన్నైలో ఉంటూ ఆ నగర జీవితాన్ని ఆహ్లాదంగా ఆస్వాదిస్తూ ఏది రాసినా దానిపై ఉన్న మక్కువను తెలియ జేసుకొంటూ తెలుగును జీవింపజేస్తూ వృత్తి వేరే అయినా ప్రవృత్తిగా సాహిత్యాన్ని ఎంచుకొని అరుదైన రచనలు తెలుగులో చేస్తున్న డా ఉప్పలధడియం వెంకటేశ్వర్లు సరసభారతికి ఆత్మీయులే. వారు ఇటీవలే అరుదైన తెలుగు దేశీ ఛందస్సు "మధ్యాక్కరలు "లో శతకం రాసి 2015లో వెలువ రించారు. అందులోని నాకు తెలిసిన సొబగులను మీకు అందజేస్తున్నాను.

సాధారణం గా కవికి అక్కర వస్తేనే మధ్యాక్కరలు జోలికి పోతాడు. లేక పొతేపోరు. చాలామంది తెలుగు కవులు దాని జోలికి పోలేదు. ఒక వేళ రాసినా కొద్దిమంది మాత్రమె రాశారు. విశ్వనాధ సత్యనారాయణ గారు మాత్రం మధ్యాక్కర శతకాలు పది రాశారు అంటే 1,010.మధ్యాక్కరలు రాశారు. కల్పవృక్షం లో దాదాపు ౩౦౦మధ్యాక్కరాలతో సన్నివేశ అక్కర తీర్చారు. ఆదికవి నన్నయ గారు 39 రాస్తే ఎర్రాప్రగడ ఒకదానికే పరిమితమైతే తిక్కన గారు ఆ చాయలకే పోలేదు. తర్వాత తుమ్మల. నాయని ఆరుద్ర. సుప్రసన్న. మొదలైన వారు తలో శతకం కాని కొన్నిపద్యాలు కాని సంతరించారు. అలాంటి "నన్ను ముట్టుకోకు "అన్న మధ్యాక్కరలపై వెంకటేశ్వర కు మోజు కలిగి శ్రీమతి ప్రోత్సాహం తో తన అనుభవాలను ఈ దేశీ ఛందస్సులో చెప్పాలని తపించి ఆ తపనకు అక్షర రూపం కల్పించి సరస్వతీ కంఠా భరణం చేశారు. .

ఈ దేశీ ఛందస్సులో ఆధ్యాత్మికమే కాక ఇతర భావాలనూ చెప్పటానికి అణుమాత్రం సందేహం లేదన్నారు మొదటి పద్యం లో. తాను పాటించిన నియమాలను వివరించారు. తెలుగు ఛందస్సులోని సొగసును దర్శింప జేయటమే తన ఆదర్శం అన్నారు. "దేహంబు ఉండు నందాక దాహంబు తీరదట".సామాన్య మానవ జీవిత విశేషాలనుఈ అసామాన్య ఛందస్సులో అతి సునాయాసంగా చెప్పటం ఉప్పలధడియం వారి గొప్పతనం. ఒకరకం గా పప్పు దప్పళం.

"భారత రామాయణాది ప్రాచీన వాఙ్మయ మందు –నేరము లేన్నుత కంటే తిరముగా నిజ విద్య మెరయ – చారు కృతుల్ వెలయించు టేంతేని సత్కార్య మగును –పేరిమి కల్గునే ప్రుద్వని పెదవి విరుపుల చేత "అని చక్కని జాతీయం తో చీకటిని తిట్టు కుంటూ కూచోకుండా చిరు దీపం వెలిగించాలని చెప్పారు. సిద్ధాంతాలు వల్లిన్చేవాడి చేత హులక్కి. రాద్ధాంతాలు చేసేవాడి రాణ కూడా అంతే. పద్ధతి లేని మనుషులలో ఔచిత్యం

ఉండదు అంటారు. కూరలు కొందామని వెడితే కొబ్బరి కూడా కాటా లో పెట్టి తూచటం చూసి ఔరా అనుకొన్నారు. మరో అందమైన మధ్యాక్కర ముక్కెర –

"గగన మండలమెల్ల క్రమ్ముకొన్నవి కారు చీకటులు –అగణిత సంఖ్యలో తారలగుపించే. నన్నింటి నడుమ –నిగనిగ మని కళ లొలుకుచుండెను నిండు జాబిల్లి –తెగిన పూసల దండ వోలె. నందలి దివ్యమణి వలె".

"పెట్రోలు ఖర్చులు తగ్గు ననెడి అభిప్రాయ మెసగ –మెట్రో కు స్వాగతం "పలికాడు కవి. కాని నగా నట్రా అమ్మితే కాని అణువు మాత్రం స్థలం కూడా రావటం లేదు. ఇదీ "మెట్రోలియం "గాధ. మద్రాస్ మహానగరం లో మానవాక్రుతులు కవికి "సింహ శరభోర గేంద్ర శార్దూల –మద గజా కీర్ణంబు"గా ఉన్దికనుక సామాన్య జనం జాగ్రత్తగా మసలాలి అని హెచ్చరించారు నన్నయ్యగారి భాషలో. "రాయల వారు "అనే మాట కర్ణాలకు తాకితే కవి కి శరీరం పులకించి. పోతుందట. హృదయం రసజ్ఞత పొందుతుందట. రణ గోణ ధ్వనులతో కంపించిపోయే మద్రాస్ మహానగరం లో టి నగర్. మైలాపూర్ లు శ్రావ్య సంగీతం వినిపిస్తూ ఘనమైన సంప్రదాయాన్ని పాదు కోనేట్లు చేస్తున్నాయి. స్వర గంగలో మునకలు వేయిస్తున్నాయని మెచ్చుకొన్నారు. దక్షిణాది తెలుగును ఈసడించేవారికి చెంప దెబ్బలాగా గా

"దక్షిణాది తెలుగు వారి మాటల తరహాయే వేరు –లక్షణో పేతమ్ము కాదనుచు బుదులా పలుకులకు –ఆక్షేపణల్ తెలప వచ్చుగాని శతాబ్దాలుగా పరి –రక్షించు కొనినారు భాష ననుచు వారల మెచ్చవలదే ? ఇది అక్షర సత్యం స్వాభిమానం తో తెలుగును ఇంట్లో మాట్లాడుకొంటూ. తమిళం పెత్తనాన్ని సహిస్తూ తెలుగు భాషను ప్రాణ ప్రదంగా కాపాడు కొంటున్న దక్షినాది తెలుగు వారికి జేజేలు. వారి సంకల్ప దీక్షకు అభినందనలు.

"రేవు "అనే మాట మరుగై పోయి ;;పోర్ట్ "అనే ఆంగ్ల పదమే విరివిగా వాడుకలో ఉండటం ఆంగ్లాను రక్తిఏ కాని భాషాభిమానం కాదని బాధ పడ్డారు.

"మౌలికమైన భావనల వ్రాసితి మధ్యాక్కరలను –శ్రీలు పొంగెడు తెల్గు సొష్ట వమ్మున చెలగు కృతి యని –మేలిమి బుధులు. భాషాభిమానులు మెచ్చిన నదియె –చాలును. పది వేలటంచు నే నాత్మ సంతృప్తి గొనుదు" అని ఏంతో వినయంగా చెప్పారు మధ్యాక్కరకవి వెంకటేశ్వర. దాక్షిణాత్యకవుల కృతులను వారిని కీర్తిస్తూ కవి

"లాక్షణికుల మెచ్చు వెంకట సుకవి. లాఘవ మొప్ప-అక్షయంబగు దివ్య కృతులు పలికిన అల త్యాగ రాజు –దక్షిణ ప్రాంతపు కవుల వార సత్వము నిల్పు కొరకు –అక్షరార్చన సేతు నష్ట దిక్పరి వ్యాప్తాంధ్రి కేను "అని హృదయ పూర్వక అంజలి ఘటించారు. చెన్నైలో ప్రముఖ తెలుగు సంస్థలు "వేద విజ్ఞాన వేదిక. ఆంధ్రా సోషల్

అండ్ కల్చరల్ అసోసియేషన్ సంయుక్తంగా నిర్వహించే "తర తరాల తెలుగు కవిత "ప్రసంగాలకు గొప్పగా స్పందించారు. పూర్వం రోజుల్లోనే కాదు "నేటికిని చెన్న పట్టణమందు –కైతలు నవలలు. కధలు వ్రాయు దిగ్దంతులు గలరు "అని చాటి చెప్పారు.

"జీవన సన్న వేశములు కొన్నింటి చిత్రించినాను –భావము. భాష ఇత్యాదిగా దీని పరికించి బుధులు –చేవగల క్రుతియో కాదో నిర్ణ యించెదరు. తెలుగునకు –నా వంతుగా నొక కొన్ని పద్యాల నర్పించు చుంటి "అని శతకాన్ని ముగించారు. దీన్ని చదివి బేరీజు వేసి నిగ్గు తేల్చమని కవి గారి కోరిక. పండితులు ఆపనికి పూనుకోవాలని నా విజ్ఞప్తి.

సాహసంగా మధ్యాక్కరలను మాధ్యమం గా గ్రహించి చక్కని తేట తెలుగు పదాలతో ఈ శతకం కూర్చిన శ్రీ వెంకటేశ్వరకు హార్దిక అభినందనలు. ప్రోత్సహించిన వారి అర్ధాంగి శ్రీ మతి ఉష గారికి శుభాశీస్సులు. అంకితం పొందిన శ్రీ విద్వాన్ ఎస్ దశరధ రామ రెడ్డి గారు ధన్యులు.

ముచ్చ్చటైన తెలుగు తల్లి వర్ణ ముఖ చిత్రం తో అచ్చు తప్పులు లేని అక్కరాల మధ్యాక్కరలు చూపులకే కాదు మనసుకూ ఆహ్లాదం కలిగిస్తాయి. ఆస్వాదించి కవిని అభినందించండి. స్కాన్ చేసిన పుస్తకం కవర్ పేజీలు జత చేశాను చూడండి.

"అమూల్యం "అయిన ఈ పుస్తక ప్రాప్తి స్థానం

General secretary

Janani (social and cultural Academy )

13/53 second street. Vasuki nagar

Kodungaiyur. Chennai -600,1118

Phone -044-25541 572

## 02 పరశురామ పంతుల లింగమూర్తి గారి రెండు శతకాలు

రెండు అముద్రిత శతకాలు రాసిన పరశురామపంతుల లింగమూర్తి "శ్రీ సీతారామాంజ నేయం "అనే అద్భుత ఆధ్యాత్మిక గ్రంధం రాసిన తెలంగాణా కవి. శేషాద్రి రమణకవులు కూడా పై రెండు శతకాలను ప్రస్తావించలేదు. వంగూరి సుబ్బారాగారు "మనశ్శతకం "గురించి చెప్పారు. బిరుదురాజు రామరాజుగారు మాత్రం అముద్రితాలైన లింగమూర్తి గారి "ఆత్మారామ శతకం ",,గోవింద శతకం" గురించి త్రవ్వితీసి లోకానికి చాటారు. నియోగి

బ్రాహ్మణుడైనఈ కవి వంశంవారు మహారాష్ట్ర నుండి వలసవచ్చారు. ఈ ఇంటిపేరు వాళ్ళు అంబాల. ఈదులవాయ మట్టేవాడలలో ఉన్నారట. కవికాలం 18శతాబ్ది. సీతారామాన్జనేయం 1760లో రచింపబడి ఉంటుందిఅని శేషాద్రి రమణ కవులూహించారు. రతి మన్మధ విలాసం. జీవన్ముక్తిప్రకరణం. బ్రహ్మానారద సంవాదం, తారకయోగం, మానస శతకం. సీతారామాంజనేయం లింగమూర్తిగారి కృతులని వారు చెప్పారు. తర్వాత "సీతపాట "అనే అద్భుత గేయకావ్యం వచ్చిందని రాజుగారన్నారు. కవి పోతన్న, రామదాసు వంటి భక్తకవి వేదాంత వేత్తకూడా. భక్తీ వైరాగ్యాల కూడలి లింగామూర్తికవి అన్నారు బిరుదు రాజువారు. ఓరుగల్లులో మట్టేవాడ ఒకభాగం అక్కడ కవి గారి గృహం ఇప్పటికీ దర్శనీయమే. దీన్ని ప్రభుత్వం భద్రపరచాలని కోరారు. ఈ రెండు శతకాలు మరికొన్ని పంచరత్నాలు రెండు" బెత్తెలవొడవున్న" 34తాటాకులపై వ్రాయబడ్డాయి.

ఇందులో ఆత్మారామ శతకం లో 108కందపద్యాలున్నాయి. 100పద్యాల తర్వాత" శ్రీ రామార్పణమస్తు" అని ముగించి. తర్వాత ఆరు పద్యాలలో గురు స్తుతి. కృతి ప్రశంస. ఫలశ్రుతి చెప్పాడు. రుచికి కొన్ని కందాలు –

"నరనారాయణము మన –మిరువురము నవిద్యవలన నేకాత్ముల.

మక్షర పురుష. పరమపురుషుల –మరయంగా విద్యవలన నాత్మారామా ".

"నిమ్నోన్నతములుగాని సు-షుమ్నామార్గమున నిన్ను జూచి జిత ప్ర

ద్యుమ్నులగు యోగిపుంగవు –లామ్నాయ విధిం భజింతు రాత్మారామా "

"గురుడనగా నీశ్వరుడగు –స్థిరమతి శిష్యుండంన జీవాత్ముండ

య్యిరువుర కైక్యస్థానం –బరయంగా పరమపదము నాత్మారామా "

"ఇల పరశురామ పంతుల –కులజ శ్రీ లింగమూర్తి గురుడవు నీపై

పలికితివి గాక నితరుల –కలవడునే యిట్లుబలుక నాత్మారామా "

ఈ శతకాన్ని నక్కా నరసంభట్లు అనే వ్రాయసగాడు 27-4-1798 న రాసినట్లు రాజుగారు ధృవీకరించారు.

15వ కమ్మ రెండవ వైపు "గోవింద శతకం "ప్రారంభమైంది. 111 కంద పద్యాలు. ఇందులోకూడా వందవ పద్యం తర్వాత "శ్రీరామా "అని ముగించి మిగిలిన 11 పద్యాలలో మిగిలిన విషయాలు రాశాడు. ఈ శతకం లో భక్తీ, వేదాంతం రెండూ ఉన్నాయి-

"శ్రీ లక్ష్మీ నారాయణ –నీలాంబుద నిభ శరీర. నిగామాధారా

లీలావిహార. నిర్మల –శీల, చిదానందకంద శ్రీ గోవిందా “

“యోగకర. యోగవిద్వర – యోగాభ్యాస ప్రవీణ,యోగాధారా

యోగైశ్వర్య పరాయణ –యోగానందానుభూతి యుత గోవిందా “

“క్షరతత్వము నంటక న –క్షర పురుషుని మించి సర్వ సాక్షి యనంగా

పురుషోత్తముడని వెలసిన –పరాత్ముని నిను భజింతు వర గోవిందా “

83వ పద్యం నుంచి వివిధ అవతార స్తోత్రాలురాశాడు –

“ధరణీ సురవరద మహా –పరశు ధర. నృపాల జలధి బడబానల. భా

సుర సు తపోధనఘున సుం –దర.భార్గవ రామ రూపధర గోవిందా “

“ఈ స్తోత్ర రత్నరాజము –కౌస్తుభ మణి తుల్యముగను,గని. కానుకగా

హస్తాబ్జంబుల గైకొని –విస్తరముగ మై ధరింపవే గోవిందా “

తర్వాత ఒకపద్యంలో తనను గురించి చెప్పాడు.

వ్రాయసకాడు నక్కా నరసంభట్లు ”శ్రీసీతారామ పరబ్రహ్మణేనమః. శ్రీ లింగమూర్తి పరబ్రహ్మణే నమః “అని రాసి తానొక పద్యం రాశాడు. వ్రాతకాలం 28-4-1798అన్నారు రాజుగారు

“దయ నాదరింపు భక్త హృ –దయ,నా ఫణిశయన వికసితాంబుజ నయనా

నయనామయ నామయ నా-భయ నాశము చేసి మమ్ముపాలింపు హరీ “

ఈ రెండు శతకాల తర్వాత పంచరత్నాలున్నాయి –ఒకపద్యం –

సీ-”మొదలు ప్రాణాపానములను,తద్రేచక పూరక కుంభకంబులను నవి మెలంగు,నిడా. పింగళా సుషుమ్నల హంసత్వమునే సాక్షి తానె తెలియు

వికచహృత్కమల కర్ణిక యందు ఘోషించు ప్రణవనాదంబు నే ప్రభు డెరుగు -భ్రూ మ, ధ్యమమును చూపులను. నానావిధ కళలను మనము నే ఘనుడు గాంచు

నతడె ప్రత్యగాత్ము డతడెవో పరమాత్ము –డతడె వాసుదేవు డతడె శివుడు

అతడెస్వప్రకాశకుడైన శ్రీమన్మహా –దేవ లింగమూర్తి దివ్యకీర్తి "

ఇలా నాలుగుపద్యాలురాసి తర్వాత అయిదవ సీసపద్యానికి "సాంఖ్యం" అని. ఆరవదానికి "అమనస్కం" అని శీర్షికలుపెట్టాడు. వీటి తరవాత "శ్రీరామరామేతి రమే రామే మనోరమే "మొదలైన పంచరత్న శ్లోకాలున్నాయి. వీటి తర్వాత వీటి తెలుగుఅనువాద గీతపద్యాలున్నాయి –

"శ్రీమనోరమ శ్రీరామ రామరామ –యనుచు రమియించు రాముని యందు రామ

నామము వరానన సహస్రనామ తుల్య –మట్లు గావున దీని నీ వవధరింపు "

మందారమకరంద తుందితాలైన వేదాంత పద్యాలు రాయటం పరశురామపంతుల లింగమూర్తిగారికి ఎన్నతో పుట్టిన విద్య అనిపిస్తుంది వారి "శ్రీ సీతారామాంజేయం "చదివి పులకించని తెలుగువాడు లేడు అని నా అభిప్రాయం. ఈ శతకాలు అలాంటివే.

వీటిని కూడా వ్రాయసకాడు నక్కా నరసంభోట్లు 29-4-1798న రాసినట్లున్నది. యితడు లింగమూర్తికవిని దర్శించి తరించినట్లు చెప్పుకొన్నాడు

ఆధారం -.–ఆచార్య బిరుదరాజు రామరాజుగారి "చరిత్ర కెక్కని చరితార్ధులు "-(విస్మృత కవులు –కృతులు )

# రచనలు

## ముద్రిత రచనలు

శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ రాసిన,సరసభారతి ప్రాచురించిన పుస్తకాలు డిజిటల్ రూపం లో. క్లిక్ చేస్తే చాలు పుస్తకం ప్రత్యక్షం

| | పుస్తకం పేరు | వివరాలు | ప్రచురణ | అంకితం | పేజీలు |
|---|---|---|---|---|---|
| 1 | ఆంధ్ర వేద శాస్త్ర విద్యాలంకారులు | 27 తెలుగు వేదశాస్త్ర ప్రవీణులు రచనలు | సెప్టెంబర్ 2010 | స్వర్గీయ శ్రీ కోమలి సూర్యనారాయణ శాస్త్రి | 55 |
| 2 | జనవేమన | వేమన యోగి గా మారిన విధం | ఏప్రిల్ 2012 | చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ | 116 |
| 3 | దర్శనీయ దైవ క్షేత్రాలు | 100 ప్రసిద్ధ దేవాలయాల చరిత్ర, దివ్యధామ దర్శనం | జనవరి 2015 | శ్రీ కోగంటి సుబ్బారావు శ్రీమతి సావిత్రి | 164 |
| 4 | శ్రీ హనుమత్ కథా నిధి | హనుమాన్ దివ్య చరిత్ర, పూజ శ్లోకాలు | ఉగాది 2012 | స్వర్గీయ పవని రాధాకృష్ణ | 159 |
| 5 | శ్రీ ఆంజనేయ స్వామి మహాత్మ్యం | ఆంజనేయస్వామి మహత్యం, కధలు, విశేషాలు | జూన్ 2013 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 120 |
| 6 | సిద్ధ యోగిపుంగవులు | 35 సిద్ధుల జీవిత చరిత్రలు | ఏప్రిల్ 2013 | స్వర్గీయ మైనేని సౌభాగ్యమ్మ కుమ్మమూరు | 120 |
| 7 | మహిళా మాణిక్యాలు | 50 ప్రపంచ ప్రసిద్ధ మహిళల చరిత్రలు | మార్చి 2014 | శ్రీమతి మైనేని సత్యవతి USA | 184 |
| 8 | పూర్వాంగ్ల కవుల ముచ్చట్లు | 125 ఇంగ్లాండ్,అమెరికా దేశాల కవుల చరిత్ర | ఆగస్ట్ 2014 | శ్రీ రాచకొండ నరసింహ శర్మ వైజాగ్ | 280 |
| 9 | గీర్వాణ కవులకవితా గీర్వాణం -1 | 146 సంస్కృత కవుల జీవిత విషయాలు | మార్చి 2015 | శ్రీ మైనేని గోపాలకృష్ణ USA | 408 |
| 10 | గీర్వాణ కవుల కవితా గీర్వాణం -2 | 482 సంస్కృత కవుల జీవిత విషయాలు | డిసెంబర్ 2014 | గబ్బిట భవానమ్మ మృత్యుంజయశాస్త్రి | 632 |
| 11 | గీర్వాణ కవుల కవితా గీర్వాణం -3 | 462 సంస్కృత కవుల జీవిత విషయాలు | డిసెంబర్ 2017 | డా|| భండారు రాధాకృష్ణ మూర్తి, సులోచన | 520 |
| 12 | దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు -1 | 201 ఆంజనేయ దేవాలయాల విశేషాలు | మే 2015 | శ్రీమతి వేలూరి దుర్గ, శ్రీ వివేకానంద | 264 |
| 13 | దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు -2 | 221 ఆంజనేయ దేవాలయాల విశేషాలు | మార్చి 2019 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 312 |
| 14 | కెమోటాలజి పిత డా.కొలాచల సీతారామయ్య | ఆయిల్ సైన్స్ శాస్త్ర సాంకేతిక శాస్త్రజ్ఞుడు | జనవరి 2016 | శ్రీ యలమంచలి సీతారామయ్య,శేషుమాంబ | 144 |
| 15 | దైవ చిత్తం | Mind of god కు తెలుగు స్వేచ్ఛ అనువాదం | ఏప్రిల్ 2016 | శ్రీ మైనేని గోపాలకృష్ణ USA | 80 |
| 16 | బ్రహ్మశ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి | శత జయంతి ఉత్సవ సమీక్ష | మార్చ్ 2017 | శ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి | 17 |
| 17 | ఆధునిక ప్రపంచ నిర్మాతలు – జీవితాలలో చీకటి వెలుగులు | చరిత్రను మలుపు త్రిప్పిన వివిధ రంగాల 91 ప్రపంచ ప్రముఖుల జీవితం సమగ్ర గ్రంధం | డిసెంబర్ 2017 | శ్రీ స్వర్గీయ పరచూరి రామకృష్ణయ్య | 704 |
| 18 | షార్లెట్ సాహితీ మైత్రీ బంధం | అమెరికా నార్త్ కరోలిన షార్లెట్ యాత్రా సాహిత్యం | 2018 | అమెరికా షార్లెట్ | 344 |
| 19 | అణుశాస్త్రవేత్త డా.ఆకునూరి వెంకట రామయ్య | 117 మూలకం టెన్నిస్సిన్ 'Ts'ఆంధ్ర అణుశాస్త్రవేత్త | అక్టోబర్ 2018 | స్వర్గీయ ఆకునూరి వెంకట సుబ్బమ్మ | 40 |
| 20 | శాస్త్రపరిశోధన పిత డా.పుచ్చా వెంకటేశ్వర్లు | ఆంధ్ర కాంతి శాస్త్ర పరిశోధన సాంకేతికవేత్త | మార్చి 2019 | శ్రీ ఆకునూరి రామయ్య | 32 |
| 21 | ఊసుల్లో ఉయ్యూరు | 75ఏళ్ళ అనుబంధం,జ్ఞాపకాలు నాస్టాల్జియా | మార్చి 2020 | శ్రీ కోట సూర్యనారాయణ శాస్త్రి, సీతమ్మ | 304 |
| 22 | సోమనాథ్ నుంచి కాశీ విశ్వనాథ్ దాకా | 6 రాష్ట్రాల క్షేత్ర సందర్శన యాత్రా సాహిత్యం | మార్చి 2020 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 328 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 23 | ఆధునిక ఆంధ్ర శాస్త్ర మాణిక్యాలు | 62 ఆంధ్ర శాస్త్రవేత్తల జీవిత విశేషాలు, | మార్చి 2020 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 168 |
| 24 | వ్యాఖ్యాన చక్రవర్తి కోలాచలం మల్లినాద సూరి | శ్రీ పిజి.లాల్యే ఇంగ్లీష్ "మల్లినాథ'అనువాదం | మార్చి 2021 | శ్రీ మల్లినాద | 120 |
| 25 | ఆధునిక విదేశీ సంస్కృత విద్వాంసులు | 42 విదేశ సంస్కృత విద్వాంసుల రచనలు | మార్చి 2021 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 80 |
| 26 | Dr. Ankunuri Venkata Ramayya | డా ఆకునూరి వెంకటరామయ్య ఇంగ్లీష్ అనువాదం | అక్టోబర్ 2020 | స్వర్గీయ ఆకునూరి వెంకట సుబ్బమ్మ | 40 |
| | | | | | 5735 |

సంపాదకత్వం

| | పుస్తకం పేరు | వివరాలు | అంకితం | ప్రచురణ | పేజీలు |
|---|---|---|---|---|---|
| 1 | జ్యోతిస్సంశ్లేషణం | విద్వాన్ గబ్బిట మృత్యుంజయశాస్త్రి రచన | స్వర్గీయ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి | మార్చ్ 2010 | 15 |
| 2 | ఉయ్యూరు ఊసులు | గబ్బిట కృష్ణ మోహన్ ఉయ్యూరు జ్ఞాపకాలు | ఉయ్యూరు | డిసెంబర 2010 | 42 |
| 3 | మహా కవితా సంతం | కవుల కవితలు సెప్టెంబర్ 2010 | స్వర్గీయ టి ఎల్ కాంతారావు | సెప్టెంబర్ 2010 | 32 |
| 4 | మా అక్కయ్య | ఉగాది కవితా సంపుటి | | ఆగష్టు 2011 | 40 |
| 5 | "ఆదిత్య "హృదయం | పద్య వచన కవితా సంకలనం | | మే 2012 | 24 |
| 6 | త్యాగి పే"రెడీలు' | శ్రీ టీవీ సత్యనారాయణ రచనలు | బాపు రమణ | మార్చి 2015 | 96 |
| 7 | శ్రీరామవాణి | శ్రీ తూములూరి దక్షిణామూర్తి గారి రచన | | | 24 |
| 8 | మా అన్నయ్య | కవితాసంకలనం | తాడికొండ భోగ మల్లికార్జునరావు దంపతులు | జూలై 2016 | 45 |
| 9 | శ్రీ సువర్చలా వాయు నందన శతకం | రామలక్ష్మణచార్యులు | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | ఫిబ్రవరి 2017 | 64 |
| 10 | శ్రీ సువర్చలా మారుతి శతకం | ముదిగొండ సీతరావమ్మ | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | ఫిబ్రవరి 2017 | 40 |
| 11 | శ్రీ సువర్చలేశ్వర శతకం | మంకు శీను | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | ఫిబ్రవరి 2017 | 35 |
| 12 | వసుధైక కుటుంబం | ఉగాది కవితల సంకలనం | | మార్చి 2018 | 40 |
| 13 | సాహితీ స్రవంతి | (సాహితీ మండలి తరఫున ) | | మార్చి 2012 | 25 |
| | | | | | 522 |

అంకాత్మక (డిజిటల్) పుస్తకాలు

| | పుస్తకం పేరు | వివరాలు | విడుదల | పేజీలు |
|---|---|---|---|---|
| 1 | కోనసీమ అందాలకు వేదపవిత్ర సొబగులు సౌరభాలు అద్దిన ఆహితాగ్నులు | Emeritus of South Asian Studies at the University of Visconsin, Madison లో Professor Da vid.M.Knipe Vedic Voices-intimate Narratives of a Living Andhra Tradition కి అనువాదం | 19-04-2019 | 67 |
| 2 | సమస్త భక్త శిఖామణులు | దైవం కోసం, దేశం కోసం, రాజ్యం కోసం, సాహిత్యం కోసం పాటుపడి చరిత్రలో మిగిలిపోయిన భక్త శిఖామణులు | 15-08-2021 | 350 |
| 3 | వేద, ఇతిహాస, తాత్వికరచనల విశ్లేషణ | వివిధ రామాయణ, భారత, భాగవత,వేద ఉపనిషత్తులు మొదలైన వాటిపై విశ్లేషణ | 10-09-2021 | 460 |

| | | | | |
|---|---|---|---|---|
| 4 | దర్శనీయ వ-వి)నాయక ఆలయాలు | శివ, దేవి, వినాయక, విచిత్ర ఆలయాల చరిత్ర, శ్రీ ఆదిశంకర విశిష్ట వేదాంత రచన | 15-10-2021 | 625 |
| 5 | బ్రహ్మశ్రీ విద్వాన్ శ్రీ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి | బ్రహ్మశ్రీ విద్వాన్ శ్రీ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి సాహిత్య, సామాజిక సేవ వార్తాపత్రికల సంకలనం 132 వ జయంతి కానుక | 15-08-2022 | 45 |
| 6 | శమీ అష్టోత్తరం పూజా విధానమ | శమీ అష్టోత్తరం పూజా విధానమ | 05-10-2022 | 15 |
| 7 | సహస్రచంద్రదర్శనం | సహస్ర చంద్ర దర్శనం, సరసభారతి సాహితీ పుష్కరోత్సవం | 05-10-2022 | 60 |
| 8 | శ్రీ శంకర | ఆది శంకరాచార్యుల బోధనలు | 22.03.2023 | 200 |
| 9 | శ్రీ శోభ కృత్ ఉగాది 2023 | శ్రీ శోభ కృత్ ఉగాది 2023 కవితా సంకలనం | 14-05-2023 | 50 |
| 10 | రైట్ హానరబుల్ శ్రీనివాస శాస్త్రి | **ట్ ఎస్ జగదేశన్ రాసిన వి ఎస్ శ్రీనివాస శాస్త్రి ఆంగ్ల పుస్తకానికి తెలుగు స్వేచ్ఛానువాదం** | 16=-8-2023 | 110 |
| 11 | శత శతక ప్రసాద సమీక్ష | **ఆదిదేవుడు శ్రీ విఘ్నేశ్వర స్వామికి  వినాయక చవితి 18.09.2023 రోజున అంకితము** | 18.09.2023 | 350 |

Vuyyuru 521165 Krishan District

Andhra Pradesh
India
Cell : 9989066375

8520805566

Land Line : 08676-232797